## PUBLISHERS' NOTE

This is a sincere endeavour to present a series of Geography books based on the syllabus issued by our Education Department. The following are the special features of the series:

1. In view of the independence of our country, the books are so planned that every country is viewed in relation to Indian Union, as it is necessary for the Indian student of to-day to explore markets for his productions and to improve the economic status of his country and install her among the foremost countries of the world.

2. Everywhere stress is laid on the human and commercial aspects of the various countries.

3. General Geography is given its full importance as it is the very foundation of the knowledge about the life in various countries.

4. Care has been taken not to avoid any point necessary for the standard, and not to give any unnecessary point.

5. Adequate number of maps, and illustrations depicting the life in various countries is given to help the student to consolidate his knowledge.

We shall feel gratified if the teachers and the taught are benefited by this series, even slightly.

In the end, we deem it a pleasant duty to thank the Ambassadors, High Commissioners and other representatives of various countries in India for the great co-operation they have extended to us by supplying us with valuable information and photographic views of their countries.

# SYLLABUS

The General and Regional Geography of the World.

*A. Physical Geography.*

(*a*) The shape of the Earth; Latitude and Longitude. Time and its relation to Longitude. Rotation and Revolution.

(*b*) The moon—its phases: elementary ideas about eclipses.

(*c*) Land, formation of important rocks; the chief agents of change; the formation of soil. Drainage system.

(*d*) The Ocean—its chief movements—waves, currents, tides and their effects.

(*e*) The atmosphere; temperature, pressure winds.

*Notes*:—The portion of physiography included in the science syllabus is **exempted** to be dealt with more effectively in the teaching of science.

*B. Regional Geography.*

Hot lands, warm and cool lands, cold lands.

(West coast regions, east coast regions, interior uplands and interior lowlands)

Position, relief, climate, vegetation, mineral wealth.

*C. Economic Geography.*

Animal and forest products. Distribution of agricultural plants. Mineral resources and industries.

*Trade.*—The interchange of principal commodities; Transport system. Means of communication by land, sea and air.

*D. Human Geography.*

Political Divisions; Races, Distribution of population. Main occupations.

*E. Use of Atlas.*

Ordinance maps, sketch maps, charts, diagrams, map reading and map-making:

*F. Out door work.*

1. Local survey of a village or Mohalla by a group.
2. Making and using a wind vane and rain-gauge.
3. Observation of Principal constellations at night.
4. Use of the chain and plane table in map-making.

The following distribution of work in the higher stage is only suggestive:—

*Note.*—General principles of physical geography should be studied first so that their application may be made later.

*Class* VIII.—Asia, India in detail with special treatment of Hyderabad (Andhra Pradesh), Australia.

*Class* IX.—Europe, the British Isles in detail, North and South America and Africa.

*Class* X.—Revision of the whole syllabus with emphasis on Human and Economic Geography.

*Note.*—(*a*) Most of the outdoor work should be done in the first two years. Free time and holidays should be utilised for this purpose.

(*b*) At least 25 sketch maps, diagrams, etc., should be prepared by each pupil in each class.

(*c*) In teaching geography, it should be remembered that geography is a science, and the foundation of a sound knowledge of geography is personal observation.

★

# విషయసూచిక

## తొమ్మిదవ తరగతి

### మొదటి భాగము

### ఆ ఫ్రి కా



### రెండవ భాగము

### *దక్షిణ అమెరికా*

మూడవ భాగము

## ఆస్ట్రేలియా

## నాల్గవ భాగము

## ఉత్తర అమెరికా

# పదియవ తరగతి

## మొదటి భాగము

### ఐరోపా ఖండము



## రెండవ భాగము

### ప్రపంచ సమీక్ష

# విశ్వపరిచయము

*తొమ్మిదవ తరగతి*

## మొదటి భాగము

## ఆఫ్రికా

---

## 1. ఉనికి - నైసర్గిక స్వరూపము

ప్రపంచములోని ఖండములన్నిటిలోను భూమధ్యరేఖకు ఉత్తర దక్షిణములు దాదాపు సమానముగా వ్యాపించి కర్కట మకర రేఖలను రెండింటిని కలిగియున్న ఘనత ఆఫ్రికాఖండము నకే కలదు. ఇది దక్షిణార్ధ గోళములో 34° నుండి ఉత్తరార్ధ గోళములో 37° వరకు వ్యాపించియున్న బృహత్ఖండము. దీనికి పశ్చిమమున అట్లాంటికు, ఉత్తరమున మధ్యధరా సముద్రము, ఈశాన్యమున ఎఱ్ఱసముద్రము, తూర్పున, దక్షిణమున హిందూ మహాసముద్రమును కలవు. ఈశాన్యమున సూయజు కాలువ ద్వారా ఆసియానుండియు, వాయవ్యమున జిబ్రాల్టరు జలసంధి ద్వారా యూరపునుండియు వేరుచేయబడి యున్నది.

ఈ ఖండము ఆస్ట్రేలియాకు నాలుగు రెట్లును, ఆసియాలో మూడింట రెండువంతులకంటె ఎక్కువయు వైశాల్యము కలిగియున్నది. ఇంత పెద్ద ఖండమైనను తీరరేఖ చాల

తక్కువగా చీలియుండుట ఒక విశేషము. ఈ ఖండమునకు మన ఇండియాతో కొన్ని పోలికలు కలవు. దక్షిణ ఇండియాకంటె ఉత్తర ఇండియాలో భూభాగ మెక్కువైనట్లు దక్షిణాఫ్రికా కంటె ఉత్తరాఫ్రికాలో భూభాగ మెక్కువ. ఇండియా ద్వీపకల్ప భాగము చివర కన్యాకుమారి అగ్రమున్నట్లు ఈ ఖండము చివర




ఆఫ్రికా - నైసర్గిక స్వరూపము

గుడ్‌హోప్ అగ్రము కలదు. ఇండియాకు దిగువ సింహళద్వీప మున్నట్లు ఈ ఖండము చివర మెడగాస్కర్ ద్వీపము కలదు.

ఆఫ్రికా ఖండము చాలవరకు పీఠభూమి. ఈపీఠభూమిలో కొంత 3000 అడుగులకంటె ఎత్తుగాను, మరికొంత 1000 అడుగులకంటె ఎత్తుగాను ఉన్నది. మైదాన ప్రదేశము చాల తక్కువగాను, ఇరుకుగాను తీరము వెంబడి వ్యాపించియున్నది. ఉత్తర ఆఫ్రికాలో చాలవరకు ఈ రెండవ తరగతి పీఠభూమి ఎడారిగా ఏర్పడియున్నది. ఈ ఖండపు వాయవ్యమున ఎత్తయిన అట్లాసు పర్వతపంక్తి కలదు. ఈ పర్వతములు ముడుత పర్వతములు. ఇవి ఒకప్పుడు స్పెయినులోని సిరానెవాడా పర్వతములతో కలిసియుండి తర్వాత భూమి క్రుంగుటచే జిబ్రాల్టరు జలసంధి ఏర్పడి వేరుచేయబడియున్నవి. ఈ పర్వతములు మూడు వరుసలుగా మధ్యధరా సముద్రమునకు కొంతవరకు సమానాంతరముగ వ్యాపించియున్నవి. దక్షిణాఫ్రికాలో ఎత్తయిన పీఠభూమిఉండి వాయవ్యమునకు వాలియున్నది. ఈ ఖండమందు ఎత్తయిన పర్వతశిఖరములు తక్కువ. వానిలో కిలిమంజిరో 19,000 అడుగుల ఎత్తుకలదు. ఇదిగాక కెన్యా, రువెంజోరీ పర్వతములు కూడ మిక్కిలి ఎత్తయినవి. ఇవన్నియు భూమధ్యరేఖ సమీపమున నున్నను వీని శిఖరములు సదా హిమరేఖచే కప్పబడియుండును. ఈఖండమునకు ఆగ్నేయ భాగమున డ్రేకెన్‌బర్గ పర్వతవరుసలు ఉత్తర దక్షిణములుగా వ్యాపించియున్నవి. ఖండమునకు దక్షిణమున న్యూవెల్డ్ పర్వతములు జావర్గబర్గ

పర్వతములు, తీర పర్వతములు అను మూడువరుసలు కారూలు అను రెండుమెట్లను చేయుచున్నవి.

బహుకాలము ఆఫ్రికాఖండము చీకటి ఖండము అని పిలువబడి అజ్ఞాతముగా నుండిపోవుటకు అందలి ఎడారులు, పీఠ భూములు ముఖ్యకారణములు. ఉత్తరమున ఎడారు లెట్లు యాన యోగ్యములు కాకపోయెనో, భూమధ్య ప్రాంతారణ్యములు




ఆఫ్రికా రాజకీయము

ఎట్లు చొరరానివిగా నుండెనో అట్లే దక్షిణ భాగమందలి పీఠభూములు జలపాతములకు నిలయములై ప్రయాణమునకు వీలు కలిగించకుండెను. ప్రక్కపుటలోని రాజకీయ పటమును జూచి రాష్ట్రముల పేర్లు గుర్తు పెట్టుకొనుము.

ఈ ఖండములో నాలుగు ముఖ్యమైన నదులు కలవు. అవి నైలు, కాంగో, నైజరు, జాంబెజీ. అవికాక జాంబెజీకి దక్షిణమునగల లింపోపో (మొసళ్ళనది), కేప్ రాష్ట్రములోని ఆరెంజి నదికూడ పెద్దవే. ఖండమునకు దాదాపు మధ్యగాను తూర్పుగాను ఎత్తయిన పీఠభూమిమీద పెద్ద సరస్సులు కలవు, వీటిలో ముఖ్యమైనది విక్టోరియా న్యాంజా అను మంచినీటి సరస్సు. 4000 అడుగుల ఎత్తుననున్నది. జాంబెజీనదికి నీరిచ్చు న్యాసా, కాంగోనదికి నీరిచ్చు టాంగనీకా, నైలునదికి నీటి నందించు ఎడ్వర్డు మరియు ఆల్బర్టు సరస్సులు ఈ భాగములోనే కలవు. వీనికి దక్షిణమున కొన్ని ఉప్పునీటి సరస్సులు కూడ ఉన్నవి. కాని వీటికి సముద్రముతో ఏమియు సంబంధము లేదు.

### ప్రాక్టికల్

ఆఫ్రికా ఖండముయొక్క నైసర్గిక స్వరూపమును పటమువ్రాసి చూపుము.

---

## 2. శీతోష్ణస్థితి - వర్షపాతము

ఆఫ్రికా శీతోష్ణస్థితిని పరిశీలించునపుడు దాని ఉనికిని జ్ఞప్తియం దుంచుకొనవలయును. ఖండ మధ్యముగా భూమధ్య

రేఖ పోవుచుండుటచేతను, అయనరేఖలు రెండును ఖండము మీదుగా పోవుచుండుటచేతను, ఎక్కువభాగము ఉష్ణమండలము లోనికి వచ్చును. కాని దక్షిణ ఆఫ్రికాలో చాల భాగము ఎత్తయిన పీఠభూమి యగుటచే ఆ భాగమునకు ఎక్కువ ఉష్ణముండదు. పడమటి తీరమైదానమునకు పవనములు వీచుచుండుటచే ఆ ప్రాంతమునకుకూడ ఎక్కువ వేడియుండదు. ఈ కారణములచే సూర్యకిరణములు దక్షిణార్ధ గోళములో సూటిగా పడునపుడు ఆ ఖండముయొక్క తూర్పు తీర మైదానమున మాత్రము అధికోష్ణ ముండును. ఆ సమయమున ఉత్తర తీరము మిక్కిలి చల్లగా నుండును.

సూర్యకిరణములు ఉత్తరార్ధగోళములో సూటిగా పడునపుడు సహారా ఎడారి భాగము మిక్కిలి వేడెక్కిపోవును. ఆ భాగము పొడిగానుండును. భూమధ్యరేఖకు దక్షిణమున చల్లగా నుండును. మరియు దక్షిణాఫ్రికాలోని పీఠభూములలో చలి యింకను ఎక్కువగా నుండును.

ఇవిగాక ఆఫ్రికాలోని శీతోష్ణస్థితిని, మధ్యధరా శీతోష్ణస్థితి, ఎడారి శీతోష్ణస్థితి, ఉష్ణమండల శీతోష్ణస్థితి, నాడీమండల శీతోష్ణస్థితి, సమశీతోష్ణమండల శీతోష్ణస్థితి అను భాగములుగా విభజింపవచ్చును.

మధ్యధరా శీతోష్ణస్థితి ఆ సముద్ర తీరప్రదేశములలోను, నైరృతి మూలను కలదు. ఈ ప్రాంతములలో శీతకాలమున మాత్రమే వర్షించుచు వేసవులందు నిర్మలాకాశము కానవచ్చును.


శీతకాలపు వర్షపాతము
10 అం. పైన
6 నుండి 10 అం
2 ,, 6 ,,
2 అం. లకు తక్కువ
60°
70°
80°
65°


వేసవి వర్షపాతము
10 అం. పైన
6 నుండి 10 అం.
2 ,, 6 ,,
2 అం.లకు తక్కువ
70°
80°
60°
55°

ఎడారి శీతోష్ణస్థితి ఉత్తరాఫ్రికాలో తూర్పు పడమరలుగా వ్యాపించిన సహారా, లిబియా, ఈజిప్టు ప్రాంతములలోను, దక్షిణ ఆఫ్రికాలో పడమటి భాగమునను కానవచ్చును. ఈ ప్రాంతములలో గాలి ఎప్పుడును పొడిగా నుండును.

ఉష్ణమండలపు శీతోష్ణస్థితి భూమధ్యరేఖకు ఇరుప్రక్కలను కలదు. ఈ ప్రాంతములందు వేసవిలో మాత్రము వర్షములు కురియుచు శీతకాలమున ఒరపుగానుండును. భూమధ్యరేఖకు ఉత్తరమున వేసవి అయినపుడు దక్షిణమున శీతకాలమనియు, భూమధ్యరేఖకు దక్షిణమున వేసవి అయినపుడు ఉత్తరమున శీతకాలమనియు ఈఖండమునుగూర్చి ఎల్లప్పుడును జ్ఞాపకముంచుకొనవలయును.

నాడీమండల సీతోష్ణస్థితి భూమధ్య రేఖాప్రాంతమున — ముఖ్యముగా కాంగోనదీ పరీవాహ ప్రదేశమున— కాననగును. ఈ ప్రాంతము ఎల్లప్పుడును వేడిగాను, తడిగాను ఉండి అధిక వర్షపాతమునకు లోబడియుండును.

సమశీతోష్ణమండల శీతోష్ణస్థితి దక్షిణాఫ్రికా పీఠభూమి మీద గడ్డి బీడులలో కాననగును. ఇచ్చట సమశీతోష్ణముగాను సామ్యముగాను ఉండును.

వర్షపాతము, పవనములు : నవంబరునుండి ఏప్రిలువరకు దక్షిణాఫ్రికాలో వేసవి. ఆ కాలములో ఉత్తర ఆఫ్రికాకు ఈశాన్య వ్యాపారపవనములు వీచును. అవి ఎడారి భూముల మీదుగా వచ్చుటచే పూర్తిగా పొడిగాలులు. కాని మొరాకో,

ఆల్జీరియా ప్రాంతములకు మాత్రము నైరృతి వ్యతిరేక వ్యాపారపవనములు వీచి మంచి వర్షమును కలిగించును. దక్షిణ ఆఫ్రికాలో ఆగ్నేయభాగమునకుకూడ ఆగ్నేయవ్యాపారపవనములవలన మంచివర్షము కలుగును. భూమధ్య రేఖాప్రాంతమున వహానవర్షము సమృద్ధిగా కురియును.




ఆఫ్రికా సహజ వృక్షజాలము

మేనుండి అక్టోబరు వరకు ఉత్తర ఆఫ్రికాలో వేసవి. ఆ కాలమునకూడ ఎడారి ప్రాంతములలో ఈశాన్య వ్యాపారపవనములు వీచును. ఇవి పొడిగాలులు. ఆగ్నేయ వ్యాపారపవనములు భూమధ్యరేఖా ప్రాంతమువరకు చొచ్చుకొని పోవును. ఈ సమయమున దక్షిణ ఆఫ్రికా నైరృతి భాగమున వాయవ్య వ్యతిరేక వ్యాపారపవనములవల్ల మంచి వర్షము కురియును. సహారా ఎడారిలోని అల్పపీడన ప్రదేశముయొక్క ప్రభావము వల్ల వర్షపవనములు గినీ ప్రాంతమునకును, భూమధ్యరేఖా ప్రాంతమునకును అధికవర్షము నిచ్చుచున్నవి.

సహజ వృక్షజాలము: ఆఫ్రికాలో భూమధ్యరేఖనుండి ఉత్తరముగాను దక్షిణముగాను పోయినకొలది దాదాపు ఒకే లక్షణములు గోచరించు చుండును. మధ్యధరా మండలము, ఎడారులు, గడ్డిబీడులు, ఉష్ణమండలారణ్యములు, మొదలైన వానిని గుర్తించవచ్చును.

---

## 3. నదులు - సరస్సులు

ఆఫ్రికాఖండములోని ముఖ్యనదులగు నైలు, కాంగో, నైజరు, జాంబెజీలును, వాని ఉపనదులునుగూడ అధిక వర్షపాతముగల భూమధ్యరేఖాప్రాంతముననే పుట్టుచున్నవి.

నైలునది ప్రపంచములోని నదులన్నిటిలోను మిక్కిలి పొడవైనది. ఈ గొప్పనది (తెల్లనైలు) భూమధ్యరేఖమీద నున్న

విక్టోరియా న్యాంజా సరస్సులో ఉద్భవమై కొంతదూరము ప్రవహించిన తరువాత ఆల్బర్టు న్యాంజాలోనికి ప్రవహించును. ఆ సరస్సులో ఎడ్వర్డ్, న్యాంజాలో పుట్టిన ఉపనది, దీనిని కలియుచున్నది. ఇట్లు నైలునది ఎల్లప్పుడును వర్షముగల ప్రాంతములందుద్భవించుటచే జలసమృద్ధి గలిగి మిక్కిలి ప్రయోజనకారియగుచున్నది. పాకిస్థాన్‌లో సింధునది సింధురాష్ట్రమునకు జీవనాధారమైనట్లు ఈనైలునది ఈజిప్టుకు జీవగఱ్ఱయైనది. ఈ నదికి పీఠభూమి దశలో చాల జలపాతములు కలవు. కొంత దూరము ప్రవహించిన తరువాత అబిసీనియా పీఠభూమిలో ఉద్భవించిన బ్లూనైలు దీనిని ఖార్టూం వద్ద కలియుచున్నది. అబిసీనియాలోని అధికవర్షములవల్ల బ్లూనైలు అధికజలమును తెచ్చి ఈజిప్టులో వరదలకు కారణమగుచున్నది. అట్బారా అను ఉపనది నైలును బెర్బరుకు దిగువను కలియుచున్నది. ఇటుతరువాత ఈనది ఇతర ఉపనదులు లేకనే 1600 మైళ్ళు ఉత్తరముగా ప్రవహించి మధ్యధరా సముద్రములో కలియుచున్నది. ఈ భాగము ఎడారి యగుటచే చాలనీరు ఆవిరియై పోవుచున్నది. సింధు, గంగానదులవలె దీనికికూడ ముఖద్వారమున డెల్టాకలదు. ఈనది వరదలను అరికట్టుటకు 1902 లో అశ్వాన్ వద్దను, 1925 లో మక్వార్ వద్ద బ్లూనైలుకును ఆనకట్టలు కట్టిరి. వరదనిరోధక చర్యగా అశ్వాన్‌వద్ద ఎగువ ఆనకట్ట కట్టుటకు ఇప్పటి ప్రభుత్వము సంకల్పించి యున్నది.

కాంగోనది నైలువలె పొడవుకాకపోయినను జలసమృద్ధ మైనది. దీని పరీవాహిక ప్రదేశము పూర్తిగా అధిక వర్ష పాత మండలములోనే కలదు. నైలునది అట్లుగాక పీఠభూమి దాటిన తరువాత చాల దూరము ఎడారి భూమిలో ప్రవహించు చున్నది. తన మార్గములో ఈ నది రెండు పర్యాయములు భూమధ్యరేఖను దాటుచున్నది. నైలునదివలె నిదికూడ మూడు సరస్సులలోని నీటిని గ్రహించుచు ప్రవహించుచున్నది. దీనికి రెండువైపులనుండి అసంఖ్యాకమగు ఉపనదులు కలవు. వీనిలో కొన్ని గోదావరి, నర్మదానదులంత పెద్దగానున్నవనినచో కాంగో నదిలోని జలమెంతయుండునో యూహింపవచ్చును. పీఠభూమి భాగములో ఈనది దట్టమైన అరణ్యములమధ్యగా ప్రవహించును. కాంగోనది పీఠభూమిని దాటి మైదానములోనికి ప్రవేశించు నపుడు అనేక జలపాతములను కలిగియున్నది. ఈజలపాతము లకు ఎగువ మహారణ్యప్రాంతములో ఈనది గొప్పప్రయాణసాధన ముగా నున్నది. ఇచ్చట నది చాల వెడల్పుగాను లోతుగాను ఉండుటచే పడవలే కాక పెద్దపెద్ద స్టీమర్లుకూడ తిరుగగలవు.

గినీ ప్రాంతములో సముద్రమునకు దగ్గరగా నైజరు నది ఉద్భవించి ఉత్తరముగా పోయి తర్వాత దక్షిణముగా వంగి గినీ సింధు శాఖలో సంగమించుచున్నది. ఈ నదికి కుడివైపున అధికవర్షపాత ప్రదేశమును, ఎడమవైపున పొడి ఎడారి ప్రదేశ మును ఉండుట గమనింపుడు, ఈ నదిగూడ జలపాతములవల్ల ప్రయాణములకు అంత అనుకూలముగ లేదు.

జాంబెజీ దక్షిణాఫ్రికాలో ముఖ్యమైనది. కాని నైలంత పొడవుకాని, కాంగో అంత జలసమృద్ధముకాని కాదు. ఈనది ఎత్తయిన అంగోలా పీఠభూమిమీద ఉద్భవించి తూర్పుగా ప్రవహించుచున్నది. ఈ ప్రదేశము అధిక వర్షపాత మండలము నకు దక్షిణమున నుండుటచే నవంబరునుండి ఏప్రిలు కాలములో జలసమృద్ధమైయుండును. మధ్యలో దీనికొక గొప్ప జలపాతము కలదు. దానికి విక్టోరియా జలపాత మని పేరు. ఈ పాతము ఎత్తు 420 అడుగులు. ఈ జలపాతము బహుసుందర దృశ్యమై ఉత్తర అమెరికాలోని నయాగరా జలపాతముతోను మన దేశములోని శివసముద్ర, జోగ్ జలపాతములతోను పోల్చ దగినది. ఈనదికూడ నౌకాయానమున కంతగా అనుకూలిం చుటలేదు.

పైనదులు కాక లింపోపో లేక మొసళ్ళనది, ఆరంజినది చెప్పదగినవి. లింపోపో జాంబెజీకి దక్షిణమున ఎత్తైన పీఠ భూమిలో పుట్టి తూర్పుగా ప్రవహించి హిందూ మహాసముద్ర ములో కలియుచున్నది. వర్షాకాలములో నీరుండి ఇతర కాలము లలో బురదగుంట లేర్పడును. ఈ గుంటలలో మొసళ్ళుండు టచే ఈనదికి ఈ పేరు వచ్చినది.

ఆరెంజి నది లింపోపోకు దక్షిణముగా పీఠభూమిలోనే పుట్టి పశ్చిమముగా ప్రవహించి అట్లాంటికు మహాసముద్రములో కలియుచున్నది. ఈనది నౌకాయానమునకు బొత్తిగా అను కూలముగా లేదు.

నదులనుగూర్చి పునశ్చరణ చేయుటకు ఈ క్రింది పట్టికను గమనింపుడు.

| నదిపేరు | ఏసముద్రములో కలియుచున్నది |
| --- | --- |
| 1. నైలు | మధ్యధరాసముద్రము |
| 2. సెనెగల్, గాంబియా, నైజరు, కాంగో, ఆరెంజి | అట్లాంటిక్ మహాసముద్రము |
| 3. జాంబెజి, లింపోపో | హిందుమహా సముద్రము |

ఆఫ్రికాలోని సరస్సులను కూడ కొన్ని ముఖ్యభాగములుగా భాగించవచ్చును. ఎక్కువగా సరస్సులు తూర్పునగల పీఠభూమిభాగములలోనే కాననగును. రుడోల్ఫ్, ఆల్బర్టు, ఎడ్వర్డు, టాంగన్యికా, న్యాసా, విక్టోరియా, బంగ్వియోలో మ్వెరు సరస్సులు ఈ తరగతిలోనివి. వీనిలో కొన్ని ఉప్పునీటి సరస్సులుకూడ కలవు. అట్లాసు పర్వతప్రాంతములలోని షాట్స్ సరస్సులు మరొక రకమైనవి. ఛాడ్ సరస్సు తీయని నీటిని కలిగియుండును. న్గామి సరస్సు కొంతకాలము మంచినీటిని మరి కొంతకాలము ఉప్పునీటిని కలిగియుండును. పైవికాక చిన్న ఉప్పునీటి సరస్సులు గినీ తీరమునను, సూయజు ప్రాంతమునను ఇతర సముద్రతీర ప్రాంతములందును కలవు.

# 4. అట్లాసు మండలము

ఆఫ్రికా ఖండముయొక్క వాయవ్య మూలగల మొరాకో, ఆల్జీరియా, ట్యూనిసు ప్రాంతములు ఈ మండలములో చేరును. ఈ మండలములో అట్లాసు పర్వత పంక్తులును వాటిమధ్య పీఠభూములును గలవు. మధ్యధరా సముద్రమునకును, అట్లాసు పర్వత పంక్తికిని నడుమ ఫలవంతమైన టెల్ మైదాన మున్నది. పీఠభూమి భూ భాగమునకు షాట్స్ పీఠభూమి అని పేరు. షాట్స్ అనునవి ఉప్పునీటి సరస్సులు.




ఇచ్చట మధ్యధరా శీతోష్ణస్థితి కలదు. కాని పవనములను అట్లాసు పర్వతపంక్తులు అడ్డుటచే పవనములు సహారా ఎడారి ప్రాంతమునకు చొచ్చుకొని పోలేవు. ఈ మండలపు మరొక ముఖ్యలక్షణము అచటి వృక్షజాలము. ఇతర మధ్యధరామండల ప్రాంతములవలె ఇక్కడకూడ ఆలివు, నిమ్మ, నారింజ, ద్రాక్ష ముఖ్యముగా లభించును. ఓక్ చెట్లును, కార్కు చెట్లునుకూడ కలవు. అధికవర్షము అక్కరలేని తాటిజాతిచెట్లుకూడ పెరుగును.

పీఠభూములమీద ముఖ్యముగా ఆల్జీరియాలో ఆల్ఫా లేక ఎస్పార్టో అనుగడ్డి సమృద్ధిగా పెరుగును. ఈగడ్డి కాగితము తయారుచేయుటకు యూరుపునకు ఎగుమతి చేయబడుచున్నది. పీఠభూములమీదను, కొండలమీదను గడ్డి, తుప్పమొక్కలు అధికముగా నుండి ఒంటెలు, గుఱ్ఱములు, గొఱ్ఱెలు, మేకలు పెంపకమున కుపయోగపడుచున్నవి.

ఆల్జీరియాలోని అట్లాసు పర్వతములలో ఇనుము, పాలరాయి ఎక్కువగా కలవు. ట్యూనిసులోకూడ కొన్ని ఖనిజములు కలవు. కాని అవి అంతగా ఉపయోగములోనికి తేబడలేదు. సముద్రతీరమందలి మైదానములు, లోయలు (టెల్) సారవంతమైనవి. వర్షాధారమువల్లను, నీటిపారుదల పర్పాటులవల్లను, పాతాళగంగ బావులవల్లను గోధుమ, జొన్న, బార్లీ పండించుచున్నారు.

అట్లాసు ప్రాంతమున కాకేషియను జాతికి చెందిన ప్రజలు నివసింతురు. వారు బర్బరు జాతికి కాని, మూరు జాతికి కాని చెందినవారు. అరబ్బుదేశమునుండి దండెత్తి వచ్చిన తెగలను మూరు లందురు. గ్రామములలో బర్బరు లెక్కువ. కావుననే ఈ భాగములకు బార్బర దేశములని పేరు వచ్చినది. ఈ పదము సామాన్యముగా మొరాకో, ఆల్జీరియా, ట్యూనిసు, ట్రిపోలీ దేశములకు వర్తించుచున్నది. పట్టణములలో మూరులు అధికముగా కానవత్తురు. వారిస్త్రీలు పరదాలను నేటికిని ధరించుచునే యున్నారు. వీరు మొహమ్మదీయులు.

ఈప్రాంతములు బహుప్రాచీనమైనవి. క్రీస్తు పూర్వము కొన్ని శతాబ్దముల క్రిందటనే ఫోనీషియనులు, గ్రీకులు ఇచ్చట తమ వలసలను ఏర్పరచుకొనిరి.

ఈ ప్రాంతములో అల్జీరియా, ట్యూనిసు, మొరాకో అను మూడు దేశములు కలవు. మొదటిది ఫ్రెంచివారివలస మిగిలిన రెండును వారి రక్షిత ప్రాంతములు. అల్జీరియనులు ఇటీవల స్వాతంత్ర్యము కొఱకు పోరాటము సల్పుచున్నారు. ఆ విషయమును గూర్చి తెలుసుకొనుడు.

అల్జీరియా ఫ్రెంచివారిచే 1830 లో ఆక్రమింపబడి చాల వృద్ధిలోనికి తేబడెను. వారు దీని అభివృద్ధికొరకు రైలు మార్గములు, పాతాళగంగ బావులు, రోడ్లు, హార్బరులు నిర్మించిరి చాలవరకు వర్తక వ్యాపారములను వృద్ధిపరచిరి. ఈప్రాంతములోని శీతోష్ణస్థితి ఆహ్లాదకరమైన దగుటచే ఫ్రెంచివారు అధికముగ ఇచ్చటి పట్టణములలో నివసించుచున్నారు. ముఖ్య రైలుమార్గము ఓరను రేవునుండి ట్యూనిసు పట్టణమువరకు ఆల్జియర్సు పట్టణము మీదుగా వ్యాపించియున్నది. ఈప్రధాన మార్గమునుండి ఉత్తర రేవులకును దక్షిణమున బిస్క్రా మొదలగు ఎడారి ప్రాంతప్రదేశములకును శాఖలుగలవు ఈ దక్షిణ ప్రదేశములకు ఒంటెల బిడారులమీద ఎడారి సరకులు వచ్చి చేరు చుండును. మరియు ఖర్జూరపు పండ్లకుకూడ ఈదక్షిణ ప్రాంతములు కేంద్రములు.

ఆల్జీరియాకు ఆల్జియర్సు రాజధాని. చక్కని నౌకాశ్రయము కలదు. ఓడలు బొగ్గు వేసికొను స్థలము. కాన్‌స్టాంటైన్ అను పట్టణము దేశములోపల పర్వతములమీద కలదు.

ఆల్జీరియానుండి ద్రాక్షసారాయము, జంతువులు, బార్లీ, జొన్న మొదలగు ఆహారధాన్యములు, కార్కు, ఉన్ని, జింకు, లోహము ముఖ్య ఎగుమతులు. ఈ దేశము ఫ్రాన్సుతో ప్రధానముగా వర్తక వ్యాపారములను కొనసాగించుచున్నది.

ట్యూనిసులో మెజెర్డా లోయ మిక్కిలి సారవంతమైనది. దీనికి స్వభావసిద్ధమైన రేవు ట్యూనిసు. ఇదియే ఆ దేశమునకు రాజధానికూడ నైయున్నది. ఇచ్చట నుండి బార్లీ, ఆలివునూనె, గోధుమ, ఎస్పార్టొగడ్డి, జింకు, ముఖ్య ఎగుమతులు,

మొరాకో పై రెంటి కంటెను కొంచెము వెనుక బడినదనియే చెప్పవచ్చును. ఇది స్వతంత్ర రాజ్యము. దీనిని సుల్తాను పాలించును. ప్రజలు ముఖ్యముగా ప్రాచీన పద్ధతులపై వ్యవసాయము చేయుచున్నారు. మంచి రైలు, రోడ్డు మార్గములు లేక వర్తక వ్యాపారములలో తగినంత అభివృద్ధిలేదు. ఫెజ్ ఈ దేశములో మిక్కిలి పెద్దపట్టణమేగాక రాజధాని కూడను. కాని మొరాకోకూడ రాజధానిగా భావింపబడుచున్నది. మొరాకో చర్మములు, ఎఱ్ఱ ఫెజ్‌టోపీలు, సిల్కు వస్త్రములు, రగ్గులు ఇచటి ముఖ్యనిర్మాణములు. టాంజియరు, మోగడార్ రేవుల ద్వారా పై సరకులు ఎగుమతి యగును. టాంజియరు సమీపములోని క్యూటా సురక్షిత ప్రదేశము.

# 5. సహారా ఎడారి

ఆఫ్రికాఖండములో భూమధ్యరేఖకు ఉత్తరమునను దక్షిణముననుకూడ ఎడారులు కలవు. ఉత్తర ఎడారిమండలమునకు సహారా అందురు. సహారా అనగా గొప్ప ఎడారి అని అర్థము. ఇది నైలునది మండలము తప్ప ఎఱ్ఱ సముద్రమునుండి అట్లాంటికు మహాసముద్రము వరకు తూర్పు పడమరలుగాను, ఉత్తరమున అట్లాసు పర్వతములు మధ్యధరాసముద్రమునుండి దక్షిణమున సూడానులోని సవానా గడ్డిబీడులవరకు వ్యాపించియుండి ఇండియాకు రెట్టింపును, ఐరోపాఖండమంతయును వైశాల్యము కలిగియున్నది. ఈ విశాలప్రదేశములో అసలు ఎడారి ప్రదేశము కాక చుట్టునున్న తుప్పనేలలుకూడ చేరియున్నవి. లోగడ ఈ మహా ఎడారిని దాటుటకు అనేక విఫల ప్రయత్నములు చేయబడియున్నవి. నేటికిని ఈప్రయాణము బహుకష్టతరమైనదే. ఈ ఎడారి ఏర్పడుటకు ముఖ్యకారణము నీటిలోపము. ఇచ్చట వర్షము బహుతక్కువ. కురిసిన కొద్దివర్షమును ఎండిన భూమి వెంటనే పీల్చివేయును. ఒక్క నైలునది మాత్రము జల సమృద్ధమై సముద్రమును చేరగలుగుచున్నది. మే నుండి అక్టోబరు వరకు ఇచ్చట ఉష్ణము ఎక్కువ. ఈ ఉష్ణవాయువులు చుట్టు ప్రక్కల ప్రదేశములకు వీచుచుండును. మన వేసవిలో కూడ థార్ ఎడారినుండి వేడిగాలులు ఢిల్లీవైపునకు వీచుట ఈ సందర్భములో గమనింపుడు. సహారాప్రాంతముల పగళ్లు చాల



సహారా ఎడారి ప్రదేశము

వేడిగాను, రాత్రులు చలిగా నుండును. ఇట్లు శీతోష్ణ స్థితిలో ప్రతిదినము కలుగుచుండు మార్పులవల్ల అచ్చట రాళ్ళు పగులగొట్టబడి ఇసుకగాను, దుమ్ముగాను మారుచుండును. దీనికి **Weathering** అందురు. ఈ ఎడారి మధ్యగా కర్కాటరేఖ పోవుచుండుట గమనింపుడు.

ఈ ఎడారి స్వభావము వేర్వేరుచోట్ల వేర్వేరు విధముగా నుండును, కొన్నిచోట్ల పచ్చిగడ్డి, మొక్కలులేని బోడికొండలును, మరికొన్నిచోట్ల గులకరాళ్ళు, ఇసుకయును కాననగును. లిబియా ఎడారి పూర్తిగా ఇసుకమయము, అట్లే అట్లాసు పర్వతములకు దక్షిమునకూడ కొంత ప్రదేశము కేవలము ఇసుక ప్రదేశము.

ఇట్టి ఈఎడారిలోకూడ నదులు లేకపోయినను అక్కడక్కడ ఒయాసిస్సులు కలవు. అవి లేనిచో ఈఎడారి నిర్మానుష్యమయ్యేడిది. ఇవి నీటి బుగ్గలు. ఈ ఒయాసిస్సులున్నచోట గ్రామములు వెలసినవి. వీటి మార్గమున ఒంటెల బిడారులు ప్రయాణము చేయుచుండును. ఈ ఒయాసిస్సు గ్రామములచుట్టు ఖర్జూరము చెట్లు కలవు. జొన్న పండింపబడుచున్నది. ఒంటెలకు, మేకలకు పచ్చిగడ్డి పెరుగును. అచ్చటి ప్రజలకు ఖర్జూరము ముఖ్య ఆహారపదార్థము. ఖర్జూరము లేనిచో ఎడారి జీవితము దుర్భరమగును. అచ్చటిప్రజలు తమభాగ్యమును తమఖర్జూరపు చెట్లనుబట్టి, ఒంటెలనుబట్టి ఎంచుకొందురు. కఫ్రా, మర్జక్, ల్యూట్, ఐర్, టాఫిలేట్ అనునవి కొన్ని ముఖ్య ఒయాసిస్సులు.

ఈ ఎడారి భూములలో వృక్షములు అచ్చటి ప్రత్యేక పరిస్థితులకు తగినట్లు నిర్మింపబడి యున్నవి. చాలలోతుననున్న నీటిని పీల్చుకొనుటకు అనువుగా వీటికి పొడవైన వ్రేళ్లుండును. కొన్నిటికి చిక్కని రసము, ముళ్ళుకల ఆకులుండును. తుమ్మ ముఖ్యమైన చెట్టు. కొన్నిచోట్ల వర్షము కురియగానే పుష్పములు వికసించి అచిరకాలములోనే వేడికి వాడిపోవును.

ఒయాసిస్సు ప్రాంతములలో ప్రజలు స్థిరనివాసులు. ఇతరచోట్ల సంచారజీవనులు. అరేబియా ఎడారిలోకూడ ఇట్టి



ఎడారి ప్రయాణము

సంచార జీవనులు కలరు. వీరికి బెడూవియను లందురు. శీతకాలములో పుల్లపు ప్రదేశములలోను, వేసవిలో పీఠభూముల

మీదను నివసించుచు వారి ఒంటెలను, గుఱ్ఱములను, గొఱ్ఱెలను మేకలను మేపుకొనుచుందురు. ఖర్జూరమే కాక పాలు, జున్ను, జొన్న, మాంసముకూడ వారి ఆహారము. వారు వర్తకముకూడ చేయుదురు. తమ ఒంటెలపై సరకులను రవాణాచేయుట మరొక ముఖ్యవృత్తి. ఖర్జూరపుపండ్లు, ఎడారి ఉప్పు, సాంబ్రాణి, చర్మములు, కంబళ్లు బిస్క్రా మొదలగు బిడారు కేంద్రములకు కొనిపోయి అచ్చట నూలువస్త్రములు, పిండి, కత్తులు, కాఫీ మొదలగు వస్తువులు కొందురు.

పశ్చిమ సహారా ఫ్రెంచివారి ఏలుబడిలో నున్నది. తూర్పు సహారా అనగా ఈజిప్టు కొద్దికాలము క్రితమువరకు ఇంగ్లీషువారి ఏలుబడిలోనుండి ఇప్పుడు స్వతంత్ర మైనది.

---

# 7. నైలునదీ మండలము

ఈజిప్టుమండలము సహారా ఎడారిలో ఒక పెద్ద ఒయాసిస్సువంటిది. నైలునది లేనిచో ఇచ్చటకూడ ఎడారియే యుండెడిది. కనుక ఈజిప్టు నైలునది ప్రసాదమని చెప్పబడినది.

ఈజిప్టు 222 మిలియను ఎకరముల వైశాల్యము కలిగియుండ అందు 8 మిలియను ఎకరములు మాత్రము సేద్యము చేయబడుచున్నవి. ఈ సేద్యమునకు నైలునది ముఖ్యాధారము. వరదల కాలములో వరదలవల్ల లోయ సారవంతము చేయబడు

చున్నది. ఇదికాక నైలుడెల్టా ప్రదేశములో సతతము ప్రవహించు కాలువలను పర్చరచిరి. ఇచ్చట భూమి సారవంతమైన దగుట




నైలునదీ పరీవాహ ప్రదేశము

చేతను, చక్కని నీటిపారుదల పర్చాట్లుండుటచేతను నైలులోయ ఈజిప్టుదేశ ప్రజలను పోషింపగలుగు చున్నది. ఇంగ్లీషువారు 1902 లో అశ్వాన్ ఆనకట్టను పూర్తిచేసిరి. వరద నిరోధక మగు ఆనకట్టలు అసూత్, ఎస్నా, జిఫ్టాలలో కలవు. ఈ లోయ 5 నుండి 20 మైళ్ళ వరకు వెడల్పు కలిగి దాదాపు 1600 మైళ్లు సముద్రము వరకు వ్యాపించియున్నది.

ఈజిప్టులో ముఖ్యమైనపంట ప్రత్తి. ఇది పొడుగు పింజ కలది. ఈ ప్రత్తిని ఇండియా, ఇంగ్లాండు వగైరా దేశములకు



ఖర్జూరము

ఎగుమతి చేయుదురు. దేశ ఎగుమతులలో ప్రత్తి 90 శాతముండును. ఇదికాక చెఱకు, మొక్కజొన్న, జొన్న, వరి, గోధుమ, బార్లీ, కాయధాన్యములు, పండ్లు, కూరగాయలు పైరు చేయబడుచున్నవి. ఖర్జూరము నైలునది గట్లమీదను, ఒయాసిస్సులలోను చక్కగా పెరుగును.

ఈజిప్టుకు రాజధాని కెయిరో. ఇది ఆఫ్రికాలోని అన్ని పట్టణములకంటె పెద్దది. నైలునదిడెల్టా శిఖరమువద్ద నున్నది. ఇచ్చట జగత్ప్రసిద్ధమైన పిరమిడ్లు కలవు. దీనికి సమీపమున



ఈజిప్టులోని స్ఫింక్సు, దానివెనుక పిరమిడ్లచుట్టునుగల ఎడారిప్రదేశమును గమనింపుడు

స్ఫింక్స్ అను విచిత్రమైన పెద్ద బొమ్మకలదు. ఈపట్టణము రైలు మార్గములద్వారా అలెగ్జాండ్రియా, రోసెట్టా, డామియెట్టా రేవులతోను, సూయజ్, పోర్టు సయ్యాద్‌లతోను, దక్షిణమున ఖార్టూమ్ వగైరా పట్టణములతోను కలుపబడినది. ఇచ్చట గొప్ప ఇస్లాము విశ్వవిద్యాలయము కలదు. ఇవన్నియు ఈజిప్టుయొక్క ప్రాచీన నాగరికతను చాటును.

అలెగ్జాండ్రియా ఈజిప్టుయొక్క ముఖ్యమైన సముద్రపు రేవు. ఈ పట్టణము అలెగ్జాండరుచే స్థాపింపబడినది. ఈ రేవు ద్వారా మధ్యధరా సముద్రముదాటి ఐరోపా మొదలగు దేశములతో వర్తకము జరుగుచున్నది. అసూత్, అశ్వాన్, వాడిహాల్ఫాలు నైలునదిమీద ముఖ్యమైన వర్తక స్థానములు.



పోర్టుసయ్యాద్ రేవు

పోర్టు సయ్యదు సూయజు కాలువయొక్క ఉత్తరపు చివర మధ్యధరా సముద్రతీరమున కలదు. మంచివర్తక కేంద్రము. క్రమముగా వృద్ధిపొందుచున్నది. నౌకలు ఆగుటకు చాల ముఖ్యమైన స్థానము. సూయజు కాలువ ద్వారా పోవు నౌకలు ఇచ్చట బొగ్గు నింపుకొనును. సూయజు పట్టణము ఎక్కువ ఆరోగ్యకరమైనది కాదు. కాలువవల్ల ఎక్కువ ప్రయోజనమును పొందలేదు.




సూయజు కాలువ ఈజిప్టులో మరొక ముఖ్య అంగము. ఐరోపీయులు ఇండియా, ఇండోచైనా మున్నగుచోట్ల వలసలు స్థాపించుకున్న తర్వాత ఐరోపా నుండి దగ్గరమార్గము కావలసి వచ్చెను. ఫెర్డినాండ్ డిలెసెప్స్ అను ఫ్రెంచివానిచే ఈకాలువ త్రవ్వబడి 1869లో తెరువబడినది. ఇది 100 మైళ్ళ పొడివు 27 అడుగుల లోతు కలిగి ఒక్క ఓడ మాత్రమే పోవుటకు వీలుగా నున్నది. పోర్టు సయ్యదుకు సూయజుకు మధ్యనున్న కొన్ని సరస్సులను కలుపుచు ఈ కాలువ త్రవ్వబడినది. అందుచే ఓడలు

సరస్సులలోనే తప్పుకొనగలవు.అందుకు అనుకూలముగా కాలువ పొడవునను టెలిఫోను ఏర్పాట్లు కలవు. ఇప్పుడు సూయజు కాలువ పూర్తిగా ఈజిప్టువారి ఆధిపత్యములోనికి వచ్చినది. ఇంతవరకు ఈ కాలువగుండా పోవు ఓడలలో అధికభాగము ఇంగ్లీషువారివే. ఈ కాలువమీద ఇస్మైలియా పెద్దపట్టణము.

సూడాను : నైలునదీ మండలములో సూడాను కూడ ఒక భాగము. సూడాను అనగా నల్లవారిదేశము అని అర్థము. అక్కడ అధికముగా నివసించు నీగ్రోలనుబట్టి ఈ పేరు వచ్చినది. ఈదేశము ఈజిప్టునకు దక్షిణముగా నైలునదికి ఇరుప్రక్కల వ్యాపించి యున్నది. కొంతకాలము క్రితమువరకు ఇంగ్లీషు వారికి ఈజిప్టువారికి కలసి దీనిపై పెత్తన ముండుటచే దీనికి ఆంగ్లో ఈజిప్షియన్ సూడాను అను పేరుండెను. ఇప్పుడు ఈజిప్టునుండి సూడానునుండి కూడ ఆంగ్లేయులు వైదొలగిరి. రెండును స్వతంత్రమైనవి. ఈ దేశముయొక్క ఉత్తరభాగమున వర్షములు బొత్తిగా తక్కువ. దక్షిణభాగము భూమధ్యరేఖా ప్రాంతముననుండుటచే వేసవివర్షములు కురియును.ఈదేశమును ఈజిప్టుతో కలుపుటకు నైలునది ముఖ్యసాధనము. ఈనది మీదుగా జలపాతములు లేనిచోట్ల పడవలు, చిన్న ఓడలుకూడ ప్రయాణము చేయుచుండును. ఈనది వెంబడి రైలుమార్గము కలదు. బెర్బెరుకు ఉత్తరమున నదీసమీపమున మాత్రము వ్యావసాయము కలదు. దీనికి దక్షిణమున కొద్ది వర్షము కలచోట్ల గొప్ప గడ్డిబీడులు కలవు. వీనిని సవానాలందురు. ఇవి ఉగాండా

వరకు వ్యాపించి యున్నవి. వీటిలో ఉష్ట్రపక్షులు సంచరించు చుండును. నీగ్రోలు వ్యవసాయము చేయుచుందురు. నైలుడో ఆజ్‌లో అనగా బ్లూ, తెల్లనైలుల మధ్యప్రదేశములో ప్రత్తి పంట అధికము. సవానాలో తుమ్మచెట్లు అక్కడక్కడ కనబడును.



సూయజు కాలువ



సవానాలలో చెట్లు అరుదుగా చెదిరియుండుటను గమనింపుము.

వీటినుండి తీసిన తుమ్మజిగురు అధికముగా ఎగుమతి చేయబడుచున్నది. ఉష్ట్రపక్షి ఈకలు, సవానాలలో వేటాడిన ఏనుగుల దంతములు, ఖర్జూరపుపండ్లు, చర్మములు, జంతువులు ఇచ్చటి ఎగుమతులు. సూడాను పంచదార, యంత్రములు, లోహములు, నూలువస్త్రములు, శకటములు, చమురులు, గోధుమలు దిగుమతి చేసికొనుచున్నది.

సూడానుకు ముఖ్యపట్టణము ఖార్జూము. ఈ పట్టణము వద్ద శ్వేత, బ్లూనైలులు కలియుచున్నవి. పోర్టు సూడాను ఈదేశమునకు ముఖ్యరేవు.

అబిసీనియా : ఎడారిప్రదేశము కాకున్నను అబిసీనియా అను స్వతంత్రరాజ్యముకూడ నైలునదితో సంబంధము కల దేశము. నైలుకు ముఖ్య ఉపనదులగు బ్లూనైలు, అట్బారాలు ఈ దేశములోనే పుట్టుచున్నవి. ఈ దేశము సూడానుకు తూర్పుగానున్న ఉన్నతమైన పీఠభూమి. పీఠభూమి కావున శీతోష్ణస్థితి ఆహ్లాదకరముగా నుండును. ఈ దేశమునకు సముద్రతీరము లేదు. ఫ్రెంచిసోమాలిలాండులోని జిబూతీ ద్వారా ఎగుమతి దిగుమతులు జరుగుచుండును.

పర్వతములకు దిగువభాగము అనారోగ్యకరమైనది. దట్టమైన అరణ్యములు కలవు. ఇచ్చట కాఫీ, ప్రత్తి, చెఱకు, మిరియాలు పండింపబడుచున్నవి. 5000 నుండి 9000 అడుగుల ఎత్తువరకు శీతోష్ణస్థితి చాల అనుకూలమైనది. ఇచ్చట గోధుమ, బార్లీ, మధ్యధరా మండలపుపండ్లు పండింపబడుచున్నవి. ఇంకనూ

ఎత్తైనచోట్ల పశుపోషణ జరుగుచున్నది. క్రమముగా ఎత్తుకు పోయినకొలది వృక్షజాలము తగ్గుచున్నది. కొన్ని పర్వత శిఖరములు మంచుతో కప్పబడియుండును.

ఇచ్చటి ప్రజలకు వ్యవసాయము, పశుపోషణ ముఖ్య వృత్తులు. వారు రాతితోను, మట్టితోను కట్టబడి రెల్లుతో కప్పబడిన చుట్టు గుడిసెలలో కాపురముందురు.

ఈదేశము ఇటీవల తన స్వాతంత్ర్యమును కోల్పోయి తిరిగి రెండవ ప్రపంచ యుద్ధానంతరము సంపాదించుకొన్నది. ఈ దేశపు చక్రవర్తి హెలీ సెలాసీ తన దేశమును సర్వవిధముల అభివృద్ధిలోనికి తెచ్చుటకు ప్రయత్నించుచున్నాడు.

అడ్డిస్ అబాబా ఈ దేశమునకు రాజధాని. 8000 అడుగుల ఎత్తున కలదు. జనసంఖ్య 3 లక్షలు. ఈపట్టణము రైలు ద్వారా జిబూతీకి కలుపబడినది. హరార్, అడోవా, గోండార్ ఇతర ముఖ్య వర్తక కేంద్రములు.

---

## 7. ఎఱ్ఱ సముద్రప్రాంత ప్రదేశములు

ఈ ప్రదేశములు ఎఱ్ఱ సముద్రతీరమునను, దానికి దిగువ హిందూ మహాసముద్ర తీరమునను కల దేశములతో కూడినది. ఇటలీవారి ఎరిత్రియా పడమటి ఎత్తయిన అబిసీనియా పీఠభూమికిని సముద్రమునకును మధ్యనున్న మైదానము. ఫ్రెంచి సోమాలిలాండు, బ్రిటిషు సోమాలిలాండు, ఇటాలియన్

సోమాలిలాండు దేశములలో చాల భాగము పీఠభూమి. ఇచట వర్షము తక్కువ. తుప్పనేలలు మాత్రము కనబడును. వేబీ లోయలోని గడ్డి బీడులలో ఒంటెలు, ఆవులు, గొఱ్ఱెలు, మేకలు పెంచబడుచున్నవి. ఇచ్చటి చెట్లనుండి సాంబ్రాణి వంటి పదార్థము తయారు జేయబడుచున్నది.

బ్రిటిషు సోమాలిలాండులోని బెర్బెరా రేవు మంచి సహజ నౌకాశ్రయమై ఎడ్డ సముద్రమునకు కాపలా కాయుచున్నది.

---

# 8. తూర్పు ఆఫ్రికా - సవానా భూములు

ఈమండలము సూడాను, అబిసీనియాలనుండి దక్షిణముగా లింపోపో నదివరకును వ్యాపించియున్నది. ఇదంతయు ఉన్నతమైన పీఠభూమి ప్రదేశము. దీనికి తూర్పున ఇరుకైన తీర మైదానము, పడమట కాంగో, మధ్య నైలునదీ మండలములును కలవు. ఇదంతయు ఆంగ్లేయుల ఏలుబడిలో నున్నది. ఇచ్చటనే సరస్సుల మండలము కలదు. ఈ సరస్సులు భూమి క్రుంగుటచే ఏర్పడిన లోయలలోనివి. ఇట్టి లోయలను రిఫ్టు లోయలు (Rift valleys) అందురు. ఎఱ్ఱ సముద్రముకూడ రిఫ్టులోయ అని చెప్పబడుచున్నది. ఇక్కడి పీఠభూమిప్రదేశమంతయు ఒకప్పుడు అగ్నిపర్వత క్రియకు లోబడి యుండియుండును. అబిసీనియా మున్నగు పీఠభూములలోని లావాద్రవమునకు ఇదియే కారa

ణము. ఇచట కెన్యా, కిలిమంజీరో పర్వతములు చల్లారిన అగ్ని పర్వతములు.




తూర్పు ఆఫ్రికా

ఈ ప్రదేశము ఉష్ణమండలములోచేరి భూమధ్యరేఖా ప్రాంతమున నున్నను 4000 నుండి 6000 అడుగుల ఎత్తున నుండుటచే శీతోష్ణస్థితి సౌమ్యముగానుండి ఐరోపియనులు స్థిర వసతి ఏర్పరచుకొనుటకు అనువుగానున్నది. వర్షపాతము తక్కువ. సవానాలు ఏర్పడియున్నవి. ఇచ్చట గడ్డి చాల ఎత్తువరకు పెరుగును. జంతువులను పీడించు ట్సెట్సీ ఈగలు లేనందువల్ల

పశుపోషణ బాగుగా జరుగుచున్నది. ఎత్తయిన పర్వతముల మీద పీఠభూమిమీద కంటె వర్షపాత మెక్కువ కనుక దట్టమైన అరణ్యములు కలవు. ఈ కొండలపై కాఫీ పండింపబడుచున్నది.

ఇచ్చట మసాయి జాతి నీగ్రోలు నివసించుచున్నారు. వీరు బలిష్ఠమైనవారు. వీరులు. వారికి పశుపోషణ ముఖ్యవృత్తి. అందుచే స్థిరనివాసులుకారు. అయినను కొంచెము వ్యవసాయము కూడ చేసి ధాన్యములను పండించుచున్నారు. వీరు పాలు, మాంసము, ధాన్యములు, తేనె ఆహారముగా తీసికొందురు. చర్మములతో నిర్మించిన గుడారములలో నివసించెదరు. రక్షణ కొఱకు ఇండ్లచుట్టు ముండ్ల దడులు కట్టుకొందురు. మొక్కల లేత కొమ్మలను ఎండబెట్టి పక్కగా వేసికొందురు. ఎండిన సొరకాయ బుర్రలను పాత్రలుగా వాడుదురు.

ఈ మండలములో కల ప్రదేశములను వాని ముఖ్యపట్టణములను ఈక్రింది పట్టీనుండి తెలిసికొనుడు.

| కాలనీ లేక రక్షితప్రాంతము | రాజధాని లేక ముఖ్య పట్టణము |
|---|---|
| కెన్యాకాలనీ | నైరోబీ |
| టాంగనీకా రక్షిత ప్రాంతము | దార్ - ఎస్ - సలామ్ |
| ఉగాండా రక్షిత ప్రాంతము | మెంగో (దేశీయుల రాజధాని) |
| | ఎంటెబి(ఇంగ్లీషువారిరాజధాని) |
| నాసాలాండురక్షితప్రాంతము | బ్లాంటైర్ |
| ఉత్తర రొడీషియా | లివింగ్‌స్టన్ |
| దక్షిణ రొడీషియా | సాలిస్బరీ |

కెన్యాదేశము : అబిసీనియాకు దక్షిణమున నున్నది. పటములో గుర్తింపుడు. ఈ రాష్ట్రమున కొంత పీఠభూమి, కొంత తీరమైదానము. ఈ రాష్ట్రపు ఉత్తరభాగములో వర్షము తక్కువ. కాబట్టి పొడిగానుండును. దక్షిణ భాగములో వర్షములు ఎక్కువ. దీని పడమట రుడోల్ఫ్, విక్టోరియా సరస్సులు కలవు. ఇచట వ్యవసాయము ముఖ్యవృత్తి. కాఫీ, మొక్కజొన్న, గోధుమ, తేయాకు, చెఱకు, కొబ్బరి పండింపబడుచున్నవి. ఇచ్చట పీఠభూమినుండి మైదానమునకు వచ్చుట బహుకష్టము. కాబట్టి పర్వతములమీద పండిన సరకులు నైలునది మీదుగా, సూయజుకాలువద్వారా తీరప్రాంతములకు రావలసియుండును. పశుపోషణ బాగుగా జరుగుచున్నది. ఇక్కడ బంగారు, వెండి, జిప్సమ్, పాలరాయి మొదలగు ఖనిజములున్నట్లు కనుగొనబడినను అవి పూర్తిగా వినియోగములోనికి తేబడలేదు.

కెన్యాకు నైరోబీ రాజధాని. మొంబాసా ముఖ్య రేవు పట్టణము. మొంబాసా నైరోబీ ద్వారా విక్టోరియా సరస్సు మీది కిసుము రేవుతో రైలు మార్గముతో కలుపబడినది. మొంబాసా బొంబాయివలె ఒక ద్వీపముమీద కట్టబడినది. ఈ రైలు మార్గము నిర్మించుటలో ఎన్నోకష్టములు ఎదుర్కొనబడినవి. అచ్చటి సింహములుకూడ కొంతవరకు ఆటంకమయ్యెను. ఈ రైలుమార్గ నిర్మాణములో భారతీయులు ప్రముఖపాత్రను వహించిరి. ఇందువలన బానిసవ్యాపారము పడిపోయెను. ఈ

ప్రాంతములో మందలుగా వన్యమృగములను చూడగలము. దీనికి ఐరోపీయుల వేటభూమి అని పేరు కలదు.

మొంబాసాకు కొద్ది దూరములో పెంబా, జాంజిబారు ద్వీపములు కలవు. ఇవి పవడపు ద్వీపవములు. జాంజిబారులో మంచి నౌకాశ్రయ మున్నది. ఈ రెండు దీవులును లవంగములను పండించి ప్రపంచమునకు సరఫరా చేయుచున్నవి. కొబ్బరి వర్తకముకూడ కలదు. ఈ దీవులలో భారతీయులు చాలమంది కలరు. వర్తకము ఎక్కువగా వారి చేతులలో కలదు.

కెన్యాకాలనీకి దక్షిణమున టాంగనీకా రాష్ట్రము కలదు. ఇది మొదటి ప్రపంచ యుద్ధమునకు పూర్వము జర్మనీవారి ఏలుబడిలోనుండి జర్మను ఈస్టు ఆఫ్రికా అని పిలువబడుచుండెను. ఆ యుద్ధానంతరము బ్రిటిషువారి రక్షితప్రాంతమయ్యెను. ఈ రాష్ట్రము విక్టోరియా, టాంగనీకా, న్యాసా సరస్సులను తాకుచున్నది. దీనిలో అధికభాగము పీఠభూమి. టాంగనీకా సరస్సు తీరమున ఉజిజి రేవుపట్టణము కలదు. ఇది వర్తకస్థానము. దంతములు ఎగుమతి అగును. ఉజిజి ఈ రాష్ట్రమునకు రాజధానియు, ముఖ్యరేవును అగు దార్-ఎస్-సలాముతో రైలుమార్గముచే గలుపబడినది.

రాష్ట్రములో ముఖ్యపంటలు కాఫీ, టీ, పొగాకు, కొబ్బరి, గోధుమ, బార్లీ. పశుపోషణ ప్రధానమైన వృత్తి. అభ్రకము, తగరము, బొగ్గు, మాంగనీసు, వజ్రములు ఉన్నట్టు కను

గొనబడినవి. ఆ రాష్ట్రములో ప్రసిద్ధమైన వజ్రపుగని కలదు. అచ్చటనుండి వజ్రములు ముఖ్య ఎగుమతులలో నొకటి.

ఉగాండా రాష్ట్రము బ్రిటిషువారి రక్షితప్రాంతము. దాని సరిహద్దులలో విక్టోరియా, ఎడ్వర్డ్, జార్జి, ఆల్బర్ట్, కియోగా, సాలిస్బరీ సరస్సులలో భాగములును, నైలుపరీవాహప్రదేశములో కొంతభాగమును చేరియున్నవి. దాని వైశాల్యము 93,981 చ. మైళ్ళలోను ఈ సరస్సులే 13,680 చ. మైళ్ళ ప్రదేశమును ఆక్రమించుచున్నవి. ఉగాండా అంతయు పీఠభూమి ప్రదేశము. శీతోష్ణస్థితి సౌమ్యముగా నుండును. లోయలలో అడవులు, బురద నేలలుకూడ కలవు. ఈ రాష్ట్రములోని రువెంజోరి పర్వత శిఖరము 16,794 అ, ఎత్తుండి మంచుతో కప్పబడి యుండును.

జనసంఖ్య తక్కువ. ఐరోపీయులు కొద్దిమంది మాత్రము ఇచ్చట స్థిరపడిరి. ప్రజల ముఖ్యవృత్తులు వ్యవసాయము, పశుపోషణ. చుట్టుప్రక్కల రైలుమార్గములు, ఇతర ప్రయాణసాధనములు వృద్ధిపొందుటచే ఈ దేశముయొక్క పరిశ్రమలుకూడ పెంపొందుచున్నవి. ప్రత్తి ముఖ్యపంట. పొగాకు, కాఫీ, తేయాకు, రబ్బరు ఇతరపంటలు. బంగారము, తగరముకూడ త్రవ్వబడుచున్నవి. ఈ గనులలో చాలమంది పనిచేయుచున్నారు. ఇచ్చటి సుందర దృశ్యములను, జంతుకోటిని చూచుటకు యాత్రికులనేకులు వచ్చుచుందురు.

ఈ దేశమునకు ఎంటెబి రాజధాని. అచటి ఆదిమనివాసులగు మాడీ జాతివారికి మెంగో ముఖ్యపట్టణము. కంపాలా

ముఖ్యవర్తక కేంద్రము. విక్టోరియా సరస్సుమీద జింజా ముఖ్యమైనరేవు.



ఉగాండా రాష్ట్రమందలి మాడీవేటగాడు

న్యాసాసరస్సునకు ఇరువైపుల వ్యాపించియున్న దేశము న్యాసాలాండు. ఇదికూడ ఇంగ్లీషువారి రక్షిత ప్రాంతమే. ఇది సముద్రమునకు 180 మైళ్ళ దూరములోనున్నది. న్యాసా సరస్సులో నౌకలు తిరుగుచుండును. పీఠభూమి కనుక శీతోష్ణ స్థితి సౌమ్యముగా నుండుటచే ఐరోపియనులు స్థిరనివాస మేర్ప రచుకొనిరి. ఈదేశమునకును సముద్రమునకును మధ్య పోర్చు గీసు తూర్పు ఆఫ్రికాకలదు. పోర్చుగీసు తూర్పు ఆఫ్రికాలోని బెయిరా న్యాసాలాండుకుకూడ రేవుపట్టణము.

ఇచ్చటి ప్రజలకు (దేశీయులకు, ఐరోపియనులకు) వ్యవ సాయము ముఖ్యవృత్తి. పొగాకు, తేయాకు, సిసాల్ నార, ప్రత్తి, రబ్బరు, కాఫీ ముఖ్య పంటలు. బంగారము, రాగి, ఇనుము, అభ్రకము, బొగ్గు, మాంగనీసు కూడ ఉన్నట్టు కనుగొనబడినవి. జోంబారా రాజధాని. పీఠభూమిమీద కాఫీ తోటలలోకల బ్లాంటైరు చక్కని ప్రదేశము.

ఉత్తర రొడీషియా న్యాసాలాండుకు పడమరగాను, జాంబెజీనదికి ఉత్తరమునను ఉన్న విశాల ప్రదేశము. ఇది ఎత్త యిన పీఠభూమి ప్రదేశము. దీనికి ఉత్తరమున కాంగోనదీ ప్రాంతపు అధికవర్షపాత మండలము కలదు. కావున వర్షపాతము తక్కువకాదు. గడ్డి దట్టముగా పెరుగును. నదీతీరముల వెంబడి దట్టమైన అరణ్యములు కలవు. ఎత్తయిన పీఠభూములమీద కూడ ఉష్ణము అధికముగాను గాలి తడిగాను ఉండును. కావున ఈ ప్రదేశము ఐరోపీయులకంత అనుకూలమైనదికాదు. ఇక్కడ

ఐరోపీయులు తాత్కాలికముగా వర్తక వ్యాపారములలో పాల్గొనుటకు. గనులలోను, తోటలలోను పనిచేయుటకు మాత్రము వచ్చిపోవుచు స్థిరనివాస మేర్పాటు చేసికొనలేదు. వ్యవసాయమునకు, పశుపోషణకు చాల అనుకూలమైనది. ప్రత్తి, మొక్కజొన్న, గోధుమ, పొగాకు ముఖ్యపంటలు. పశువులు, గొఱ్ఱెలు, మేకలు, పందులు పోషింపబడుచున్నవి. బంగారము మొదలగు లోహము లున్నట్లు కనుగొనబడినది. కేప్ టౌనునుండి రైలుమార్గము దక్షిణరొడీషియాలో బులవేయో నుండి ఉత్తరముగాపోయి, జాంబెజీనదిని విక్టోరియా జలపాతము వద్ద దాటి, ఉత్తర రొడీషియాలోనికి పోయి కాంగోనదీ ప్రాంతమును చేరుచున్నది. బులవేయోనుండి దక్షిణ రొడీషియాకు రాజధానియగు శాలిస్బరీకి ఒకశాఖకలదు. ఈదేశమునకు లివింగ్స్టను రాజధాని. పెంబా, లుసాకాలు వర్తక కేంద్రములు.

దక్షిణ రొడీషియా జాంబెజీ, లింపోపో నదులకు మధ్యనున్న ఉన్నతమైన పీఠభూమి. ఈ రాష్ట్రములోని శీతోష్ణస్థితి సౌమ్యముగా నుండుటచే ఉత్తర రొడీషియాకంటె ఈ రాష్ట్రము ఎక్కువ అభివృద్ధి చెందినది. పశ్చిమమునకు పోయినకొలది వర్షపాతము తగ్గుచుండును. దేశములో అడవులు ఎక్కువగా నుండుటయేకాక పచ్చికబీడులు కూడ ఎక్కువ. కాని ట్సెట్సీ ఈగలవలన పశువులకు చాల నష్టము కలుగుచుండును.పొగాకు, ప్రత్తి, మొక్కజొన్న, జొన్న, తియ్యదుంపలు, వేరుసెనగ ముఖ్య పంటలు. ఇక్కడ మిడతలవలన పంటలకు నష్టము కలుగు

చుండును. ఇచ్చట లభించు బంగారమువలన ఈదేశము ఆర్థిక ముగా వృద్ధిపొందుచున్నది. ఈ గనులు శాలిస్బరీ, బుల్వాయోల మధ్య కలవు. క్రోమియము కూడ అధికముగా ఉత్పత్తి చేయబడుచున్నది. వెండి, సీసము, ఇనుము, రాగి, బొగ్గు, తగరము కూడ త్రవ్వబడుచున్నవి. పశుపోషణకూడ జరుగు చున్నది. ఈ దేశమునకు రాజధాని శాలిస్బరీ. ఇది పోర్చుగీసు తూర్పు ఆఫ్రికాలోని బెయిరా రేవుతో రైలుద్వారా కలుప బడియున్నది. బుల్వాయో పెద్ద పట్టణము.

---

# 9. పోర్చుగీసు తూర్పు ఆఫ్రికా

హిందూ మహాసముద్రతీరమున జాంబెజీ నదికి ఇరు వైపుల ఈ దేశము వ్యాపించియున్నది ఇందు అధికభాగము మైదానము. ఇచ్చట వేడిమి అధికము. ఆగ్నేయ వ్యాపార పవనములవల్ల అధిక వర్షము కురియును. కాబట్టి దేశము సార వంతముగా నుండుటయేగాక చాల అడవులనుకూడ కలిగి యున్నది. జాంబెజీ నదియొక్క డెల్టా బురదతో కూడియుండి క్షారజలారణ్యములకు నిలయమై యున్నది. ఈ దేశముయొక్క వర్తకము మూడు ముఖ్యమైన రేవులద్వారా జరుగుచున్నది. చిన్డె రేవు జాంబెజీ ముఖద్వారమునగల ముఖ్యమైనరేవు. దానికి దక్షిణముగా బెయిరా రేవు కలదు. ఈ రేవు ఒక రైలుమార్గము ద్వారా శాలిస్బరీ, బుల్వాయోలతో కలుపబడినదని ఇదివరకే

చెప్పితిమి. దక్షిణమున లొరెన్జో మార్క్వెస్ సురక్షితమైన రేవు. ఇది లింపోపో నదీ ముఖద్వారమువద్ద కలదు. మొజాంబిక చిన్న పవడపు దీవిమీద కట్టబడిన పట్టణము. అదికూడ పోర్చు గీసు వారిదే. మంచి హార్బరు కలదు. కాని వర్తకము తక్కువ.

---

# 10. మెడగాస్కరు ద్వీపము

ఈ ద్వీపము హిందూ మహాసముద్రములో పోర్చుగీసు తూర్పు ఆఫ్రికానుండి మొజాంబిక్ కాలువచే వేరుచేయబడినది. ఇది 1000 మైళ్లు పొడవుకలది. మధ్య ఎత్తయిన పీఠభూమియు చుట్టును మైదానమును కలవు. తీరమున వర్ష మెక్కువ. కాబట్టి ఆ ప్రాంతములో అరణ్యములు అధికము, పీఠభూమి చల్లగానుండును. కాని వృక్షము లుండవు. అచ్చటి గడ్డి పశు పోషణకు అనుకూలముగా నున్నది. పల్లపుచోట్ల వరి పండింప బడుచున్నది. అదియే అచ్చటి ప్రజలకు ముఖ్యాహారము.

పీఠభూమిమీద హోవా లనబడు మలయాజాతి ప్రజ లును, మైదానములో నీగ్రో జాతివారును నివసించుచుందురు. ఈ ద్వీపమునకు అంటననరీవో రాజధాని. అది ఆరోగ్యకరమైన పీఠభూమిమీద కలదు. ఇక్కడనుండి టామ్‌టేవ్ అను రేవునకు ఒక్కటే రైలుమార్గము కలదు. రబ్బరు, బంగారము, చర్మములు ముఖ్య ఎగుమతులు. ఈ ద్వీపము ఫ్రెంచివారికి చెందినది.

# 11. దక్షిణ ఆఫ్రికా

దక్షిణాఫ్రికా సమశీతల మండలములో నున్నది. ఈ ప్రాంతములో అత్యధిక భాగము పీఠభూమి అగుటచే శీతోష్ణ స్థితి అనుకూలముగా నుండును. ఆగ్నేయ వ్యాపార పవనముల వల్ల ఇచ్చట వేసవిలో వర్షము కురియును. ఈ సమయములో నైరృతిమూల తప్ప పడమటి తీరమంతయు పొడిగానుండును. ఈ పీఠభూమి యందలి గడ్డి మైదానమును వెల్డు అందురు. ఇచ్చటి ఆదిమవాసులను కాఫిరు లందురు. పశుపాలన వీరి ముఖ్య వృత్తి.

దక్షిణాఫ్రికాకు దక్షిణాఫ్రికాయూనియను అను పేరుకూడ కలదు. దిగువ పట్టీ దాని వివరములను విశదము చేయగలదు.

| రాష్ట్రము | రాజధాని | దేశముయొక్క స్వభావము |
|---|---|---|
| గుడ్ హోపు రాష్ట్రము | కేప్‌టౌను | పీఠభూమి, కారూలు, కొద్ది తీరమైదానము: తూర్పుతీరము నేటాలును పోలియుండును. |
| నేటాలు | పీటర్ మారిట్జ్ బర్గు | ఇరుకైనతీరమైదానము, లోప్రదేశము ఎగుడు దిగుడు, డ్రాకెన్సు బర్గ కొండలు. |
| ఆరెంజి ఫ్రీస్టేటు ట్రాన్స్‌వాల్ | బ్లోయెంఫాంటెన్ ప్రిటోరియా | ఎగుడు దిగుడుగల పీఠభూమి, దూర దూరమున పర్వత శ్రేణులు, వీటికి కొప్జెన్ అనిపేరు. |
| నైరృతి ఆఫ్రికా | విండ్‌హక్ | పీఠభూమి, ఇరుకైన లోతైన తీర మైదానము. |



దక్షిణ ఆఫ్రికాలోని వెల్డుపై బోయరు రైతు ఒకచోటనుండి మరొక చోటునకు కుటుంబ సహితముగా మారుట పటమున చూపబడినది. రోడ్లులేని ఆ ప్రదేశమున అన్ని జతల ఎడ్లను బండికికట్టినగాని ప్రయాణము సాగదు.

కేప్ ఆఫ్ గుడ్ హోప్ రాష్ట్రము : ఆఫ్రికా దక్షిణ చివర ఆరెంజి నదికి దక్షిణమునకలదు. ఈ రాష్ట్రములో అత్యధిక భాగము ఎత్తయిన పీఠభూమి. ఈ పీఠభూమి దక్షిణమునకు




ద. ఆఫ్రికా పీఠభూమి సెక్షన్

క్రమము.గా రెండు మెట్లుగా తగ్గుచున్నది. వాటికి గ్రేట్ కారూ, లిటిల్ కారూ (Karroo) అని పేర్లు కలవు. ఈ పీఠభూమిమీద వర్షము,చాలతక్కువ. కనుక నదులు రాకపోకలకు నిరుపయోగమైనవి. వర్షాభావమువల్ల వ్యవసాయము చాల తక్కువ. నీటిని నిలువ చేసుకొనవలసి యుండును.

రాష్ట్రములో జనసంఖ్యతక్కువ అచ్చటి ఆదిమవాసులు కొద్దిగా వ్యవసాయము చేయుదురు. గనులకొరకు ఐరోపియులు వచ్చి స్థిరనివాస మేర్పరచుకొనిరి. కేప్ రాష్ట్రములోను దక్షిణ ఆఫ్రికాలోని ఇతరరాష్ట్రములలోనుకూడ భారతీయులు చాల మందికలరు. వీరు తూర్పు, దక్షిణ ఆఫ్రికాలలో పనిచేయుటకు తీసుకొనిరాబడిన భారతీయ సంతతివారు. చాల మంది వర్తకములోకూడ నున్నారు.

ఈ రాష్ట్రములో ఖనిజ సంపద ఎక్కువ. రాగి అధికముగా లభించును. వజ్రములకు కింబర్లీ గొప్ప కేంద్రము. ప్రపంచ ఉత్పత్తిలో 90 శాతము ఇక్కడనే లభించుచున్నది.

ఈ రాష్ట్రములో గోధుమ, ఓట్లు, రై, పొగాకు, జొన్న ముఖ్యపంటలు. కేప్‌టౌను రాజధాని. అనేక నౌకలు నిలుచుచుండును. గొప్ప సముద్ర వర్తక కేంద్రము. ఈ రేవుద్వారా ఉన్ని, చర్మములు, ఉష్ట్రపక్షి ఈకలు, పాడిపరిశ్రమతాలూకు పదార్థములు, బంగారము, వజ్రములు, రాగి ఎగుమతి అగును. ఇంగ్లండు, ఐరోపాలనుండి నూలువస్త్రములు, ఇనుము, ఉక్కు యంత్రములు వగైరా దిగుమతి యగును. ఈరాష్ట్రమునకు తూర్పున పోర్ట్ ఎలిజబెత్, తూర్పు లండను రేవులుకూడ వ్యాపార కేంద్రములే.

ఈ రాష్ట్రమునుగూర్చి చదివినపుడు దీని దక్షిణభాగములోకూడ మధ్యధరా శీతోష్ణస్థితిగల ప్రదేశమున్నదని జ్ఞాపకముంచుకొనవలెను. ఇక్కడకూడ శీతకాలమున వానలు కురియును. నిమ్మ, నారింజ, ద్రాక్ష, ఆలివు మున్నగుపండ్లు పండును.

ట్రాన్సువాలు:ఆరెంజిరాష్ట్రమునకు ఉత్తరమున లింపోపో నదికిని, ఆరెంజి నదికిని మధ్య ట్రాన్స్‌వాల్ రాష్ట్రము గలదు. ఈప్రాంతములోని పీఠభూమిలో కొన్ని కొండలవరుసలు కలవు. అందు ముఖ్యమైనది విట్‌వాటర్స్ రాండ్. ఈ రాష్ట్రములో ఉత్తరభాగమున అడవులు గలవు. వర్షపాతము వ్యవసాయము

నకు తగినంతగా నున్నది. ప్రదేశము ఆరోగ్యకరమైనది. దక్షిణమున ఎత్తు ఎక్కువ. గడ్డి సమృద్ధిగా పెరుగును కాబట్టి పశుపోషణకు అనుకూలముగా నున్నది.

ఈరాష్ట్రము ఖనిజసంపదకు ప్రసిద్ధమైనది. బంగారము, బొగ్గు, ఇనుము, వజ్రములు, ప్లాటినము, సీసము, వెండి, తగరము రాగి ముఖ్య ఖనిజములు. విట్‌వాటర్‌రాండు పర్వతపంక్తికి రాండు అను సంక్షిప్తనామము కలదు. ఈ ప్రదేశములో బంగారము ఎక్కువగా లభించును. ఈగనులకు జోహాన్సుబర్గ్ ముఖ్య కేంద్రము. ఇచ్చట వర్షపాతము తక్కువైనను బావులద్వారా నీటిని తీసి వ్యవసాయమునకును, గనులకును ఉపయోగించుచున్నారు. బొగ్గు అంత మంచిది కాకపోయినను పరిశ్రమలను వృద్ధిచేయుటకు అనుకూలముగానుండి సమీపముననే లభించును. ప్రిటోరియా సమీపమున వజ్రపుగనులు కలవు. చెఱకు, ప్రత్తి, పొగాకు ముఖ్యపంటలు.

రాష్ట్రరాజధాని ప్రిటోరియా పెద్దపట్టణము. 4500 అడుగుల ఎత్తున కలదు. జొహాన్స్‌బర్గ్ దక్షిణాఫ్రికాలో అన్నిటి కంటె పెద్దపట్టణము.

ఆరంజిఫ్రీస్టేటు రాష్ట్రము ఆరెంజినదికిని వాల్‌నదికిని మధ్యకలదు. దానికి తూర్పున నేటాలు, పడమట బ్రిటిషు నైరృతి ఆఫ్రికాకలవు. ఇదిచాలఎత్తైనపీఠభూమి. సంవత్సరములో 8 నెలలు వర్షము చాల తక్కువ. కావున పశుపోషణయే ముఖ్యవృత్తి. పశువులు, గొఱ్ఱెలు పెంచబడుచున్నవి. ఇచ్చటి నదులకు వేస

విలో మాత్రము వరదలువచ్చును. ఇటీవల వ్యవసాయము వృద్ధి చేయబడుచున్నది. మొక్కజొన్న, జొన్న, గోధుమ ఈప్రాంతములో పండించబడుచున్నది. దీనికి బ్లోయెమ్ ఫాంటెన్ రాజధాని. ప్రిటోరియాతో రైలుమార్గముచే కలుపబడినది. నేటాలులోని డర్బను నుండి. గుడ్‌హోపు రాష్ట్రములోని తూర్పు లండను నుండి రెండు రైలుమార్గములు తీరమువెంబడి ఈ రాష్ట్రములోనికి వేయబడినవి.

నేటాలు రాష్ట్రము : ఆరెంజి ఫ్రీస్టేటుకు తూర్పున కలదు. గాంధి మహాత్ముడు తన పవిత్రజీవితములో కొంతకాల మీ రాష్ట్రమున గడపెను. ఈరాష్ట్రమునకు డ్రేకెన్‌బర్గు పర్వతపంక్తి పడమటి సరిహద్దు. ఈ పంక్తికిని తీరమైదానమునకును మధ్య కొంత పీఠభూమి ప్రదేశము కలదు. ఈ ప్రాంతములోని రెండు కనుమలద్వారా ఖండములోనికి రైలుమార్గములు వేయబడినవి. ఇచ్చట ట్యూగెలా నదీజలపాతము ప్రసిద్ధమైనది.

శీతోష్ణస్థితి ఔన్నత్యమునుబట్టిమారుచుండును. పీఠభూమి మీది సౌమ్యశీతోష్ణస్థితి ఐరోపీయులకు ప్రశస్తమైనది. మైదాన ప్రాంతము తడిగాను, ఉష్ణముగాను ఉండును. తీరమైదానములో చెఱకు, వాటిల్ (Wattel) పండుచున్నవి. వాటిల్‌చెట్టు బెరడు (Wattle Bark) చర్మములను పదునుచేయుటకు చాల మంచిది. ఈ వాటిల్‌ను ఇప్పుడు మన దేశములోగూడ పెంచుటకు

ప్రయత్నములు జరుగుచున్నవి. పశుపోషణ కూడ అధికము. ఈరాష్ట్రము ఎల్లప్పుడును పచ్చగా నుండును. కావున దీనిని



నేటాలులోని జూలూజాతివారి యిండ్లు

దక్షిణాఫ్రికా ఉద్యానవన మని పిలిచెదరు. ఇచ్చటిబొగ్గు మేలు రకమైనది.

నేటాలులోని ఆదిమవాసులను జూలూ లందురు. వారు పొలములలో పనిచేసియు, రిక్షాలు లాగియు జీవనోపాధిని సంపాదించుకొను చున్నారు. వీరు చుట్టుగుడిసెలలో కాపుర ముందురు.

నేటాలుకు రాజధాని మారిట్జుబర్గు లేక పీటర్ మారిట్జు బర్గ్. పీఠభూమి మీద ఒక పల్లపుచోట కలదు. డర్బను మంచి ఓడరేవు. ఈ రేవుద్వారా ట్రాన్స్‌వాలులోని బంగారు, ఉన్ని, బొగ్గు, పంచదార, వాటిల్ బెరడు, చర్మములు ముఖ్య ఎగుమతులు.

నైరృతి ఆఫ్రికా : మొదటి ప్రపంచ యుద్ధము వరకు జర్మనుల వలసయై యుండెను. తర్వాత 1920 నుండి దక్షిణాఫ్రికా యూనియను పరిపాలనలో నున్నది. ఈ ప్రదేశములో వర్షములు తక్కువ. ఆగ్నేయ వ్యాపార పవనము ఈ దేశము చేరుసరికి తేమను కోల్పోవును. కావున పీఠభూమి మీద గుఱ్ఱములు, గొఱ్ఱెలు, మేకలు పెంచబడుచున్నవి. ఈ దేశమునకు వాల్విష్‌బే అనునది మంచి రేవు. ఈ దేశమునకు విండ్‌హక్ రాజధాని. ఇచ్చటి ప్రజలలో అధిక సంఖ్యాకులు నీగ్రోలు. కాని రాష్ట్రము యొక్క దక్షిణమున నీగ్రో జాతికి సంబంధించిన నెగ్రిటోలు కలరు. వారిని బుష్‌మన్ లని, హాటెంటాటు లని అందురు.

నైరృతి ఆఫ్రికాకు తూర్పున బెచూనాలాండు కలదు. ఈ రాష్ట్రములోనే కలహారి ఎడారి ఉన్నది. ఆఫ్రికాలో భూమధ్య రేఖకు ఉత్తరమునకు పోయినకొలది ఎట్టి మండలములుండునో అట్లే దక్షిణమునకు పోయినకొలది అట్టి మండలములుండుట ఒక ప్రత్యేకత అని ఇదివరకే చదివియున్నారు. ఉత్తరమున సహారా ఉన్నట్లు దక్షిణమున కలహారి ఉన్నది. సహారా కర్కాటక రేఖా

ప్రాంతమున నున్నట్లు కలహారి మకరరేఖాప్రాంతమున నున్నది. గమనింపుడు. కలహారి ఎడారిలో ఉత్తరమున తుప్ప నేలలున్న ప్రదేశములో ఉష్ట్రపక్షులు కలవు. కొన్నిచోట్ల వీటిని మంద లుగా పెంచుచున్నారు. ఇచ్చట జనసంఖ్య చాల తక్కువ. వారు నీగ్రోజాతికి చెందిన బెచూనాలు. వారికి పశుపోషణ ముఖ్యవృత్తి.

---

## 12. కాంగోమండలము

ఈ నదీపరీవాహిక ప్రదేశము బెల్జియనుల స్వాధీనములో నున్న ఏకైక వలస. ఇచ్చట శీతోష్ణస్థితి వేడిగాను, చెమ్మగాను ఉండును. సంతత వర్షపాతమండలము, వహానవర్షములు కురియు చుండును. ఈ వర్షములు సూర్యునితో ప్రయాణము చేయు చుండును. అనగా సూర్యుడు ఉత్తరార్ధ గోళములో ఉన్నపుడు ఈమండలముయొక్క ఉత్తరము వైపునను, దక్షిణార్ధ గోళములో నున్నపుడు దక్షిణము వైపునను వర్షములు కురియుచుండును. కాంగో పరీవాహిక ప్రదేశములో దట్టమైన అరణ్యాము లుండుట వలన నదులే ప్రయాణ సాధనములు. కాంగో, దాని ఉపనదులు, కలసి 10,000 మైళ్లు ప్రయాణమునకు వీలు కలిగించుచున్నవి. ఒక్క కాంగోనది 1,000 మైళ్ళు ప్రయాణము చేయుటకు

చాల అనుకూలముగా నున్నను కొన్నిచోట్ల జలపాతములవల్ల వీలుగాలేదు. కాబట్టి రైలు మార్గములు అచ్చటచ్చట నిర్మింప బడినవి.




కాంగో మండలము

ఇచ్చటి అడవులు అద్భుతమైనవి. చెట్లు చాల దట్టముగా పెరుగును. వాటి మధ్య అనేక తీగలు అల్లిబిల్లిగ నల్లుకొని యుండును. ఈ తీగలకు ముండ్లుకూడ ఉండును. సూర్యరశ్మి కొరకు వృక్షరాజములు పోరాటము సలుపుచున్నవా అన్నట్లుండును. సూర్యరశ్మిచెట్ల మొదళ్ళకు అసలే తగలదు. కాబట్టి నేల యంతయు చీకటిగా నుండును. ఎప్పుడును వర్షముకురియును. కనుక నేల తేమగా నుండును. జంతుజాలముకూడ ఇచ్చట

నివసింపలేదు. చెట్లమీద నివసించు కోతులు మాత్రము బ్రతుక గలవు. ఇచ్చటి కోతులు మనుష్యులవలె పెద్దవిగా నుండును. ఇవిగాక అసంఖ్యాకముగ పక్షులును, కీటకములు నుండును. ఈ అరణ్యములలో నూనెతాడి (Oil palm) చాల ముఖ్యమైనది. ఎబనీ, మహాగనీచెట్లును, కాయలు, జిగురు ఇచ్చు చెట్లునుకూడ ముఖ్యమైనవే. తియానా చెట్లనుండి రబ్బరు తీయుదురు. ఇట్టి మహారణ్యములోకూడ ఆదిమ నివాసులు నివసించుచున్నారు. వీరు ఏనుగ దంతములను ప్రోగుచేయుచుందురు. వీరందరును నీగ్రోలు. వీరిలో చాలమంది నేటికిని నరమాంస భక్షకులు. వీరు బంటూ భాష మాట్లాడుదురు. అతి దట్టమైన అరణ్యా ప్రాంత ములలో పిగ్మీలను మనుష్యులు కలరు. వీరు 3 లేక 4 అడు గుల ఎత్తుందురు. వీరు కొద్దిగా వ్యవసాయముచేసి అరటి, తియ్యదుంపలు, మొక్కజొన్న మొదలగు వానిని పండించు చున్నారు. అడవుల అంచులలో కొంత ప్రదేశమును బాగుచేసి వ్యవసాయము చేయుదురు. ఆకులతో నిర్మించిన చుట్టుగుడి సెలలో నివసింతురు.

బెల్జియం కాంగో దేశమునకు నైరృతిగా పోర్చుగీసు అంగోలా దేశముకలదు. ఇందు పీఠభూమియు, ఇరుకైన తీర మైదానమును కలవు. ఇచట వర్షపాతము బహు తక్కువ. కాబట్టి సవానా గడ్డిబీడులు మాత్రముకలవు. ఉత్తరమున కాంగో నదీప్రాంత మగుటచే వర్ష మెక్కువ. అందుచేత అడవులు కలవు. ఆ అడవులలో నూనెతాడిచెట్లు, రబ్బరుచెట్లు కలవు. ఉత్తరవాలు

లలో కాఫీ, ప్రత్తి పైరు చేయబడుచున్నవి. లోయాండా ఈ దేశమునకు రాజధాని. బెంగ్యులా పెద్ద పట్టణము. రెండును రేవులే. రెంటినుండి దేశములోనికి రైలుమార్గములు కలవు. ఈ రేవులనుండి కాఫీ, రబ్బరు, మైనము, నూనెతాడి చెట్టుయొక్క నూనె, చర్మములు ముఖ్య ఎగుమతులు.

---

## 13. పశ్చిమ ఆఫ్రికా

ఈ విభాగములో ఫ్రెంచి ప్రదేశములు, బ్రిటిషు ప్రదేశములు, పోర్చుగీసు ప్రదేశములు, లైబీరియా అను దేశములను పరిశీలించవలసి యున్నది.

ఫ్రెంచి ఈక్వెటోరియల్ ఆఫ్రికా బెల్జియం కాంగోకు పడమటగానుండి ఉత్తరమున సహారా ఎడారిలో చేరిపోయి




పశ్చిమ ఆఫ్రికా

యున్నది. ఈ ప్రదేశము అధిక వర్షపాత మండలములోనిది. ఇక్కడి అరణ్యములలో ఏనుగులు అధికమగుటచే దంతములు

ప్రోగుచేయుదురు. అడవులలో నూనెతాడి, రబ్బరుచెట్లు హెచ్చుగాకలవు. పీఠభూమికిని, సముద్రమునకును మధ్యగల కొండవాళ్ళమీద అరణ్యములున్నవి. సముద్రతీరమున క్షారజలారణ్యములు కలవు. లిబ్రెవిల్లి దేశమునకు రాజధాని. అదియే ముఖ్య రేవుకూడను. ఈ రేవుద్వారా రబ్బరు, దంతము, కలప, పామ్ ఆయిల్, కాఫీ ముఖ్య ఎగుమతులు.

ఫ్రెంచి ఆఫ్రికా సహారాకు దక్షిణముగా లైబీరియా, బ్రిటిషు, పోర్చుగీసు ప్రదేశములుపోను మిగిలినదంతయు నైయున్నది. సహారా కూడ ఫ్రెంచివారిదే. ఆల్జీరియా, ట్యూనిసులు వారి ప్రాబల్యములోనే ఉన్నవి. కాబట్టి ఉత్తర ఆఫ్రికాలో అధికభాగము ఫ్రెంచివారికి చెందినదని పటముచూచి గమనింపుడు. ఈ ప్రదేశములో నైజరునది ఉత్తరముగా ప్రవహించి ఆగ్నేయముగా మరలినది. ఈవంపువద్ద టింబక్టూ కలదు. ఇది ఒంటెల మార్గమునకును, నదీమార్గమునకును కూడలి. ఇక్కడినుండిఎడారిలోనికి ట్యూనిసు వైపునకు ఒకటి, మొరాకో వైపునకు నురొకటి ఎడారు మార్గములు కలవు. నైజరునదిలో ప్రయాణముచేయు పడవలు, ఓడలు ఇక్కడ నిలుచును. ఇచ్చటి నుండి పశ్చిమముగా రైలుమార్గముకూడ కలదు. అట్టి ప్రముఖ స్థానమందున్న ఈ పట్టణము గొప్ప వర్తకకేంద్ర మగుటలో ఆశ్చర్యములేదు. అరబ్బు వర్తకులు ఖర్జూరము, తుమ్మజిగురు, ఉష్ట్రపక్షి ఈకలు తెచ్చెదరు. ఐరోపానుండి పనిముట్లు, పూసలు మొదలగునవి కూడ మొరాకో ద్వారా ఎడారి దాటి వచ్చును.

వేలకొలది ఒంటెలుకల బిడారులు ఎడారి ఉప్పును తెచ్చును. నదిలోవచ్చు ఓడలు ధాన్యము, బంగారము, మైనము, దంతము తెచ్చును.

నైజీరియా బ్రిటిషువారిది. నైజరు నదినిబట్టి దానికా పేరు వచ్చినది. నైజరునది ఫ్రెంచిగినీ ప్రాంతమున ఫ్యూటాజాలన్ వద్ద పుట్టి ఈశాన్యముగా ప్రవహించి, టింబక్టూ దాటిన తర్వాత ఆగ్నేయముగా ప్రవహించి గినీ సింధుశాఖలో కలియుచున్నది. ఇది ప్రవహించు ప్రాంతములో కోలాచెట్లు కలవు. వీటి కాయల లోని గింజలతో పానీయము చేయుదురు. ముఖద్వారమువద్ద అనేక శాఖలగుటచే పెద్ద డెల్టా ఏర్పడినది. ఈ ముఖద్వార ప్రాంతమునగల దేశమే నైజీరియా. ఈ ప్రాంతములో వర్ష పాతము అధికము. వేడి హెచ్చు, గాలి తేమగా నుండును.

ఉత్తర నైజీరియా ఛాడ్ సరస్సువరకు వ్యాపించియున్నది ఇచ్చటి పీఠభూమిప్రదేశము సారవంతమును, జనసమ్మర్దమును అయినది. ఇచ్చట సొకోటో, కేనో, కుకా అను వర్తక కేంద్ర ములు కలవు. ఇవన్నియు బిడారువర్తక కేంద్రములు. కేనో బిడారువర్తక కేంద్రమేకాక లాగాస్ రేవుతో రైలుద్వారా కలుపబడినది. ఇది బహుకాలమునుండి ప్రసిద్ధమైనది. ఈ పట్ట ణముచుట్టు 15 మైళ్ళ నిడివిగల గోడ కలదు. ఈ గోటలోపల పట్టణమేకాక తోటలు, పొలములుకూడ కలవు. ఇచ్చట లోహము, చర్మము పరిశ్రమలు కలవు. నూలు పరిశ్రమకూడ ముఖ్యమైనదే. ఇచ్చట ఒక గొప్ప సంత జరుగును. అచ్చటకు

చుట్టుప్రక్కల ప్రదేశములనుండి జనులు వచ్చి తమ సరకులనిచ్చి తుపాకిమందు, పట్టువస్త్రములు మొదలైనవానిని కొందురు. ఈ పట్టణములో అధిక సంఖ్యాకులు నీగ్రోలు. వీరు హౌసా, ఫులా తెగలకుచెంది నాగరికులైనవారు. వీరి భాషయే సూడాను లోని నీగ్రోలుకూడ మాట్లాడుదురు.

దక్షిణ నైజీరియా ముఖద్వార ప్రాంతమున సముద్రతీరమున నున్నది. ఇచ్చట శీతోష్ణస్థితి ఆరోగ్యకరమైనది కాదు. వర్షపాత మధికము. గాలి తడిగా నుండును. ముఖ్యముగా పామ్ ఆయిల్, రబ్బరు ఉత్పత్తి చేయబడుచున్నవి. పామ్ అను తాడి ఈ ప్రదేశమున అతి ముఖ్యమైనది. ఈ నూనెతో సబ్బులు, కొవ్వువత్తులు చేయుదురు. లాగోస్ రాజధాని చిన్న ద్వీపము మీద కట్టబడి కానో పట్టణముతో రైలుద్వారా కలుపబడినది.

సెనెగల్, గాంబియా నదులుకూడ నైజరువలెనే ఫూటా జాలన్‌వద్ద పుట్టి పశ్చిమముగా ప్రవహించి అట్లాంటిక్ మహాసముద్రములో కలియుచున్నవి. సెనెగల్ పరీవాహిక ప్రదేశములో వర్షముతక్కువ. ఇచట నువ్వులు వేరుసెనగ పైరుచేయబడి నూనె తీయబడుచున్నది. సెనెగల్ దేశమునకు సెంట్‌లూయీ రాజధాని. అది సెనెగల్ నదీముఖద్వారమున ఒక చిన్నద్వీపము మీద కట్టబడినది. గాంబియాదేశమునకు బాథర్స్ట్ రాజధాని.

గోల్డుకోస్టుకూడ అధిక వర్షపాత మండలములోనిదే. ప్రజలకు వ్యవసాయము ముఖ్యవృత్తి. మంచి అడవులుకూడ కలవు. రోడ్లు వృద్ధిచేయబడినవికాని నదులు యానమునకు పనికి

రావు. రైలుమార్గములు కొద్దిగా కలవు. ప్రజలు కోకో, కోలా పామ్ ఆయిల్, కొబ్బరి, రబ్బరు, ప్రత్తి ఉత్పత్తి చేయుచున్నారు. మహోగనీ ముఖ్యమైన కలప. బంగారము, మాంగనీసు, వజ్రములు గనులలో త్రవ్వబడుచున్నవి. అక్రా రాజధాని. శేవుకూడను. ఈ దేశమునకు ఇటీవలనే ఘనా అను పేరుతో స్వతంత్ర ప్రతిపత్తి కలిగింపబడినది.

సియ్రాలియోనీ బ్రిటిషు పాలనలో నున్నది. ఈ దేశములో చాలభాగము మైదానము. ఇక్కడ వరిపంట ఎక్కువ. అదియే అచ్చటి ప్రజల ముఖ్యాహారము. మొక్కజొన్న, జొన్న, వేరు సెనగ, కొబ్బరికూడ పండింపబడుచున్నవి. ఇక్కడనుండి ముఖ్య ముగా తాడినూనె, కోలా, అల్లము, కోకో, కాఫీ, మిర్చి ఎగుమతి అగుచున్నవి. బంగారము, ఇనుము, వజ్రములు ఉన్నవి కాని త్రవ్వుటకు పెద్ద యత్నములు జరుగుట లేదు. ఫ్రీటౌన్ రాజధానియేకాక గొప్ప సహజ నౌకాశ్రయము.

లైబీరియా నీగ్రోల స్వతంత్ర రిపబ్లికు రాజ్యము. విముక్తు లైన నీగ్రో బానిసల కొరకు ఒక అమెరికను సంఘముచే ప్రారంభింపబడెను. ఇచ్చట దేశీయులు క్రూమను తెగకు చెందిన వారు. కష్టపడి పనిచేయుదురు. కావున ఈ దేశము వృద్ధిలోనికి వచ్చుచున్నది. ఇచ్చటి విద్యావిధానము వృద్ధిచేయుటకు ఐక్య రాజ్య సమితి విద్యా వైజ్ఞానిక సంఘము (UNESCO) వారు మన ప్రస్తుతపు విద్యాశాఖ డైరెక్టరగు శ్రీ సదాశివ రెడ్డిగారిని మూడు సంవత్సరముల క్రిందట పంపియుండిరి.

# ప్రశ్నలు

1. ఆఫ్రికాఖండముయొక్క ఉనికిని వర్ణింపుడు.
2. ఆఫ్రికాలో దాని ప్రత్యేక ఉనికికిని శీతోష్ణస్థితికిని గల సంబంధమును చూపుడు.
3. ఆఫ్రికాయొక్క నైసర్గిక స్వరూపమునుగూర్చి వ్రాయుడు.
4. ఆఫ్రికాలోని కొన్ని ముఖ్యనదులను పేర్కొని వాటినిగూర్చి వ్రాయుడు.
5. ఆఫ్రికాలో ఉత్తర దక్షిణములందు వేర్వేరు శీతోష్ణస్థితులుండునని రుజువు చేయుడు.
6. ఆఫ్రికాలోని సరస్సులనుగూర్చి వ్రాయుడు. అవి ఎట్లేర్పడినవి?
7. ఈజిప్టునకు భిక్ష పెట్టిన నది యేది? దానినిగూర్చి వ్రాయుడు.
8. ఆఫ్రికాలోని వేర్వేరు ఎడారులను పేర్కొని వాటి స్వభావమును వివరింపుడు.
9. సహారా ఎడారినిగూర్చి విపులీకరింపుడు.
10. ఆఫ్రికాలో వివిధవర్షపాత మండలములనుగూర్చి సకారణముగ వ్రాయుడు.
11. ఆఫ్రికాలోని సహజ మండలములనుగూర్చి వ్రాయుడు.
12. ఆఫ్రికాఖండములోని ఆదిమవాసులను వర్ణింపుడు.
13. కాంగో నదీప్రదేశము అంత ఉపయోగకరమైనది కాదని చూపుడు.
14. ఉత్తరాఫ్రికాలోని మధ్యధరా శీతోష్ణస్థితిగల మండలమును వర్ణింపుడు.
15. ఈజిప్టు నైలునదివల్ల ఎట్లు వృద్ధి పొందుచున్నదో వివరింపుడు.
16. సమశీతోష్ణమండలపు గడ్డిబీడులను వర్ణింపుడు.

17. నైలునదికి సూడాను, అబిసీనియా, ఈజిప్టులతో సంబంధ మున్నను ఆ మూడు దేశములును వేరుగానున్నవి-ఎట్లు ?
18. బార్బరీరాజ్యములేవి ? అచ్చటి శీతోష్ణస్థితి ప్రజాజీవితముగూర్చి వ్రాయుడు.
19. దక్షిణ ఆఫ్రికా యొక్క ప్రాముఖ్యత యేమి ?
20. ఆఫ్రికాలో దక్షిణభాగమే అధికముగా వృద్ధిపొందుటకు కారణములు చూపుడు.
21. దక్షిణ ఆఫ్రికాలోని మధ్యధరా శీతోష్ణ మండలముగూర్చి వ్రాయుడు.
22. దక్షిణ ఆఫ్రికాలోని జంతుజాలమును గూర్చి వర్ణింపుడు.
23. దక్షిణ ఆఫ్రికాలోని ముఖ్య ఖనిజములనుగూర్చి వ్రాయుడు.
24. ఆఫ్రికాలో బంగారము, వజ్రములు, బొగ్గు ఎక్కడెక్కడ లభించుచున్నవో తెలుపుడు.
25. "ఈజిప్టు సహారా ఎడారిలోని పెద్ద ఒయాసిస్సు"-దీనిని విపులీకరింపుడు.
26. ఆఫ్రికాలోని వివిధ ఉష్ణమండలపు పంట లేవి ?
27. సూయజు కాలువనుగూర్చి వ్రాయుడు.
28. ఆఫ్రికాలోని ముఖ్య పట్టణములను వర్ణింపుడు.
29. దక్షిణ ఆఫ్రికా యూనియనులో ఏరాజ్యములు కలవు ? వాటిలోని ముఖ్య ఖనిజము లేవి ?
30. ఆఫ్రికాలోని ముఖ్యరేవులను పేర్కొని వానినుండి ఎగుమతి దిగుమతులను తెలుపుడు.
31. దక్షిణ ఆఫ్రికా ఉద్యానవనమని దేనికి పేరువచ్చెను ? ఏల ?
32. సహారా ఎడారిలోని ముఖ్య వర్తక కేంద్రములను గురించి వ్రాయుడు.

---

రెండవ భాగము

# దక్షిణ అమెరికా

## 1. ఉనికి, నైసర్గిక స్వరూపము

ఈ ఖండమునకు పడమట పసిఫికు, తూర్పున అట్లాంటికు మహాసముద్రములు కలవు. తక్కినఖండము లన్నిటికంటెను దక్షిణముగా వ్యాపించియున్నది. ఇది 12° ఉత్తర అక్షాంశము మొదలు 55° దక్షిణ అక్షాంశము వరకు కలదు. ఆఫ్రికాకును దీనికిని కొన్ని పోలికలు కలవు. ఆఫ్రికాలోనుండి భూమధ్యరేఖ పోవుచున్నది. అట్లే ఈ ఖండములోనుండి కూడ భూమధ్యరేఖ పోవుచున్నది. రెంటిమీదుగను మకరరేఖ పోవుచున్నది. ఆఫ్రికా దక్షిణార్ధగోళము 35° వరకు వ్యాపించి యుండగా ఈఖండము దక్షిణార్ధగోళము 59° వరకు వ్యాపించి యున్నది. అయినను ఉష్ణమండలములోనే అధికభాగ ముండుట గమనింపుడు. ఈ ఖండములోను ఉత్తరమున అధికభూభాగము కలదు. ఇది మన దేశమునకు నాల్గురెట్లు పెద్దది. ఉత్తర దక్షిణములుగా పొడవు 4,700 మైళ్ళును, తూర్పు పడమరలుగా అత్యధికమైన దూరము 3,200 మైళ్ళును కలదు. ఈ ఖండమునకు దక్షిణపు చివరను టైరాడెల్‌ఫ్యూగో అను ద్వీపము కలదు. దీనికిని ఖండమునకును మధ్య మాజిలాను జలసంధి కలదు.




దక్షిణ అమెరికా నైసర్గికము

ఈ ఖండమునకుకూడ ఆఫ్రికా, ఆస్ట్రేలియాలవలె తీర రేఖ ఎక్కువగా చీలియుండలేదు. నైరృతిమూల మాత్రము అనేక చీలికలను కలిగియున్నది.

---

# 2. పర్వతములు

ఆండీసు పర్వతపంక్తి దక్షిణ అమెరికాలో ఉత్తర దక్షిణ ములుగా గొప్పగోడవలె 5000 మైళ్ళు వ్యాపించియున్నది. ఈ పర్వతములు కొనిచోట్ల 400 మైళ్ళు వెడల్పుగాకూడ నున్నవి. ఇచ్చట ఇవి కొన్ని వరుసలుగా నుండుటచే వానిమధ్య ఎత్తయిన పీఠభూములు, రెండు పెద్ద సరస్సులు కలవు. ఉత్తర మున ఈపంక్తి చీలిపోయియున్నది. ఆ చీలికల మధ్యకూడ పీఠ భూములు కలవు. ఈ పర్వతపంక్తి ఎక్కువ వెడల్పుగానున్న చోటనే ఎక్కువ ఎత్తుగాకూడ నున్నది. ఇందలి శిఖరములలో కొన్ని హిమాలయములలోని గొప్ప శిఖరము లంత ఎత్తున నుండి హిమముచే సదా కప్పబడి యుండును. ఇవి అగ్నిపర్వత ములవలన ఏర్పడినవి.

తూర్పుపీఠభూమి : రెండు భాగములుగానుండి అమె జాను మైదానముచే వేరు చేయబడుచున్నది. అమెజాను మైదా నమునకు ఉత్తరమున (1) గయానా మిట్టలు, (2) దక్షిణమున బ్రెజిలు మిట్టలు గలవు. గయానా పీఠభూమి చాల వంకరటింక

రగా నుండి నదులచే ఎక్కువగా కోసివేయబడినది. ఉత్తరముగా ప్రవహించు ఎస్క్విబో, దక్షిణముగా ప్రవహించు అమెజానులో కలియు బ్రాంకో నదులు ఈ పీఠభూమిని దాదాపు రెండుగా చేయుచున్నవి. గయానా పీఠభూమికిని, ఆండీసు పర్వతముల కును మధ్య జల విభాజక క్షేత్ర మున్నది. దీనికి ఉత్తరముగా ఒరినాకో నదియు, దక్షిణముగా అమెజాను నదియు కలవు.

బ్రెజిలు పీఠభూమి త్రిభుజాకారముగానున్న పెద్ద భూభాగము. ఈ మిట్టకు తీరప్రాంతమున ఎత్తయిన శిఖరములు గలవు. ఆ ప్రాంతములో పీఠభూమి తీరమువైపు నిట్రముగాను ఖండములోనికి వాలుగాను ఉన్నది. ఈ పీఠభూమియొక్క దక్షిణభాగమున పెరాగ్వే, ఉరుగ్వే, పరానా నదు లున్నవి. బ్రెజిలి యన్ పీఠభూమికిని, ఆండీసు పర్వతములకును మధ్య మేటో గ్రాసో మిట్టలు కలవు. ఇవి అంత ఎత్తు లేవు. వీటిలో అనేక మైన ఖనిజములు లభించుచున్నవి.

---

## 3. నదులు - మైదానము

ఒరినాకో మైదానము:ఉత్తర ఆండీసుపైనను గయానాపీఠ భూమికి ఉత్తరముననను కురిసిన వర్షమును ఒరినాకోనది సముద్ర ములో చేర్చుచున్నది. ఈ నదీమార్గము చాలవంకరగానున్నది. ఇది పుట్టినచోట దట్టమైన అరణ్యములును, మధ్యమార్గమున

లానాస్ అనబడు సవానా గడ్డిబీడులును, సంగమ ప్రదేశములో క్షార జలారణ్యములును కలవు. ఈ నదీ ముఖద్వారమువద్ద పెద్దడెల్టా కలదు. ఇక్కడ పెద్ద ఓడలు వచ్చుటకు అడ్డంకులు కలవు. కాని చిన్నపడవలు 1000 మైళ్ళవరకు నదిపై ప్రయాణము చేయగలవు. ఈ లానాస్ శీతకాలమున గడ్డిలేనివై యుండి వర్షములు కురిసిన తర్వాత గడ్డిని పుష్కలముగా గలిగి పశుపోషణకు మిక్కిలి వీలును కలిగించును. అచ్చటచ్చట మొక్కలుండి ఆనందదాయకముగా నుండును. చిన్నచిన్న చెరువులుకూడ నుండును. ఆ చెరువుల నీరు త్రాగుటకు అడవి మృగములు, వివిధములైన పక్షులు వచ్చుచుండును. ఇచ్చట గడ్డి చాల ఎత్తునకు పెరుగుచుండును. ఎండిన గడ్డివలన భయంకరమైన అగ్నిప్రమాదములు కలుగుచుండును. ఒరినాకో నదికిని, ఆండీసు పర్వతపంక్తికిని మధ్యనున్న పర్వతవాలులపై కాఫీ, కోకో పైరు చేయబడుచున్నవి.

అమెజాను మైదానము: చాల విశాలమైనది. ఈ నది ఆండీసు పర్వతముల తూర్పు వాలులో పసిఫికు మహాసముద్రమునకు 100 మైళ్ళ దూరమున పుట్టి, పర్వత వరుసలమధ్య కొంత దూరము ప్రవహించి తర్వాత తూర్పుగా తిరుగుచున్నది. పర్వత దశలో దీనికి అనేక జలపాతములు కలవు. దీనికి దక్షిణమునుండి కలియు ఉపనదులు ఉత్తరమునుండి కలియువానికంటె సంఖ్యలోను, పొడవులోను, తెచ్చునీటిలోను గొప్పవి. ఈనది పొడవులో (3500 మైళ్ళు) ప్రథమస్థాన మాక్రమించక పోయినను,

వెడల్పులోమాత్రము అద్వితీయమైనది. దీనిలో ప్రవహించునంతటి జలరాశి మరి యేనదిలోను లేదు. చాల వెడల్పును, లోతును కలిగియుండుటచేత నౌకాయానమునకు మిక్కిలి అనుకూలముగా నున్నది. పెద్ద ఓడలుకూడ ప్రయాణము చేయవచ్చును. ఆండీసు పర్వతముల దిగువభాగము వరకు దాదాపు 3000 మైళ్ళు నౌకాయానమునకు అనువుగా నున్నది. ఈ నదిలో అనేక ద్వీపములున్నవి. ముఖద్వారమునకు 250 మైళ్ళ దూరమునుండి ఈనది 50 నుండి 150 మైళ్ళ వరకు వెడల్పున్నది. దీనితో పోల్చిన మన గొప్ప నదులగు గోదావరి, కృష్ణలు పిల్లకాలువలుగా తోచును. నది అనుటకంటె దీనిని కదలుచున్న సరస్సు అనుట ఎక్కువ ఉచితము. దీని ఉపనదులలో పదివరకు గంగానదికంటె పొడవైనవి. ఈ గొప్పనది తెచ్చు నీటివల్ల సముద్రములో తీరమునుండి 200 మైళ్ళ వరకు నీరు తియ్యగానుండును. దీని ముఖద్వారమున డెల్టా ఏర్పడలేదు.

ఇన్ని ఉపనదులతో ఇంతనీటిని తెచ్చుటకు కారణము ఈ ప్రదేశము భూమధ్యరేఖాప్రాంతమందుండి అధికవర్షముల పొందుటే. ఈ అమెజాన్ మైదానములో అధికోష్ణ వర్షపాతములవల్ల సెల్వా లను ఉష్ణమండలారణ్యము లేర్పడినవి. ఈఅరణ్యములు దుర్భేద్యములు. మనిషి చొరశక్యముకాదు. అనంతమైన రకములగుచెట్లు చాలపొడవుగా పెరిగిపోవుచుండును. (కాంగో అరణ్యముతో పోల్చుడు). అనేక లతలు అల్లిబిల్లిగా అల్లుకొనియుండును. పరాన్న భుక్కులగు బదనికలు కోటానుకోట్లు

వీటిపై బ్రతుకుచుండును, ఇచ్చట పాములు, పురుగులు అమితము. కాని పెద్దజంతువులుమాత్ర ముండవు. నేల ఎల్లప్పుడును తడిగాను, చీకటిగాను ఉండును. కోతులు చెట్ల పైభాగమున తిరుగుచుండును. వాటిలో కొన్ని కోతులు ఉదయాస్తమయ సమయములందు భయంకరమైన అరుపులు అరచుచుండును. ఇతర సమయములందు ఇచ్చటి నిశ్శబ్దత బాధాకరమైనది. కొద్దిమంది నిర్భాగ్యజీవనులు ఈ మహారణ్యములో మట్టిగుడిసెలలోనో లేక సంచారజీవనులుగానో ఉందురు. వారు చేపలు, తాబేళ్ళు మొసళ్ళను వేటాడి వాని మాంసమును తిందురు. అడవిసరకులను ప్రోగుచేసి అమ్ముదురు.

ఈ సెల్వాలలో రబ్బరు ముఖ్యమైనది. చెట్లచుట్టు నరకులను పెట్టి గిన్నెలను వ్రేలాడ కట్టుదురు. రబ్బరుపాలు ఆ గిన్నెలోనికి ప్రవహించును. ఈపాలను వెచ్చపెట్టి గడ్డ కట్టించి ఎగుమతి చేయుదురు. మలయా ద్వీపకల్పము, దక్షిణయిండియా, సింహళములలో రబ్బరుతోటలు పెంచిన తరువాత ఈ అడవులలో దొరుకు రబ్బరుకు గిరాకీ తగ్గినది.

ప్లేటునదీ మైదానము : బ్రెజిలు పీఠభూమికి దక్షిణమునను, దక్షిణ ఆండీసుపంక్తికి తూర్పునను మూడవమైదానము కలదు. దీనిని ప్లేటునదీ మైదానమందురు. మాటోగ్రాసోలో పుట్టిన పెరాగ్వేనది మైదానమునకు మధ్యగా దక్షిణముగా ప్రవహించుచున్నది. బ్రెజిలు పీఠభూమిలో పుట్టిన పరానానది దానిని కొంత దిగువను చేరుచున్నది. ఏకమైన ఈనదీముఖ

ద్వారమునకు కొద్ది దూరములో బ్రెజిలు పీఠభూమిలో పుట్టిన ఉరుగ్వేనదిని కలుపుకొని ఏకమై రయోడిలాప్లాటా లేక ప్లేటు నది అని పిలువబడుచున్నది. కావున ఈ నదులన్నియు ప్రవహించు మైదానమునకు ప్లేటునదీ మైదానమని పేరు వచ్చినది. ఈ నదులు చాలదూరము నౌకాయానమునకు అనుకూలముగా నున్నవి. పెద్ద ఓడలు 1000 మైళ్ళు లోనికి పోగలవు.

---

# 4. శీతోష్ణస్థితి - వర్షపాతము

దక్షిణ అమెరికా పటమును చూచినచో మనకు కొన్ని ముఖ్య విషయములు గోచరించును. ఖండములో అత్యధిక భాగము ఉష్ణమండలములో నున్నది. మకరరేఖకు దక్షిణముగా ఎక్కువ భూమి లేదు. ఉన్నదానిలో మైదానమెక్కువ. మరియు తూర్పుతీరము వెంబడి ఉష్ణజల ప్రవాహమున్నది. ఆండీసు పర్వతములు మిక్కిలి ఎత్తుగానుండి పడమటి పవనములను రానీయవు. తూర్పు పవనములను పోనీయవు. పడమటితీర మైదానము బహు సన్నముగా నున్నది. ఇవన్నియు ఖండము యొక్క శీతోష్ణస్థితిపై ప్రభావము కలిగియున్నవి.

భూమధ్య రేఖవద్ద ఉష్ణ మెక్కువ ఉండునుకనుక సహజముగా అల్పపీడన మేర్పడును. అమెజాను పరీవాహ ప్రదేశము మైదానము కనుక అచ్చట ఉష్ణము ఇంకను ఎక్కువగానుండును.

కాబట్టి అచ్చట ఈశాన్య వ్యాపార పవనముల వలనను, ఆగ్నేయ వ్యాపార పవనముల వలనను వర్షించుటేకాక వహానవర్షము కూడ కురియును. ఈ ప్రాంతములో సంవత్సరమంతయు అధిక వర్షముండును. సూర్యునితో వాన ప్రయాణముచేయును. కాంగో మైదానముతో పోల్చుడు. ఈ రెండు వ్యాపారపవనము లును ఆండీసు పర్వతములను దాటి పసిఫికు తీరమునగల మైదానమును చేరలేవు. పడమటి మైదానములో భూమధ్య రేఖకు దక్షిణమున వర్షములేదు. అచ్చటకు ఆగ్నేయ వ్యాపార పవనములు వీవక పోవుటయేకాక ఈగాలులు తీరమునుండి సముద్రములోనికి వీచును. కాబట్టి ఆప్రాంతము ఎడారితుల్య మైనది. దీనికి అటకామా ఎడారి అని పేరు.

అమెజానుకు ఉత్తరమున వెనిజులా, గయానాలలో వేసవిలో వర్షముండి, ఇతర సమయములలో పొడిగా నుండును. అందుచేత చక్కని గడ్డిబీడులు ఏర్పడినవి. వీనిని లానోస్ అందురు. అట్లే అమెజానుకు దక్షిణమునకూడ పెరాగ్వే, దక్షిణ బ్రెజీలు, అర్జెంటైనా, బొలీవియాలలో వేసవిలోనే వర్ష ముండును. ఇచ్చట లానోస్ కంటె ఎక్కువ చల్లదనముండును. ఎందుచేత ? ఈ గడ్డిబీడులను ఉత్తర అర్జెంటైనా ప్రాంతములో కాంపోలనియు, మధ్య అర్జెంటైనాలో పాంపాలనియు అందురు.

మధ్యచిలీ మధ్యధరా శీతోష్ణస్థితి కలిగియున్నది. దక్షిణ చిలీ అధికముగా పడమటి పవనములవల్ల వర్షమును పొందు చున్నది. కాని ఇచ్చటి ఆండీసు పర్వతములకు తూర్పున

నున్న పెటగోనియా పీఠభూమికి ఈ ఆండీసు పర్వతములు అడ్డువచ్చుటచే వానలేక ఎడారి ఏర్పడినది.

పెటగోనియా పీఠభూమి, దానికి తూర్పునగల తీర మైదానము దక్షిణ ధ్రువమునకు చాల దగ్గరగా నుండుటచే చలిగ నుండవలసినది. కాని వానికి సమీపమున ప్రవహించు ఉష్ణజల ప్రవాహము వలన అంత చలి ఉండుటలేదు.

ఇట్లు ఆండీసు పర్వతములు దక్షిణ అమెరికా శీతోష్ణ స్థితిలో ప్రముఖపాత్ర వహించుచున్నవి. అంతే కాదు. హిమాలయములపైకి పోవునపుడు శీతోష్ణస్థితి మారునట్లు భూమధ్య రేఖవద్ద ఆండీసు పర్వతములపైకి పోయినకొలది కూడ శీతోష్ణ స్థితిలో మార్పు కనబడును,

---

# 5. సహజ వృక్షజాలము

శీతోష్ణస్థితి, వర్షపాతములనుబట్టి దక్షిణ అమెరికాలో క్రింది సహజ వృక్షజాలముగల భాగములను గాంచగలము. అవి 1. ఉష్ణమండలారణ్యములు, 2. సవానా గడ్డిబీడులు, 3. వెచ్చని సమశీతల మండలారణ్యములు, 4. సమశీతల మండలపు గడ్డిబీడులు, 5. చల్లని సమశీతోష్ణపు అరణ్యములు, 6. ఉష్ణ మండలపు ఎడారి. 7. సమశీతల మండలపు ఎడారి, 8. మధ్యధరా మండల వృక్షజాలము, 9. పర్వత ప్రదేశ వృక్షజాలము.




దక్షిణ అమెరికా సహజవృక్షకోటి

1. ఉష్ణమండలారణ్యములను గూర్చి అమెజాను మైదాన విషయములో కొంత చదివితిరి. అంతటి మహారణ్యములు పెరుగుటకు ఉష్ణము, అధికవర్షము కారణము. ఈ అరణ్యములు అమెజాను మండలములోను, ఒరినాకో నదీ మైదానములోను, గయానా తీరములోను, బ్రెజిలు తీరములోను కలవు. వర్షపాత పటము పరిశీలింపుడు.

2. ఉష్ణమండలారణ్యములకు ప్రక్క సవానా లుండును. ఈభూములు గడ్డిభూములు. అమెజాను ఉష్ణమండలారణ్యములకు ఉత్తరమునను, దక్షిణమునను సవానాలు కలవు. చెట్లు అక్కడక్కడ కొద్దిగా చెదరి పెరుగును. గడ్డి సమృద్ధిగా నుండుటచే పశుపోషణకు అవకాశము ఎక్కువ. అమెజాను ఉత్తరపు సవానాలకు లానోలనియు, దక్షిణ సవానాలకు కాంపోలనియు పేరు. ఉత్తరమున గయానాపీఠభూమి, దక్షిణమున బ్రెజిలు పీఠభూమి ఈ మండలములో చేరును.

3. కాంపోలకు దక్షిణమున మాటోగ్రాసో మండలము, పెరుగ్వే, ఉరుగ్వేలు వెచ్చని సమశీతల మండలారణ్యములు లేక ఉప ఉష్ణమండలా రణ్యములు (Sub-Tropical forests) కలిగి యున్నవి. ఈ మండలములలో ఖండములకు తూర్పు పడమర అంచులయందు వ్యాపించియున్నవి. సమశీతల మండలములో వెచ్చదన మెక్కువకలచోట్ల ఉండును. ఈ అరణ్యము లంతదట్టమైనవి కావు. కొన్ని ప్రత్యేకమైన చెట్లు, తీగలు పెరుగును. ఇచ్చట ఒకరకమైన చెట్టు మేట్ లేక పెరుగ్వే తేయాకును ఇచ్చును.

5. సమశీతల మండల గడ్డిబీడులకు వేర్వేరు దేశములలో వేర్వేరు పేర్లుకలవు. దక్షిణ అమెరికాలో వీటికి పాంపాలని పేరు. మధ్యఅర్జెంటైనా, ఉరుగ్వేలలో ఇవికలవు. ఇవి సాధారణముగా పశ్చిమాప్రదేశములోగాని, ఖండమధ్యమునగాని ఉండును. ఇచ్చట వర్షపాతము తక్కువగాను, ఉష్ణవ్యత్యాసము అధికముగాను ఉండును. చెట్లు బహుతక్కువ. శీతకాలములో నేలగట్టి పడిపోయి యుండును. వసంత ఋతువులో పచ్చని గడ్డితో కనులపండువ చేయును. ఈ ప్రాంతము చాలవరకు గోధుమ వ్యవసాయమునకు ఉపయోగింపబడుచున్నది.

5. చల్లని సమశీతల మండలారణ్యములు పసిఫిక్ తీరమున దక్షిణ చిలీలో కలవు. ఇచట సంవత్సరము పొడవునను వర్షపాత ముండుటచేత దట్టమైన అరణ్యములు బయలుదేరినవి.

6. ఉష్ణమండలపు ఎడారులు : పెరూ, ఉత్తర చిలీలలో ఈ ఎడారి వ్యాపించి యున్నది. ఈ ఎడారి మకరరేఖకు సమీపమున నున్నది. దీనిని అటకామా ఎడారి అందురు. చిన్నచిన్న నదులవల్ల ఒయాసిస్సు లేర్పడినవి. ఇందు ముండ్ల చెట్లుండును. ఇది తక్కిన ఎడారులవలె నిరుపయోగమైనది కాదు. ఇచట లవణములు విస్తారముగా త్రవ్వబడుచున్నవి.

7. సమశీతల మండలపు ఎడారి : ఖండపు దక్షిణమునగల పెటగోనియా పీఠభూమిమీద కలదు. వర్షమార్గమును ఆండీసు పర్వతము లడ్డుటచే ఇది ఏర్పడినది. ఇచ్చట కొద్ది గడ్డి, ముండ్ల మొక్కలు మాత్రము పెరుగును.

8. మధ్యధరా మండల వృక్షజాలము : ఇది మధ్యచిలీలో కలదు.

9. ఆండీసు పర్వతములపైకి పోయిన కొలదిని శీతోష్ణ స్థితి మారుచుండునని చదివితిరి. అట్లే వృక్షజాలము కూడ మారును. క్రిందిచిత్రము ఈ విషయమును స్పష్టపరచును.




ఆండీసు పర్వతములపైకి పోయిన కొలది వృక్షకోటియందలిమార్పు

భూమధ్యరేఖవద్ద వర్ష మధికము కనుక ఆండీసు పర్వతములకు రెండువైపుల అరణ్యములు కలవు. ఈ ప్రాంతపు తూర్పువాలులను మాంటేనా అరణ్యములందురు. వీనికి దక్షిణమున ఆండీసు పర్వతములమధ్యగల పీఠభూములపై గడ్డిబీడు లున్నవి. వాటిని పారమాజ్ అందురు.

---

# 6. జంతు జాలము

జంతుజాలము : దక్షిణ అమెరికాలోని మహారణ్యము లలో అనేకరకములైన జంతుజాలము లుండుటలో ఆశ్చర్యము లేదు. దీనిని గురించి కొంతవరకు అమెజాను మైదానము అను పాఠములో చదివియుంటిరి. అచ్చట ఉష్ణమండలారణ్యములలో అనంతకోటి జీవరాసులున్నవి. కాని ఈ అరణ్యములలో వేడి, తేమ ఎక్కువ కనుక సాధారణపు జంతువులు బ్రతుకలేవు. చెట్లపైకి ఎగబ్రాకు జంతువులు, వివిధమైన పురుగులు, పక్షులు కాననగును. కోతులు ముఖ్యము. వీటికి మనదేశపు కోతులవలె నోటిలో సంచులుండవు. పొడవైన తోకలను కొమ్మలకుచుట్టి ఒకచోటినుండి మరొకచోటికి పోగలవు. బ్రహ్మాండమైన పాములు చెట్లనుండి వ్రేలాడుచుండును. నదులలో అసంఖ్యాక మైన చేపలు, మొసళ్ళు చరించుచుండును. ఈ అరణ్యములలో పందివంటి టపీరు నదీతీరములను పొడిచి తినుచుండును. జగువర్ అను అమెరికా చిరుతపులి వేటకొఱకు పొంచితిరుగును.

గడ్డి మైదానములలో గడ్డి తిను జంతువులు మందలుగా నుండును. హ్రీ (Rhea) అను దక్షిణ అమెరికా ఉష్ట్రపక్షి ఇచ్చట కలదు. ఆండీసు పర్వతముల మీద లామా, అల్పాకా గొఱ్ఱెలు కలవు. వికూనా అను జంతువు సగము ఒంటె, సగము మేకవలె నుండును. ఇవన్నియు మృదువైన ఉన్నినిచ్చును. బరువు లనుకూడ మోయును. ఈ పర్వతములమీద కాండర్ అను పెద్ద

రాబందు ఉన్నది. చీమలను, చెదపురుగులను తినివేయు జంతువులు కలవు. పాంపాల మీద గుఱ్ఱములు, పశువులు, గొఱ్ఱెలు మేపబడు చున్నవి.

---

## 7. జనసంఖ్య

దక్షిణ అమెరికాను మొదట కొలంబసు కనుగొన్న తరువాత స్పెయినువారు దీనిలో వలసలు ఏర్పరచుకొన్నప్పుడు ఇచ్చట ఆదిమ నివాసులుండిరి. ఉత్తర అమెరికాలోని మెక్సికోలోను, ఈ ఖండములోని పెరూ దేశములోను చాల నాగరికులైన ప్రజలుండిరి. వారి బంగారమునకు ఆశపడి స్పెయినువారు వారిని ఓడించుటయేకాక చాలవరకు నాశనము చేసిరి. వారిని ఇండియనులు అని పిలిచిరి. ఆ పేరే ఉత్తర, దక్షిణ అమెరికాలలోని ఆదిమ నివాసులకు ఇప్పటికిని కలదు. కాల క్రమమున స్పెయినువారు, పోర్చుగీసువారు ఆదిమనివాసులతో వివాహ సంబంధము లేర్పరచుకొనిరి. ఇప్పుడు ఒక మిశ్రమజాతి తయారైనది. వీరిని మెస్టిజోలు అందురు.

మొట్టమొదట స్పెయినువారు వెండి బంగారముల నాశించినను క్రమముగా స్థిరనివాస మేర్పరచుకొనిరి. రెండు శతాబ్దముల తరువాత డచ్చివారు, ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, గయానా తీరమున స్థిరపడిరి. ఆ ప్రదేశములు ఇప్పటికిని వారి

ఏలుబడిలోనే వున్నవి. మిగిలిన వానిలో బ్రెజిలు పోర్చుగీసు వారిది. మిగిలిన భాగములు స్పెయినువారివి. వారు క్రమముగా భూమిని వృద్ధిపరచిరి. క్రొత్తగనులను కనుగొనిరి. వర్తక వ్యాపారములను, పరిశ్రమలను, వ్యవసాయమును పెంపొందించిరి. అందులకు అచ్చటి ఆదిమనివాసుల నుపయోగించిరి. కాని నీగ్రోలనుకూడ ఆఫ్రికానుండి తెచ్చిరి. వీరేకాక ఇటలీ, జర్మనీ, ఇండియా, చైనా మొదలైన దేశములవారు కూడ వలసవచ్చి స్థిరపడిపోయిరి. వీరందరును వ్యవసాయము, పరిశ్రమలు, వర్తక వ్యాపారములు మొదలైన వానిలో పాల్గొని ఖండముయొక్క అభివృద్ధికి తోడ్పడుచున్నారు. వీరిలో అత్యధికులు తీరప్రాంతము లందే నివసించుచున్నారు. ఈశతాబ్దారంభమునుండి ఈ దేశములు స్వతంత్రమై ప్రజాప్రభుత్వములైనవి. నేటికిని ఈ ఖండములో జనసంఖ్య అభివృద్ధి తక్కువే.

---

# 8. రవాణా సదుపాయములు

ఇచ్చట జనసంఖ్య తక్కువగుటచేతను, దేశములు భాగ్యవంతము కాకపోవుటచేతను రవాణా సదుపాయము లంత ఎక్కువగా లేవు. మొట్టమొదటి వలసలు, తరువాతి అభివృద్ధి తీరప్రాంతముననే జరుగుటచే ఓడమార్గములు ముఖ్యమైనవి.

పైగా అమెజాన్, దాని ఉపనదులు, ఒరినాకో, పెరాగ్వే మొదలయిన నదులద్వారానే ఖండములోపలికి పోవ వీలున్నది. కాబట్టి ఈఖండములో ఓడమార్గముల ప్రాముఖ్యతను ఊహింపవచ్చును.

అమెజాన్ ఉపనదియగు నీగ్రోనది మీది మేనోస్ రేవు చాల ముఖ్యమైనది. అమెజాన్ ముఖద్వారమునకల పారా రేవు ముఖ్య సముద్రరేవు. ఒరినాకో నదిమీద 1000 మైళ్ళవరకు, ఓడలు ప్రయాణము చేయగలవని ఇదివరకే చదివియున్నారు. తూర్పుతీరమున పారా, బాహియా, రయోడిజనీరో, సాంటాస్, మాంటివీడో, బ్యూనస్ ఐరిస్ మొదలైె గొప్ప రేవులు కలవు.

రైలుమార్గములు తూర్పుతీరపు రేవులను కలుపుచున్నవి. ముఖ్యముగా దక్షిణమైదానములో ఎక్కువ. ఆండీసు మండలములో చిలీ, పెరూ, బొలీవియాలను కలుపు రైలుమార్గమును కూడ గుర్తింపుడు. చిలీలోని వాల్పరైజోను బ్యూనస్ ఐరిస్‌తో కలుపు రైలుమార్గము ఆండీసు పర్వతములలో 10,000 అడుగుల ఎత్తున నున్న అస్పల్లేటా కనుమగుండా వేయబడినది.

---

## 9. రాజకీయవిభాగములు - కొలంబియా

దక్షిణ అమెరికాలో 13 రాజ్యము లున్నవి. ఇందు బ్రెజిలు, గయానాలు, వెనిజులా, కొలంబియా, ఈక్వెడారు పెరూ, బొలీవియా, పరాగ్వేలు ఉష్ణమండలపు దేశములు. అర్జంటైనా, ఉరుగ్వే, చిలీలు సమశీతలపు దేశములు.


కారకాస్
ట్రినిడాడ్
వెనుజేయిలా
బగోటా
కొలంబియా
గయానాలు
ఈక్వెడార్
గయాక్విల్
మానాస్
బెలెమ్
బ్రెజిల్
పెరు
లీమా
లాపెజ్
బొలివియా
ఆంటోఫెగస్టా
అసన్సియన్
రియోడిజనీరో
శాంటాస్
వాల్పెరైజో
శాన్‌టియాగో
బ్యూనోస్ఐరిస్
మాంటివిడో
లాప్లాటా
పొర్టొడెల్ఫ్యూగో

కొలంబియా: ఈ దేశము దక్షిణ అమెరికా యొక్క వాయవ్యమూల నున్నది. ఇందు ఆండీసు పర్వతములు మూడు శాఖలుగా విడిపోయినవి. ఈదేశముయొక్క జనసంఖ్య 11 మిలియనులు. దీని వైశాల్యము 440,000 చదరపుమైళ్ళు. ఈ దేశములో అధికభాగము పర్వతములును, మిట్టలు నగుటచే ఎక్కువమంది వాటిమీదనే నివసించుచున్నారు.

ఇచ్చట కాఫీ, వరి, అరటి, రబ్బరు, నార, చెఱకు, ఉత్పత్తి చేయబడుచున్నవి. ప్రపంచములో బ్రెజిలు తరువాత కొలంబియాయే కాఫీ ఉత్పత్తిలో రెండవస్థానము ఆక్రమించుచున్నది. ఈకాఫీపంట అధికముగా ఆండీసు పర్వతములలోని కార్డిలెరా వాలులో కలదు. ఈ ప్రదేశము అగ్నిపర్వత సంబంధమై బహుసారవంతమైనది. రబ్బరు అరణ్యప్రాంతములలో లభించును. కాఫీగింజలను రేవునకు చేర్చుట ఈ దేశములో ఒక సమస్య. జంతువుల నుపయోగించుచున్నారు.

కొండవాళ్ళమీద పశుపోషణకూడ బాగుగా నున్నది. ఆవులు, పందులు, గుఱ్ఱములు, గొఱ్ఱెలు, మేకలు, కంచరగాడిదలు మేపుదురు. ఈకొండలమీద బంగారము, వెండి అధికముగానే లభించుచున్నవి. ఇనుము, ప్లాటినము, బొగ్గు కూడా కలవు. కొన్నిచోట్ల నూనెబావులు కూడ కనుగొనబడి ఈ దేశము యొక్క ప్రాముఖ్యతను హెచ్చించినవి. ఇచ్చట పెనామా టోపీలు చేయుదురు.

ఈ దేశమునకు బొగోటా రాజధాని. ఇది 8700 అడుగుల ఎత్తున ఆండీసు పర్వతములలో నున్నది. ఆరోగ్యకరమైన ప్రదేశము. రైలుమార్గముతో మాగ్డలీనా నదిమీద ఒక రేవుతో కలుపబడినది. అచ్చటినుండి నదీమార్గముననే ప్రయాణము చేయవలయును. బర్రాంక్విలా, కార్తజీనాలు ముఖ్య సముద్రపు రేవులు.

---

# 10. ఈక్వెడార్

ఇది కొలంబియాకు దక్షిణమున నున్నది. ఈ దేశములో పశ్చిమతీర మైదానము, ఆండీసు పర్వతభాగము, అమెజాను ప్రదేశము కలవు. ఈ దేశపు వైశాల్యము 2,80,000 చదరపు మైళ్లు, జనసంఖ్య 3 మిలియనులు. ఐరోపీయులు జనసంఖ్యలో 8 శాతముమాత్రము కలరు. వర్షపాతము అధికము. పడమటి వాళ్ళలో కోకో ప్రసిద్ధమైనది. తూర్పు వాళ్ళలో ఉష్ణమండలారణ్యములు కలవు. రబ్బరు లభించును. కొలంబియాలో కాఫీ అధికమైనట్లు ఈ దేశములో కోకో ముఖ్య ఎగుమతి. వరి, కాఫీకూడ పండింప బడుచున్నవి.

ఈ దేశములో ఖనిజములు హెచ్చుగా ఉన్నను వాటిని తీయుటకు గట్టి కృషి జరుగుట లేదు. నూనె బావులు కనుగొన బడినవి. బంగారము, వెండి, రాగి, ఇనుము, సీసము, బొగ్గు కూడ కలవు. ఇక్కడకూడ పెనామా టోపీలు(Panama Hats) తయారు చేయుట ముఖ్య పరిశ్రమ.




క్విటో ఈ దేశమునకు రాజధాని. ఆండీసు పర్వతముల మీద 9000 అడుగులఎత్తున నున్నది. ఇది రేవగు గయాక్విల్‌తో రైలుద్వారా కలుపబడినది. క్విటో ప్రాంతములో భూకంపముల భయము చాలకలదు.

---

# 11. పెరూ

ఈక్వెడారుకు దక్షిణమున పెరూదేశము కలదు. దీనిలో కూడ తీరమైదానము, ఆండీసు పర్వత ప్రదేశము, ఆమెజాను

నదీమైదాన భాగములు కలవు. ఈ దేశములోని ఆండీసు పర్వత ములలోనే గొప్పనది అగు అమెజాను పుట్టుచున్నది. ఈదేపు పీఠభూమిలో టిటికాకా సరస్సుకలదు. పెరూ దేశముయొక్క పడమటితీర మైదానములో వర్షముండదు. ఎడారితుల్యాము. నీటిపారుదల పర్వాట్లు చేసినచో పంటలు పండింపవచ్చును. ఆ విధముగా ఇచ్చట చెఱకు, ప్రత్తి, పొగాకు, కోకో, వరి, పండించు చున్నారు. ఇచ్చటి ప్రత్తి పొడుగుపింజ ప్రత్తి. పడమటి పర్వతవాలు పొగమంచుతో తడిసి గడ్డిని గలిగి యుండుటచే పశుపోషణ జరుగుచున్నది. ఇచ్చట ఆల్పాకా, వికూనా, లామా గొఱ్ఱెలు పెంచబడుచున్నవి. వీటినుండి బహు మృదువైన ఉన్ని లభించును. ఇవి టిబెట్‌లోని యాక్ బర్రెలను పోలి యుండి పర్వతములమీద బరువులను మోయుట కుపయోగిం చును. పర్వతములపైన మధ్యధరా మండలపు ఫలములు పండించు చున్నారు. తూర్పువాళ్ళలో వర్షము ఎక్కువ. కనుక ఉష్ణ మండలారణ్యములు కలవు. ఈ ప్రాంతములో జనసంఖ్య బహు తక్కువ.

514,059 చదరపుమైళ్ళ వైశాల్యముగల ఈ దేశ ములో 8 మిలియనులు జనులు మాత్రము కలరు. దాదాపు సగము మంది ఐరోపీయులు.

ఈ దేశములో మంచి ఖనిజ సంపద కలదు. బంగారు, వెండి, రాగి కలవు. పెట్రోలియము బావులు త్రవ్వబడినవి. వెనేడియ మను ఖనిజమునకు ఈ దేశమే అగ్రస్థానము వహించి

నది. పరిశ్రమలుకూడ వృద్ధిపొందుచున్నవి. పాస్కో వద్ద గొప్ప వెండిగను లున్నవి.

ఈ దేశమునకు లీమా రాజధాని. పడమటితీర మైదానమున ముఖ్య రేవగు కల్లావో కు 8 మైళ్ళ దూరమునకల పెద్ద పట్టణము. ఆరోగ్యకర మైనది కాదు. కల్లావో నుండి లీమా మీదుగా పాస్కో కు రైలు మార్గము వేయబడినది. పెరూ దేశమునకు దక్షిణమున కల మాలెండో రేవునుండి అతి ప్రమాదకరమైన మార్గము వెంబడి టిటికాకా సరస్సునకు మరొక రైలు మార్గము కలదు. ఇది అనేక లోయలు, సొరంగములలో నుండి వేయబడిన నీలగిరి రైలుమార్గమును పోలియుండును.

---

## 12. బొలీవియా

బొలీవియా దేశము మధ్య ఆండీసు మండలములో పెరూకు దక్షిణముగా నున్నది. ఆండీసు పర్వతపంక్తుల మధ్య మిక్కిలి ఎత్తయిన పీఠభూమియే బొలీవియా దేశము. సరస్సుల నుండి నీటిపారుదల ఏర్పాట్లు చేసుకొని పంటలు పండించుచున్నారు. ఇచ్చటి అరణ్యములలో సింకోనా, రబ్బరు, కోకోచెట్లు కలవు. పీఠభూములమీద బంగాళదుంపలు (ఆలుగడ్డలు), బార్లీ, కాఫీ, వరి, చెఱకు, పొగాకు పండింపబడుచున్నవి. గడ్డికూడ ఎక్కువకనుక పశుపోషణ బాగుగా జరుగుచున్నది. ఇక్కడకూడ

గొఱ్ఱెలు, ఆవులు, మేకలతోపాటు ఆల్పాకాలు, వికూనాలు, లామాలు విశేషముగా పెంచబడుచున్నవి.

ఈ దేశములో ఖనిజ సంపద ఎక్కువగా కలదు. స్పెయిను వారు ఈ దేశమును బంగారు దేశమనిరి. బంగారము, వెండి, తగరము, రాగి ముఖ్య ఖనిజములు. ఈగనులు ఇప్పుడు కూడ చక్కగా పనిచేయుచున్నవి. ఇక్కడి ముఖ్యఖనిజము తగరము. తగరపు ఉత్పత్తిలో బొలీవియా ప్రపంచములో ద్వితీయస్థాన మాక్రమించుచున్నది. తగరము టిటికాకా సరస్సునకు తూర్పున త్రవ్వబడుచున్నది. దానికి కేంద్రము సుకర్. వెండిగనులకు కేంద్రము పోటోసీ.

ఈ దేశ జనసంఖ్య మూడు మిలియనులు మాత్రమే. అందుచే అంతగా వృద్ధిలోనికి వచ్చుటలేదు. ఈ జనులలో అత్యధిక సంఖ్యాకులు అచ్చటి ఇన్కాజాతికి చెందిన ఆదిమ నివాసులే. ఈ దేశమునకును పెరూ దేశమునకును అన్ని విషయములలోను పోలికలుండుట గమనింపుడు.

ఈ దేశమునకు తీరములేదు. ఈదేశపు ముఖ్యపట్టణమగు లాపాజ్ నుండి చిలీదేశపు రేవగు అరికాకు రైలుమార్గము ఉన్నతమైన పర్వతములద్వారా వేయబడినది. లాపాజ్ పట్టణము ముఖ్య వర్తకస్థానము. ప్రభుత్వము ఉండు స్థానము. కాని రాజ్యాంగరీత్యా ముఖ్య పట్టణము సూకర్. లాపాజ్ రెండు మైళ్ళకంటె ఎక్కువ ఎత్తున ఉన్నది. లాపాజ్ నుండి సూకర్ కును, అక్కడినుండి మధ్య చిలీలోని రేవగు అంటోఫగస్టాకును,

మరొక రైలుమార్గము కలదు. సాంటూసునుండియు, అట్లాంటిక్ తీరమునగల బ్యూనస్ ఐరిస్ నుండియు కూడ రైలు మార్గములు కలవు. పటముపై వీనిని గుర్తింపుడు.

---

## 13. వెనిజులా

వెనిజులా దక్షిణ అమెరికాకు మిక్కిలి ఉత్తరమున ఉన్నది. దీనికి ఉత్తరమున కారిబియన్ సముద్ర మున్నది. ఈ దేశము ముఖ్యముగా ఒరినాకోనదీ పరీవాహ ప్రదేశమని చెప్పవచ్చును.

ఈదేవు లానోస్ అను గడ్డి మైదానములో ఆవులు, గొఱ్ఱెలు, మేకలు, గుఱ్ఱములు, కంచర గాడిదలు, పందులు కలవు. దీనికి బోలివరు కేంద్రము. ఈ పట్టణము చేరుటకు ఒరినాకో నదిలో ఓడలమీద ప్రయాణము చేయవలయును. ఒరినాకోనది పుట్టినచోట రబ్బరు లభించును. ఉత్తర మైదానములలో గోధుమ, వరి, పొగాకు, మొక్కజొన్న, కాఫీ, చెఱకు, ప్రత్తి, చిక్కుళ్ళు ఎక్కువగా పండించుచున్నారు. ఈదేశములో ఖనిజసంపదకూడ అధికమే. బంగారము, రాగి, పెట్రోలియము, బొగ్గు, ఇనుము ముఖ్య ఖనిజములు. పెట్రోలియము ఉత్పత్తిలో ప్రపంచమున ప్రముఖ స్థానమును సంపాదించుకొన్నది.

350,000 చదరపుమైళ్లు విస్తీర్ణముకల ఈ దేశములో 5 మిలియనులు మాత్రము జనులున్నారు. దీనికి రాజధాని కారకాస్. భూమధ్యరేఖకు చాల దగ్గరలో నున్నను, 3000 అడుగుల ఎత్తున నుండుటచే చక్కని శీతోష్ణస్థితి కలిగియున్నది. సముద్రమునకు 20 మైళ్ళలోనుండి ముఖ్యరేవగు లాగ్వైరాతో రైలుద్వారా కలుపబడినది.

---

# 14. గయానాలు

వెనిజులాకు తూర్పున, అట్లాంటికు తీరమున గయానాలు కలవు. ఇందులో పడమటనుండి తూర్పుగా బ్రిటిషు, డచ్, ఫ్రెంచి గయానా లున్నవి. వైశాల్యములోకూడ ఈ వరుసలోనే తగ్గుచున్నవి. ఈ ప్రదేశములు రమణీయమైనవి. కాని నదులకు జలపాతము లెక్కువ. వర్షము అధికము. రవాణా సదుపాయములు తక్కువ. కావున అంతగా వృద్ధిలోనికి రాలేదు. ఈమూటిలోను బ్రిటిషు గయానా కొంత అభివృద్ధి సాధించినది.

తీరమైదానము ఎల్లప్పుడును చెమ్మగా నుండుటచే అనారోగ్యకరమైనది. ఇచ్చట చెఱకు, కోకో, పొగాకు, ప్రత్తి, వరి పండును. దక్షిణ పీఠభూములమీద సవానా గడ్డిబీడులలో పశుపోషణ ముఖ్యమైనది. ఇచ్చటి అడవులలో మంచికలప, రబ్బరు లభించును. బంగారము, వజ్రములు, ఇనుము, బ్యాక్సైట్ దొరకుచున్నవి. డచ్, ఫ్రెంచి గయానాలలోకూడ తీరప్రాంతము

లందు కొబ్బరి, చెఱకు, వరి పండించబడుచున్నవి. ఫ్రెంచి గయానాలో బంగారము తీయుట ముఖ్యవృత్తి. బ్రిటిషు గయానాలోని వ్యవసాయ భూములలో పనిచేయుటకు నీగ్రోలు, మన దేశస్థులు తీసుకొని పోబడిరి. ఇప్పుడుకూడ మనదేశస్థులు అక్కడ చాలమంది స్థిరనివాసులై యున్నారు.

బ్రిటిషు గయానాకు జార్జిటౌను, డచ్చిగయానాకు పారమారిబో, ఫ్రెంచి గయానాకు కెయన్నే రాజధానులు.

---

# 15. బ్రెజిలు

దక్షిణ అమెరికాలో అధికభాగమును బ్రెజిలు దేశమే ఆక్రమించుచున్నది. ఇంత పెద్దదేశమైనను అభివృద్ధి తక్కువ. ఇందుకు అచ్చటి అమితవర్షమే కారణము. దేశమంతయు ఉష్ణమండలములోనే యున్నది.

ఈ దేశముయొక్క వైశాల్యము 33 లక్షల చదరపు మైళ్లు. జనసంఖ్య 53 మిలియనులు. దీనికి అట్లాంటికు తీరమున దాదాపు 4,000 మైళ్ళ తీరరేఖ యున్నను మంచి రేవులు తక్కువ. ఈ దేశములో మూడు ముఖ్య భాగములను గుర్తించవచ్చును. 1. ఉత్తర అమెజాన్ నదీ పరీవాహిక ప్రదేశము, 2. మధ్య పీఠభూమి. 3. దక్షిణ మైదానము.

1. అమెజాన్ నదినిగూర్చి ఈ వరకే చదివియున్నారు. ఇచ్చట జనసంఖ్య బహుతక్కువ. రాకపోకల సదుపాయములకు




నదులే శరణ్యము. ఈ దేశము మిక్కిలి పెద్దదగుటచేతను, ఆర్థికాభివృద్ధికి మిక్కుటముగా అవకాశ ముండుటచేతను దీనిని నిద్రించు రాక్షసుడు (Sleeping giant) అని కొందరు అందురు. ఈ ప్రాంతము మిక్కిలి దట్టమైన అరణ్యాభాగ మగుటచే అభివృద్ధి కాలేదు. ఆటవికజాతులు రబ్బరేకాక ఇతర అడవి సరకులనుకూడ తెచ్చి అమ్ముదురు. అందు ముఖ్యమైనవి బ్రెజిలు గింజలు (Brazil nuts). ఈ గింజలనుండి చమురు తీయుదురు. వీనిని కొందరు ఆటవికులు తిందురు.

2. మధ్య పీఠభూమి బ్రెజిలు దేశపు ఆర్థికస్తోమతకు ప్రధానమైనది. ఈ ప్రదేశము దాదాపు మడీరా, అమెజానులకు దక్షిణమున తూర్పు పడమరలుగా వ్యాపించియున్నది. ఇచ్చటి మిట్టలు తీరమువైపు నిట్రముగా నున్నవి. అచ్చట తీరమైదానము కూడ తక్కువ. ఈ పీఠభూములలో వేసవిలో (అక్టోబరునుండి ఏప్రిల్ వరకు) వర్షమెక్కువ. కావుననే ఇచ్చట సవానాలు పర్పడినవి. ఇచ్చటి సవానాలను గురించి ఇదివరకే చదివితిరి. ఇచ్చటి లోయలలో ఉష్ణమండలారణ్యములు కలవు. ఇచ్చటి నదులకు జలపాతము లెక్కువగా నుండుటచే నౌకాయానమున కంతగా ఉపకరించుటలేదు.

ఇచ్చట కాఫీ, కోకో, రబ్బరు, చెఱకు, పొగాకు, ప్రత్తి, పండింపబడు చున్నవి. కాఫీ ఈ పీఠభూమిలోని అన్ని రాష్ట్రములలోను పండింపబడు చున్నది. ఈ దేశముయొక్క ఆర్థిక సంపద ముఖ్యముగా ఈ ఉత్పత్తిమీద ఆధారపడియున్నదని చెప్పవచ్చును. సేయోపౌలో రాష్ట్రము కాఫీ పంటకు ముఖ్యమైనది. ఇందుకు ఇచ్చటి వర్షము. ఔన్నత్యము కారణము. ఈ మండలము పరానానదినుండి తూర్పుగా బ్రెజిలు పర్వతపంక్తి వరకు వ్యాపించియున్నది. ఇచ్చటి నేల సారవంతమై కాఫీకి అవసరమైన ఇనుమును కలిగియున్నది. ఐరోపీయులకు కూడ ఉత్సాహము కలిగించు శీతోష్ణస్థితి కలదు. ఇచ్చట ఉత్పత్తి అయిన కాఫీగింజలలో కొన్నిటితో ప్లాస్టిక్ వస్తువులు తయారు చేయుచున్నారు. సేయోపౌలోలోని కాఫీ తోటలలో సమస్త

సదుపాయములతో కూడిన గ్రామము లున్నవి. ఇచ్చటి కాఫీ సాంటాస్ రేవుగుండా ఎగుమతి అగును. రియోడిజనీరో కూడ కాఫీ ఎగుమతికి ముఖ్యమైన రేవు.

రెండవ ముఖ్యపంట కోకో. దానికి బాహియా ముఖ్య కేంద్రము. చెఱకు, పొగాకు, మొక్కజొన్న, ప్రత్తి పండింపబడు చున్నవి.

3. దక్షిణ మైదానము పాంపాలకు సమీపముగానుండి సమశీతలముగా నుండును. అందుచే ఐరోపీయులు అధికముగా వలసవచ్చి పశుపోషణలో స్థిరపడిరి. పందులు, గొఱ్ఱెలు, గుఱ్ఱములు, ఆవులు హెచ్చుగా కలవు. మాంసము, చర్మములు ముఖ్య ఎగుమతులు.

బ్రెజిలులో ఖనిజసంపద చాల ఉన్నట్లు కనుగొనబడినది. క్రోమ్, అభ్రకము, గ్రాఫైటు, మాంగనీసు, బొగ్గు, ఇనుము, బంగారము, ఉప్పు, వజ్రములు, బెరిలియము అను పచ్చలు లభించుచున్నవి. మాంగనీసు ఉత్పత్తిలో బ్రెజిలు ప్రపంచములో మూడవస్థాన మాక్రమించుచున్నది.

పరిశ్రమలుకూడ వృద్ధిపొందుచున్నవి. నూలు, ఉన్ని, పంచదార, పండ్లను నిలువచేయుట, పట్టు, జనపనార, సారా ఉత్పత్తి మొదలయిన పరిశ్రమలు వృద్ధిపొందుచు ప్రభుత్వ రక్షణము పొందుచున్నవి. ఉక్కు యంత్రాగారము ఇనుపగనుల సమీపమున నెలకొల్పబడినది. ఇప్పటికి 240 నూలు మిల్లులు కలవు.

ఇచ్చట రైలుమార్గములు తక్కువ. కాఫీ మండలముల నుండి రయోడీ జనీరోకును, సాంటాసుకును, తూర్పుతీరప్రాంతమున కొద్దిగాను కలవు.

1949 లో పంచవర్షప్రణాళికను ప్రవేశపెట్టి ప్రజల జీవితప్రమాణము, పరిశ్రమలు, రవాణాసదుపాయములు, వ్యవసాయము, విద్యుచ్ఛక్తి వృద్ధిచేయుటకు ప్రభుత్వము ప్రయత్నించుచున్నది.

ఈ దేశమునకు రియోడీజనీరో రాజధాని. గొప్పపట్టణము. చక్కని రేవు. వ్యాపారకేంద్రము. లోపలి ప్రదేశములతోను, దక్షిణపు తీరప్రదేశములతోను, రైలుద్వారా కలుపబడినది. దానికి దక్షిణమున సాంటాస్ రేవు కాఫీ ఎగుమతికి ప్రసిద్ధికెక్కినది. బాహియా, పెర్నాంబుకోలు పంచదార, ప్రత్తి, పొగాకు ఎగుమతి చేయుచున్నవి.

---

## 16. చిలి

ఈ దేశము దక్షిణ అమెరికాయొక్క పడమటి తీరమున పసిఫికు మహాసముద్రమునకును ఆండీసు పర్వతములకును మధ్య ఉత్తర దక్షిణములుగా 2500 మైళ్ళు వ్యాపించియున్నది. దీని వెడల్పు 200 మైళ్ళకంటె ఎక్కడను ఎక్కువలేదు. ఈ దేశములో భూకంపములు తరచుగా వచ్చుచుండును. ఈ దేశము దక్షిణ అమెరికా దేశములలో చాల అభివృద్ధి చెందిన

వానిలో ఒకటి. ఈ దేశపు వైశాల్యము 286,000 చదరపు మైళ్ళు. జనసంఖ్య దాదాపు 6 మిలియనులు. ఈ దేశము చాల పొడవగుటచే శీతోష్ణస్థితిలో భేదములు ఏర్పడినవి. అందుచే దీనిని మూడు భాగములు చేయవచ్చును.

1. ఉత్తర చిలీమండలపు ఎడారి ప్రదేశము : దీనినే అటకామా ఎడారి అందురు. ఇది ఏర్పడుటకు కారణములను శీతోష్ణస్థితి పాఠములో చూచితిమి. ఎడారి అయినను ఈప్రదేశములో ఖనిజసంపద అధికముగానున్నది.ఇచ్చట పెట్లుప్పు (Sodium Nitrate) గనులు కలవు. దీనిని ఎగుమతిచేయుటచే ఈదేశమునకు మంచి ఆదాయము వచ్చుచున్నది. మన దేశములోని రాజస్థానులో సంభారు సరస్సులో కూడ ఉప్పుతీయుదురు. వర్షము లేకపోవుటచేతనే ఇది లభించుచున్నది. ఉన్నచో కరగిపోవును కదా. ఈ నైట్రేటు ఇక్విక రేవుద్వారా ఎగుమతి అగును. ఈ ఉత్తర చిలీలో బంగారము, వెండి, రాగి కూడ లభించుచున్నవి. ఇందు రాగి ముఖ్యమైనది. ఆంటోఫెగాస్టా ఈప్రాంతపు మరొక రేవు. బొలీవియాలోని ఖనిజములు కూడా ఈ రేవుల ద్వారా ఎగుమతి అగును.

2. మధ్యచిలీ : ఉత్తరచిలీ ఖనిజములకు ముఖ్యమైనట్లు మధ్యచిలీ వ్యవసాయమునకు చాల అనుకూలమైనది. శీతోష్ణస్థితి చాల ఆహ్లాదకరమైనది. ఇచ్చట మధ్యధరా మండలశీతోష్ణస్థితి కలదు. ఈ ప్రాంతములోనే ఈ దేశపు జనసంఖ్యలో అధిక భాగము నివసించుచున్నారు. ఇచ్చట నీటిపారుదల ఏర్పాట్లుచేసి

గోధుమ, బార్లీ, ద్రాక్ష మొదలైనవి పండించుచున్నారు. ద్రాక్ష సారాయమును తయారుచేయుట ఇక్కడ ముఖ్యవృత్తి. ఈ భాగపు కొండవాళ్ళమీద గొఱ్ఱెలను, దక్షిణమున వర్షమెక్కువ గలచోట్ల పశువులను పోషించుచున్నారు. ఈ ప్రాంతములో పండించిన ఆహారపదార్థములు ఉత్తరచిలీలోని గనుల పనివారికి ఆధారము. ఈ భాగములో బొగ్గు దొరకుచున్నది. ఈ భాగమునకు ముఖ్యమైనరేవు వాల్పరైజో.

3. దక్షిణచిలీ : ఖండము చివర హోరన్ అగ్రము వరకు వ్యాపించియున్నది. దీని దక్షిణ భాగమున అసంఖ్యాకమగు ద్వీపములును, ఫియోర్డులును ఉండుట చూడుడు. ఇచ్చట వర్షమధికమగుటచే అరణ్యము లెక్కువ. జనసంఖ్య తక్కువ. పశుపోషణ ముఖ్యవృత్తి. వ్యవసాయము చేయుటకు మైదానము లేదు. అధికవర్ష మగుటచే గోధుమ పండదు. కొన్ని ద్వీపములమీద స్వదేశీయులు బంగాళదుంపలు పండించుచున్నారు. ఇచ్చటనుండి గొఱ్ఱెమాంసము, ఉన్ని పుంటా అరెనాస్ రేవునుండి ఎగుమతి అగుచున్నవి.

చిలీ దేశమునకు రాజధాని శాంటియాగో. ఆరోగ్యకరమైన చోటు. వాల్పరైజోకు సమీపమున నున్నది. రైలు మార్గములద్వారా ఇతర చోట్లకు కలుపబడినది.

---

# 17. పరాగ్వే, ఉరుగ్వే, అర్జెంటైనా

## ప రా గ్వే

ఈ దేశములో సగము ఉష్ణమండలములోను, సగము సమశీతలమండలములోను ఉన్నను ఉరుగ్వే అర్జెంటైనాలతో ఎక్కువ సంబంధముండుటచే సమశీతల మండలములోనిదిగా భావించబడినది. ఈ దేశముయొక్క ఉత్తరభాగము అడవుల తోను, తూర్పు దక్షిణభాగములు గడ్డిబీడులతోను నిండియున్నవి. దీనికి పడమట గ్రాంచాకో అడవులు కలవు. ఈ దేశమున పరానా, పరాగ్వే నదులుండుటచే దేశములోనికి ఓడలు రాగలవు. మిట్టలమీద పశుపోషణ జరుగుచున్నది. లోయలలో ప్రజలు వ్యవసాయములోను, తోటపనులలోను జీవితములు గడుపుకొను చున్నారు. ఇచ్చట మేట్ అను పరాగ్వే టీ ముఖ్యపంట. నారింజలు కూడ పండించుచున్నారు. జనసంఖ్య చాల తక్కువ.

ఈ దేశమునకు రాజధాని అసన్షియన్

## ఉ రు గ్వే

బ్రెజిలుకును, అర్జెంటైనాకును మధ్యనున్నది. ఈ దేశపు వైశాల్యము. 72,153 చదరపుమైళ్లు. జనసంఖ్య రెండున్నర మిలియనులు. ఇచ్చట వేసవి (నవంబరునుంచి ఏప్రియల్) లో వర్షము కురియును. అది గడ్డిబీడులకు అనుకూలమైనది. ఈ బీడులను పాంపాలందురు. అర్జంటైనాలో పాంపాలకు ఇవితూర్పు

చివర నున్నవి. పాంపాలనుగూర్చి మీరు ఇదివరకే చదివితిరి. ఈ దేశములో పర్వతములు లేవు. చిన్న చిన్న కొండలుమాత్రము కలవు. ఇచ్చట వ్యవసాయముకన్న పశుపోషణ ముఖ్యవృత్తి. ఉన్ని, మాంసము, చర్మములు మొదలగు పశుసంబంధమైన వస్తువులే ముఖ్య ఎగుమతులు. వ్యవసాయము బహుకొద్ది (7%) ప్రదేశములో జరుగుచున్నది. గోధుమ, మొక్కజొన్న, ఓట్లు. వరి, అవిసె, ద్రాక్ష ముఖ్యపంటలు.

అనేక ఖనిజము లున్నట్లు కనుగొనబడినది. అవి బంగారము, వెండి, రాగి, తగరము, పాదరసము, అభ్రకము, బలపపురాయి, జిప్సము, కోబాల్టు, చలువరాయి. వీటిని త్రవ్వుటకు ఎక్కువ శ్రద్ధతీసుకొనబడలేదు.

ఈ దేశమునకు రాజధాని, ముఖ్యరేవు మాంటివిడియో ప్లేటు నదీతీరమున నున్నది. రైలుమార్గముల ద్వారా చాల ప్రదేశములతో కలుపబడినది. మాంసము, చర్మములు, ఉన్ని ఎగుమతికి తయారుచేయు యంత్రశాలలు కలవు.

## అర్జెంటైనా

అర్జెంటైనా దక్షిణ అమెరికాలో రెండవ పెద్దరాజ్యము. మకరరేఖకు ఉత్తరమునుండి హారన్ అగ్రము వరకును ఆండీస్ పర్వతములనుండి అట్లాంటికు వరకును వ్యాపించి యున్నది. ఈ దేశపు వైశాల్యము 10 లక్షల చదరపుమైళ్ళు. జనసంఖ్య

18 మిలియనులు. వీరిలో అధిక సంఖ్యాకులు ఐరోపీయులు. స్వదేశీయులు ఉత్తరపు అడవులలో నుందురు.

ఈ దేశపు ఉత్తరభాగము ఉష్ణమండలారణ్యములోనిది. ఈ ప్రాంతము అభివృద్ధి కాలేదు.




అర్జంటైనా, చిలీ దేశములు

దీనికి దిగువ ఉప ఉష్ణమండల గడ్డిబీడు లున్నవి. వీనినే పాంపా లందురు. పాంపాల ఈశాన్యభాగమున మొక్కజొన్న,

అవిసె ముఖ్యపంటలు. బ్యూనస్ ఐరిస్ ప్రాంతమున గోధుమ పంట అధికము. అర్జంటైనా దక్షిణ అమెరికాకు ధాన్యాగారము అని పిలువబడుచున్నది. ఓట్లు, చముురుగింజలు, ప్రత్తి, బంగాళా దుంపలు, చెఱకు, పొగాకు, వరి, పరాగ్వే టీ కూడ పండింపబడు చున్నవి.

ఇచ్చట పశుపోషణ ముఖ్యవృత్తి. పశువులనుండి మాంసము తీసి రిఫ్రిజిరేటరులలో నిలువచేసి ఎగుమతి చేయుచున్నారు. ఇచ్చట ఆవులు, గుఱ్ఱములు, గొఱ్ఱెలు, పందులు, మేకలు కార్డోబో జిల్లాలో ఎక్కువగా మేపుచున్నారు. మాంసము కాక చర్మములు, ఉన్ని, మాంస సంబంధమైన ఇతర వస్తువులు కూడ ఎగుమతి అగుచున్నవి. ఈ సరకులు బ్యూనస్ ఐరిస్, లాప్లాటా, బాహియాబ్లాంకా రేవులద్వారా ఎగుమతి అగు చున్నవి.

ఈ దేశపు వాయవ్యభాగమున మరొక వ్యవసాయ ప్రదేశము కలదు. ఇది ఆండీసు పర్వతముల పాదములవద్ద నున్నది. ఇచ్చట వర్షము తక్కువైనను చిన్న ఏరులనుండి నీటి పారుదల పర్పాటులు చేసి పంటలు పండించుచున్నారు. మధ్యధరా మండలపు పంటలు, పండ్లు పండును. ఇచ్చటివారికి ద్రాక్షసారాయము చేయుట ముఖ్యవృత్తి.

పెటగోనియా భాగము ఈ దేశపు దక్షిణచివర నున్నది. ఇది రాతి ఎడారి. ఈ ప్రదేశము వర్షచ్ఛాయాప్రదేశము. ఆండీసు పర్వత వాళ్ళలో గొఱ్ఱెలపోషణ కలదు.

ఖండమునకు దక్షిణమున టెర్రాడెల్‌ఫ్యూగో అను ద్వీపము కలదు. దీనిని రెండు భాగములు చేసిరి. పడమటి భాగము చిలీకి, తూర్పు భాగము అర్జెంటైనాకు చెందును. మాజెలాను జలసంధి పూర్తిగా చిలీ దేశములోనిది. సమీపములోని ఫాక్‌లాండు ద్వీపములు బ్రిటిషువారివి. చెట్లు పెరుగవు. కొద్దిగా గొర్రెల పెంపకము కలదు.



అర్జెంటైనాలో రవాణా సదుపాయములు అధికముగా నున్నవి. నదులు చాలదూరము యానయోగ్యములు. 27,000 మైళ్ళ రైలుమార్గములును, 32,000 మైళ్ళ రోడ్లును కలవు. కావుననే ఆర్థికాభివృద్ధి అధికముగా నున్నది. ఇందుకు అనువగు శీతోష్ణస్థితి, చదునైన నేల ముఖ్య కారణములు.

బ్యూనస్‌ఐరిస్ ఈ దేశమునకు రాజధాని, ముఖ్యరేవు. ప్లేటునదిమీదనున్నది. దేశపు ఎగుమతి దిగుమతులలో అధిక భాగము ఈ రేవు మీదుగానే జరుగుచున్నవి. దీని జనసంఖ్య 16 లక్షలు. ఓడలు నిలుచుటకు, సరుకులు నిలువవేయుటకు అనేక ఏర్పాటులున్నవి. పసిఫికు తీరమున కల వాల్పరైజోకు ఇక్కడినుండి రైలుమార్గము కలదు.

# ప్రశ్నలు

1. స్పెయినువారు అమెరికాకు మొదట వచ్చినపుడు అచట ఎవరెవరు నాగరికులుండిరి ?
2. దక్షిణ అమెరికా యొక్క ఉనికిని వివరింపుడు.
3. దక్షిణ అమెరికా నైసర్గిక స్వరూపమును విశదముచేయుడు.
4. ఆండీసు పర్వతములను గురించి వ్రాయుడు.
5. దక్షిణ అమెరికాకును, ఆఫ్రికాకును పోలికలు భేదములు వ్రాయుడు.
6. కాంగో అమెజాన్ మైదానములను పోల్చుడు.
7. అమెజాన్ నదిని గూర్చి వ్రాయుడు.
8. దక్షిణ అమెరికాలోని ముఖ్యనదులను వర్ణింపుడు.
9. దక్షిణ అమెరికాలో వర్షపాత వితరణమునుగూర్చి వ్రాయుడు.
10. దక్షిణ అమెరికాలోని పర్వతములను గూర్చి వ్రాయుడు.
11. దక్షిణ అమెరికాలోని దక్షిణ మైదానము యొక్క ప్రాముఖ్యత ఏమి ?
12. దక్షిణ అమెరికాలోని వెనుజులా మైదానము గూర్చి వ్రాయుడు.
13. అర్జెంటైనా మైదానము చాల ఉపయోగకరమైనది. ఏల ?
14. బ్రెజిలు మైదానము చాల పెద్దదైనను ఉపయోగకరము కాదని చూపుడు.
15. బ్రెజిలు మిట్టలను వర్ణించి వాని ప్రాముఖ్యతను తెలుపుడు.

16. దక్షిణ అమెరికా కాఫీ పంటకు ప్రసిద్ధమని చూపుడు.
17. దక్షిణ అమెరికాలోని ఖనిజసంపదను గూర్చి వ్రాయుడు.
18. స్పెయినువారు వెండిబంగారములకు ఆశించి దక్షిణఅమెరికాను ఆక్రమించిరి - దీనిని వివరింపుడు. ఈ ఖనిజములు ఎక్కడ ఎక్కువగా దొరకును ?
19. దక్షిణ అమెరికా శీతోష్ణస్థితిని గూర్చి వ్రాయుడు.
20. దక్షిణ అమెరికాలోని సహజ వృక్షజాలమును వర్ణింపుడు.
21. దక్షిణ అమెరికాలోని జంతుజాలమును గూర్చి వ్రాయునది.
22. దక్షిణ అమెరికాలోని పాంపాలను వర్ణింపుడు.
23. చిలీ రాజ్యము యొక్క ప్రాముఖ్యతను చూపుడు.
24. అర్జెంటైనాను గూర్చి వ్రాయుడు.
25. రబ్బరు, కాఫీ, గోధుమలు దక్షిణ అమెరికాలో ఎచ్చట లభించును ?
26. బ్రెజిలు ప్రస్తుతము వృద్ధిపొందకున్నను మంచి భవిష్యత్తు కలదు. ఎట్లు ?
27. బ్రెజిలు నిద్రించు రాక్షసుడు **(Sleeping giant)** అనుటలో ఉద్దేశ్యమేమి ?
28. దక్షిణ అమెరికాలోని వివిధ అరణ్యపు పంటలను గూర్చి వ్రాయుడు.
29. దక్షిణ అమెరికాలోని ఎడారి భూములను వర్ణింపుడు.
30. దక్షిణఅమెరికాలోని మధ్యధరామండలమునుగూర్చి తెలుపుడు.
31. దక్షిణ అమెరికాలో నడుతే ముఖ్య ప్రయాణసాధనములని చూపుడు.

32. దక్షిణ అమెరికాలోని వేర్వేరురాజ్యములను వాటి రాజధానులను పేర్కొనుడు.

33. దక్షిణ అమెరికాలోని పశుసంపదను గూర్చి వ్రాయుడు.

34. లానోలు, కాంపోలు అననేమి ? విశదము చేయునది.

35. దక్షిణ అమెరికాలోని ముఖ్యరేవులను గూర్చి వ్రాయుడు.

36. దక్షిణ అమెరికాలో రైలుమార్గములను గురించి వ్రాయుడు.

37. దక్షిణఅమెరికాలో జనసంఖ్య తక్కువగానుండుటకు కారణము లేమి ?

---

## మూడవ భాగము

# ఆస్ట్రేలియా

---

## 1. ఉనికి - పరిశోధన

ఆస్ట్రేలియా అను పదమునకు దక్షిణభూమి అని అర్థము. పాశ్చాత్యులకు 16వ శతాబ్దపు చివరిభాగములో మాత్రము దానినిగూర్చి తెలియవచ్చినది. 1606లో టారెస్ అనువాడు టారెస్ జలసంధిలో ప్రయాణము చేసినతర్వాత దీనిని గూర్చిన పరిశోధనలు ఎక్కువయ్యెను. 1642లో డచ్చివారి టాస్మను ఈ ప్రదేశమును పరిశోధించి టాస్మేనియా ద్వీపమును న్యూజిలాండును కనుగొనెను. బ్రిటిషు దేశస్థుడగు కెప్టెనుకుక్ 1769 లో న్యూజిలాండు ద్వీపము చుట్టును ప్రయాణముచేసి రెండు ద్వీపములకు మధ్యనున్న జలసంధిలోనుండి పోయెను. అందుచే దానికి కుక్ జలసంధి అని పేరు వచ్చినది. తర్వాత ఆస్ట్రేలియాలోని బోటనీబేని పరిశోధించి అచ్చట కల పువ్వులచే దానికి ఆ పేరు పెట్టెను. అచ్చటినుండి ఉత్తరముగా న్యూ సౌత్ వేల్సు, గ్రేట్ బారియర్ రీఫ్‌ల మధ్యగా ప్రయాణము చేసెను.

కుక్ ప్రయాణము చేసిన కొంతకాలమునకు బోటనీబే ప్రాంతమును యావజ్జీవ ద్వీపాంతరవాస ఖైదీల కొఱకు ఉపయోగింప ఆంగ్లప్రభుత్వము నిశ్చయించెను. ఇట్లు 1788 లో సిడ్నీ ప్రారంభమయ్యెను. తర్వాత కొంతకాలమునకు బాస్,

ఫ్లిండర్సు అనువారు ఖండముయొక్క దక్షిణ భాగమును పరిశోధించి టాస్మేనియా ద్వీపమును చుట్టిరి. అందుచే ఆస్ట్రేలియాకును టాస్మేనియాకును మధ్యగల జలసంధికి బాస్ జలసంధి అని పేరు కలిగెను. తర్వాత ఫ్లిండర్సు దక్షిణతీరమును పరిశోధించెను. క్రమముగా ఆస్ట్రేలియా యొక్క పరిమాణము ఆకారము తెలియనయ్యెను.

ఇట్లు కనుగొనబడిన ఆస్ట్రేలియా ఆగ్నేయ ఆసియాకు దిగువను హిందూ పసిఫిక్ మహాసముద్రములకు మధ్య నున్నది. ఈ ఖండము పెద్ద ద్వీపము. ఇండియాకు ఇది 3300 మైళ్ళ దూరమున కలదు. ఇది దక్షిణార్థ గోళములో 11 డిగ్రీలనుండి 39 డిగ్రీలవరకు వ్యాపించియున్నది, ఇది అవిభక్త హిందూ దేశముకంటె $1\frac{1}{4}$ రెట్లు పెద్దది. ఈ ఖండమునకు మధ్యగా మకరరేఖ పోవుచుండుట గమనింపుడు.

ఉత్తరమున విశాలమగు కార్పెంటేరియా సింధుశాఖ కలదు. దీనికి పడమట వెడల్పైన ద్వీపకల్పమును, తూర్పున సన్నని ద్వీపకల్పమును కలవు. తూర్పు పడమట తీరములు వెలుపలికి వంగియుండగా దక్షిణతీరము లోనికి వంగియున్నది. ఇచ్చట గ్రేట్ ఆస్ట్రేలియన్ అఖాతము కలదు. మొత్తముమీద ఆఫ్రికా కంటె ఈ ఖండపు తీర రేఖ ఎక్కువగా చీలియున్నది. కాని చీలికలు లోతుగా లేకపోవుటచే ఖండ మధ్యభాగము సముద్రమునకు చాలదూరమున నున్నది. ఇది శీతోష్ణస్థితిపై ప్రభావము చూపించుట మనము ముందు గ్రహింతుము.



గ్రా ఆస్ట్రేలియా తీరమునగల గ్రేట్ బారియర్ రీఫ్. దీని పొడవు 1200 మైళ్ళు.

ఈ ఖండములో మరొకవిశేషమేమన దీని ఈశాన్యమున తీరమునకు 30 నుండి 75 మైళ్ళ దూరమున గ్రేట్ బారియర్ రీఫ్ అనబడు పవడపు పురుగులచే ఏర్పరుపబడిన దిబ్బ 1,200 మైళ్ళ పొడవున వ్యాపించియున్నది. కొన్నిచోట్ల ఈ దిబ్బ వెడల్పు 100 మైళ్ల వరకు కలదు. ఈ దిబ్బ ఉపరిభాగము పాటు సమయమున సముద్రమట్టముతో సమానముగానుండును. ఇదంతయు పవడపు పురుగుల అనంతమైన కృషియొక్క ఫలితము. ఈదిబ్బ సముద్ర గర్భమునుండి 200 నుండి 300 అడుగుల ఎత్తువరకు నుండును. కాని సముద్ర కెరటముల దెబ్బకు తాళలేక ఈదిబ్బ చాలచోట్ల శిథిలమైనది. మనదేశపు లక్షద్వీపములు కూడ ఇట్టివే. ఈ దిబ్బ ఒక గోడవలె పనిచేయుచున్నది. పసిఫిక్ మహాసముద్రములో ఈదిబ్బకు వెలుపల గొప్ప తుపానులు చెలరేగుచున్నను, దిబ్బకును ఖండమునకును మధ్య సముద్రము నిశ్చలముగా నుండును. కాబట్టి నిరపాయముగా ఓడలు నిలువ గలవు. ఈ దిబ్బలోనుండి చాలచోట్ల మార్గములు కలవు. వాని ద్వారా పడవలు తీరమునకు వచ్చుచు పోవుచుండును.

---

# 2. నైసర్గిక స్వరూపము - నదులు

నైసర్గికముగా ఆస్ట్రేలియాను మూడు ముఖ్య భాగములుగా విభజింపవచ్చును. 1. పశ్చిమ పీఠభూమిభాగము 2. మధ్య పల్లపుభూములు, ముర్రే డార్లింగు మైదానము, ఐర్ సరస్సు కార్పెంటేరియా ప్రాంత మైదానములు, 3. తూర్పు ఉన్నత ప్రదేశములు.




ఆస్ట్రేలియా నైసర్గికము

1. పశ్చిమ పీఠభూమి ఎడారితుల్యము. ఇది ఆస్ట్రేలియాలో సగముకంటె ఎక్కువభాగమును ఆక్రమించియున్నది.

ఈ మండలములో దక్షిణమున నల్లార్ బర్ సున్నపురాయి మైదానము మాత్రము వేరు. ఈ పీఠభూమి భాగము కఠిన శిలామయము. ఈశిలపైనగల ఇసుకరాతి పొరలు వాతావరణ క్రియ (Weathering) వలన శిథిలమై అడుగుననున్న శిల బయలుపడినది. ఇందువల్ల కొన్ని చోట్ల గొప్ప ఇసుకప్రదేశములును, మరికొన్ని చోట్ల ఇసుకరాతి స్తంభములును ఏర్పడినవి. ఈ పీఠభూమి 1,000 నుండి 3,000 అడుగులవరకు ఎత్తున నున్నది. తీరమున రేవులు ఎక్కువ లేకపోవుట వలనను, గాలి ఎల్లప్పుడును పొడిగా నుండుటవలనను అంత వాసయోగ్యమైన ప్రదేశము కాదు. ఈ ప్రదేశమంతయు ఎడారి.

2. పశ్చిమ పీఠభూమికి తూర్పునను, తూర్పు పర్వత పంక్తికి పడమటను ఉత్తరమునుండి దక్షిణము వరకు మధ్య మైదానము సెల్విన్ పర్వతపంక్తివలనను, గ్రేపర్వతపంక్తివలనను మూడు భాగములుగా చేయబడినది. సెల్విన్ పంక్తి అడ్డు వచ్చుటవలన చాలనదులు కార్పెంటేరియా సింధుశాఖ వైపునకు ప్రవహించుచున్నవి. గ్రే పర్వతపంక్తివలన ముర్రేడార్లింగు మైదానము ఐర్ మండలమునుండి వేరుచేయబడినది. ఈఐర్ మండలములోని నదులు ముఖ్యమైనవికావు. ఐర్ సరస్సు సముద్రమట్టమునకు 40 అడుగుల లోతున నున్నది. నీరు లేనప్పుడు బురదతో నిండియుండును. ఆస్ట్రేలియా ఖండములో ముఖ్యముగా చెప్పదగినవి ముర్రేడార్లింగు వాని ఉపనదులును. ఇచ్చటి మైదానము ఈ నదుల నీటిచే తడుపబడి సారవంతమైనది. ఇచ్చటి మిక్కిలి

సారవంతమైన ప్రదేశమునకు రివరినా అనియు ముర్రేనదికి దక్షిణమున పొడిగానుండు ప్రదేశమునకు మాల్లీ భూములనియు పేర్లు.

మూడవ నైసర్గిక భాగము తూర్పునగల పర్వతభాగము. ఉత్తరమున యార్కు అగ్రము నుండి టాస్మేనియా వరకు




వ్యాపించియున్నది. ఆస్ట్రేలియాకును టాస్మేనియాకును మధ్య బాస్ జలసంధిలో మాత్రము ఈ పంక్తి కనిపించుటలేదు. ఈ పర్వతపంక్తిని గ్రేట్ డివైడింగ్ రేంజి అందురు. ఈపంక్తి తూర్పు తీరమునకు దాదాపు సమాంతరముగా నున్నది. న్యూ సౌత్ వేల్సు రాష్ట్రములో ఈ పర్వతపంక్తికి వేర్వేరు పేర్లు కలవు. ఉత్తర భాగమునకు న్యూ ఇంగ్లండు పంక్తి అనియు, దక్షిణ

భాగమునకు బ్లూమౌంటెనులనియు (Blue Mountains) అందురు. విక్టోరియా రాష్ట్రములో వీనికి ఆస్ట్రేలియన్ ఆల్ప్సు అందురు. ఇచ్చటనే ఈ పర్వతపంక్తియొక్క మిక్కిలి ఎత్తయిన శిఖరములు కలవు. అవి 7000 అడుగుల ఎత్తునుండి యూరపులోని ఆల్ప్సువలె ఎల్లప్పుడును మంచుతో కప్పబడి యుండును. ఈ ఆల్ప్సు సముద్రము వైపునకు నిలువుగాను దేశ మధ్యము వైపునకు ఎక్కువ వాలుగాను ఉన్నవి.

తీర మైదానము చాల ఇరుకైనను మిక్కిలి జనసాంద్రత గలది. మన దేశములో కేరళ తీరముతో పోల్చుడు. గ్రేట్ డివైడింగ్ రేంజి సముద్రమునకు దగ్గరగా నుండుటచేతను తీరము వైపు నిలువుగా నుండుటచేతను పసిఫిక్‌లోనికి ప్రవహించునదులు చాల చిన్నవి. కాని ఇచ్చట వర్షము అధికముగాను, తరచుగా నుండుటచేత వీనిలో నీరు ఎక్కువ. సంవత్సర మంతటను ఉండును. కాని ఖండములోనికి ప్రవహించు నదులు పొడవైనవి. ఇచ్చట తూర్పుతీరముకన్న వర్షముతక్కువగుటచే నదులు నెమ్మది గాను, తక్కువ నీటితోను ప్రవహించుము. వర్షకాలము దాటిన తర్వాత ఇవి చాలవరకు తగ్గిపోవును. కాని ఈ ప్రాంతములోని ముర్రేనదిమాత్రము సదా జలపూర్ణమైన జీవనది. ఆస్ట్రేలియను ఆల్ప్సులో పుట్టుటచే వాటిమీద మంచు దానికి సంవత్సర మంతటను నీటి నందించును. మన దేశములోని గంగ, యమున జ్ఞప్తికి తెచ్చుకొనుడు. ముర్రేయొక్క ముఖ్య ఉపనది డార్లింగు. ఇది న్యూ సౌత్‌వేల్సు, క్వీన్సులాండులలో కురిసిన వర్షమును

గ్రహించి వర్షకాలములో చాల పెద్దనదిగా ఏర్పడి నౌకా యానమునకు కూడ చాల దూరము వీలుకలిగించును. కాని వేసవిలో డార్లింగుయొక్క ఉపనదు లెండిపోవుటచే ఇదికూడ చాల కృశించిపోవును. ఈ ముర్రే డార్లింగునదుల పరీవాహ ప్రదేశమునకు ముర్రే డార్లింగు నదీ మైదానమని పేరు. ముర్రే నది సముద్రములో కలియుచోట లోతు తక్కువగుటచే నిరుప యోగ మైనది.

తూర్పు తీరమున ఉత్తరముగా పోయినకొలది నదులు లేవు. దానికి కారణము పర్వతములకును సముద్రమునకును మధ్య తీరమైదానమే లేదు. ముర్రేడార్లింగు మైదానమునకు ఉత్తరమున నెల్విన్ పంక్తిలో పుట్టి ఉత్తరముగా ప్రవహించి కార్పెంటేరియా సింధుశాఖలో కలియు చిన్న నదులు చాల కలవు. ఇవి వర్షములు కురిసినపుడు జల సమృద్ధములుగా నుండును. కాని ఆప్రాంతములో జనసంఖ్య బహు తక్కు వగుటచే అవి నిరుపయోగముగా నున్నవి.

పడమటి తీరమున వర్షము చాల తక్కువ. వర్షము కురి సినపుడు మాత్రము నదులలో నీరుండును. నైరృతిమూల స్వాన్ నది ముఖ్యమైనది. ఇది పెర్త్ నగరము గుండా పోయి సముద్రములో కలియుచోట ఫ్రీమాంటిల్ అను చక్కని రేవు కలదు.

ఖండపు మధ్య ముర్రే డార్లింగు మైదానమునకు పడ మట ఐర్ సరస్సు మండలములలోకూడ అనేక చిన్న నదులు

కలవు. ఈ సరస్సు చాల వరకు సముద్ర మట్టముకంటె పల్లముగా నుండుటచే సమీప ప్రాంతముల కురిసిన వర్షము దీని లోనికి ప్రవహించును. ఈ నదులలో పెద్దవి డయామాంటినా, కూపర్స్ క్రీక్ అనునవి. ఇవి కూడ వర్షములప్పుడు మాత్రమే ఐర్ సరస్సును చేరగలుగుచున్నవి. ఈ సరస్సు వేసవిలో బురదతో నిండియుండును. ఈ ప్రాంతమంతయు ఎడారి. ఈ సరస్సునకు ఉత్తరమున గల ప్రదేశమునకు స్టోనీడిజర్టు అందురు. అనగా రాతి మయమైన ఎడారి. ఈ ప్రాంతమంతటను ఆర్టీషి యను బావులు కలవు.

దక్షిణమున గ్రేట్ ఆస్ట్రేలియన్ అఖాతములో కలియు నదులు లేవు. ఆస్ట్రేలియా చాల పెద్ద ఖండమైనను మంచి నదులు లేకపోవుట గమనించ దగినది. పటముమీద కనబడు అనేక నదులు వానలు తగ్గగానే ఎండిపోవును. కావున నదులు ప్రయాణ సాధనములుగా ఎంత మాత్రమును ఉపయోగపడుట లేదు. కావున రైలు, రోడ్డు మార్గముల ఆవశ్యకత అధికము.

---

## 3. శీతోష్ణస్థితి - వర్షపాతము

ఆఫ్రికా భూమధ్యరేఖకు ఇరుప్రక్కల వ్యాపించి కర్కాట మకర రేఖలను రెంటిని కలిగి యున్నట్లు చూచితిమి. అందుచే ఉత్తరమునకును దక్షిణమునకును ఋతు భేదము

కలుగు చుండును. కాని ఆస్ట్రేలియా భూమధ్య రేఖకు దక్షిణముగా నుండుటచే మనకు వేసవి అయినపుడు అక్కడ




వర్షపాతము

శీతకాలమును, మనకు శీతకాలమైనపుడు అచ్చట వేసవియు అగుచుండును. మకర రేఖ ఖండ మధ్యముగా పోవుచుండుట గమనింపుడు. కావున ఉత్తరార్ధము ఉష్ణమండలములోను, దక్షిణార్ధము సమశీతల మండలములోను ఉన్నవి. కర్కాటరేఖ మన దేశములో మధ్యగా పోవుచున్నది కదా. అందుచే దక్షిణ ఇండియా ఉష్ణమండలములోను, ఉత్తర ఇండియా సమశీతల మండలములోను ఉన్నట్లు గమనించితిమి. కాబట్టి ఉత్తర ఆస్ట్రే

లియాకును, దక్షిణ ఇండియాకును వర్షపాతములోను, ఉష్ణోగ్రతలోను పోలికలు కలవని తెలిసికొనుడు.

నవంబరునుండి మే వరకు ఆస్ట్రేలియాకు వేసవి కనుక ఆస్ట్రేలియా అంతయు వేడెక్కును. వేడిగాలులు పైకెగసి పోవుటచే అల్పపీడన మేర్పడును. అప్పుడు అధికపీడనముగల సముద్రముమీదనుండి తేమగల వాయువులు వీచును. ఇందువల్ల ఉత్తర ఆస్ట్రేలియాలోను, తూర్పుతీరముననను వర్ష మధికము. ఇవి ఋతుపవనవర్షములు. అచ్చటగల గ్రేట్ డివైడింగు రేంజివల్ల ఆ పర్వతపంక్తికి పడమట వర్షము తక్కువ. మనదేశములో పడమటి కనుమలకు పడమట అధికవర్షము తూర్పున అల్పవర్షము ఉండుట గమనింపుడు. పవనములు ఇంకను ఖండములోనికి పోయినపుడు తేమను కోల్పోయి వర్షమును ఈయజాలవు. అదే సమయమున ఆగ్నేయ ఆస్ట్రేలియాలో ఆగ్నేయవ్యాపార పవనములవల్ల కొంచెము వర్షము కురియుచున్నది. దక్షిణ ఆస్ట్రేలియా పొడిగానుండును. ఉత్తర ఆస్ట్రేలియాలో వేడి మనదేశములో నున్నట్లుండును. కాని దక్షిణ ఆస్ట్రేలియాకు అంటార్కిటికు నుండి మధ్య మధ్య ఆహ్లాదకరమైన చల్లని వాయువులు వీచుచుండును.

ఆస్ట్రేలియాకు శీతకాలములో ఆగ్నేయ వ్యాపారపవనములు వీచుచుండును. ఇవి భూమినుండి సముద్రముపీదికి వీచుచుండుటచే అధికవర్షము నీయవు. కాని ఆ సమయమున ఖండముయొక్క దక్షిణభాగమున పశ్చిమ పవనములు వీచి ఆ

భాగమునకు వర్షము నిచ్చును. కనుక దక్షిణ ఆస్ట్రేలియాలో మధ్యధరా శీతోష్ణస్థితి ఏర్పడినది.



పాతాళగంగ బావి

ఆస్ట్రేలియాలో మొత్తముమీద తూర్పుతీరము, ఉత్తర తీరము, నైరృతిమూల, ఆగ్నేయమూల మాత్రము మంచి వర్షమును పొందును. ఖండ మధ్యము ఏ పవనములవలనను లాభమును పొందలేకున్నది. ఆస్ట్రేలియాలో వర్షపాతము తక్కువే కాక అస్థిరముగా నుండుటచే వ్యవసాయదారులకు నష్టము కలుగుచుండెడిది. కాని ఇటీవల ఆర్టీషియను బావులను ఏర్పరచిన తర్వాత ఆ బాధ తొలగినది.

నీటి జలలు తూర్పుమైదానములోను, దక్షిణ ఆస్ట్రేలియాలోని నల్లార్బార్ మైదానములోను, పశ్చిమమునను, వాయ

వ్యమునను కలవు. నడివేసవిలోకూడ ఈ బావులలో నీరు సమృద్ధిగా లభించును. అయినను ఇట్టి నీటిఊటలులేని మధ్య ఆస్ట్రేలియావంటి ప్రదేశములకు నీటిని సరఫరా చేయుటకు ఆ ఖండపు ప్రభుత్వము కృత్రిమ వర్షపాతమునుగూర్చి ప్రయోగములు సలుపుచున్నది.

టాస్మేనియా ద్వీపమగుటవలనను, పశ్చిమ పవనముల దిశలోనుండుటవలనను సంవత్సరమంతయు వర్షమును పొందును.

---

## 4. వృక్షజాలము - జంతుజాలము

ఏ దేశమందైనను శీతోష్ణస్థితిని, వర్షపాతమునుబట్టి సహజ వృక్ష జాలమును, జంతు జాలమును ఉండును. అంతేకాక ఆ ఖండముయొక్క ఉనికినిబట్టికూడ నుండును. ఆస్ట్రేలియా దక్షిణార్ధగోళములో నుండుటయేగాక, ఇతరదేశములతో సంబంధము లేకుండ నుండుటచే అందలి వృక్షజాలమును, జంతు జాలమును ప్రత్యేకమైనవి.

ఉత్తర సముద్రతీరమందు ఉష్ణమండలారణ్యాములు కలవు. ఇవి పూర్తిగా ఋతుపవనముమీద ఆధారపడినట్లు గమనింపుడు. వర్షపాత పటముతోపోల్చిన అధిక ఋతుపవనవర్షము కలచోట్లనే ఈ ఉష్ణమండలారణ్యాము లున్నట్లు మీరు గమనించగలరు. ఈ ప్రదేశములు కార్పెంటేరియా సింధుశాఖకు చుట్టును, తూర్పు

తీరమునను కలవు. అచ్చట కలపకు పనికివచ్చు వృక్షములు, తాటిజాతి చెట్లు, వెదురు మొదలయినవి చక్కగా పెరుగును. అడవులను నరికి అరటి, వరి, నీలిమందు, చెఱకు, పొగాకు పండించుచున్నారు. ఇచ్చటనే ఆస్ట్రేలియా యూకలిప్టసు లేక నల్లజిగురుచెట్లు సమృద్ధిగా కలవు. ఈ చెట్లు విచిత్రమైనవి. ఇవి సతత హరితములు. చిన్నవిగా నున్నపుడు ఈచెట్లకు వెడల్పు ఆకులున్నను, పెద్దవైనపుడు ఆకులు లోనికి ముడుచుకొని యుండుటచే అంతనీడ నీయలేవు. ఈ చెట్ల కలప మన టేకు వలె అన్ని సామానులు చేయుటకు పనికి వచ్చును. దీనిలో నుండి తైలముతీసి మందుగా వాడుదురు. చాల ఎత్తుగా పెరుగును. కొన్ని చెట్లు 400 అడుగుల ఎత్తుండును. ఈ చెట్లను మన దేశములో నీలగిరి కొండలమీద పెంచుచున్నారు. దక్షిణ ఆస్ట్రేలియాలోను, టాస్మేనియాలోను కూడ ఇట్టి చెట్లే కలవు.

ఈ ఉష్ణమండలారణ్యములకు దిగువ సవానాలు కలవు. వీటిలో చిన్న తుప్పనేలలుకూడ కలవు. ఇక్కడ అరణ్యములు పెరుగకపోవుటకు వర్షపాతము తక్కువగుటయే కారణము. ఇంతకంటె మంచిగడ్డిబీడులు క్వీన్స్‌లాండు రాష్ట్రములో కలవు. ఇచ్చట పశుపోషణ బాగుగా జరుగుచున్నది. ఈ ప్రదేశము ముర్రేడార్లింగు మైదానములోనిది. పల్లపుప్రదేశము గోధుమకు అనుకూలము. క్రమముగా దక్షిణముగాను, పడమరగాను పోయినకొలది ఎడారిప్రదేశములోనికి పోవుదుము. అచ్చట గడ్డి కూడ బహుతక్కువగా నుండును చిన్న చిన్న మొక్కలుండును.

కాని వానినిండ ముండ్లుండును. అందుచే జంతువులు వానిని ముట్టవు.

దక్షిణ ఆస్ట్రేలియా దక్షిణ భాగమున మధ్యధరా శీతోష్ణ స్థితి కలదు. ఇచ్చట కూడ యూకలిప్టస్ చెట్లే కలవు. ద్రాక్ష, ఆలివు, నారింజ వగైరాలు లేకపోవుట గమనించదగినది. వీటిని తరువాత ప్రవేశ పెట్టిరి.



దక్షిణ ఆస్ట్రేలియాలోని ఫలవంతమగు లోయ

పశ్చిమ ఆస్ట్రేలియాలో గొప్ప అడవులు కలవు. ఇచ్చటి కర్రి, జర్రా చెట్లు చాలఎత్తునకు పెరుగును. వాటి కలప చాల విలువైనది. ఈ కలపకు చెద పట్టదు. కాబట్టి రైలు పట్టాల క్రింద వేయు స్లీపర్లుగా వీనిని వాడుచున్నారు. ఆస్ట్రే

లియాలో ఆసియా, ఐరోపాలలోని వృక్షజాలము లేకపోవుటచే ఇక్కడ వలసకు వచ్చిన ఆంగ్లేయులు అనేకమైన చెట్లు, ఫలములు, విత్తనములు తెచ్చి నాటిరి. వారే గోధుమ, బార్లీ, ఓట్లు తెచ్చి వ్యవసాయ మారంభించిరి. ఇప్పుడు ఆస్ట్రేలియా గోధుమ పంటలో ప్రముఖ స్థాన మాక్రమించుచున్నది.

ఎడారి తుల్య ప్రదేశములలో చిన్నచిన్న ముండ్ల మొక్కలుండును. పూర్తిగా ఎడారి ప్రదేశములో అనగా ఇసుక భూమిలో సన్నని గడ్డి మొక్కలు కొద్దిగా కలవు.

వృక్ష జాలములో ఆస్ట్రేలియాకు ప్రత్యేకత ఉన్నట్లే జంతుజాలములో కూడ కలదు. ఇందుకు కూడ ఆస్ట్రేలియాకు



ఆస్ట్రేలియాలోని జంతుజాలము



కంగారూల మందలు వచ్చికబీడులలోని గడ్డిని తినివేయును. వెనుకభాగమునన్న యూక్లిప్టస్ చెట్లను చూడుము.

ఇతర ఖండములతో సంబంధము లేకపోవుటచే కారణము. ఇచ్చటి జంతుకోటి ప్రపంచములోని ఇతర జంతువులనుండి పూర్తిగా వేరుగా నున్నది. ఐరోపీయులు ఇక్కడ వలసకు వచ్చినపుడు ఈ ఖండములో వారికి గుఱ్ఱములు, ఆవులు, గొఱ్ఱెలు, మేకలు కనబడలేదు. మన అడవులలోని మృగములగు సింహములు, పెద్దపులులు, ఏనుగులు, లేళ్లు కూడ కనబడలేదు. పెంపుడు జంతువులు కూడ ఏమియు లేకుండెను. కంగారూ ముఖ్యమైన జంతువు. దీనికి పొట్టక్రింద జేబువంటి దుండును. అందులో తన పిల్లలను దాచుకొనగలదు. అది నాలుగుకాళ్ల మీద పరుగెత్తలేదు. దానికి ముందుకాళ్ళు పొట్టిగాను, వెనుక కాళ్లు చాల పొడవుగాను ఉండును. అందుచే అది ముందుకు దుముకుచు పోవును. ఇట్లు దుముకుటలో దానికి దాని బలమైన తోక సహాయకారి.

ఇట్టి జేబు కలిగిన మరొక చిన్న జంతువు ఓపోసమ్. ఇది చెట్లెక్క గలదు. చాల మృదువైన ఉన్ని దాని కుండును. మరొక విచిత్రమైన జంతువు డక్‌బిల్. దీనికి ఇతర జంతువులవలె నోరుండక బాతువలె ముక్కుండును. రెక్కలుండవు. తోక కలదు. కాని కాళ్లు కప్పకాళ్ళవలె నుండును. దీని శరీరము మృదువైన రోమములతో కప్పబడియుండును. ఇది నదులపక్క కలుగులలో నివసించును. గ్రుడ్లు పెట్టును. కాని పిల్లలకు పాలిచ్చి పెంచును. డింగో అనునది అడవి కుక్క. అది నక్కకును తోడేలుకును మధ్యరకముగా నుండును. ప్రపంచములో

మరెచ్చటను లేదు. ఎము అనునది ఆరడుగుల ఎత్తుగల పక్షి. దీనికి రెక్క లుండవు కాని గుఱ్ఱమంత వేగముగా పరుగెత్త



ఆస్ట్రేలియాలోని కోలా అను ఒక వింతజాతి ఎలుగుగొడ్డు.

గలదు. నల్లహంసలు సరస్సులలో నుండును. లైర్ అను పక్షి పురి విప్పి అందముగా నిలబడును. కోలా అను వింతజాతి ఎలుగు కూడ కలదు.

మానవునకు సహాయ కారులగు జంతువులు లేకపోవుటచే మొదట వలసకు వచ్చినవారు గుఱ్ఱములు, ఆవులు మొదలైన జంతువులను తెచ్చి ఆస్ట్రేలియాలో ప్రవేశపెట్టిరి.

---

# 5. ప్రజలు

ఆస్ట్రేలియాలో ఐరోపీయులు ప్రవేశించినప్పుడు అక్కడ కొద్దిమంది ఆదిమ నివాసులు కనబడిరి. వారు అనాగరికులు. నీగ్రోలు కాకపోయినను నల్లనివారు. ఆస్ట్రేలియాలోని జంతు వృక్షజాలములవలె వీరుకూడ ఇతర ప్రపంచముతో సంబంధము లేక చాల వెనుకబడి యుండిరి. వారు రాతియుగపు మనుష్యుల కంటె భేదముగా లేకుండిరి. లోహముల నెరుగరు. వారు రాయి, ఎముక, కొయ్యతో చేసిన పనిముట్లను వాడుకొనుచు, వ్యవసాయము చేయక, పచ్చిమాంసము, దుంపలు, పండ్లు, తిను చుండిరి. క్రమముగా వీరిసంఖ్య తగ్గినది. ఇప్పుడు వీరిలో కొందరు స్థిరనివాసులై పట్టణముల సమీపమున నివసించు చున్నారు. వీరు గుఱ్ఱపుస్వారిలో నిపుణులు. మరికొందరు సంచార జీవనులుగానే ఉన్నారు.

ఐరోపీయులు ఎక్కువగావచ్చి సారవంతమైన తూర్పు తీరమున స్థిరపడిన కొలది ఆదిమ నివాసులు వెనుకకు తొలగి పోయిరి. ఎడారి ప్రాంతములో నివసించుట కష్టమగుటచే క్రమముగా నశింపసాగిరి. అప్పుడు ఐరోపీయులు ఈ విషయము గ్రహించి వారికి కొన్ని ప్రత్యేక స్థానముల నేర్పాటుచేసి అందు ప్రవేశపెట్టిరి. వారికి వ్యవసాయాదులుకూడ నేర్పిరి. క్రమముగా వారు విజ్ఞానవంతులగుచున్నారు. వారిసంఖ్య కూడ నశించుట లేదు.

టాస్మేనియాలో కూడ ప్రత్యేక ప్రజ లుండిరి. వారు నీగ్రోజాతి లక్షణములు కలిగి పొట్టిగాను, నల్లగానుఉండి ఉన్ని



ఆస్ట్రేలియాలోని ఆదిమవాసులు గుఱ్ఱపుస్వారీలో మంచి నిపుణులు

వంటి జుట్టునుకలిగి యుండిరి. వారుకూడ రాతియుగమువారి వలె నుండిరి. ఆ జాతివారు పూర్తిగా నశించిపోయిరి.

కెప్టెన్ కుక్ బోటనీబేను కనుగొనిన తర్వాతనే ఈ ప్రదేశము వాసయోగ్యమని కనుగొనబడి ఆంగ్లేయ ఖైదీలకు స్థానమైనది. క్రమముగా వారిసంఖ్య ఎక్కువగుటయేగాక వారు

స్థిరనివాసులై వ్యవసాయమును, పశుపోషణమును ఆరంభించి ఖండమును వృద్ధిపరచిరి.

1851 లో బంగారు విశేషముగా భూమికి పైననే కనుగొనబడగా లక్షలకొలది ఐరోపీయులు జీవనోపాధి కొఱకు ఆస్ట్రేలియాకు వచ్చిరి. ఈ బంగారము అయిపోయిన తర్వాత వీరిలో చాలమంది వ్యవసాయములో స్థిరపడిపోయిరి. తర్వాత చైనా, జపాను ప్రజలుకూడ వచ్చి ఖండపు ఉత్తర తీరమున నివాస మేర్పరచుకొనిరి. కాని క్రమముగా అచ్చటి శ్వేతజాతి వారు అభ్యంతరము చేయగా వారి వలస ఆగిపోయెను. ఇప్పుడు ప్రభుత్వముయొక్క అనుమతిలేనిదే ఎవరును స్థిరనివాస మేర్ప రచుకొనరాదు.

ఆస్ట్రేలియాలో నేటికిని జనసాంద్రత బహు తక్కువ. ఇతర ఖండములతో ఎటువంటి సంబంధములేని ఏకాకి ద్వీపము. తర్వాత అచ్చట చాల భాగము ఎడారి, ప్రభుత్వమువారు ఇతర దేశీయులను రానీయలేదు. అందుచే ఆఖండములో జనసంఖ్య ఇప్పుడు 80 లక్షలుమాత్ర మున్నది. ఖండపు వైశాల్యము 30 లక్షల చదరపు మైళ్లు. సరాసరి జనసాంద్రత 100 చదరపు మైళ్ళకు 275 మంది. అనగా 1 చదరపు మైలుకు ముగ్గురు కూడ లేరు. కొన్ని రాష్ట్రములలో మాత్రము జనసాంద్రత చాల హెచ్చుగాను, కొన్నిటిలో చాల తక్కువగాను ఉన్నది. ఈ క్రింది పట్టీని పరిశీలింపుడు.

ఆస్ట్రేలియా - 1905 లో వైశాల్యము, జనసంఖ్య.

| రాష్ట్రము పేరు | వైశాల్యం చ. మై. | జనసంఖ్య | 100 చ. మైళ్లకు జనసాంద్రత |
|---|---|---|---|
| న్యూసౌత్ వేల్సు | 309,433 | 3,225,242 | 1,042 |
| విక్టోరియా | 87,884 | 2,202,869 | 2,507 |
| క్వీన్సులాండు | 670,500 | 1,183,792 | 177 |
| దక్షిణ ఆస్ట్రేలియా | 380,070 | 700,257 | 184 |
| పశ్చిమ ఆస్ట్రేలియా | 975,920 | 557,918 | 57 |
| ఉత్తర ఆస్ట్రేలియా | 523,620 | 15,303 | 3 |
| టాస్మేనియా | 26,215 | 279,386 | 1,066 |
| కాన్బెరా | 939 | 20,774 | 2,212 |
| మొత్తము | 2,974,581 | 8,185,539 | 275 |

## 6. వృత్తులు

ఆస్ట్రేలియాలో జనసంఖ్య వర్తక వ్యాపారములు, గనులు, రేవులు, వ్యవసాయము, రవాణా సదుపాయములు, శీతోష్ణస్థితి చక్కగా అమరినచోట్ల ఎక్కువగాను ఇతరచోట్ల తక్కువగాను ఉన్నది.

ఇచ్చటి ప్రజలు జీవనోపాధికొఱకు వేర్వేరు వృత్తుల నవలంబించుచున్నారు. మొదటినుండియు, వ్యవసాయము, పశుపోషణ జరుగుచున్నవి. 1788 లో 7 గుఱ్ఱములు, 7 ఆవులు, 29 గొఱ్ఱెలు తేబడి ఇప్పుడు అసంఖ్యాకముగా పెరిగిపోయినవి.

గొఱ్ఱెలు : ఆస్ట్రేలియా ఐశ్వర్యమునకు గొఱ్ఱెలు ముఖ్య సాధనములు. మెరీనో జాతి మేలురకపు గొఱ్ఱెలను తెచ్చి ఇచ్చట వృద్ధిచేసిరి. ఒక ఆస్ట్రేలియా గొఱ్ఱె ఇండియా గొఱ్ఱెకు ఐదు రెట్లు



ఆస్ట్రేలియాలోని మెరీనోజాతి గొఱ్ఱె విశేషము మేలైన ఉన్ని నిచ్చును.

ఉన్ని నిచ్చును. ఒక్కొక్కరైతునకు పెద్దపెద్ద పొలములుండును. కనుక ఒకచోటినుండి మరొకచోటికి గొఱ్ఱెలను, గుఱ్ఱముల

నుపయోగించి కాయుచుందురు. ఆస్ట్రేలియా గొఱ్ఱెల ఉన్ని జగత్ప్రసిద్ధమయినది. గొఱ్ఱెమాంసముకూడ విశేషముగా ఎగుమతి అగుచున్నది. ఈ క్రింది పట్టిక పశుపోషణగూర్చి తెలుపును.



ఆస్ట్రేలియాలోని గొఱ్ఱెలు




ఆస్ట్రేలియా పశువులు - 1951-52

| | |
|---|---|
| గొఱ్ఱెలు | 117,647,000 |
| ఆవులు | 14,893,000 |
| పందులు | 1,022,000 |

పశువులు: ఆస్ట్రేలియాలో పశుపోషణ తూర్పు తీరమునందే బాగుగా జరుగును. పశువులపాలు ప్రతిదినము పితుకవలెను కాబట్టి కొద్ది స్థలములోనే వాటిని తిరుగ నిచ్చెదరు. అట్టి చోట గడ్డి సమృద్ధిగా నుండవలెను. ఈ లక్షణములు తూర్పు తీరమున పూర్తిగా కలవు.



ఆస్ట్రేలియా - పాడిపశువులు. వెనుకభాగమున యూకలిప్టస్ చెట్లను గమనింపుము.




వ్యవసాయము : చాలమంది వ్యవసాయములోకూడ తమ జీవితమును గడుపుకొనుచున్నారు. క్వీన్స్‌లాండ్, న్యూసౌత్ వేల్సు, విక్టోరియాలలోను, దక్షిణ ఆస్ట్రేలియా దక్షిణభాగములోను నైఋతి ఆస్ట్రేలియాలోను గోధుమ పంట అధికము. ఈ వ్యవసాయమునకు యంత్రములను ఎక్కువగా వాడుచున్నారు. ఇదిగాక బార్లీ, ఓట్లు, మొక్కజొన్న, చెఱకు కూడ ముఖ్య పంటలు. వ్యవసాయము తూర్పుతీరముననేగాక ముర్రేడార్లింగు మైదానములోకూడ ఎక్కువగా జరుగుచున్నది. ఇచ్చటి గోధుమలు ఇంగ్లాండునకు ముఖ్యముగా ఎగుమతి అగును. కొన్ని సంవత్సరములనుండి మనదేశముకూడ ఇచ్చటి గోధుమలను కొను



న్యూసౌత్‌వేల్సులో ఒక రైతుభార్య - 2000 యకరముల వైశాల్యముగల పొలములోగల వంటశాలలో పనిచేయుట గమనింపుము.



ఆస్ట్రేలియాలో యంత్రముల సహాయమున వ్యవసాయము చేయుదురు.

చున్నది. మొట్టమొదటిసారి 1897లో గోధుమలు ఈఖండము నుండి ఎగుమతి అయ్యెను. అడిలైడ్ గోధుమ ఎగుమతికేంద్రము.




పండ్లతోటలు : న్యూసౌత్‌వేల్సులోని రెవరినామండలము లోను, గ్రేట్ డివైడింగ్ పంక్తియొక్క పడమటివాళ్ళ మీదను, దక్షిణ ఆస్ట్రేలియా విక్టోరియా రాష్ట్రములలోను, నైరృతి ఆస్ట్రేలియాలోను పండ్లపరిశ్రమ ముఖ్యము. ఇచ్చట పండ్లను డబ్బాలలో నిలువచేయుదురు. ద్రాక్షతోటలు కలవు. ద్రాక్ష సారాయముకూడ తయారు చేయబడుచున్నది. నారింజ నిమ్మ ఫలములు సమృద్ధిగా ఉత్పత్తిచేయబడుచున్నవి. టాస్మేనియాలో శీతల మెక్కువ కనుక ఇంగ్లాండు ఫలములగు ఆపిల్స్, పియర్స

ప్లమ్స్ వగైరాలు పండింపబడుచున్నవి. ఈ పండ్లను చల్లని గదులలో పెట్టి చెడకుండ కాపాడి ఎగుమతి చేయుదురు.

గనులు : పై వృత్తులలోనేకాక చాలమంది గనులలో పనిచేయుదురు. బంగారపు గనులు ప్రజలను ఎక్కువగా ఆకర్షించినవి. మనదేశములో కోలారు గనులలో బంగారము కఠినమైన రాతిలో కొన్ని వందల అడుగులలోతున భూగర్భములో లభించును. దానిని తీయుట బహుప్రయాసతో కూడినది. కాని ఆస్ట్రేలియా బంగారుగను లట్టివికావు. అక్కడ మొదట బంగారము భూమిపైననే మెరయుచు కనబడెను. నదుల ఇసుకలో నుండెను. పెద్దపెద్ద గడ్డలుగాకూడ లభించుచుండెను. నదిలోని మట్టిని కడిగి చాల బంగారమును సంపాదించుటకు వీలుండెడిది. అందుచే బంగారును త్వరగా సంపాదించుట కవకాశ ముండెడిది. బంగారును ఎక్కువగా సంపాదించి అచిరకాలములోనే అచటివారు భాగ్యవంతు లగుచుండెడివారు. అనేకమందిఅనేక దేశముల నుండి వచ్చి చాల బంగారమును సంపాదించుకొనిరి. జనసంఖ్య త్వరితముగా వృద్ధిపొందెను. భూమ్యుపరిభాగమందలి బంగారమంతయు అయిన తర్వాత భూమిలోపల త్రవ్వుట మొదలు పెట్టిరి. విక్టోరియా రాష్ట్రములోని బెండింగో, బల్లారెట్, బీచ్వర్తు లలో బంగారు గనులు కలవు. ఆస్ట్రేలియాలోని ముఖ్యమగు బంగారు గనులు ఎడారితుల్యమగు పశ్చిమ ఆస్ట్రేలియాలోని కాల్గూర్లీ, కూల్గార్డీ లలో కలవు. ఇచ్చటికి నీటిని చాలదూరము నుండి తేవలసియుండును. క్వీన్సులాండులో రాక్హాంప్టన్ గని

కలదు. 1951 లో 9 లక్షల ఔన్సుల బంగారము ఉత్పత్తి చేయబడినది.

ఆస్ట్రేలియాలో ఇతర ఖనిజ సంపదకూడ అధికముగా కలదు. న్యూసౌత్ వేల్సులోని బ్రోకెన్‌హిల్‌లోని గనులలో వెండి, సీసము, తగరము, జింకు అధికముగా త్రవ్వబడుచున్నవి. మౌంట్ మోర్గన్ వద్ద గొప్ప రాగి గను లున్నవి.

బొగ్గు మరొక ముఖ్య ఖనిజము. ఇది న్యూ సౌత్‌వేల్సు, క్వీన్స్‌లాండు, టాస్మేనియా, నైరృతి ఆస్ట్రేలియా, ఆగ్నేయ



ఆస్ట్రేలియాలో వాయవ్యభాగమున ఎక్స్‌మౌత్ సింధుశాఖ ప్రాంతమునందలి మట్టినూనె బావులు

ఆస్ట్రేలియాలలో లభించుచున్నది. 1951 లో 1 కోటి 80 లక్షల టన్నుల బొగ్గు త్రవ్వబడినది. దక్షిణ ఆస్ట్రేలియాలో ఇనుప గనులుకూడ కలవు. వజ్రములు, నీలములు కూడ కొద్దిగా లభించుచున్నవి.

ఆస్ట్రేలియా ప్రజలలో 10 లక్షలమంది 1950 లో గనులు త్రవ్వు పనిలో నుండిరి. ఆస్ట్రేలియా వాయవ్య భాగమున నూనె బావులుకూడ కనుగొనబడినవి. ఖండపు ఉత్తరమున ముత్యపు చిప్పలను పట్టుదురు.

ఆస్ట్రేలియా జనసంఖ్యలో దాదాపు సగముమంది సిడ్నీ, మెల్‌బోర్న్, అడిలేడ్, పెర్త్, బ్రిస్బేన్ నగరములలోనే నివసించుచుండుట గమనింపదగినది.

---

## 7. రవాణా సదుపాయములు

ఆస్ట్రేలియాలో గొప్ప నదులు లేకపోవుటచే ఖండ మధ్యమునకు పోవుటకు వీలులేకున్నది. సముద్ర తీరమైనను ఐరోపాలోవలె లోనికి చొచ్చుకొని పోలేదు. తూర్పునను, ఉత్తరమునను కల జీవనదులలో కొద్ది దూరము ప్రయాణము చేయవచ్చును. ముర్రే డార్లింగులలో మాత్రము స్టీమర్లు సంవత్సరములో కొన్ని నెలలు తిరుగ గలవు. కాని ఈ నదీ ముఖ ద్వారము అనుకూలమైనది కాదు. సరస్సులు ప్రయాణ యోగ్యములు కావు. ఎడారిలో రోడ్లు లేవు. అక్కడ ఒంటెల



న్యూ సౌత్‌వేల్సుకు ప్రధాననగరమైన సిడ్నీ నగరముయొక్కయు హార్బరుయొక్కయు దృశ్యము.

మీదనే పోవలయును. అందుచే ఈ విశాల ఖండములోని వివిధ భాగములను కలుపుటకు రైలు మార్గములు ముఖ్యమయ్యెను. జన సాంద్రత అధికముగా గల తీరమైదానములలో ముఖ్య పట్టణములును, రేవు పట్టణములును అగు సిడ్నీ, మెల్బోర్న్, అడిలైడ్, బ్రిస్బేన్, పెర్త్‌లను కలుపుచు రైలు మార్గములు వేయబడినవి. ఈ పట్టణములను ఖండ మధ్యమునగల వ్యవసాయ, పశుపోషక, ఖనిజ, పారిశ్రామిక నగరములతో రైళ్ళు కలుపుచున్నవి. కాని దాదాపు నిర్జనమగు ఉత్తర పశ్చిమ తీరములందు రైలు మార్గములు లేవు. ఇటీవలనే పెర్త్‌ను అడిలైడ్‌ను కలపు రైలు మార్గము కాల్గూర్లీ, కూల్గార్డీల ద్వారా వేయబడినది. ఈ ఖనిజ నగరములు దాటిన తర్వాత రైలు మార్గము వెయ్యి మైళ్ల వరకు నిర్మానుష్యము, నిర్జలమగు ప్రదేశముల గుండా పోవును. ఈ మార్గము ద్వారా ప్రయాణముచేసి పసిఫిక్ తీరమున గల సిడ్నీ నుండి హిందూమహా సముద్రతీరమున గల పెర్త్ చేరవచ్చును. ఉత్తరమునకూడ క్రొత్త రైలుమార్గములు ప్రారంభించబడినవి. దక్షిణ ఆస్ట్రేలియాలోని అగస్టారేవు నుండి ఉత్తర ఆస్ట్రేలియాలోని డార్విన్ రేవు వరకు మార్గము కొంత పూర్తి అయినది.

ఆస్ట్రేలియా ద్వీప మగుటచేతను, రైలు మార్గములు తగినంతగా లేకపోవుటచేతను స్వదేశ వర్తకమునకును, విదేశ వర్తకమునకును గూడ రేవులు వృద్ధి కావలసి వచ్చెను. రేవుల వద్ద గొప్ప పట్టణములు కూడ వెలసెను.

సిడ్నీ పట్టణము ఆస్ట్రేలియాలోని గొప్ప రేవగు పోర్టు జాక్సన్ వద్ద వెలసినది. సహజ నౌకాశ్రయము. దీనికి వెనుక బ్లూమౌంటెను పర్వతములు గలవు. అచ్చటి వ్యవసాయోత్పత్తులకు ముఖ్యరేవు. ఈ రేవుద్వారా బంగారము, ఉన్ని, బొగ్గు, మాంసము, చర్మములు, వెన్న, గోధుమ, వెండి ముఖ్య ఎగుమతులు. సిడ్నీ, పసిఫిక్ తీరమున నుండుటచే చైనా, జపానులతోను, కెనడా, అమెరికా సంయుక్త రాష్ట్రములతోను, దక్షిణ అమెరికాతోను వర్తకముచేయు రేవై యున్నది.

మేల్బోరన్ రెండవ ముఖ్యమైనరేవు. ఇతర రేవులతో ఓడ మార్గముల ద్వారాను, ఇతర ముఖ్య పట్టణములతో రైలుమార్గముల ద్వారాను కలుపబడినది. దీని వెనుకనున్న భూమిలోని కలప, పాడిపరిశ్రమ సంబంధమైన వస్తువులు, ఉన్ని, మాంసము, పండ్లు, వ్యవసాయ వస్తువులు ఈ రేవు ద్వారా ఎగుమతి అగుచున్నవి. ఇండియా, ఐరోపా, అమెరికాలతో వర్తకము చేయుచున్నది. గుడ్‌హోప్ అగ్రముద్వారా ఇంగ్లండుకు ఓడలు పోవును. బ్రిస్బేన్ మంచిరేవు కాకపోయినను దాని వెనుక భూమిలోనున్న బొగ్గు, ఇతర పరిశ్రమలకు అనుకూలమైన రేవుగా నున్నది.

దక్షిణ ఆస్ట్రేలియాకు పోర్టు అడిలైడ్, పోర్టు అగస్టా అను రెండు రేవులు కలవు. వీటిద్వారా గోధుమ, ఉన్ని, రాగి ఎగుమతి అగుచున్నవి. స్వాన్ నదీతీరమున, పెర్తు, ఆ నదీ ముఖద్వారమునగల చక్కని రేవగు ఫ్రిమాంటిలు పశ్చిమ ఆస్ట్రేలి

యాకు ముఖ్యమగు రేవులు. వీటిద్వారా బంగారము, ఉన్ని, కలప, ముత్యములు, ముఖ్య ఎగుమతులు. ఫ్రీమాంటిలు ఇండి యాకు దగ్గర రేవు.

ఇప్పటి ప్రపంచ రహాదారులలో విమానమార్గములు కూడ చాల ముఖ్యమైనవి. ఆస్ట్రేలియాతో ఇంగ్లండు, ఫ్రాన్సు, హాలెండు, ఇటీవల మనదేశమును విమానమార్గములను నడుపు చున్నవి. ఈ మార్గములు మలయాలోని సింగపూరు, జావాలోని బటేవియాల మీదుగా ఆస్ట్రేలియా ఉత్తర తీరమునగల డార్విన్ చేరును. అచ్చటినుండి బ్రిస్బేన్, సిడ్నీలకు పోవును. ఆస్ట్రేలియా వంటి విశాల ఖండములో విమాన మార్గముల అవసరము చాల కలదు. అచ్చట రైలు మార్గమునకు ఒక గేజికాక వేర్వేరు గేజులు కలవు. అందుచే బ్రిస్బేనునుండి పెర్తుపోవుటకు ఆరు దినములు పట్టును. దానినిబట్టి విమాన మార్గముల ఆవశ్యకతను ఊహింపవచ్చును.

---

## 8. రాజకీయ విభాగములు

ఆస్ట్రేలియా ఖండభాగము ఆరు రాష్ట్రములుగ విభ జింపబడినది. టాస్మేనియాకూడ ఆస్ట్రేలియాలోని ఒకరాష్ట్రమే. కావున ఖండము మొత్తము ఏడు రాష్ట్రములు. అవి, న్యూ సౌత్ వేల్సు, విక్టోరియా, క్వీన్సులాండు, దక్షిణ ఆస్ట్రేలియా, పశ్చిమ ఆస్ట్రేలియా, ఉత్తర మండలము, టాస్మేనియా. ఈ

రాష్ట్రముల మధ్య సరిహద్దులు రాష్ట్రముల మధ్య జరిగిన ఒడంబడికల ననుసరించి, అక్షాంశ తులాంశములను ఆధారము చేసుకొని నిర్ణయింపబడుటచే సమాన రేఖలుగా నున్నవి.




## ఆస్ట్రేలియా రాజకీయము

ఈ క్రిందిపట్టీని పరిశీలింపుడు.

| రాష్ట్రము | రాజధాని | రాష్ట్రస్వభావాదులు |
|---|---|---|
| న్యూ సౌత్ వేల్సు | సిడ్నీ | ఇరుకైనతీరమైదానము, ఎత్తయిన పర్వత పంక్తులు. అధిక వర్షపాతము, |
| విక్టోరియా | మెల్బోర్న్ | |
| క్వీన్సులాండు | బ్రిస్బేన్ | పర్వతపంక్తి అంత ఎత్తుకాదు. మైదానము వెడల్పు, ఉష్ణమండలారణ్యములు, ఋతుపవన వర్షము. |

| | | |
|---|---|---|
| దక్షిణ ఆస్ట్రేలియా | అడిలైడ్ | మైదానము ఎక్కువ. నీటిఊటలు సరస్సులు, ఎడారి, దక్షిణమున మధ్యధరా శీతోష్ణస్థితి. |
| పశ్చిమ ఆస్ట్రేలియా | పెర్తు | అధికముగా ఎడారి. నైరృతిమూల మధ్యధరా శీతోష్ణస్థితి. |
| ఉత్తర మండలము | డార్విన్ | మాన్సూను, వర్షములు, దక్షిణమున సవానాలు, ఎడారి. |
| టాస్మేనియా | హోబార్టు | ఎత్తుపల్లములు గల పీఠభూమి. సమశీతల మండలారణ్యములుకల కొండలు, లోయలు. |

ఆస్ట్రేలియా యూనియన్ కేంద్ర రాజధాని యగు కాన్బెర్రా కేంద్ర భాగముపై నున్నది. ఈ కేంద్ర భూభాగము న్యూ సౌత్‌వేల్సు రాష్ట్రములో నున్నది. దీని వైశాల్యము 939 చదరపు మైళ్ళు.



కాన్‌బెర్రాలోని పార్లమెంటు భవనము

## (A) న్యూ సౌత్ వేల్సు

ఆస్ట్రేలియాలో ఇదియే మొదటి రాష్ట్రము. ఇచ్చటనే ఖైదీలు మొట్టమొదట ప్రవేశపెట్టబడిరి. గ్రేట్ డివైడింగ్ పర్వత పంక్తి తీరమునకు సమాంతరముగా నుండి బ్లూమౌన్ టెన్స్ (Blue



సిడ్నీ నగరము



ఆస్ట్రేలియాలో న్యూకాసిల్ ఇనుపకార్ఖానాలో టెలిగ్రాం తీగలుచేయు ఒక దృశ్యము

(Mountains) అని పిలువబడుచున్నవి. తీరమైదానము చాల సారవంతమైనది. అనేక చిన్ననదులు కలవు. పర్వతపంక్తికి పడమట అంత ఎక్కువ వర్షముండదు కావున సవానాలు కలవు. ఈ ప్రాంతములో డార్లింగునది దాని ఉపనదులు కలవు. ఈ జలాధారములవల్ల ఇచ్చట గోధుమపంట ఎక్కువ. గొఱ్ఱెలకు మంచి మేత లభించును. ఇక్కడ శీతోష్ణస్థితి శీతకాలములో చల్లగాను వేసవిలో వేడిగాను ఉండును. తీరమున వర్షమెక్కువ. వ్యవసాయము బాగుగా జరుగుచున్నది. నారింజలు పండింపబడుచున్నవి. సముద్రమువైపునున్న కొండవాళ్లమీద గడ్డి సమృద్ధిగా నుండుటచే గొఱ్ఱెలపోషణ జరుగుచున్నది. ఇచ్చట యూకలిప్టసు చెట్లెక్కువ. పర్వతముల పడమటి వాళ్ళమీద గొఱ్ఱెలెక్కువ. ఆస్ట్రేలియాలోని గొఱ్ఱెలలో సగము ఈ రాష్ట్రములోనే కలవు. ఈ రాష్ట్రములోని పర్వతములలో బొగ్గు త్రవ్వుచున్నారు. దానికి న్యూకాసిల్ కేంద్రము. ఇచ్చట ఉక్కు పరిశ్రమ కలదు.

సిడ్నీ ఈ రాష్ట్రమునకు రాజధాని. ఆస్ట్రేలియాలో ప్రప్రథమముగా నిర్మింపబడిన పట్టణము. దీనిని గురించి ఇదివరకే చదివియున్నారు.

## (C) విక్టోరియా

ఈ రాష్ట్రము ఆస్ట్రేలియాలో ముర్రేనదికి దక్షిణమున గల ఆగ్నేయభాగమును ఆక్రమించియున్నది. గ్రేట్ డివైడింగ్

రేంజిలోని ఆస్ట్రేలియన్ ఆల్ప్సు ఈ రాష్ట్రములో తూర్పు పడమరలుగా వ్యాపించియున్నవి. వీటిలో కొన్నిటి శిఖరములు ఎల్లప్పుడును మంచులో కప్పబడి యుండును. తీరమైదానము చాల ఇరుకైనది. ఆగ్నేయ వ్యాపార పవనములవల్లను, పశ్చిమ వాయువుల వల్లనుకూడ వర్షములు కురియుటచే వ్యవసాయము



ఆస్ట్రేలియాలోని మెల్బోర్న్ నగరము

నకు పశుపోషణకు, గొఱ్ఱెలపెంపకమునకుకూడ అనుకూలముగా నున్నది. ముర్రేనదీమైదానము ఈ రాష్ట్రములోకూడ కలదు. అచట గోధుమపంట అధికము. పండ్లుగూడ పండింతురు. ద్రాక్ష, నారింజ, నిమ్మ, చక్కగా పెరుగును. ఇచ్చట కొండవాళ్ల మీద గొఱ్ఱెలు చాల ఎక్కువ. ఆస్ట్రేలియన్ ఆల్ప్సులోని గ్రేట్ వాలీలో పశుపోషణకు చాల అనుకూలముగా నున్నది. పర్వతములమీద మంచికలప లభించును.

ఈ రాష్ట్రమునకు రాజధాని మెల్బోర్న్. ఇది ఆస్ట్రేలియాలో అన్నిటికన్న పెద్ద పట్టణము. పోర్టు ఫిలిప్ సింధుశాఖ మీద నున్నది. ఇది కొద్దికాలము క్రితము బురదప్రదేశముగా నుండి ఇప్పుడు గొప్ప ఆధునిక నగరమై సుందరభవనములతోను, విశాలమగు వీధులతోను అలరారుచున్నది. బెండిగో, బల్లారట్‌లు బంగారు త్రవ్వుటకు ముఖ్యకేంద్రములు. విక్టోరియారాష్ట్రము నుండి బంగారము, ఉన్ని, జీవజంతువులు, గోధుమ, వెన్న, చర్మములు, మాంసము ముఖ్య ఎగుమతులు.

## (C) క్వీన్స్ లాండు

ఈ రాష్ట్రములో కొన్నిచోట్ల తీరమైదానము లేనే లేదని చెప్పవచ్చును. యార్క్ అగ్ర ద్వీపకల్పము ఉష్ణమండల శీతోష్ణస్థితిని కలిగియుండుటచే వర్షపాతము 80 అంగుళము లకు మించియుండును. అందుచే ఇచ్చట కొబ్బరి, అరటి, చెఱకు, వరి, పొగాకు పండించబడు చున్నవి. అనాసతోటలు ఎక్కువగా

పెంచబడుచున్నవి. ఈ ప్రాంతమునకు కైరన్స్ రేవు. ఈ రేవు ద్వారా తగరము, రాగి కూడ ఎగుమతి అగును.



అనాస తోట

ఉత్తరమునుండి దక్షిణమునకును, సముద్రతీరమునుండి లోనికి పోయినచో వర్షము తగ్గును. కావున పర్వతపంక్తికి పడమట గోధుమ పండించుచున్నారు. పర్వత వాళ్లమీద గొఱ్ఱెల పోషణ జరుగుచున్నది.

ఈ రాష్ట్రములోని నదులన్నియు చిన్నవి. జనసంఖ్య తక్కువగుటచే అంత ఉపయోగకరముగలేవు. నదులు సముద్రములో కలియుచోట అన్నినదులకును ఇసుక దిబ్బలు అడ్డుం

టచే నౌకాయానమున కనుకూలముగలేవు. ఈ రాష్ట్రమునకు రాజధాని అగు బ్రిస్బేను ఆ పేరుకల నదీతీరమున సముద్రమునకు 20 మైళ్ళ దూరముననున్నది. ఓడలు ఈ పట్టణము చేరుటకు నదిలోని ఇసుకను తరచుగా త్రవ్వివేయుచుండవలయును. ఇచ్చటనుండి, గోధుమ, ఉన్ని, గొఱ్ఱెమాంసము, ఆవుమాంసము, వెన్న, రాగి, తగరము, బొగ్గు, చర్మములు, క్రొవ్వు వగైరాలు ముఖ్య ఎగుమతులు.

## (D) దక్షిణ ఆస్ట్రేలియా

ఈ రాష్ట్రములో పశ్చిమమునను ఉత్తరమునను ఎడారి ప్రదేశముకలదు. తూర్పునను ఈశాన్యమునను ఐర్ సరస్సు మైదానము కలదు. ఆగ్నేయమూల దక్షిణ ఆస్ట్రేలియా మిట్ట భూములు, మధ్యధరామండలము కలవు.

ఎడారి ప్రదేశములో మిక్కిలి పొడిగా నుండును. ఐర్ సరస్సు ప్రదేశము వర్షకాలమున మాత్రము నీటిని కలిగియుండి తర్వాత బురద బయలుపడును. కాని ఇచ్చట సమృద్ధిగా అంతర్వాహిను లుండుటచే ఆర్టీషియను బావులు త్రవ్వవచ్చును. ఈ రాష్ట్రములోకూడ ముర్రేనది కొంతదూరము ప్రవహించి సముద్రములో కలియుచున్నది.

దక్షిణ ఆస్ట్రేలియా మిట్టలు ఉత్తరమునుండి దక్షిణముగా వ్యాపించియున్నవి. ఇది మిక్కిలి సారవంతమైన ప్రదేశము. ఇచ్చట మధ్యధరా శీతోష్ణస్థితి కలదు. కాబట్టి శీతకాల

ములో పశ్చిమ వాయువులవల్ల తగినంత వాన కురియును. కాన గోధుమ పైరు చేయబడును. ఓట్లు, ద్రాక్ష, నారింజ, నిమ్మ మున్నగునవి అధికముగా ఉత్పత్తిచేయబడుచున్నవి. మిట్టల మీద గొఱ్ఱెలు, పశువులుకూడ బాగుగా పోషింపబడుచున్నవి. ఇచ్చట మిట్టలమీద రాగి త్రవ్వబడుచున్నది.

ఈ రాష్ట్రమునకు రాజధాని అడిలైడ్. ఇదికూడ పెద్ద పట్టణమే. ఇక్కడనుండి అన్ని దిక్కులకును రైలుమార్గములు, ఓడమార్గములు కలవు. ఇక్కడనుండి డార్విన్ రేవునకు పోవు టెలిగ్రాఫ్ మార్గముకలదు. అడిలైడ్‌కు కొంచెము దూరములో పోర్టు అడిలైడ్ అను మంచిరేవు కలదు. ఇచ్చట హిందూమహా సముద్రమునుండి, పసిఫిక్ మహాసముద్రమునుండి వచ్చు ఓడలు ఆగుచుండును. మెల్బోరన్ వచ్చిపోవు ఓడలు ఇచ్చటకూడ మకాము చేయుచుండును.

ఈ రాష్ట్రమునుండి ఉన్ని, గోధుమ, రాగి, పండ్లు, మాంసాదులు ముఖ్య ఎగుమతులు.

## (E) పశ్చిమ ఆస్ట్రేలియా

ఈ రాష్ట్రము ఆస్ట్రేలియా ఖండములో దాదాపు మూడవభాగమును ఆక్రమించియున్నది. దీనిలో అధికభాగము ఎడారి. కొంచెము తీరమైదానము, పీఠభూములు కలవు. ఇక్కడ ఉష్ణము ఎక్కువగా నుండునుకాని దక్షిణమునకు పోయిన కొలది తగ్గుచుండును. వేసవిలో (నవంబరు నుండి ఏప్రిలు వరకు)

ఉత్తరప్రాంతమున ఋతుపవన వర్షములు కురియును. శీతకాలమున (మే నుండి అక్టోబరువరకు) పశ్చిమ పవనముల ప్రభావము వల్ల నైరృతిమూల వర్షములు కురియును. మధ్యప్రదేశములో మాత్రము వర్షము బహుతక్కువ. అందుచే అచ్చట గడ్డికూడ ఎక్కువగా నుండదు. చిన్నచిన్న మొక్క లుండును. నైరృతి మూల మాత్రము మంచి అరణ్యములు కలవు. వీనిలో కర్రీ, జర్రా అను వృక్షముల కలప బహు విలువైనదని ఇదివరకే చెప్ప బడినది. ద్రాక్ష, నారింజ, నిమ్మ మొదలగు ఫలవృక్షములును, గోధుమ మొదలగు తృణధాన్యములును చక్కగా పైరగును. ఇచ్చట మిట్టలమీద గొఱ్ఱెలు, పశువులుకూడ పెంచబడుచున్నవి. సముద్ర తీరమున ముత్యములు పట్టుచున్నారు.

పశ్చిమ ఆస్ట్రేలియాలో అన్నిటికంటె ముఖ్యమైనవి బంగారు గనులు. కాల్గూర్లీ. కూల్గార్డీలలో ప్రముఖమైన గను లున్నవి. ఈ పట్టణములు పడమట పెర్త్‌తోను, తూర్పున అడిలైడ్ ద్వారా మెల్బోర్న్, సిడ్నీ, బ్రిస్బేనులతోను కలుపబడినవి. అక్కడ నీరు చాలకపోవుటచే సముద్రప్రాంతములనుండి గొట్టములద్వారా తెప్పించుకొనుచున్నారు. ఇవికాక ఇంకా కొన్ని చిన్నగనులు కలవు.

ఈ రాష్ట్రమునకు ముఖ్యపట్టణము పెర్త్. ఇది స్వాన్ నదీతీరమున నున్నది. ఈ నదీ ముఖద్వారమున ఫ్రీమాంటిల్ అను చక్కని రేవు కలదు. ఇది పశ్చిమ ఆస్ట్రేలియాకు ప్రధానమైన రేవు. ఈ రేవునుండి గుడ్‌హోప్ అగ్రముద్వారా ఇంగ్లండు

కును, అమెరికాకును, హిందూమహాసముద్రముద్వారా ఇండియా ఆఫ్రికా తూర్పుతీరముతోను వర్తకవ్యాపారములు సాగించుటకు వీలుగా నున్నది. ఈ పట్టణము ఇతర రాష్ట్ర రాజధానులకంటె చిన్నది. కాని అభివృద్ధిచెందు అవకాశములు చాల కలవు.

రాష్ట్రపు దక్షిణ తీరమున ఆల్బనీ అను మరొక మంచి రేవు కలదు. ఇచట యుద్ధనౌకలు నిలుచును. (తూర్పుతీరమున సిడ్నీలో) రైలుమార్గముద్వారా పెర్తుతో కలుప బడినది.

పశ్చిమ ఆస్ట్రేలియానుండి ముఖ్య ఎగుమతులు బంగారము, ఉన్ని, కలప, ముత్యములు, ఫలములు, మాంసము.

## (F) ఉత్తర మండలము

ఈ రాష్ట్రములో మధ్య ఎడారి భాగము, పీఠభూములు ఉత్తరమున ఆరన్హీమ్ ద్వీపకల్పము చేరియున్నవి. ఈ విశాల ప్రదేశము ఇండియా వైశాల్యములో దాదాపు మూడవ వంతుండును. ఉత్తరమున ఆరన్హీమ్ ద్వీపకల్పములో వేసవి కాలమున వేడి, తేమ ఎక్కువ కావున (నవంబరునుండి ఏప్రిల్ వరకు) ఋతుపవన వర్షములు అధికముగా కురియును. అనేక మంచినదు లేర్పడినను అంత ఉపయోగకరములుకావు. దక్షిణమునకు పోను వాన తగ్గుచున్నది. సముద్రతీరమున దట్టమైన అరణ్యములు కలవు. తీరప్రాంతమున కొన్నిచోట్ల క్షార జలారణ్యములు కూడ కలవు. తీరమునకు వెనుకభాగములో

సవానా గడ్డిబీడులు కలవు. ఇచ్చట పశుపోషణ జరుగుచున్నది. కొన్ని ప్రాంతములలో బంగారు గనులుకూడ కలవు. దీనికి దక్షిణమున ఎడారిభూమి కలదు. ఇందులో చాలవరకు ఇసుక కూడ నుండును. ఇచ్చట జనసంఖ్య చాల తక్కువ.

ఈ రాష్ట్రమునకు ముఖ్య పట్టణము పామర్‌స్టన్. ఇది డార్విన్ రేవుమీద నున్నది. డార్విన్ రేవు చక్కనిది. అడిలైడ్ నుండి బయలుదేరిన టెలిగ్రాఫ్ తీగలు ఇక్కడ అంతమగును. ఇండియా, ఐరోపాలనుండి వచ్చు విమానమార్గములు ఆస్ట్రేలియాలో ఇచ్చట మొదట ఆగును. ఇచటనుండి బంగారము, పశువులు ముఖ్య ఎగుమతులు.

## (G) టాస్మేనియా

1642 లో టాస్మన్ అను డచ్చివానిచే ఈ ద్వీపము కనుగొనబడుటచే దీనికి ఆ పేరువచ్చినది. ఈ ద్వీపము ఖండములో ఒక భాగమని అతడు తలంచి ఇంకనూ తూర్పుగాపోయి న్యూజిలాండును కనుగొని దానికి ఆపేరు పెట్టెను. మన దేశమునకు దక్షిణమున సింహళ మున్నట్లు ఆస్ట్రేలియాకు ఈ ద్వీపమున్నది. ఓడలో ఒకదినము ప్రయాణము చేయవలసి యుండును. సింహళముకంటె కొంచెము పెద్దదిగాను, ఐర్లండు కంటె కొంచెము చిన్నదిగాను ఉండును. ఇది విక్టోరియా రాష్ట్రమునుండి బాస్ జలసంధిచే వేరు చేయబడుచున్నది.

ఈ ద్వీపములో శీతోష్ణస్థితి ఇంగ్లండులోవలె ఉండుటచే అచ్చట ఆపిల్సు, పియర్సు మొదలైనవి పండును. ద్వీప మధ్యమున ఎత్తయినపీఠభూమికలదు. ఈపీఠభూమిలో కొన్ని పర్వత శిఖరములును, లోయలునుకూడ కలవు. ఇచ్చటకూడ మధ్యధరా శీతోష్ణస్థితి ఉండుటచే పశ్చిమ పవనములవల్ల మంచి వర్షము లభించును. కాబట్టి పడమటి ప్రాంతమున అడవు లెక్కువ. తూర్పుతీరమున అంత ఎక్కువ వర్షములేదు. కావున గడ్డి బాగుగా మొలచును. పశుపోషణ అధికముగా కలదు.

ఈ ద్వీపమునకు హోబర్టు రాజధాని; ముఖ్య రేవు పట్టణము. దక్షిణమున నున్నది. ద్వీపమునకు ఉత్తరమున లౌసెస్టన్ మరొక మంచిరేవు. ఈ రెండును రైలుద్వారా కలుప బడినవి. పడమటి తీరమునకుకూడ రైలు మార్గము వేసిరి.

ఇచ్చటనుండి ఉన్ని, బంగారము, వెండి, తగరము, కలప, పండ్లు ముఖ్య ఎగుమతులు.

## (H) న్యూగినీ

యార్కు అగ్రమునకు ఉత్తరమున విచిత్రాకృతిగల ఈ పెద్ద ద్వీపములో పశ్చిమభాగము వెనుక డచ్చివారిది. వారు తూర్పు ఇండియా దీవులను విడిచి వెళ్ళిపోవుటచే ఈ దీవి పడమటి భాగముపై వారి ఆధిపత్యము సంశయములో పడి నది. ఈ దీవి తూర్పుభాగము మొదటి ప్రపంచయుద్ధమునకు పూర్వము ఇంగ్లీషు వారికిని, జర్మనులకును వశమై యుండెను.

యుద్ధములో జర్మనులు ఓడిపోయిరి. కనుక ఆ ద్వీపముయొక్క తూర్పుభాగమంతయు బ్రిటిషువారు తీసికొని ఆస్ట్రేలియా ఏలుబడికి విడిచిరి. అప్పటినుండి అది ఆస్ట్రేలియాలో భాగముగానే ఉన్నది. కొబ్బరి, అరటి, చెఱకు పండింపబడుచున్నవి. మంచి గంధము, రబ్బరు, ఎండుకొబ్బరి ఎగుమతి చేయబడుచున్నవి. ప్రధానమైన రేవగు పోర్టు మోర్సుబీకిని, సిడ్నీకిని మధ్య ఓడలు తిరుగుచుండును. ఈ ద్వీపము లోపల చాల ఎత్తయిన పర్వతములుకలవు. అవి మంచుతో కప్పబడి యుండును. ఈద్వీపములో జనసంఖ్య చాల తక్కువ. ఋతుపవన వర్షముల వలన అరణ్యము లెక్కువ.



## 9. న్యూజిలాండు

ఈ దేశము మొదట టాస్మను అను డచ్చి దేశస్థుడు కనుగొనినట్లు ఇదివరకే తెలిసికొని యుంటిరి. ఇది రెండు పెద్ద ద్వీపములను, దక్షిణమున చిన్న ద్వీపమును కలిగియున్నది. ఇది కాక ఇంకను చిన్నద్వీపములు తీరమునకు కొంచెము దూరముగా కలవు. ఇది బ్రిటిషు దీవులకంటె కొంచెము చిన్నది. ఉత్తర ద్వీపమునకు ఆక్లండుఅనియు, క్రిందిద్వీపమునకు దక్షిణ ద్వీపమనియు, దానిక్రిందిదానికి స్టూవర్టుద్వీపమనియు పేర్లు. ఈదేశము ఆస్ట్రేలి


ఉత్తరద్వీపము
టౌపో సరస్సు
ఎగ్మోంట్
హాక్ అఖాతము
నేపియర్
వెల్లింగ్టన్
నెల్సన్
దక్షిణ ద్వీపము
కుక్ శిఖరము
క్రైస్టుచర్చి
కాంటర్‌బరి సిం. శాఖ
డ్యూనెడిన్
స్టూవర్ట్ ద్వీపము

న్యూజిలాండు

యాకు తూర్పున దాదాపు 1200 మైళ్ళ దూరములో నున్నది. ఇది 30°నుండి 50°లు దక్షిణ అక్షాంశముల మధ్య నున్నది. ఈ దేశముకూడ కామన్వెల్తు రాజ్యములలో నొకటి.

## నైసర్గిక స్వరూపము - శీతోష్ణస్థితి

ఈ ద్వీపములు ఒకప్పుడు కలిసియుండి అగ్నిపర్వత క్రియ వలన విడిపోయియుండును. దక్షిణ ద్వీపములో పర్వతములు (వీటిని దక్షిణ ఆల్ప్సు అందురు) పడమటి తీరమునకు దగ్గరగా నుండుటచే తూర్పు వైపున మైదాన మెక్కువగా నున్నది. ఉత్తర ద్వీపములో పర్వతములు తూర్పు తీరము వైపునుండుటచే మైదానము పడమటివైపున నున్నది. దక్షిణ ఆల్ప్సు పర్వతములు చాల ఎత్తయినవి. వీనిలో కుక్ శిఖరము 12,000 అడుగుల ఎత్తుండి ఎల్లప్పుడును మంచుతో కప్పబడి యుండును. ఈ శిఖరములలో హిమానీ నదములుకూడ కలవు. ఉత్తరద్వీపము యొక్క మధ్యభాగములో అగ్నిపర్వత సంబంధమైన కొండలును, అక్కడక్కడ అగ్నిపర్వతములును కలవు. వీటిలో రెండు సజీవముగానే ఉన్నవి. ఈ ప్రాంతములో టౌపో సరస్సు కలదు. దానికి ఈశాన్యముగా మరికొన్ని చిన్న సరస్సులు కలవు. కొండల పగుళ్ళలోనుండి నీటి ఆవిరి మేఘములవలె పైకి లేచుచుండును. గాలి అంతయు గంధకపు వాసనతో కూడి యుండును. కొన్నిచోట్ల మరుగుచున్న నీరు కొన్ని వందల అడుగుల ఎత్తునకు వేగముగా అప్పుడప్పుడు లేచి పడు

చుండును. వీటిని గెయిజర్లు (Geyesers) అందురు. ఈ ఉష్ణజల మంతయు గంధక మిశ్రమమై యుండుటచే కొందరు రోగులు ఇందు స్నానము చేయుటకు వచ్చుచుందురు. ఈ వేడినీరు ఇసు



గెయిజరు

కను, ఇతరలోహములను కరగించి రంగుల రంగుల పొరలను ఏర్పరచును. ఈ రంగులు చూచుటకు చాల ఆకర్షణీయముగా నుండును.

ఆస్ట్రేలియా తీరము బొత్తిగా చీలియుండనట్లు చూచి యుంటిమి. కాని ఈ ద్వీపముల తీరము చాల చీలియుండి పడమటివైపున ఫియోర్డులు ఏర్పడియున్నవి.

ఈ దేశము ఆస్ట్రేలియాకన్న చల్లగా నుండును. ఇందుకు కొన్ని ముఖ్య కారణములు కలవు. ఈదేశము ఆస్ట్రేలియాకన్న భూమధ్య రేఖకు దూరముగా సమశీతోష్ణమండలములో నున్నది. ఇవి ద్వీపము లగుటచే ఏ భాగమును సముద్రమునకు దూరమున లేవు. ఇచ్చట సంవత్సరమంతటను పడమటి వాయువులవల్ల వర్షము కురియుచునే యుండును. మన ఇండియాకంటె చల్ల గాను, బ్రిటిషు దీవులకంటె వెచ్చగాను ఉండును. ఆక్లండు ద్వీపకల్పములో మాత్రము మధ్యధరా శీతోష్ణస్థితి కలదు.

## వర్షపాతము - నదులు

ఈ ద్వీపములు పడమటి పవనముల దిశలో చుండుటచే సంవత్సరమంతయు వర్షములు కురియుచునే యుండును. ఉత్తర ద్వీపములో మైదానము పడమట నుండుటచే అచ్చట అధిక వర్షము కురియును. దక్షిణ ద్వీపములో పర్వతములు పడమటను మైదానము తూర్పునను ఉండుటచే పర్వతములకు పడమట వర్షము అధికముగాను, మైదానములో కొంత తక్కువగాను

కురియును. దీనిని మన దేశములోగల పడమటి కనుమలు, వాటి తూర్పునగల దక్కను పీఠభూములతో పోల్చుడు.

అధిక వర్షపాతముండుటచే నదు లధికముగా నుండును కదా. కాని దక్షిణ ద్వీపములో పడమటగా ప్రవహించు నదులు వేగముగా ప్రవహించి ఉపయోగము లేకున్నవి. తూర్పుగా ప్రవహించు నదులుకూడ యానయోగ్యములుకావు. వాటి ముఖద్వారములందు ఇసుకమేటలుండును. ఉత్తర ద్వీపములో టౌపో సరస్సులోనుండి పుట్టిన వైకటోనది కొంత పెద్దది. దీనిలో కొంతదూరము వరకు నౌకాప్రయాణమునకు వీలున్నది. మిగిలి నవి చిన్ననదులు.

## వృక్షజాలము - ఉత్పత్తులు

ఇచ్చట ఎప్పుడును వర్షములుండుటచేతను ఎండవేడిమి ఎక్కువగా లేకపోవుటచేతను దేశమంతయు సర్వదా పచ్చగా కనబడును. దట్టమైన అరణ్యములుకూడ ద్వీపములకు పడమటి భాగమున నుండును. ఈ అరణ్యములలో కౌరి, పైను చెట్లు ముఖ్యమైనవి. ఇవి 200 అడుగుల ఎత్తువరకు పెరుగును. వాటి కలప ఉపయోగకరమైనది. దీనినుండి వచ్చు జిగురుతో వార్నిషు తయారుచేయుదురు. దేశములో మూడవవంతు నేటికిని అరణ్యమయమైయున్నది. అందుచే అంపపుకోత పరిశ్రమ ఎక్కువగా నున్నది. ఎడారులు లేక పచ్చిక సమృద్ధిగా నుండుటచే కొండ వాళ్ళమీద గొఱ్ఱెలను, పశువులను పోషించుచున్నారు.

మైదానములో గోధుమ, బార్లీ, ఓట్లు పండించుచున్నారు. చలి ఎక్కువ కనుక వరి పండదు. ఉన్ని ముఖ్య ఉత్పత్తులలో నొకటి. మాంసము ఎగుమతి చేయబడుచున్నది. ఇంగ్లండునకు వెన్న, జున్ను, అధికముగా ఎగుమతి చేయుచున్నారు. మొట్ట మొదటివారు వలసకు వచ్చినపుడు జీవితమునకు అవసరమైన వృక్షములుకాని, జంతువులుకాని లేకుండెను. ఇంగ్లండునుండి ఆస్ట్రేలియానుండి పెక్కురకములను తెచ్చి వృద్ధిచేసిరి.

ఈ దేశములో బంగారము, బొగ్గు కలదు. నూనెబావులు కూడ బయల్పడినవి. అగ్ని పర్వతముల సమీపమున గంధకము లభించుచున్నది.

## జనసంఖ్య

ఈ దేశములోని జనులందరును ఐరోపానుండి, ముఖ్య ముగా ఇంగ్లండునుండి వచ్చి స్థిరనివాస మేర్పరచుకొనినవారే. జనసంఖ్య చాల తక్కువ. రేవుల వద్దనే ముఖ్యమైన నగరములు వెలసినవి. ఎక్కువమంది అచ్చటనే నివసించుచుందురు.

ఆ దేశములోని ఆదిమనివాసులను మెయోరీ లందురు. వీరు శరీరసౌష్ఠవము కలవారు. నరమాంస భక్షకులు. యుద్ధ ప్రియులు. లోహముల నెరుగకపోయినను రాతితో చక్కని ఆయుధములను తయారుచేసికొను చుండిరి. వారు తమచే ఎన్నుకొనబడిన నాయకులచే పాలింపబడుచుండెడివారు. వారి సంఖ్య చాలవరకు క్షీణించినది. ఇప్పుడు వారు విద్యావంతులును

నాగరికులును అగుచున్నారు. కొందరు న్యూజిలాండు పార్లమెంటులో సభ్యులు. కొందరు ప్లీడర్లు. కొందరు సైన్యములో చేరి బ్రిటిషువారి పక్షమున పోరాడిరి. వారు ఉత్తర ద్వీపములో అగ్నిపర్వత ప్రాంతమున పల్లెలలో నివసింతురు.

## పట్టణములు

ఆక్లండు : ఉత్తర ద్వీపములోని పట్టణము – మంచి రేవు.

వెల్లింగ్టన్ : ఉత్తరద్వీపపు దక్షిణ కొసను కుక్ జలసంధి మీద నున్నది. చక్కని హార్బరు కలదు. దేశమునకు మధ్యగా నున్నది. రాజధాని. ఇచ్చటనే దేశపు పార్లమెంటులు సమావేశమగుచుండును. వెల్లింగ్టన్ ఆక్లండులు రైలుమార్గములతో కలుప బడినవి.

క్రైస్టుచర్చి : దక్షిణ ద్వీపములో తూర్పువైపున నున్నది. ఇది ఉన్ని, మాంసపు వర్తకమునకు కేంద్రము. దీనికి లిటిల్టను రేవు.

ఇన్వర్ కార్గిల్ : దక్షిణద్వీపమునకు దక్షిణమున నున్నది. తీర మైదానముల వెంబడి వేసిన రైలుమార్గములు ఈ రేవులను కలుపుచున్నవి.

---

# ప్రశ్నలు

1. ఆస్ట్రేలియా కనుగొనబడిన విధమును గూర్చి వ్రాయుము.
2. ఆస్ట్రేలియాను మొదట డచ్చివారు చూచినను ఇంగ్లీషు వారికే లభించెను. ఎట్లు ?
3. ఆస్ట్రేలియా పరిశోధనలో కెప్టెన్ కుక్ పాత్రను వివరింపుడు.
4. ఆస్ట్రేలియా ఉనికిని సహజ స్వరూపమును వర్ణింపుడు.
5. గ్రేట్ బారియర్ రీఫ్ అన నేమి ? దాని పాత్ర ఏమి ?
6. ఆస్ట్రేలియా నదులను వర్ణింపుడు.
7. ముర్రే డార్లింగు నదులను వర్ణించి వాటి ప్రాముఖ్యతను తెలుపుడు.
8. ఆస్ట్రేలియాలోని వృక్షజాలమును గూర్చి వ్రాయుడు.
9. ఆస్ట్రేలియాలోని జంతుజాలమును గూర్చి వ్రాయుడు.
10. ఆస్ట్రేలియా ప్రత్యేక ద్వీపము కనుక ఇతర ప్రపంచముతో సంబంధము లేదు. ఈ విషయమును అచటి మనుష్యులు, జంతువులు, వృక్షముల ద్వారా నిరూపింపుడు.
11. ఆస్ట్రేలియాలోని వర్షపాత వితరణను గూర్చి వ్రాయుడు.
12. ఆస్ట్రేలియాలో వివిధ ప్రాంతముల శీతోష్ణస్థితి ఎట్లున్నదో చూపుడు.
13. మధ్య ఆస్ట్రేలియా కంటె తూర్పు తీరము అభివృద్ధి పొందినది. శీతోష్ణ స్థితి దృష్ట్యా ఈ విషయము పరిశీలింపుడు.
14. ఆస్ట్రేలియాలో వర్షము తక్కువైనను జలమునకు కొన్నిచోట్ల కొదువలేదు. ఎట్లు ?
15. ఉత్తర ఆస్ట్రేలియాకును, ఆగ్నేయ ఆస్ట్రేలియాకును గల భేదము లేవి ?

16. ఆస్ట్రేలియా ఎడారిని వర్ణింపుడు.
17. ఆస్ట్రేలియా ఖనిజ సంపదను గూర్చి వ్రాయుడు.
18. ఆస్ట్రేలియాలోని మైదానములను గూర్చి వ్రాయుడు.
19. ఆస్ట్రేలియా ప్రజలను వర్ణించి వారి వృత్తు లేవో తెలుపుడు.
20. ఆస్ట్రేలియాలోని జన సంఖ్యా వితరణను గూర్చి వ్రాయుడు.
21. ఆస్ట్రేలియాలోని పశు సంపదను గూర్చి వ్రాయుడు.
22. ఆస్ట్రేలియాలోని వ్యవసాయమును వివరించి, ఎచ్చట ఏ పంట కలదో చెప్పుడు.
23. ఆస్ట్రేలియా రవాణా సదుపాయములను వర్ణింపుడు.
24. న్యూసౌత్ వేల్సు యొక్క ప్రాముఖ్యతను చూపుడు.
25. ఆస్ట్రేలియాలోని వివిధ సహజ మండలములను గూర్చి వ్రాయుము.
26. ఆస్ట్రేలియాలోని ముఖ్యపట్టణములను పేర్కొని వాటి ప్రాముఖ్యత తెలుపుడు.
27. ఆస్ట్రేలియా వర్తక వ్యాపారములనుగూర్చి వ్రాయుడు.
28. ఆస్ట్రేలియాలోని మధ్యధరామండలములనుగూర్చి వ్రాయుడు.
29. టాస్మేనియానుగూర్చి తెలుపుడు.
30. న్యూజిలాండు యొక్క నైసర్గిక స్వరూపమును వివరింపుడు.
31. న్యూజిలాండు ప్రజల వృత్తులను తెలుపుము.
32. న్యూజిలాండులోని వృక్షజాలమునుగూర్చి వ్రాయుము.

---

# నాల్గవ భాగము

# ఉత్తర అమెరికా

## 1. ఉనికి - నైసర్గిక స్వరూపము

**ఉనికి :** పటమును చూచినచో ఉత్తర అమెరికా దాదాపు త్రిభుజాకారముగానున్న పెద్ద ఖండముగా కనబడును. దీని ఉత్తరపు చివర ఉత్తర ధ్రువమునకు అతిదగ్గరలోనున్నది. దక్షిణపు చివర 10° ఉత్తర అక్షాంశము వరకు వ్యాపించియున్నది. ఆసియా, ఆఫ్రికాల తరువాత వైశాల్యములో నిది మూడవస్థాన మాక్రమించుచున్నది. దీని వైశాల్యము 9 మిలియను చదరపు మైళ్లు. జనసంఖ్య 198 మిలియనులు. వాయువ్యమూల ఆసియానుండి బేరింగు జలసంధి ద్వారా వేరుచేయబడి యున్నది. ఈశాన్యభాగము ఐరోపాకు మిక్కిలి సమీపములో నున్నది. ఈ ఖండమును పసిఫిక్ మహాసముద్రము ఆసియానుండియు, అట్లాంటికు మహాసముద్రము ఐరోపానుండియు వేరుచేయు చున్నవి. ప్రాత ప్రపంచమునకు చెందిన ఆసియా, ఐరోపాలు పూర్వమే వృద్ధి చెందియుండుటచేత వానితో రెండువైపుల రెండు సముద్రముల ద్వారా వ్యాపారము చేసికొనుటకు చాల వీలుగా నున్నది. పెనామా కాలువ త్రవ్వినతర్వాత రెండు సముద్రములను కలుపు దగ్గరదారి ఏర్పడినది. ఈ ఖండముయొక్క తీరరేఖ యూరపు తీరరేఖఅంత ఎక్కువగా చీలి ఉండలేదు.

నైసర్గిక స్వరూపమునుబట్టి ఉత్తర అమెరికాను 1. పడమటి పర్వత ప్రాంతము. 2. తూర్పు పర్వత ప్రాంతము, 3. మధ్య మైదానము అను భాగములుగ చేయవచ్చును.




ఉత్తర అమెరికా నైసర్గిక స్వరూపము

1. పడమటి పర్వత ప్రాంతము : ఈ పర్వతములు ఈ ఖండమునకు పశ్చిమమున ఉత్తర దక్షిణములుగా వ్యాపించి యున్నవి. ఈ పర్వతములను రాకీ పర్వతము లందురు. ఈపర్వతములు ఒక్కవరుసగాకాక కొన్ని వరుసలను కలిగియుండుటచే వరుసలమధ్య ఎత్తయిన పీఠభూములు కలవు. ఈ పర్వతపంక్తి అలాస్కానుండి మెక్సికోలోని టెహ్వాంటెపెక్ భూసంధి వరకు వ్యాపించియున్నవి. ఈ పర్వతపంక్తి ఉత్తరముననను, దక్షిణముననను సన్నగానుండి మధ్య వెడల్పుగా వ్యాపించియున్నట్లు గమనించుడు. అమెరికా సంయుక్త రాష్ట్రములలో ఈ పంక్తి వెడల్పు, 1000 మైళ్లు కూడ నున్నది.

2. తూర్పు పర్వత ప్రాంతము : ఈ పర్వతపంక్తి కెనడాలో లాబ్రడారు ద్వీపకల్పములో ఆరంభించి సెంటు లారెన్సు నదిని దాటిన తరువాత తీరమునకు సమాంతరముగ వ్యాపించి యున్నది. అందుచే ఈ పంక్తిని సెంటులారెన్సునది, హడ్సన్ నది మూడు భాగములుగా చేయుచున్నవి. ఈపర్వతములు రాకీ పర్వతము లంత గొప్పవిగాకాని, ఎత్తుగాకాని లేవు. ఇందలి మూడు భాగములు: లాబ్రడారు- పీఠభూమి, న్యూఇంగ్లండు మిట్టలు, అపలేషియన్ పర్వతములు. చివరి రెండును సంయుక్త రాష్ట్రముల లోనివి.

3. మధ్యమైదానములు : ఈ పల్లపుభూములు ఆర్కిటిక్ సముద్రప్రాంతమునుండి మెక్సికో సింధుశాఖవరకు వ్యాపించి యున్నవి. పటముచూడుడు. కెనడా సంయుక్త రాష్ట్రముల

మధ్యమైదానము ఒక జలవిభాజక క్షేత్రముచే వేరుచేయబడు చున్నది. దాని కుత్తరభాగము హడ్సన్ అఖాతమువైపునకు వాలియుండగా, దక్షిణభాగము మెక్సికో సింధుశాఖవైపు వాలి యున్నది.

ఈ మధ్య మైదానమునకును రాకీపర్వతములకు మధ్య కొంత ఎత్తయిన నేలకలదు. ఇది పల్లపు పీఠభూమి. ఇదికూడ రాకీలవలె ఆర్క్‌టికునుండి మెక్సికో సింధుశాఖవరకు కలదు. దీనిని నదులు చాలవరకు కోసివేసినవి. దీనిలో చాల భాగము పశుపోషణకుమాత్ర మనుకూలమైనది.

తూర్పు మిట్టలకు అట్లాంటికు మహాసముద్రమునకు మధ్య ఒక మైదానము కలదు. ఇది అపలేషియన్ పర్వతముల నుండి సముద్రమువైపునకు క్రమముగా వాలి యున్నది. ఈ మైదానము చాల సారవంతమైనది. అందుచే జనసాంద్రత చాల ఎక్కువ. ఈ తీరము ఉత్తరమున చాల చీలియున్నది. అందుచే అక్కడ నౌకాశ్రయము లెక్కువగా ఏర్పడినవి.

ప్రాక్టికల్

**ఉత్తర అమెరికాయొక్క నైసర్గికమును చూపు పటమును వ్రాయుము.**

---

## 2. నదులు

ఉత్తర అమెరికాలోని నదులను 4 విధములుగా పరిశీ లింపవచ్చును. పడమరగా ప్రవహించి పసిఫిక్‌లో పడునవి, ఉత్తర

ముగా ప్రవహించి ఆర్కిటిక్ మహాసముద్రములోనో, హడ్సన్ సింధుశాఖలోనో పడునవి, అట్లాంటిక్ మహాసముద్రములో పడునవి, మెక్సికో సింధుశాఖలో పడునవిగా విభజించి పరిశీలింతము.

పడమరగా ప్రవహించి పసిఫికులో పడునవి అంత ముఖ్యమైనవి కావు. తీరమైదానము తక్కువగుటచేత ఈ నదులకు అంతయు పర్వతదశ అనియే చెప్పవచ్చును. పైగా చాల ఎత్తు నుండి వేగముగా పారుచుండుటచే నౌకాయానమున కనుకూలము కావు. పర్వతప్రదేశమగుటచే వ్యవసాయాదుల కుపయోగించవు. ఉత్తరమున అలాస్కాలోని యూకన్‌నది, కెనడాలోని మెకంజీ, నెల్సన్ నదులు పెద్దవేకాని ఎక్కువకాలము గడ్డ కట్టుటచే నిరుపయోగమైనవి.

అట్లాంటికులోనికి ప్రవహించునదులలో ముఖ్యమైనది సెంట్‌లారెన్సునది. మధ్యమైదానములోని పల్లపు ప్రదేశములలో ఏర్పడిన సరస్సులలోని నీరు ఈనదిద్వారా ప్రవహించి అట్లాంటికులో కలియుచున్నది. సుపీరియర్, మిచిగాన్, హ్యూరన్ సరస్సులలోనుండి సెంట్ లారెన్సునది ఈరీ సరస్సులోనికి ప్రవహించును. అచ్చటనుండి అంటారియో సరస్సులోనికి ప్రవహించునపుడు ఈనదికి నయాగరా అందురు. ఇచ్చటనే ఈ నదికి ప్రఖ్యాతమైన నయాగరా జలపాతము కలదు. ఇది 160 అడుగుల ఎత్తునుండి పడుచు అనేక లక్షలమందిని ఆకర్షించు సుందర దృశ్యమైనది. అంటారియో దాటిన తర్వాత

సెంట్ లారెన్సునది వెడల్పై 600 మైళ్లు ప్రయాణముచేసి అట్లాంటిక్ మహాసముద్రములో కలియుచున్నది. ప్రపంచములో అత్యంత ఉపయుక్తమైన నదులలో ఇది యొకటి.

అపలేషియన్ పర్వతములలో పుట్టి తూర్పుగా ప్రవహించి అట్లాంటిక్‌లో కలియు నదులు చిన్నవి. కాని అవి చాల ఉపయోగకరమైనవి. వాటిద్వారా పర్వతములను దాటుట సులభమైనది. రైలు రోడ్డుమార్గములు వేయుటకు వీలయినది. అట్టివానిలో హడ్సన్, డిలావేర్, సస్క్వెహన్నా, పొటామాక్ మొదలయినవి ముఖ్యము. ఈ హడ్సన్ ముఖద్వారమువద్దనే ప్రపంచములో ద్వితీయస్థాన మాక్రమించిన న్యూయార్కు పట్టణము కలదు.

మెక్సికో సింధుశాఖలోనికి ప్రవహించు పెద్దనది మిసిసిపీ.

ఈనది ప్రపంచములోని మహానదులలో ఒకటిగా పేర్కొన తగినది. ఇది 2,000 మైళ్ళకంటె ఎక్కువ పొడవైనది. ఈనది సుపీరియర్ సరస్సునకు దిగువ ఒక చిన్న సరస్సులో పుట్టి కుడి ఎడమల నుండి నీటిని గ్రహించి దక్షిణముగా పారుచున్నది. సెంట్‌లూయీ వద్ద దీనికంటె పెద్దదగు మిస్సోరీనది కలియు చున్నది. దీనికి రెండువైపులనుండియు పెద్ద యుపనదులు వచ్చి చేరును. మిసిసిపి నది పుట్టినచోటువరకును, మిస్సోరీనది రాకీ పర్వతములవరకు యాన యోగ్యములు. ఇతర ఉపనదులలో ఓహియో, టెన్నెసీ నదులు చాలవరకును, అర్కాన్సస్ కొంత వరకు రాకపోకలకు అనుకూలముగా నున్నవి.

మిసిసిపీ నది నెమ్మదిగా అనేక వంకరలు తిరుగుచు (Meandering) మైదానములో ప్రవహించును. సముద్రమునకు దగ్గరగుకొలది ఈనదీ గర్భము చుట్టునుండు భూమికంటె ఎత్తుగా నున్నది. ఇందుకు కారణము చాల ఇసుకను తెచ్చుటయే. నీరు ప్రక్కలకు పొర్లిపోకుండ ఇరు ప్రక్కల ఎత్తయిన గట్లు వేసిరి. ఈ నదీముఖద్వారమున పెద్ద డెల్టా గలదు. ఈ నదిమీద న్యూ ఆర్లియన్సు పట్టణమున్నది. ఇది సాగర సంగమమునకు 100 మైళ్ళు పైన ఉన్నది.

రయోడీగ్రాండినది రాకీపర్వతములలోపుట్టి ఆగ్నేయముగా సంయుక్త రాష్ట్రములకును మెక్సికోకును సరిహద్దుగా ప్రవహించి మెక్సికో సింధు శాఖలో కలియుచున్నది.

---

# 3. సరస్సులు

కెనడాలోను, సంయుక్త రాష్ట్రముల ఉత్తర భాగములోను గల సరస్సులను పటములో చూడుడు. ఖండ దక్షిణ భాగములో సరస్సులులేవు. పటముమీద చూపబడిన పెద్దవి కాక వేలకొలది చిన్నవి కూడ కలవు. ఇవి ఎట్లు ఏర్పడినవి ? (ఆఫ్రికాలోని సరస్సులు ఎట్లు ఏర్పడినవో చూచియుంటిమి.) కొన్ని వేల సంవత్సరములకు పూర్వము మంచుయుగము ఏర్పడియుండెను. అప్పుడు కెనడా సంయుక్త రాష్ట్రముల ఉత్తర భాగములలో

బ్రహ్మాండమగు మంచుదిబ్బ లుండెడివి. ఇవి ఒక్కొక్కచోట ఒక మైలు మందముగా నుండెను. (ఇట్టివి ఇప్పటికిని గ్రీన్‌లాండులో కనబడుచున్నవి. ఆ ద్వీపమంతయు ఒకే మంచుదిబ్బతో కప్పబడి యున్నది.) అట్లు కప్పిన మంచుగడ్డ క్రమముగా జరుగుచుండెను. ఈ జరిగినపుడు పర్వతములను సైతము పిండిపిండి చేసివేయు చుండెను. ఒకచోటి మట్టిని మరొకచోట విడిచెను. కొన్నిచోట్ల గొప్ప గోతులు కలిగించెను. అవే నేటి సరస్సులు. ఇచటి మట్టిని రాళ్ళను మరొకచోట మిట్టగా విడిచెను. మంచుయొక్క ఈ అద్భుతమైన కృషి ఎప్పుడు జరిగెనో చెప్ప లేము. కాని జరిగి నట్లు నిదర్శనములు కలవు. మంచుయుగము అయిపోయిన తర్వాత వేలకొలది సరస్సులు నిలిచిపోయెను. ఇవన్నియు మంచినీటి సరస్సులు.

కెనడా సంయుక్త రాష్ట్రములకు మధ్య సరిహద్దుగా నుండి సెంట్‌లా రెన్సు నదికి ఆధారభూతమైన 5 సరస్సులు ప్రపంచములోని మంచినీటి సరస్సులలోకెల్ల పెద్దవి. ఇవి వరుసగా సుపీరియర్, మిచిగాన్, హ్యూరన్, ఈరీ, అంటారియోలు. వీనిలో సుపీరియర్ సరస్సు మిక్కిలి పెద్దది. ఈరీ అంటారి యోల మధ్య నయాగరా జలపాతము కలదు. అంటారియో దాటిన తర్వాత సెంట్ లారెన్సు నది మిక్కిలి యానయోగ్య ముగా నున్నది. సెంట్ లారెన్సు ఈ ఐదు సరస్సుల ద్వారా 2000 మైళ్ళ దూరము పెద్ద నౌకలకుగూడ ప్రయాణసాధన ముగా నున్నది, ఈమార్గము కెనడాకును, సంయుక్తరాష్ట్రము

లకు నుకూడ చాల ముఖ్యమైనది. వీని తీరమున రెండు దేశము లలోను గొప్ప రేవులుకలవు.

మార్గము సరిగా నుండుటకు అచ్చటచ్చట లోతు చేసిరి. నయాగరాజలపాతము అడ్డువచ్చుటచే ఈరీ, అంటారియో సరస్సులను కలుపు లోతైన కాలువను త్రవ్వినారు. సుపీరియర్, హ్యూరన్ సరస్సులమధ్య లోతైనమార్గమును ఏర్పరచుటకు ఒకమైలుమాత్రము పొడవుకల సూ కాలువను త్రవ్వినారు.

కెనడాలో విన్నిపెగ్ సరస్సు మిక్కిలి పెద్దది. దీనితర్వాత అతబాస్కా, గ్రేట్‌స్లేవ్, గ్రేట్‌బేర్ సరస్సులు పెద్దవి. ఇట్టి సరస్సులు ఇంకను కొన్ని 100 మైళ్ళకంటె ఎక్కువ పొడవైనవి కలవు.

రాకీపర్వతముల పీఠభూమిలోని సరస్సులు ఉప్పునీటివి. వీటిలో గ్రేట్‌సాల్టులేక్ పెద్దది. అక్కడ ఇంకను కొన్ని చిన్న ఉప్పునీటిసరస్సులు కలవు. వీటికి సముద్రముతో సంబంధములేదు.

ప్రాక్టికల్

**ఉత్తర అమెరికా పటమునువ్రాసి అందు నదులను, సరస్సులను గుర్తింపుము.**

---

# 4. శీతోష్ణస్థితి - వర్షపాతము

ఉత్తర అమెరికా ఉత్తరార్ధ గోళములో నున్నది కదా. మరియు ఖండముయొక్క అధికభాగము కర్కాట రేఖకు ఉత్తరముననున్నది. దీనిని బట్టి ఈ ఖండములో చాల భాగము




శీతకాల వర్షపాతము




వేసవి వర్షపాతము

సమశీతల, అతిశీతల మండలములలో నున్నదని గ్రహింప వచ్చును. పైగా ఖండముయొక్క ఉత్తరపు చివర ఆర్కిటిక్ ప్రాంతమున నున్నది. అందుచే మొత్తముమీద ఉత్తరభాగమున చలి ఎక్కువగా నుండును. ఈ ప్రాంతములో శీతకాలము ఎక్కువ నెలలు ఎక్కువచలిగానుండును. నీరుగడ్డకట్టును. ఉత్తర మున ఆర్కిటిక్ మహాసముద్రమునుండి చల్లని గాలులు దేశము మీదికి వీచును. వీటిని అడ్డుటకు పర్వత పంక్తులు లేకపోవుటచే ఉత్తర అమెరికా అంతటను (మెక్సికోతప్ప) నీరు గడ్డకట్టు నంతటి చలియుండును. అదే సమయమున తూర్పు తీరమున అంత చలి యుండదు. ఇందుకు అక్కడి ఉష్ణజల ప్రవాహ ములే కారణము.

పశ్చిమతీరమున అనగా పసిఫికు మహాసముద్రములో ఉత్తర పసిఫికు ఉష్ణజల ప్రవాహము (క్యూరోసివో) కలదు. ఈ ప్రవాహము జపానునుండి పసిఫికు మహాసముద్రముదాటి కెనడా సంయుక్త రాష్ట్రముల పడమటి తీరమున ప్రవహించుచు వెచ్చదనమును కలిగించుచున్నది. మరియు నైరృతి వ్యతిరేక పవనములు ఈ ప్రవాహముమీదనుండి వీచి వెచ్చనై రాకీపర్వత ముల పడమటి భాగమును అతి శీతలతనుండి కాపాడుచున్నవి. మరియు రాకీపర్వతములు అలాస్కాలో తూర్పు పడమరలుగా వ్యాపించి శీతలవాయువులను దక్షిణతీరమునకు రానిచ్చుటలేదు.

తూర్పుతీరమున పరిస్థితి మరొక తీరుగా కలదు. సముద్ర ప్రభావమువల్ల కొంత వెచ్చగా నున్నను ఉత్తరమునుండి మంచు

గడ్డలతోవచ్చు ఆర్కిటికు శీతలజల ప్రవాహము వల్ల తూర్పు తీరము చల్లగా నుండును, కాని గల్ఫ్‌స్ట్రీమ్ ప్రవాహజలము వల్ల ఈ శీతలత కొంచెము తగ్గును. న్యూయార్కులో శీత కాలమున నీరు గడ్డకట్టునంతటి చలియుండును. ఈ తీరమందలి ఉష్ణ శీతల జలప్రవాహములయొక్క ప్రభావమువల్ల లాబ్రడార్ ప్రాంతములో శీతకాలమున దట్టమైన పొగమంచు ఏర్పడు చుండును. రాకీపర్వత ప్రాంతమున శీతకాలములో చల్లగా నుండునని వేరే చెప్పనక్కరలేదు. దానికి వాటి ఔన్నత్యము ముఖ్యకారణము.

వేసవిలో సూర్యకిరణములు కర్కటరేఖమీద పడునపుడు మెక్సికో పర్వతప్రాంతములలోను, రాకీపర్వతముల మీదను చల్లగా నుండునుకదా. అప్పుడు పడమటితీర మైదానము సముద్ర ప్రభావమువల్ల చల్లగానుండును. తూర్పుతీరమున ఈ కాలములో లాబ్రడారు శీతలజల ప్రవాహముకంటె కూడ గల్ఫ్‌స్ట్రీమ్ ఉష్ణజల ప్రవాహముయొక్క ప్రభావము హెచ్చుగా నుండును. అందుచే వేడి ఎక్కువగానే ఉండును. ఇక మధ్య మైదానమున శీతకాలములో చలి ఎక్కువ అయినట్టు ఇప్పుడు వేడి అధికముగా నుండును. కెనడా ఉత్తరతీరమువరకు వేడి హెచ్చుగా నుండును. కాలిఫోర్నియాలో మధ్యధరా శీతోష్ణస్థితి కలదు.

వర్షపాతము ; శీతకాలములో ఉత్తరమున అతిశీతల ముగా నుండుటచే అధికపీడన మేర్పడును. ఇచ్చటనుండి అల్ప

పీడనముకల దక్షిణ భాగమునకు పవనములు వీచును. వేసవిలో దక్షిణభాగములో ఉత్తరభాగముకంటె వేడి ఎక్కువ. అందుచే అచ్చటిగాలి పైకెగసి పోవుటచే అల్పపీడన మేర్పడును. దీనిని ఆక్రమించుటకు ఉత్తరమునుండి గాలులు వచ్చును. అందుచే వేసవిలో అపలేషియన్ పర్వతములకు పశ్చిమమున వానలు కురియును. ఉత్తర అమెరికా మధ్యమైదానమంతకును ఈ ప్రభావము కలదు.

పడమటి తీరమున కాలిఫోర్నియాకు ఉత్తరమున పశ్చిమ వాయువుల ప్రభావమువల్ల సంవత్సరమంతయు వర్షముండును. కాలిఫోర్నియాలో మాత్రము శీతకాలమున వర్షము కురియుటచే మధ్యధరా సమశీతోష్ణస్థితి పర్పడినది. పడమటి వర్షములు ఎత్తయిన రాకీపర్వతములమీద కురియుటలేదు. అందుచే ఆ ప్రాంతములు చాల పొడిగా నుండును. కాని ఈ పర్వతముల పడమటి వాళ్ళకు మంచివర్ష ముండును.

ఉత్తర అమెరికా తూర్పుతీరమునకు ఆగ్నేయవ్యాపార పవనములవల్ల సంవత్సరమంతటను వర్షము కురియును. ఈతూర్పు తీరమున తుఫాను లెక్కువగా నుండును. మనదేశములోకూడ నవంబరు నెలలో గాలివానలు వచ్చుచుండును. కాని అమెరికాలో కొన్ని గాలివానలు ఇంకను ప్రమాదకరమైయుండును. ఇట్టివి చీనా జపానులకుకూడ వచ్చుచుండును.

ప్రాక్టికల్ :

**ఉత్తర అమెరికాయొక్క వేసవి శీతకాల వర్షపాత పటములను వ్రాయుము.**

---

# 5. సహజ వృక్షజాలము

అమెరికా ఖండపు ఉత్తర భాగము ఆర్క్టిక్ ప్రాంతములో ఉన్నది కావున ఎక్కువ కాలము మంచుతో కూడి యుండును. ఈప్రదేశమును టండ్రా మండల మందురు. ఇది కెనడాలో ఉత్తరమున అలాస్కానుండి లాబ్రడారు వరకు ఉన్నది. ఇచ్చట వేసవి కొద్దికాల మున్నప్పుడు మంచు కొంతవరకు కరగును. అయినను మొక్కలు పెరుగజాలవు. నాచు, గడ్డిజాతి మొక్కలు, చిన్న తుప్ప మొక్కలు పెరుగును. వసంతఋతువులో చక్కని పుష్పములు వికసించును. అనేక పక్షులువచ్చి ప్రకృతిని ఆనందదాయక మొనర్చును. కారిబూ అనబడు ధ్రువపు జింకలు నాచును తినుచు మందలుగ తిరుగుచుండును.

టండ్రాలకు దక్షిణమున శృంగాకారారణ్య మండలము కలదు. ఈ మొక్కలుకూడ టండ్రాలకు కొంతదూరమువరకు ఒత్తుగను, ఎత్తుగను పెరుగవు. ఇంకను దక్షిణమునకు రాగా ఈ అరణ్యములు చాల విస్తృతమై యుండును. ఈ అరణ్యములలో పైను, ఫర్ జాతివృక్షము లుండును. ఈ మండలము టండ్రాలకు దిగువనుండి దాదాపు సంయుక్త రాష్ట్రముల సరిహద్దువరకు వ్యాపించియున్నది. రాకీ పర్వతములలో ఉత్తర భాగమునను, అపలేషియను పర్వతముల ఉత్తర భాగములో ఎత్తయిన చోట్లనుకూడ ఇట్టి అడవు లున్నవి.

మధ్యమైదానములో శృంగాకారారణ్యములకు దిగువ రాకీపర్వతములకు తూర్పున సమశీతల మండల గడ్డిబీడులు కలవు.




ఉత్తర అమెరికా - సహజ వృక్షజాలము

ఈప్రాంతములో వర్షము తక్కువ. శీతకాలములో చలి, వేసవిలో వేడి ఎక్కువ. ఈగడ్డి బీడులను ప్రెయిరీలు అందురు.

దక్షిణ అమెరికాలో ఇట్టి గడ్డిబీడులను పాంపా లందురని మీరు చదివియున్నారు. ఈ గడ్డి బీడులలో చెట్లు బహు తక్కువ. ఈగడ్డిబీడుల పశ్చిమమునకు పోయినకొలది వర్షముతగ్గుచుండును.

శృంగాకారారణ్యములకు దక్షిణమునను ప్రెయిరీలకు తూర్పునను చల్లని సమశీతలమండలారణ్యములు కలవు. ఇచ్చట ఓక్, మేపుల్ చెట్లుండును. ఇవి ఆకు రాల్చవు. కాని ఆకు రాల్చు చెట్లుకూడ కొన్ని ఈ అరణ్యములలో నుండును. పశ్చిమ తీరప్రాంతమునను, పర్వతపాళ్ళలోను, బ్రిటిషు కొలంబియా, కాలిఫోర్ని యాలకు మధ్య ఇట్టి అరణ్యములు కలవు. సెక్వో యియా, డగ్లస్ఫర్ ఈ జాతికి చెందినవి. ఈ చెట్లు 2,3 వందల అడుగుల ఎత్తుకూడ పెరుగును.

ప్రెయిరీలకు పశ్చిమమున ఎడారి, ఎడారి తుల్యములు కలవు. ఇందుకు కారణము వర్షము తగ్గుటయే. ఇవి అరిజోనా రాష్ట్రములోను, ఉత్తర మెక్సికోలోను కలవు. ఇచట సేజ్ అను మొక్కలు పెరుగును. ఇవి ఎంతకాలమైనను వర్షము లేకుండ బ్రతుకును. మరియు బ్రహ్మాండమైన బొమ్మజెముడు పెరుగును. అది తేమను తన చిక్కని రసములో దళసరి చర్మము చాటున దాచ గలదు.

ఎడారులకు పశ్చిమమున కాలిఫోర్నియాలో మధ్య ధరా శీతోష్ణస్థితి కలదు. కావున అచట ఆ ప్రాంతపు వృక్షజాల ముండును.

ఎడారులకు దక్షిణభాగములు అనగా దక్షిణమెక్సికో, అమెరికా, పడమటి ఇండియాదీవులు ఈశాన్య ఋతుపవన మార్గములో నుండుటయేకాక అత్యుష్ణ మండలములోనున్నవి. ఇచ్చట ఎల్లప్పుడును వేడిగాను, తడిగాను ఉండును. కావున సతతహరిత ఉష్ణమండలారణ్యములు కలవు.

ప్రాక్టికల్

ఉత్తర అమెరికా పటములో వివిధ సహజ వృక్షజాలమును గుర్తింపుడు.

---

# 6. ప్రజలు - జాతులు - జనవితరణ

అమెరికాలో జనసంఖ్యను రెండు ముఖ్యభాగములుగ చేయవచ్చును. 1. ఆదిమనివాసులు 2. తరువాత వచ్చినవారు.

1. (a) ఉత్తర అమెరికాయొక్క ఉత్తర భాగమున టండ్రాభూము లున్నట్లు చదివితిమికదా. అందు నివసించువారు ఎస్కిమోలు. వీరుకూడ ఆ ఖండముయొక్క ఆదిమ నివాసుల లోనికి వత్తురు. వీరు అలాస్కా, గ్రీన్‌లాండ్, ఆర్కిటికు ప్రాంతపు కెనడాలోను నివసింతురు. వీరు ఋతువునుబట్టి తమ పద్ధతులను మార్చుకొందురు. శీతకాలములో మంచుఇండ్లలో నివసింతురు. వీటిని ఇగ్లూలు అందురు. సీలు మాంసము, క్రొవ్వు తిందురు. సీలుక్రొవ్వుతో దీపములు వెలిగింతురు. ఈ కాలములో చక్రములులేని స్లెడ్జి బండ్లలో ప్రయాణము చేయుదురు. వీనిని కుక్కలు లాగును.

వేసవిలో చర్మపు గుడారములలో నివసింతురు. సీలు చర్మమును కొయ్య చట్రమునకు కట్టి పడవగాచేసి చేపలను



ఇగ్లూ అను మంచు యింటిలో ఎస్కిమో స్త్రీలు.

వేటాడుదురు. వీరి జీవితములో సీలు ప్రముఖమైనది. అలాస్కా కెనడాలలోని ఎస్కిమోల జీవితమును బాగుపరచుటకు కెనడా అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వములు కృషిచేయుచున్నవి.

(d) ఆదిమనివాసులలో ముఖ్యులు ఎఱ్ఱ ఇండియనులు. వారి చర్మము రాగి వర్ణముగా నుండుటచే ఆ పేరు వచ్చినది. వారిలో కొందరు పచ్చగాకూడనుందురు. వారిజుట్టుఉంగరములు

లేక పొడవుగా నుండును. వారికి గడ్డములమీద వెంట్రుకలు పెరుగును. చెంప ఎముకలు ఎత్తుగా నుండును. కొలంబసు అమె



కెనడాలోని టండ్రాలలో మంచుపై చక్రములు లేని బండిని కుక్కలచే లాగించుచున్నారు.

రికా వచ్చినపుడు ఇండియా వచ్చితినని భ్రమపడి వారికి ఆ పేరు పెట్టెను. అది నేటికిని నిలిచిపోయినది. మొట్టమొదట వీరికిని ఐరోపీయులకును ఘోరయుద్ధములు జరిగెను. అందు అనేకులు నిర్దాక్షిణ్యముగా చంపబడిరి. క్రమముగా ఇరువురిమధ్య స్నేహ

మయ్యోను. వారును నాగరికు లయిరి. వారికి కొన్ని ప్రదేశములు ప్రత్యేకింప బడినవి. వారు అందులో నివసింతురు. తెల్లవారు వీరి స్త్రీలను వివాహమాడుటచే అమెరికా దక్షిణప్రాంతములలో ఈ మిశ్రమజాతివారు కలరు.



ఎస్కిమో కుటుంబము గ్రామఫోనును విని ఆనందించుచున్నారు.

ధరా సముద్రమును, ఎర్రసముద్రమును కలుపును. ఇది ప్రపంచము లోని కాలువలలోనెల్ల పెద్దది. ఐరోపానుండి ఇండియాను, దూరప్రాచ్య దేశములను చేరుటకు సూయజ్ కాలువ మార్గము చాల దగ్గరదారి. ఇది కొంచె మించుమించుగ ప్రపంచ మధ్య భాగమునందుండి అనేక దేశములమీదుగ పోవును. ఐరోపాలో బయలుదేరి ఎర్రసముద్రము దాటినమీదట ఈ మార్గము రెండు శాఖ లగును. ఒకశాఖ తూర్పుగ ఆఫ్రికా తూర్పుతీరము వెంబడి పోవును. రెండవశాఖ ఇండియా, సింహళముల మీదుగ ఆస్ట్రేలియాకు పోవును.

4. కేప్‌మార్గము : ఈమార్గము ఐరోపా పడమటితీరపు రేవులనుండి బయలుదేరి దక్షిణముగ నేగి, ఆఫ్రికా పడమటి తీరము వెంబడి గుడ్ హోప్ అగ్రమును చేరి అచ్చటినుండి ఆస్ట్రేలి యాకు పోవును.

5. దక్షిణ అమెరికా మార్గము : ఈ మార్గము ఐరోపా రేవులనుండి బయలుదేరి దక్షిణ అమెరికా తూర్పుతీరము వెంబడి పోవును.

## ఆకాశమార్గములు

ఈ రోజులలో తరచుగ విమానములలో ప్రయాణము చేయుట పాటియగుచున్నది. ఇట్లు పోవుట వలన దూరమును ప్రయాణకాలమునుకూడ తగ్గును. ఆకాశమార్గములలో నీ క్రిందివి ముఖ్యములు.

1. ఐరోపానుండి అమెరికాకు : ఈ మార్గము పశ్చిమ ఐరోపాలోని ముఖ్యకేంద్రములనుండి బయలుదేరి, ఆఫ్రికా ఉత్తరతీరము వెంబడి పోయి, బ్రెజిల్ చేరును. అక్కడనుండి అమెరికాలోని కేంద్రములకు అట్లాంటిక్ తీరము వెంబడి అనేక మార్గములున్నవి.

2. ఐరోపానుండి ఆసియా ఆస్ట్రేలియాలకు : ఈ మార్గము లండనులో బయలుదేరి మార్సెయిల్స్, ఏథెన్సు, కెయిరో, కరాచీ, ఢిల్లీ, కలకత్తా, రంగూన్, సింగపూర్, సిడ్నీలమీదుగా మెల్బోర్నను చేరును.

3. ఐరోపానుండి ఆఫ్రికాకు : ఈ మార్గము ఐరోపాలోని ముఖ్యకేంద్రములలో బయలుదేరి దక్షిణ ఆఫ్రికాలోని కేప్ టవునును చేరును.

4. అమెరికానుండి ఆసియాకు : ఈ మార్గము అమెరికా సంయుక్త రాష్ట్రములలోని శాన్‌ఫ్రాన్‌సిస్కోలో బయలుదేరి తూర్పు ఇండియా దీవులలోని మనిలాకు పోవును.

## అంతర్జాతీయ వాణిజ్యము

ప్రతి దేశమునను అనేకవస్తువులు తయారగును. శీతోష్ణ స్థితినిబట్టియు, భూసారమునుబట్టియు కొన్ని దేశములలో కొన్ని వస్తువులే తయారగును. అట్లే కొన్ని దేశములలో కొన్ని వస్తువు లితరదేశముల కంటె నెక్కువగ తయారగును. ప్రదేశ మును తాను తయారుచేయు వస్తువులలో చాలభాగము ఎగు

మతి చేయును. ఏదేశమైనను తాను తయారుచేయలేని వస్తువు లను ఇతరదేశములనుండి తెప్పించుకొనును. ఈవిధమున వస్తువులు ఒకదేశమునుండి మరియొక దేశమునకు పోవుచునే ఉండును. ఈ విధములగు ఎగుమతి దిగుమతులను చేయుటకు అంతర్జాతీయ వాణిజ్య మని పేరు.

## రేవులు, వాణిజ్య కేంద్రములు

ఒక దేశము ఇతర దేశములతో చేయు వర్తకము అభివృద్ధి చెందుటతో ఈ వాణిజ్యమునకు కొన్ని కేంద్రము లవసరమైనవి. ఎగుమతిదిగుమతులు ముఖ్యముగ కొన్ని రేవులద్వారా జరుగసాగినవి. ఈరేవుల ప్రాముఖ్యము రెండు అంశములపై ఆధారపడియుండును. అందు మొదటిది రేవులు వర్తకమునకై వస్తువులను తయారుచేయు ఫ్యాక్టరీలకును, పంటలను పండించు ప్రదేశములకును దగ్గరగను అందుబాటులోను ఉండుట. రెండవ అంశము ఓడరేవులు ఎక్కడనో మారుమూలలగాక ప్రధాన వాణిజ్యమార్గములయం దుండుట అట్లగుచో దేశదేశముల వర్తకులకు ఈ వస్తువులను గురించి వివరములు సులభముగ తెలిసి ఈ వస్తువులు అమ్ముడుపోవుటకు వీలగును.

అంతర్జాతీయ వాణిజ్యమున నీక్రింది రేవులు ముఖ్యములు:

ఐరోపాలో : లండను, గ్లాస్గో, లివర్పూల్, కార్డిఫ్, మాన్ చెష్టర్, హాంబర్గు, రాటర్ డామ్, ఆంటువర్ప్, మార్సెయిల్స్.

ఉత్తర అమెరికా: బాల్టిమూర్, బోస్టన్, మాన్ట్రియల్, న్యూయార్కు, శాన్‌ఫ్రాన్‌సిస్కో, లాస్ ఏన్‌జిల్స్, సియేటిల్, పోర్టులండ్, వాన్‌కూవర్.

దక్షిణ అమెరికాలో : రియోడి జనీరో, బ్యూనస్ అయిరిస్, వాల్‌పరైజో, మాంటివీడో.

ఆసియా : కరాచీ, బొంబాయి, కొచిన్, మద్రాసు, కలకత్తా, ఆక్యాబ్, రంగూన్, సింగపూర్, హాంగ్‌కాంగ్, కొలంబో.

ఆస్ట్రేలియా : సిడ్నీ, మెల్‌బోరన్, ఎడిలయిడ్.

ఆఫ్రికా : కేప్‌టౌన్, డర్బాన్, అలెగ్జాండ్రియా.



# హెచ్. ఎస్. సి. పరీక్షా ప్రశ్నములు

## భూగోళశాస్త్రము 1944

1. ఇండియాలో అధిక జనులు పల్లెలలోనుందురు. ఇందుకు కారణ మేమో తెలపి ఈ విషయములో ఇంగ్లండుతో పోల్చుడు.
2. మంచిరేవు పట్టణము ఏర్పడుటకు కావలసిన లక్షణము లేవి? ఉదాహరణ పూర్వకముగా వివరించునది.
3. ఈ క్రిందివానినిగూర్చి పటముతోకూడ వివరింపుడు,
   (1) సమోష్ణరేఖలు. (2) పాటు, పోటు. (3) సముద్రపు వాయువులు.
4. ప్రపంచములో గొప్పనాడీమండలారణ్యములు ఎక్కడ కలవు? వ్యాపారరీత్యా వాటి విలువ ఏమి?
5. ఆసియాలో ఈ క్రిందివి ఎక్కడ హెచ్చుగా ఉత్పత్తి చేయబడుచున్నవి? వీటికి ఎట్టి శీతోష్ణస్థితి, నేల కావలయును?
   తేయాకు, రబ్బరు, వరి.
6. హైదరాబాదు రాష్ట్రపటములో శీతోష్ణస్థితిలోను, భూస్వభావము లోను భేదముకల సహజ మండలమును చూపుము. మరియు అచ్చటి ముఖ్య ఉత్పత్తులనుగూర్చి వివరింపుడు.
7. గంగామైదానమునకును, సహారా ఎడారికిని భేదములనువ్రాసి శీతోష్ణస్థితికి మానవ నాగరికత, సంస్కృతులపైకల ప్రభావము ను చూపునది.
8. ఈ క్రిందివానిలో ఏ మూటికైన వాని సరియైనస్థితి, ప్రాముఖ్యతలనుగూర్చి తెలుపునది:
   ఖార్టూము, సిడ్నీ, యోకహోమా, మోసల్, ఖైబర్ కనుమ, యూక్రెయిన్, కాన్‌స్టాంటినోపిల్, కిన్‌బర్లీ, న్యూకాసిల్, షికాగో.

## 1945

1. మైదానములు ఎట్లు ఏర్పడుచున్నవి? ప్రపంచములోని కొన్ని ముఖ్య మైదానములను పేర్కొని వాటి ప్రాముఖ్యతను వివరింపుడు.

2. వర్షము సూర్యుని వెంబడించును! ఈ విషయమును ఇండియా సందర్భములో వివరింపుడు.

3. హిమాలయ పర్వతములకు ఆసియాలోని శీతోష్ణస్థితి, జాతులు, నాగరికతలపై ఎట్టి ప్రభావము కలదు?

4. ఆస్ట్రేలియాలోని పర్వతములు ఉత్తర దక్షిణములుగా వ్యాపించి యున్నవి. అవి తూర్పు పడమరలుగా వ్యాపించి యున్నచో కొన్ని సహజ లక్షణములలో మార్పు లుండెడివి. ఈ వాక్యమును క్లుప్తముగా వివరింపుడు.

5. ప్రపంచమందలి కొన్ని ప్రాంతములలోని ప్రజలు కేవలము పశువుల పెంపకముమీద ఆధారపడియున్నారు. ఈ ప్రదేశము లెచ్చటకలవు? అట్లుండుటకు కారణములను వివరింపుడు.

6. దక్షిణ ఆఫ్రికా యూనియనును క్లుప్తముగా వివరింపుడు. ఏ ఏ రాష్ట్రములు దానిలో చేర్చబకయున్నవి. ఆదేశము ఇంగ్లండుకు ఎగుమతిచేయు సరకులేవి? ఆ సరకుల విలువయేమి?

లేక

ఉత్తర అమెరికా పటము గీసి క్రిందివాటిని గుర్తింపుడు.

1. వ్యవసాయమండలము - ముఖ్య ఉత్పత్తులు 2. పారిశ్రామిక ప్రదేశములు - ముఖ్య పరిశ్రమలు 3. గొఱ్ఱెల పోషణ మండలము - వాటినుండి లభించు మరియు అమ్మబడు సరకులు

7. ఈ దిగువ విషయములలో చైనా, జపానుల మధ్యకల పోలికలను, భేదములను చూపుడు.

   1. సహజలక్షణములు 2. శీతోష్ణస్థితి 3. ఉత్పత్తులు 4. ప్రజల వృత్తులు.

8. నైజాము రాజ్యములో చేయబడు వివిధ నీటిపారుదల ఏర్పాట్లు ఏవి ? ఇందువల్ల లభించు ఆయా ప్రాంతముల ముఖ్య ఉత్పత్తు లేవి ? పటసహాయమున వివరింపుడు.

## 1946

1. కుటీరపరిశ్రమ అననేమి ? హైదరాబాదు రాష్ట్రములోని కొన్ని ముఖ్య కుటీరపరిశ్రమలను పేర్కొని అవి ఎచ్చట, ఏలకలవో వివరింపుడు.

2. దిగువ వానిలో ఏమూటినిగూర్చియైన క్లుప్తముగా వ్రాయుడు.

   (a) ఆర్కిటిక్‌లో కలియు పెద్దనది, చిన్నది అగు థేమ్సునదివలె ఉపయోగకరమేలకాదు ?

   (b) బ్రిటిషుదీవులు శీతకాలములో తూర్పు యూరపు దేశముల కంటె ఏల వెచ్చగానుండును.

   (c) అర్ధరాత్రి సూర్యుడు కనబడు దేశము, సంవత్సరములో ఈవింత కనబడుకాలము.

   (d) దక్కనుకును, ఆస్ట్రేలియా, ఆఫ్రికాలకును ఏలపోలికలుకలవు?

   (e) ఋతుపవన దేశములలో నదీలోయలు ఏల అధిక జనసమ్మర్దము కలిగియుండును ?

   నైజాము రాష్ట్రపు తూర్పుభాగములు పడమటి భాగములకంటె ఏల ఎక్కువ వర్షమును పొందును ?

3. 'నేటికాలమున బంగారము, రత్నములకంటె బొగ్గు, ఇనుము విలువైనవి' ఈ వాక్యమునకు అనుకూలముగాగాని, ప్రతికూలముగాగాని కారణముల నిమ్ము.

4. ప్రపంచమున ఏ ప్రాంతములలో పట్టు, రబ్బరు అధికముగా ఉత్పత్తి చేయబడుచున్నవి ? ఏ దేశములతో ఈ వ్యాపారము ఎక్కువగా చేయబడుచున్నది ?

5. ఈ క్రిందివానిలో ఇండియా, బ్రిటనులు ఎంతవరకు పరస్పరాధీనములుగా నున్నవి !

(a) ముడిసరకులు (b) యంత్రములమీద తయారైన వస్తువులు - కారణము తీయుడు.

లేక

క్రిందివానిలో ఏనాలుగునుగూర్చియైన క్లుప్తముగా వ్రాయుడు

(a) సాన్ ఫ్రాన్సిస్కో (b) అజెర్బైజాన్ (c) కొరియా
(d) వెల్లింగ్టన్ (e) మాండలే (f) సింగపూరు
(g) మనిల్లా (h) కాన్బెర్రా.

6. దక్షిణ అమెరికాలోని ముఖ్యసహజమండలములను పేర్కొని అందు ఒకదానినిగూర్చి క్లుప్తముగా వ్రాయుడు.

7. నైజాము రాష్ట్రము పటమును గీచి క్రిందివి గుర్తింపుడు.

(a) ముఖ్యనదులు (b) ఈ నదులు ప్రవహించుప్రాంతములు
(c) ఈ నదులమీద నిర్మింపబడిన ప్రఖ్యాతమైన చెఱువులు.

**1947**

1. (a) అక్షాంశములు, తులాంశములు నిర్వచింపుడు. ఏయే విషయములలో అవి వేరుగా నున్నవో స్పష్టపరుచుడు.

(b) లండనునుండి మధ్యాహ్నము 1-45 గంటలకు ఒక తంతి వార్త పంపబడెను. వార్త ప్రయాణకాలము 20 నిమిషములు అనుకొని ఆ వార్త న్యూయార్కునకు (74° ప. తు.) ఎప్పుడు చేరునో కనుగొనుడు.

2. నదులు, పర్వతములు దేశములమధ్య సహజమైన సరిహద్దులుగా ఉపకరించుచున్నవి, ఈ విషయమును ఉదాహరణములతో వివరింపుడు.

3. పనామా కాలువను, సూయాజు కాలువతో పోల్చుడు.

4. ప్రపంచములో ఏ ప్రాంతములలో ఉప్పునీటి సరస్సులు కలవు? ఈ ప్రాంతములలో శీతోష్ణస్థితిలోని ప్రత్యేకతలు, నిమ్నోన్నతములు, సహజ వృక్షజాలమును చెప్పి వివరింపుడు. ఇండియా నుండి ఒక ఉదాహరణమును ఈయుడు.

5. ఆఫ్రికాయొక్క లేక ఆస్ట్రేలియాయొక్క పటము గీసి అందు ఆఖండపు నిమ్నోన్నతములను గుర్తింపుడు.

6. నైజాము రాష్ట్రములో నీటి పారుదల ఏర్పాట్లయొక్క ప్రాముఖ్యతను తెలిపి అట్టి కొన్ని ముఖ్యమైన ఏర్పాట్లను పేర్కొనుడు.

7. ఈ క్రిందిమండలములలో ఏ ఒక్కదానికైనను దాని భూగోళ లక్షణములను వివరించి ఆ లక్షణములు అచ్చటి ప్రజాజీవితముపై కనబరచు ప్రభావమును వివరింపుడు.

(a) అమెజాను మండలము (b) సైబీరియా గడ్డి బీడులు

(c) గంగాలోయ (d) అరేబియా ఎడారి.

8. ఇండియాలో జనసాంద్రతలో తేడాలకు కారణములు చూపుడు: పటము గీచి అధిక జనసాంద్రతగల ప్రదేశములు గుర్తింపుడు.

## 1948

1. సముద్రప్రవాహములు ఎట్లు ఏర్పడినవి ? అవి ఏదేశ తీరముల వెంట ప్రవహించునో ఆదేశముల శీతోష్ణస్థితిపై వాటికిగల ప్రభావమును వివరింపుడు.
2. ఆసియాను దాని సహజభాగములలోనికి విభజించి అందలి వివిధ సహజ వృక్షజాలము అచ్చటి శీతోష్ణస్థితిపై ఎట్లు ఆధారపడినదో చూపుడు.
3. నీటిపారుదల ఏర్పాట్ల ప్రాముఖ్యత ఏమి ? నైజాము రాష్ట్రములోని ముఖ్య నీటిపారుదల ఏర్పాట్లను పేర్కొనుడు.
4. ఈ క్రిందివానిలో ఏ మూటినైనను సకారణముగావివరింపుడు.
   (a) మదరాసు, బొంబాయిలలో శీతోష్ణస్థితిలోని భేదములకు కారణమేమి ?
   (b) చైనాయొక్క వ్యాపారము దాని సహజ సంపదకు తగినట్లు లేదు.
   (c) ఇండియాలో సహకార వ్యవసాయము వ్యక్తిగత వ్యవసాయముకంటె లాభకరముగా నుండును.
   (d) ఇండియాయొక్క ముడిసరకులు ఎక్కువగా ఎగుమతి అగుచున్నవి.
   (e) గ్రహణములు ప్రతినెల సంభవింపవు.
5. ఆఫ్రికా పటముగీచి అందు ఎడారులను గుర్తింపుము. అధిక వర్షపాతముకల ప్రదేశములను పెన్సిలుతో ఒత్తుగాగుర్తింపుడు. ఆ ఖండములో ఎడారులు, వర్షపాత మండలములు ఉండుటకు కారణములను పేర్కొనుడు.
6. ఆస్ట్రేలియా తూర్పు ప్రాంతము మధ్య, పశ్చిమ ప్రాంతములకంటె ఏల అధికజనసాంద్రతను, ఐశ్వర్యమును కలిగియున్నది?

7. ఐరోపాలోని రెండు ముఖ్య పారిశ్రామిక దేశములను పేర్కొని అట్టి పారిశ్రామికాభివృద్ధికి కారణములను వివరింపుము.

8. దిగువ వానిలో ఐదింటినిగూర్చి క్లుప్తముగా వ్రాయుడు.
సాన్ ఫ్రాన్సిస్కో; మాంట్రియల్; చిలీ: ఆస్లో; మంచూరియా; భూ, సముద్రవాయువులు; కరాచీ; ట్రివాండ్రమ్: జావా.

## 1949

1. ఋతుపవన మండలమనగా నేమి ? ఆసియాలోని ఏ దేశములు ఇందు చేరియున్నవి ? ఆ దేశములు ఏల అధికజన సాంద్రతను కలిగియున్నవి ?

2. క్రిందివానిలో ఏ రెంటిని గూర్చియైనను క్లుప్తముగా వ్రాయుడు
   (a) చక్రపవనమునకు, వ్యతిరేక చక్రపవనమునకు భేదము.
   (b) నిక్షేపశిలయొక్క నిర్మాణము.
   (c) సమోష్ణ రేఖలను గీయునపుడు గమనించవలసిన అంశములు.
   (d) సూర్యగ్రహణము.

3. ఒక ప్రదేశపు జనసంఖ్య ఏ విషయములపై ఆధారపడును ? హైదరాబాదు రాష్ట్రములో అధిక వర్షపాతముకల ప్రదేశములలో అల్పజన సాంద్రత, అల్పవర్షపాతము కలచోట్ల అంతకంటె ఎక్కువ జనసాంద్రత ఏల కలదో వివరింపుడు.

4. ఇండియా ఉపఖండపు పటము గీయుడు. దానిమీద ముఖ్య రేవులను గుర్తించి వాటి ద్వారా ఎగుమతి అగు వస్తువులను పేర్కొనుడు.

5. ప్రపంచమందు ఏ దేశములలో వరి, గోధుమ అధికముగా ఉత్పత్తి చేయబడుచున్నవి ? ప్రస్తుత ఆహారపు కొఱతను నివా

రించుటకు ఇండియా వీటిని ఏ దేశములనుండి దిగుమతి చేసు కొనుచున్నది ?

6. దక్షిణ అమెరికాయొక్క సహజమండలములను పేర్కొని ఆండీసు పర్వతపంక్తి చిలీదేశపు ఆర్థిక సంపదయొక్క వృద్ధికి సహాయపడెనో, ఆటంకమయ్యెనో సకారణముగ నిరూపింపుడు,

7. అ. సం. రా. లోని ముఖ్యపారిశ్రామిక మండలములు ఎచ్చట కలవు? ఆదేశములోని ముఖ్య పరిశ్రమలను పేర్కొనుడు.

8. ఈ క్రింది వానిలో ఏ ఐదింటినిగూర్చి యైనను క్లుప్తముగా వ్రాయుడు:-పనామాకాలువ, నైలులోయ, కరాచీ, బర్మింగు హాము, సిడ్నీ, కొత్తగూడెం, బ్రసెల్స్, అంకారా, జెమ్‌షెడ్ పూరు, జావా.

## 1950

1. ఉష్ణమండలపు ఎడారులు ప్రపంచములో ఏ ప్రాంతములలో కలవు ? వాటి వితరణకు కారణములను పేర్కొనుడు.

2. ఈ క్రిందివానిలో రెంటియొక్క నిర్మాణమునకు కారణములు వ్రాయుడు.

(a) డెల్టాలు (b) నిక్షేపశిల

(c) పవడపు దీవులు (d) ఎడారిలోని ఇసుక దిబ్బలు.

3. మధ్యధరామండలపు ముఖ్య లక్షణములేవి ? ప్రపంచములో ఎచ్చ టెచ్చట ఇట్టి మండలములుకలవు ?

4. హైదరాబాదు రాష్ట్రపు పటముగీచి దానిలో వేర్వేరు రక ముల నేలలను అందలి వ్యవసాయ ఉత్పత్తులను గుర్తింపుడు.

5. పెద్ద పట్టణములు పెరుగుటకు కారణములేవి ? ప్రతి విషయ మునకు ఇండియానుండి ఉదాహరణమును చూపుడు.

6. ఆస్ట్రేలియాలోని సహజ వృక్షజాల మండలమును పేర్కొని అందొకదానిని గూర్చి క్లుప్తముగా వర్ణింపుడు.
7. ఇండియాయొక్క శీతోష్ణస్థితికి కారణమగు భూగోళ లక్షణములను సంపూర్ణముగా వర్ణింపుడు.
8. ఈ క్రిందివానిలో ఏ ఐదింటినిగూర్చి యైనను క్లుప్తముగా వ్రాయుడు.

   (a) చికాగో (b) ఫార్మోజా (c) ఇస్టాంబుల్ (d) తుంగభద్ర ప్రాజెక్టు (e) బ్యూనస్ ఐరిస్ (f) సింగరేణి (g) మధుర (h) కాన్బెర్రా (i) జెమ్‌షెడ్‌పూర్.

**1951**

1. భూకంపములు ఎట్లు కలుగుచున్నవి? వాటి ఫలితములేవి? ఇటీవల అస్సాములో సంభవించిన భూకంపమును పై వాటిని బట్టి పరిశీలింపుడు.
2. ఋతుపవన మండలముయొక్క ముఖ్య లక్షణములేవి? ప్రపంచములో ఇట్టిమండలము లెచ్చటకలవు? అందలి వ్యవసాయోత్పత్తులేవి?
3. పట సహాయమున ఈ క్రిందివాటిలో ఏ మూటినైన వివరించి, అవి ఎట్లు ఏర్పడినవో క్లుప్తముగా వ్రాయుడు.

   (a) అగ్నిపర్వత సంబంధమైన పర్వతము (*b*) జల, స్థల పవనములు (c) ఫియోర్డులు (d) ఒయేసిస్సు (e) గెయిజరు.
4. ఇండియా పటముమీద ఈ దిగువ ఉత్పత్తులుకల ప్రదేశములను గుర్తింపుడు.

   (a) ప్రత్తి (b) తేయాకు (c) నార.

   మరియు ఈ ఉత్పత్తులకు సంబంధించిన ముఖ్య పారిశ్రామిక ప్రదేశములను కూడ గుర్తింపుడు.

5. హైదరాబాదు రాష్ట్రములోని జిల్లాలలో ఏది ఎక్కువగ కఱవులకు గురిఅగుచుండును? ఈ ప్రదేశములలో ప్రభుత్వమ తీసుకున్న కఱవు నివారణ చర్యలేవి?
6. ఆఫ్రికాలోని ముఖ్య సహజ మండలములేవి? అందు ఒక దానినిగూర్చి క్లుప్తముగా వర్ణింపుడు.
7. సూయజు కాలువను వర్ణించి దాని వ్యాపార ప్రాముఖ్యత వివరింపుడు.
8. ఇంగ్లండు యొక్కగాని అ. సం. రా. యొక్కగాని పారి శ్రామి కాభివృద్ధికి కారణములు వ్రాసి వాటిలోని ముఖ్య పరిశ్రమలను పేర్కొనుడు.
9. క్రింది వానిలో ఏ ఐదింటిని గూర్చియైనను క్లుప్తముగా వ్రాయుడు.

(a) పెకింగ్ (b) లేక్ సక్సెస్ (c) కీలుకాలువ (d) మధుర (e) వ్లాడివాస్టక్ (f) అలెగ్జాండ్రియా (g) సియోల్ (h) జకార్తా (i) రయోడిజనీరో.

## 1952

1. నదియొక్క చర్యకును, హిమానీ నదముయొక్క చర్యకును పోలికలు, భేదములు వ్రాయుడు.
2. సముద్ర ప్రవాహములు ఏదేశముల సమీపమున ప్రవహించునో వాటి శీతోష్ణస్థితిపై ఎట్టి ప్రభావమును కలిగియున్నవో వివ రింపుడు. ఏదైన ఒక ముఖ్య సముద్ర ప్రవాహముయొక్క మార్గమును వర్ణింపుడు.
3. ఇండియాలో అనుసరింపబడు వివిధ నీటిపారుదల ఏర్పాట్లను వర్ణింపుడు. ఆ విధమగు ఏర్పాట్లు ఎచ్చటెచ్చట కలవు?

4. నైలులోయ ఉనికిని తెలిపి దాని భౌగోళిక ప్రాముఖ్యతను వివరింపుడు.

5. బ్రిటిషు దీవులలోని ప్రజల పనిపాటల పైనను, జీవితము పైనను భూగోళ పరిస్థితులకుగల ప్రభావములను వర్ణింపుడు.

6. హైదరాబాదురాష్ట్రి పటము మీద ముఖ్య రైలుమార్గములను, ఈక్రింది ప్రదేశములను గుర్తింపుడు.
   (a) డోర్నకలు (b) కాజీపేట (c) సికింద్రాబాదు (d) వాడీ (e) ఔరంగాబాదు (f) బీదర్.

7. హైదరాబాదు రాష్ట్రములోని కొన్ని ముఖ్య యంత్ర పరిశ్రమలను పేర్కొనుడు. వాటి అభివృద్ధికి ఎట్టి చర్యలు తీసుకొన బడినవి ?

8. ఇండియా పటమును గీచి దానిమీద విమాన మార్గములను అందలి విమానాశ్రయములను గుర్తింపుడు.

9. అమెరికా సంయుక్తరాష్ట్రముల పారిశ్రామికాభివృద్ధికి కారణములను తెలిపి, దాని ముఖ్య పరిశ్రమలను పేర్కొనుడు.

10. ఈ క్రిందివానిలో ఏ ఐదింటిని గూర్చి యైనను క్లుప్తముగా వ్రాయుడు.
   (a) రంగూను (b) ఢిల్లీ (c) చిరపుంజి (d) కైరో (e) అర్జెంటైనా (f) వాషింగ్టను (g) సిడ్నీ (h) మాంట్రియల్ (i) జొహాన్స్‌బర్గు.

**1953**

1. అక్షాంశ. తులాంశముల యొక్క ప్రాముఖ్యతను వివరింపుడు.

2. ఒక ప్రదేశము యొక్క మార్పునకు కారణ భూతమగు అంశము లేవి ?

3. భూమధ్య రేఖాప్రాంతపు అధిక వర్షపాతమునకు కారణమేమి?
4. జపాను ప్రాచ్య బ్రిటిషు దీవులని అందురు. ఈ వాక్యము ఎంతవరకు సమంజసము ?
5. స్విట్జర్లండులో చాలినంత ముడిసరకులు లేకపోయినను పారిశ్రామికముగా ఎట్లు అభివృద్ధి పొందెనో వివరింపుడు.
6. ఈజిప్టు నైలునదియొక్క ప్రసారము. ఎట్లో చూపుడు.
7. ఇంగ్లండు దేశముయొక్క ఏప్రాంతములు అధిక జనసాంద్రతను కలిగియున్నవి ? ఏల ?
8. ఆఫ్రికాలో ఒకేసమయమున వేర్వేరు ఋతువులను చూడవచ్చును – ఇది ఎట్లు సాధ్యము ?
9. (a) ఇండియా పటము గీచి అందలి వివిధ రైలు మార్గములను ముఖ్య రైల్వే స్టేషనులను గుర్తింపుడు.
   (b) దక్కను పటముగీచి అందలి వివిధ రైలుమార్గములను ముఖ్య రైల్వే స్టేషనులను గుర్తింపుడు.
10. ఏ మూటినిగూర్చియైనను క్లుప్తముగా వ్రాయుడు.
   (a) మధ్యధరా మండలము.
   (b) బొంబాయి, మార్సెయిల్స్
   (c) చంద్రగహణము
   (d) దక్కనుయొక్క ఎగుమతులు
   (e) పనామా కాలువ.

2. (a) ఆంగ్లేయులును, స్పెయినువారును ఆక్రమించిన ప్రదేశములు చాల సారవంత మైనవి. ఈ ప్రదేశములలో వారికి వ్యవసాయపు పనులలో సహాయము చేయుటకు మనుష్యులు కావలసి వచ్చిరి. అప్పుడు ఆఫ్రికానుండి నీగ్రోబానిసలను కొని తెచ్చుచుండిరి. ఈ నీగ్రోబానిసలు సంయుక్త రాష్ట్రముల దక్షిణ భాగములోనే ఎక్కువగానుండిరి. ఏలన అక్కడ పంటభూము లెక్కువ. ఉత్తరమున పరిశ్రమ లెక్కువ. అక్కడ తెల్లకూలీలే పనిచేయుచుండిరి. కావున నీగ్రో సమస్య దక్షిణరాష్ట్రముల సమస్య అయ్యెను. 1861-65 మధ్య అంతః కలహము ఈ సమస్యమీదనే వచ్చెను. బానిసతనము రద్దుచేయబడెను. అప్పటి నీగ్రోలు అమెరికాలోనే ఉండిపోయిరి. ఇప్పుడు వీరు సంయుక్తరాష్ట్రముల దక్షిణ ప్రాంతములోను, పశ్చిమ ఇండియా దీవులలోను కలరు. తెల్లవారు వారిని ఇంకను బాధించుచునే యున్నను వారు చాల నాగరికులైరి. వారిలో పండితులు, లాయర్లు, గొప్ప ఆటగాండ్రు, రచయితలు, వక్తలు, గాయకులు బయలుదేరిరి. యుద్ధములో తెల్లవారి ప్రక్కన నిలిచి పోరిరి. పాఠశాలలలో నీగ్రోలను దూరము చేయకూడదని శాసనము చేయబడెను. క్రమముగా వారిస్థితి బాగుపడ గలదు. కెనడా, సంయుక్త రాష్ట్రములలో ఇంగ్లీషు, ఫ్రెంచి ప్రజల సంతతి వారున్నారు.

(b) ఇటీవల అనేకమంది ఐరోపీయులు అమెరికాకు వచ్చి స్థిరపడిరి. ఇంకను కొందరు వచ్చుచునే యున్నారు.

(c) ఆసియానుండి కూడ వచ్చి చాలమంది అమెరికాలో స్థిరనివాసులైరి. మన దేశస్థులు అమెరికా పౌరులైన వారు చాలమందికలరు. చైనా, జపానులనుండికూడ అనేకులు వచ్చి పడమటి తీరమున స్థిరపడిరి.






ఉత్తర అమెరికా - జనసాంద్రత

ఆదిమ నివాసులు దేశమధ్యమందే కలరు. కాని క్రొత్తగా వచ్చినవారు సముద్రతీరములందు నివసింతురు. ఆస్ట్రేలియా, దక్షిణ అమెరికాలలోని పట్టణములలో కూడ ఇట్లే ఉన్నట్లు చూచితిమి. మరియు జన సాంద్రత జీవనాధారము కల చోట్ల అధికముగా నుండును. ఉత్తర అమెరికా తూర్పుతీరమున వర్షమెక్కువ. సారవంతమైన భూమి ఉండుటచేతను, మొట్ట మొదట వలసలు ఇక్కడనే ఏర్పడుటచేతను ఈ ప్రాంతమున జనసాంద్రత ఎక్కువ. ఆర్కిటిక్ ప్రాంతములో జనసంఖ్య బహు తక్కువ. రాకీ పర్వతములమీద ఎడారి భూములలోకూడ జనసంఖ్య తక్కువ. మధ్యనదీ మైదానములో కూడ జనసంఖ్య ఎక్కువగానున్నది. న్యూయార్కు ప్రాంతములో మిక్కిలి దట్ట మైన జనసంఖ్య కలదు. ఏలన ఇచ్చట పరిశ్రమలు ఎక్కువగా కలవు. సంయుక్త రాష్ట్రముల పడమట కాలిఫోర్నియాలో కూడ జనసంఖ్య కొంత హెచ్చుగానే ఉండును. ఒకప్పుడు ఇక్కడ బంగారు గనులలో పనిచేయుటకువచ్చి జనులు స్థిరపడిపోవుటయే ఇందుకు కారణము. ఈ ప్రాంతములో మధ్యధరా శీతోష్ణస్థితి కూడ మరొక కారణము.

కెనడాలో అధికభాగము శీతలప్రదేశము. కావున ఆ భాగములో జనసంఖ్య తక్కువ. కెనడాకు దక్షిణభాగములో సంయుక్తరాష్ట్రముల సరిహద్దుకు ఉత్తరమున జనసంఖ్య అధికము.

మెక్సికోలోకూడ జనసంఖ్య హెచ్చుగానే ఉన్నది. ఇచ్చట పర్వత లోయలలోను, పీఠభూముల మీదను అధిక వర్షము

కురియుట, నేల సారవంతమైనదగుట, మైదానములు ఫల వంతములగుట ఇందుకు కారణము.

మొత్తముమీద ఉత్తర అమెరికా జనసంఖ్య తక్కువే. సంయుక్త రాష్ట్రములలో మాత్రము హెచ్చుమంది కలరు. ఆ ఖండములో సగటు జనసాంద్రత చదరపు మైలుకు 17 మంది.

ఉత్తర అమెరికా జంతు జాలములో తూర్పు ఆసియా యొక్కయు, ఐరోపాయొక్కయు లక్షణములు కలవు. కొన్ని టికి ప్రత్యేకత కూడ కలదు. ఆమెరికాకు ప్రత్యేకమైనవి సీలు, లేళ్ళు, మేకలు, మోలు, చుంచు, కొన్ని పక్షులు, అడవిదున్నలు. ఇతర ఖండములతో సంబంధము కలవి ఎలుగుబంట్లు, తోడేళ్ళు, చిరుతపులులు, నక్కలు, మొదలైనవి. వలస వచ్చిన ఐరోపీయులు గుఱ్ఱము, ఆవు, గొఱ్ఱె, మేక, పంది మొదలగు పెంపుడు జంతువులను ప్రవేశ పెట్టిరి.

---

# 7. రాజకీయ విభాగములు, గ్రీన్‌లాండు

ఉత్తర అమెరికాలో గ్రీన్‌లాండు, కెనడా, అమెరికా సంయుక్త రాష్ట్రములు, మెక్సికో, మధ్య అమెరికారాష్ట్రములు, పడమటి ఇండియాదీవులు అను రాజకీయభాగములు కలవు. వీనిలో ఒక్కొక్క దానిని గూర్చి విపులముగా తెలిసికొనవలసి యున్నది.




ఉత్తర అమెరికా రాజకీయ విభాగములు

## గ్రీన్‌లాండు

పటములో గ్రీన్‌లాండును చూడుడు. ఇది చాల పెద్ద ద్వీపము. కెనడా వైశాల్యములో దాదాపు మూడవ వంతుం

డును. ఈద్వీపము ఎల్లప్పుడును మంచుతో కప్పబడియుండును. అక్కడక్కడ పర్వతశిఖరములును, కొన్ని తీరమైదానములును



ఎస్కిమో స్త్రీలు బిడ్డలను మోయు విధానము, ఉత్తర గ్రీన్‌లాండ్

మాత్రము అంతగా మంచులో కప్పబడుటలేదు. ఇక్కడి మంచు ఒకమైలు దళసరిగానుండును. ఎంత వేసవిలో నైనను పైపొర మాత్రము కొంచెము కరుగును. దీనిలో మంచుపొర నెమ్మది నెమ్మదిగా జరుగుచు సముద్రమువద్దకు వచ్చినపుడు పెద్దపెద్ద గడ్డలుగా విరిగిపోయి లాబ్రడారు శీతలజల ప్రవాహములో పడి

కొట్టుకొని పోవుచుండును. వీటిని ఐస్ బర్గులు (Ice bergs) అందురు. ఇవి కొంచెము మాత్రము పైకి కనబడుచు దానికి తొమ్మిదిరెట్లు నీటి అడుగున నుండును. అందుచే చాల ప్రమాద కరమైనవి.

పదవ శతాబ్దములో ఎరిక్ ది రెడ్ (Eric the Red) అను వాని నాయకత్వమున కొందరు నార్వే దేశపు నావికులు ఈ ద్వీపమునకు వచ్చి స్థిరపడిరి. గ్రీన్‌లాండ్ అను మంచి పేరు పెట్టిన చాలమంది స్థిరపడుటకు వత్తురని ఆ పేరు పెట్టెను. కాని ఆ ఆశ ఫలించలేదు.

గ్రీన్‌లాండులో తీరప్రాంతమందు ఎస్కిమోలు కలరు. వీరినిగూర్చి ఇదివరకే చదివితిరి. ఈ దేశము ఇప్పుడు డెన్మార్కు అధీనములో నున్నది.

---

## 8. కెనడా - న్యూఫౌండ్‌లాండ్

కెనడాదేశము బ్రిటిషువారి డొమీనియను. ఇప్పుడు కామ న్వెల్తులో ఒక సభ్యదేశము. దీని వైశాల్యము సంయుక్తరాష్ట్ర ములకంటె ఎక్కువ. 35 లక్షల చదరపు మైళ్లున్నది. జనసంఖ్య (1950 లో) 14 మిలియనులు. ఈ జనసంఖ్యలో అనేక జాతులు కలవు. వీరందరును ఒకే ప్రభుత్వముక్రింద నున్నను మన దేశములోవలె వేర్వేరు భాషలు మాట్లాడుదురు. వారు

ఫ్రాన్సు, ఇంగ్లండు, స్కాట్లండు, ఐర్లండు, జర్మనీ దేశములనుండి వచ్చి తమ ప్రత్యేకతను నేటికిని నిలబెట్టుకొనుచున్నారు. దేశము పెద్దదైనను అనేక భాగములు వాసయోగ్యములు కావు. అందుచే అత్యధిక జనసంఖ్య సంయుక్తరాష్ట్రముల సరిహద్దు ప్రాంతముననే కలదు. ఈ దేశములో ఈ దిగువ రాష్ట్రము లున్నవి. అవి నోవాస్కోషియా, న్యూబ్రన్స్‌విక్, ప్రిన్సు ఎడ్వర్డు ద్వీపము, న్యూఫౌండ్ లాండు, క్విబెక్, అంటారియో, మానిటోబా, సాస్కాచవాన్, ఆల్బర్టా, బ్రిటిషుకొలంబియా, యూకన్, వాయువ్య ప్రాంతము. కాని కెనడాను నాలుగు సహజమండలములుగా విభజించి పరిశీలించుట లాభదాయకము. అవి తూర్పు కెనడా, ప్రెయిరీ మండలము, రాకీ పర్వతప్రాంతముతో కూడిన పశ్చిమ కెనడా, ఉత్తర కెనడా.

---

# 9. ఉత్తర కెనడా

కెనడాకు ఉత్తరమున అనేక ద్వీపము లున్నవి. ఇవన్నియు నిర్మానుష్యమైన టండ్రాభూములు. కొన్నిటిలో మాత్రము ఎస్కిమోలు కలరు. సంవత్సరములో అధికభాగము మంచుతో కప్పబడి యుండును. ద్వీపములకు దక్షిణమున ప్రధాన భూభాగములోకూడ టండ్రా ప్రదేశము కలదు. ఇదికూడ వాసయోగ్యమైనదికాదు. ఇక్కడ కొద్దిగా గడ్డి, నాచుమొక్కలు ఉండును.

టండ్రాలకు దక్షిణమున శృంగాకారారణ్యములు కలవు. ఈ అరణ్యములు అలాస్కానుండి లాబ్రడారు వరకును, దక్షిణమున




కెనడా సహజభాగములు

దాదాపు సరస్సులవరకును వ్యాపించియున్నవి. ఆదిమనివాసులు ఈ అరణ్యములలో మృదు రోమముగల జంతువులను వేటాడి హడ్సన్‌బేకంపెనీ వారికి అమ్ముచుండిరి. కాని ఆజాతులు ఇప్పుడు చాలవరకు నశించినవి. ఇచ్చట కలపను పలకలుగా కోయుట, కాగితములకు పనికివచ్చు గుజ్జుచేయుట ముఖ్య వృత్తులు. ఈ పరిశ్రమ సరస్సుల ప్రాంతమున అధికముగా నున్నది. ఇచ్చట రంపపు మిల్లులు నీటిప్రవాహమునకే తిరుగుచుండును. ఈ అరణ్యముల అడుగున కఠిన శిల కలదు. కావుననే ఈ ప్రాంతమునకు కెనేడియన్‌షీల్డు మరియు లారెన్షియను పీఠభూమి అను పేర్లు కలవు.

సరస్సుల ఉత్తరభాగమున సడ్బరీ ప్రాంతమున బంగార మున్నట్లు కనుగొనబడినది. ఇచ్చట నికెలు, రాగి, కూడ త్రవ్వ



కెనడాలోని కలప పరిశ్రమ. దుంగలను ఘనీభవించిన నదులపైకి గుఱ్ఱములచేత లాగించుట.

చున్నారు. ఇనుముకూడ కలదు. కోబాల్టు వద్ద వెండి, కోబాల్టులు త్రవ్వబడుచున్నవి.



కెనడా కలప పరిశ్రమ - నదులగుండా గొనితేబడిన దూలములను కోత యంత్రశాలకు చేర్చుచున్నారు.

శృంగాకారారణ్య ప్రాంతము అతి శీతల మగుటచే వ్యవసాయమున కనుకూలము కాదు. కాని దక్షిణపు టంచులలో కొద్దిగా జరుగుచున్నది. శీతలత వల్ల భూమి సారవంతమైనది కాదు.

న్యూ ఫౌండ్ లాండు, లాబ్రడారు తీరప్రదేశము సహజముగ ఈ భాగము లోనివే. కాని ఇవి ఇదివరకు కెనడాలో చేరక ప్రత్యేకముగా నుండెను. 1949 నుండి కెనడాలో ఒక రాష్ట్రి



న్యూ ఫౌండ్ లాండులో చేపలవేట - ట్రాలర్లు.

మయ్యెను. ఈ ద్వీపము సెంట్‌లారెన్సునదీ ముఖద్వారమునకు ఎదురుగా నున్నది. ఈ ద్వీపమునకు ఉత్తరమునకల జలభాగము సంవత్సరములో ఏడు మాసములు గడ్డకట్టి యుండును. దీనికి దక్షిణమున సముద్రము అంత ఎక్కువకాలము గడ్డ కట్టదు. ఈ ద్వీపము పర్వతమయము. అనేక ఫియోర్డులు ఉత్తరమునను, దక్షిణమునను కలవు. లోపల పర్వతపంక్తులును వాని మధ్య సరస్సులును కలవు. అచ్చటచ్చట శృంగాకారారణ్యములు కలవు.

ఈ ద్వీపములో ఇనుము కనుగొనబడినది. బొగ్గు కూడ కలదు. ఈ ద్వీపమునకు సమీపమున చేపల పరిశ్రమ హెచ్చుగా కలదు. ఈ ద్వీపమునకు ఆగ్నేయముగా సముద్రములో మునిగి యున్న గ్రేట్ బాంక్సు (Great Banks) అనుచోట కాడ్, హెర్రింగు చేపలను అధికముగా పట్టుచున్నారు. ఇచ్చట సీలు దొరకును.

న్యూఫౌండులాండుకు రాజధాని సెంట్ జాన్స్, చక్కని హార్బరు కలదు.

---

# 10. పశ్చిమ కెనడా

ఇందులో రాకీ పర్వతప్రాంతమగు బ్రిటిషు కొలంబియా దాని ఉత్తరమున కల యూకన్ ప్రాంతము చేరియున్నవి. ఇచ్చట తీరము నార్వే, స్కాట్లండు తీరములవలె అసంఖ్యాకమగు ఫియోర్డులను కలిగియున్నది. ఈ ఫియోర్డుల సమీపమునగల ద్వీపములుకూడ పర్వతమయములు. వీటిలో మిక్కిలి పెద్ద

ద్వీపము వాంకూవరు. తీరము వెంబడి కోస్టురేంజి వరుస, దానికి తూర్పున ఎత్తయిన వర్షశూన్యమైన పీఠభూములు, తర్వాత సెల్‌కర్కుపంక్తి, దాని తర్వాత మహోన్నతమైన రాకీ పర్వతముల వరుస కలవు. యూకన్ ప్రాంతమంతయు కూడ పర్వతమయమే. దానిలో యూకన్‌నది ప్రవహించుచున్నది. ఈనది అలాస్కాలోకూడ ప్రవహించి బేరింగు జలసంధిలో కలియుచున్నది. ఈనదిలో చిన్న నౌకలు జూన్‌నుండి అక్టోబరు వరకు ప్రయాణము చేయగలవు. ముఖద్వారమువద్ద డెల్టాయుండుటచే రేవు లేదు.

ఇచ్చట కొద్ది పీఠభూమికాక మిగిలిన పర్వతములు శృంగాకారారణ్యములతో నిండియుండును. వీటిలో డగ్లస్ ఫర్,



బ్రిటిషు కొలంబియాలోని కలప పరిశ్రమ

ఎఱ్ఱసీడరు, తెల్లపైను జాతి చెట్లుకలవు. డగ్లస్ ఫర్ చాల ఎత్తుగా పెరిగెడి గొప్పచెట్టని ఈవరకే చెప్పబడినది. ఈ చెట్లనుండి ఇండ్లకు పనికివచ్చు కలప చాలవరకు లభించుచున్నది.



బ్రిటిషు కొలంబియాలో ప్లైవుడ్ పరిశ్రమ డగ్లస్ఫర్ జాతిచెట్ల మెత్తనికలప నుపయోగింతురు.

బ్రిటిషు కొలంబియాలో గనులు చాల గలవు. బొగ్గు, బంగారము, వెండి, రాగి, సీసము రాకీపర్వతముల పశ్చిమమున కనుగొన బడినవి. యూకన్‌లో క్లాండైక్స్ బంగారు గనులు బొగ్గు గనులు కలవు. కాని అతి చలిచేత అంతగా త్రవ్వబడుట లేదు.

ఈ ప్రాంతము చేపల పరిశ్రమకు చాల ప్రసిద్ధమైనది. సామన్ చేపలు ఈ ప్రాంతమున సముద్రములోనుండి నదుల



బ్రిటిషు కొలంబియా సామన్ చేపలు

లోనికి పోవును. వాటిని పట్టుట అక్కడ ఒక ముఖ్యవృత్తి. ఇది కాక సముద్రములోనే చేపలను పట్టుదురు. కొన్నిటిని ఎండ బెట్టుదురు. కొన్నిటిని డబ్బాలలో నిలువ చేయుదురు.

బ్రిటిషు కొలంబియా తీరప్రాంతము వెచ్చగానుండును. కావున పండ్లతోటలు కలవు. ఆపిల్, పేర్, చెర్రీ, ప్లమ్, పీచ్, ద్రాక్ష మొదలగు ఇంగ్లీషు ఫలములు చక్కగా పండింపబడు చున్నవి.

పసిఫిక్ సముద్రతీరమునుండి అట్లాంటిక్ తీరమునకు బ్రిటిషు కొలంబియాగుండా రెండు ఖండాంతర్గత రైలు




మార్గములు కలవు. ఒకటి వాంకూవరునుండి ఫ్రేజర్ నదీలోయకు కింగ్ హార్స్ కనుమగుండా వేయబడినది. దీనికి కెనేడియన్ పసిఫిక్ రైలుమార్గ మందురు. రెండవది ప్రిన్సు రూపర్టు నుండి రాకీ

పర్వతములు దాటినది. దీనికి కెనేడియన్ నేషనల్ రైల్వే అందురు. ఈ రైలు మార్గములు మంచుచే కప్పబడకుండ సంరక్షింపబడవలసి యున్నది. హటాత్తుగా కొండలపైనుండి మంచు



బ్రిటిషు కొలంబియాయొక్క రాజధానినగరమగు విక్టోరియా రేవు పట్టణము

పడి మార్గమును కప్పివేయుచుండును. శీతకాలములో నాగలి సహాయముతో మంచును తొలగించు చుందురు.

బ్రిటిషు కొలంబియాకు విక్టోరియా ముఖ్య పట్టణము. చక్కని రేవు. ఇచ్చటినుండి చైనా జపానులతోను, ఇతర దేశములతోను మంచి వర్తకము జరుగుచున్నది.

---

# 11. ప్రెయిరీ మండలము

ఈ మండలము వృక్షములులేని గడ్డిమైదానము. ఇది సుపీరియరు సరస్సుకు పడమటినుండి రాకీ పర్వత పాదముల వరకు 700 మైళ్ళు పొడవు 200 మైళ్ళు వెడల్పున వ్యాపించి యున్నది. మానిటోబా, సాస్కాచివాన్, ఆల్బర్టా రాష్ట్రముల దక్షిణభాగములు చేరియున్నవి. ఈ ప్రెయిరీ మండలము తూర్పు నుండి పడమరవరకు పోవుకొలది ఎత్తగుచుండును. మరియు తూర్పునుండి పడమరకు పోయినకొలది వర్షపాతముకూడ తగ్గు చుండును. కాబట్టి ఈమండలమును మానిటోబాలోని పల్లపు ప్రెయిరీలు, సాస్కాచివానులోని మధ్యప్రెయిరీలు, ఆల్బర్టా లోని ఎత్తు ప్రెయిరీలు అను మూడుభాగములుగా చేయవచ్చును.

పల్లపు ప్రెయిరీ ప్రదేశము చాల సారవంతమైనది. వర్ష పాతము తక్కువైనను అనుకూలమైనది. ఇచట గోధుమపంట ప్రసిద్ధమైనది. ప్రజలకు వ్యవసాయము ముఖ్యవృత్తి, మధ్య



కెనడాలోని వ్యవసాయము, వ్యవసాయపు పనులన్నిటికిని యంత్రములనే ఉపయోగించుట పటమున చూడవచ్చును.

ప్రెయిరీలలోకూడ గోధుమపంట ఎక్కువేకాని వర్షము తక్కువైనచోట్ల, గొఱ్ఱెలను మేపుచున్నారు. ఎత్తు ప్రెయిరీలలో వర్షము బాగా తక్కువ. గొఱ్ఱెల పెంపకము ముఖ్య వృత్తి అయినను గోధుమ కూడ కొద్దిగా పండింపబడు చున్నది.

గోధుమను మే నెలలో విత్తనములు చల్లి సెప్టెంబరులో కోయుదురు. ఒక్కొక్కప్పుడు ఆకురాలు కాలపు మంచు ముందుగావచ్చి పంటను నాశనము చేయుచుండును. జనబలము తక్కువగుటచే ట్రాక్టరులవంటి యంత్రముల నధికముగా ఉపయోగించు చున్నారు. సరకు నాణ్యతను కాపాడుట, ధరలను స్థిరీకరించుట మొదలగు చర్యల ద్వారా మంచి వర్తకము చేయుచున్నారు. మన దేశములో ఆహారపదార్థములు కొరతగా నున్నపుడు కెనడా, సంయుక్త రాష్ట్రములు, ఆస్ట్రేలియాలు గోధుమను సరఫరాచేసినవి. ఇప్పటికిని గోధుమ ఎగుమతిలో వీటి స్థానము చెక్కుచెదరలేదు. పండిన గోధుమను అదను వచ్చునపుడు తీసుకొనిపోవువరకు ఎలివేటర్లను ప్రత్యేక నిర్మాణములలో నిలువ చేయుదురు. రైలుమార్గములు పర్పడిన తరువాత ఇవి ఎక్కువ ఉపయోగకరముగా నున్నవి. ఎక్కువ మంది ప్రజలుకూడ ప్రెయిరీ ప్రాంతములలో స్థిరపడుచు గోధుమ ఉత్పత్తిని అధికము చేయుటలో తోడ్పడుచున్నారు.

గోధుమకు కేంద్రము విన్నిపెగ్. ఇది మానిటోబా రాష్ట్రమునకు ముఖ్య పట్టణము. 40 సంవత్సరముల క్రితము చిన్న పల్లెగానున్న ఇది ఇపుడు రెండు లక్షలకు పైన జనసంఖ్య



సాస్కాచివాన్ రాష్ట్రమునందలి విశాలమగుగోధుమ పొలములు.
వానివెనుక ఎలివేటర్లను గమనింపుడు.



విన్నిపెగ్ నగరములోని కొంతభాగము - గోధుమ వ్యాపార కేంద్రము

గల ఆధునిక పట్టణమైనది. ఇది ఎఱ్ఱనది (Red river) మీద విన్నిపెగ్ సరస్సునకు దక్షిణమున నున్నది. గోధుమ పంట భూములకు ముఖద్వారము వంటిది. దీని ద్వారానే పండిన గోధుమ పోవలయును. మరియు మంచి రైల్వే కేంద్రము. రెండు ఖండాంతర్గత రైలుమార్గములును, ఇతర మార్గములును ఇచ్చట కలియును.

ఈ ప్రాంతములో గోధుమ ముఖ్యపంట అయినను ఓట్లు, బార్లీ, బటానీలు, చిక్కుళ్ళు, బంగాళాదుంపలు పండింప బడు చున్నవి. గుఱ్ఱములు, ఆవులు, గొఱ్ఱెలు కూడ పోషింబడు చున్నవి.

ప్రెయిరీ మండలములో ఖనిజసంపద ఎక్కువగా లేదు. ఆల్బర్టాలో బొగ్గు, సహజవాయువు (Natural gas) లభించు చున్నవి. ఈ వాయువు నుపయోగించి యంత్రములు నడుపు చున్నారు. విన్నిపెగ్ కాక మానిటోబా రాష్ట్రములో బ్రాండను, సాస్కాచివానులో రెజీనా, సాస్కటూను, ఆల్బర్టాలో ఎడ్మాంటను, కాల్గరీలు ముఖ్యమైనవి.

1912 నుండి మానిటోబా, సాస్కాచివాను, ఆల్బర్టా, బ్రిటిషు కొలంబియాలకు ఉత్తరపుసరిహద్దు 60 వ అక్షాంశముగా నిర్ణయింపబడినది. ఆ అక్షాంశమునకు ఉత్తరమున యూకన్, ఉత్తర ప్రాంతములు కలవు.

---

# 12. తూర్పు కెనడా - సెంట్ లారెన్సు మండలము

ఈ ప్రాంతము కూడ కెనడాకు అత్యంత ముఖ్యమైనది. కెనడాలో ఫ్రెంచివారు మొట్టమొదట ఈ ప్రాంతములోనే స్థిరనివాసము లేర్పరచుకొనిరి. వారు అడవులను నరికి పల్లెలను, పట్టణములను నిర్మించిరి. వ్యవసాయమును వృద్ధిచేసిరి. ఈ ప్రాంతములో నోవాస్కోషియా, ప్రిన్సు ఎడ్వర్డ్ ద్వీపము, న్యూబ్రన్స్‌విక్, క్విబెక్, అంటారియో రాష్ట్రములు కలవు. వీటన్నిటిలోను వ్యవసాయము ముఖ్యవృత్తి. కెనడా దేశము లోని జనులలో మూడు పావులు ఇచ్చటనే నివసించు చున్నారు. కాని ఇటీవల రైలుమార్గముల ప్రభావమువల్ల ప్రెయిరీ మండలములో జనసంఖ్య హెచ్చుచున్నది. ఇచ్చట సహజవృక్షజాలము శృంగాకారారణ్యములు, ఆకురాలు విశాల పత్రారణ్యములు.

వ్యవసాయములో ఇచ్చట ఓట్లు ముఖ్యపంట; గోధుమ, బంగాళాదుంపలు, బార్లీకూడ పండును. కాని గోధుమ వర్షము తక్కువగల లోపలిభాగములలో చక్కగా పైరగును. పండ్ల పరిశ్రమ కూడ చాల ముఖ్యమైనది. ఆపిలు పండ్లకు ఈ ప్రాంతము ప్రసిద్ధమైనది. అందు నోవాస్కోషియా, అంటారియోలు అగ్ర స్థానము వహించినవి. నోవాస్కోషియాలోని అన్నాపోలిస్‌లోయ పూర్తిగా తోటల మయము. మనదేశమున హిమాచల ప్రదేశ్‌లో కులూలోయ కూడ ఇట్టిదే. లేక్‌పెనిన్సులా అని పిలువబడు దక్షిణ

అంటారియోలోని సారవంతమైన భూమియు, వేసవిలోని వెచ్చదనమును పండ్లతోటలకు అనుకూలముగానున్నవి. ఇచ్చట ద్రాక్ష, ఆలిపు, అత్తి, పీచ్, ఏప్రికాట్ మొదలైన పండ్లు పండును.

ఈ ప్రాంతములో పశుపోషణ మరొక ముఖ్యవృత్తి. ఇచ్చట వర్షమెక్కువ కనుక పాడి ఆవులను పోషింతురు. కెనడాలోని ఆవులలో మూడింట రెండువంతులు ఇచ్చటనే కలవు. ఇచ్చట వెన్న, జున్ను, గడ్డిపాలు చేయుదురు. ఇటీవల పాలపొడి కూడ చేయుచున్నారు, ఇందులో అధికభాగము ఇంగ్లండునకు ఎగుమతి అగుచున్నది. ఆవులు కాక ఈ ప్రాంతములో గొఱ్ఱెలు, పందులు, కోళ్లుకూడ పోషింప బడుచున్నవి.

కలప పరిశ్రమకూడ ముఖ్యమైనది. ఈ ప్రాంతములో శృంగాకారారణ్యములు, ఆకురాలు విశాల పత్రారణ్యములు కలవని ఈవరకే చదివితిరి. న్యూబ్రన్స్‌విక్ రాష్ట్రములోని సెంట్ జాన్ ఈ పరిశ్రమకు కేంద్రము. స్ప్రూస్, సీడర్, బర్చ్, ఓక్ చెట్ల కలప ఇంగ్లండు, సంయుక్తరాష్ట్రములకు ముఖ్యముగా ఎగుమతి అగుచున్నది. క్విబెక్ పట్టణము ఈ పరిశ్రమమీదనే వృద్ధిపొందినది. ఒట్టావా కూడ ఇట్టి కేంద్రమే. శీతకాలములో నరికినచెట్లు మంచు కరుగగానే నదులలో కొట్టుకొని వచ్చును. ఇవి రంపపు కోతమిల్లులో వేర్వేరు సైజులుగా కోయబడును. లేదా కాగితపు గుజ్జు తయారుచేయు మిల్లులో మెత్తగా గుజ్జు చేయబడును. ఈ మిల్లులు జలపాత విద్యుచ్ఛక్తితో పని చేయును. ఈ గుజ్జుతో న్యూసుప్రింటు, రేయన్ పట్టు చేయు



కెనడాలో ఒక పశువుల కొట్టము.

దురు. న్యూఫౌండ్ లాండులో కాగితపుగుజ్జు ఎక్కువగా చేయుచున్నారు.

న్యూఫౌండులాండు తీరమున చేపల పరిశ్రమ ఎక్కువగా నున్నదని ఇదివరకే చెప్పియున్నాము. ఇచ్చట గ్రాండ్ బాంక్స్ ప్రాంతమున, కాడ్, హెర్రింగ్, హాలీబట్, హాడక్ చేపలను పట్టుచున్నారు. న్యూఫౌండ్ లాండు, న్యూబ్రన్స్విక్, నోవా స్కోషియాలలో బెస్తవృత్తిమీద జీవించువారు చాలమంది కలరు. ఇందుకు న్యూఫౌండులాండులోని సెంట్ జోన్సు, నోవా స్కోషియాలోని హాలిఫాక్సు ముఖ్య కేంద్రములు.

ఖనిజములు, యంత్రపరిశ్రమలు కూడ ఈ ప్రాంతమున కలవు. అంటారియో రాష్ట్రములో రాగి, వెండి, కోబాల్ట్, నికెల్ గనులు కనుగొనబడినవి. క్విబెక్ లో ఆస్బెస్టాస్ ఉత్పత్తి చాల ఎక్కువ. నోవాస్కోషియాలో బొగ్గుకలదు.

హాలిఫాక్స్ నోవాస్కోషియాకు రాజధాని. చక్కని నౌకాశ్రయముకల రేవుపట్టణము. సంవత్సరములో చాలకాలము నీరు గడ్డకట్టదు. కెనేడియన్ పసిఫికు రైలుమార్గము ఇచ్చట అంతమగును.

చార్లెట్ టౌన్ ప్రిన్స్ ఎడ్వర్డు ద్వీపమునకు రాజధాని. ఇచ్చట మెత్తని ఉన్నిగల జంతువులను వృద్ధిచేయు వ్యాపారము హెచ్చుచున్నది.

క్విబెక్ ఆ పేరుగల రాష్ట్రమునకు రాజధాని. సెంటులారెన్సు నదీ ముఖద్వారమునకు కొంతదూరమున నున్నది.

ఈ పట్టణములో ఫ్రెంచివారే ఎక్కువ. ఇచ్చట కలప పరిశ్రమ, పాడిపరిశ్రమ, నూలు పరిశ్రమ, చర్మపు పరిశ్రమ కలవు.

మాంట్రియల్ క్విబెక్ రాష్ట్రములోని గొప్ప పట్టణము. కెనడాదేశములోకెల్ల పెద్దది. సెంట్ లారెన్సు నదిలోని ఒక ద్వీపముమీద ఒట్టావానది కలియుచోట నిర్మితమైనది. ఒట్టావా ద్వారా పశ్చిమ ప్రాంతములతోను, సెంట్ లారెన్సు ద్వారా దేశమధ్యముతోను దీనికి సంబంధము కలదు. ఇచ్చటినుండి హడ్సన్ నది లోయగుండా న్యూయార్కునకు గూడ మార్గము



అంటారియో రాష్ట్రమందలి ఫోర్ట్ ఆర్థర్ వద్ద ఒక కోత యంత్రశాల, నదులమీద కలపతెప్పలు



కెనడా దేశపు రాజధాని నగరమగు ఒట్టావా

కలదు. ఇచట సెంట్ లారెన్సుమీద వంతెనకట్టి రైలుమార్గమును కూడ తెచ్చిరి. అందుచే వర్తక వ్యాపారములకు మంచి కేంద్రము. అనేక పరిశ్రమలు కూడ కలవు. ఈ నదీ తీరమున కల మౌంట్ రాయల్ అను పేరుగల పర్వత శిఖరమునుబట్టి ఈ పట్టణమునకు ఈ పేరు వచ్చినది.

టొరంటో పట్టణము అంటారియో రాష్ట్రమునకు రాజధాని. ఆ పేరుగల నదికి దక్షిణతీరమున నున్నది. కేంద్ర పార్లమెంటు సమావేశ మగుచుండును. గొప్ప కోతమిల్లులు కలవు. కాగితపుగుజ్జు, కాగితముకూడ తయారుచేయు యంత్రశాలలు కలవు. ఈ పరిశ్రమకు పోర్టు ఆర్థరు కేంద్రము.

ఒటవా కెనడా దేశమునకు రాజధాని. గొప్ప అంపపు మిల్లును కలవు. ఇవి జలపాత విద్యుచ్ఛక్తిచే నడుపబడుచున్నవి.

---

# 13. అమెరికా సంయుక్త రాష్ట్రములు

పరిసరములపై పోరాటము సలిపి మానవుడు ఎట్లు విజయము పొందగలడో పూర్తిగా రుజువు చేయుచున్న దేశము, అమెరికా సంయుక్త రాష్ట్రములు. తూర్పుతీరమున చిన్న వలసగా ప్రారంభమైన ఈ దేశము క్రమముగా పశ్చిమమునకు వ్యాపించి అనేక విధముల అభివృద్ధిచెంది నేడు ప్రపంచములో అన్ని దేశములలోను గొప్పదైనది. ఈ శతాబ్ద

ఆరంభమువరకు ఈ దేశములోకూడ వ్యవసాయమే ప్రధాన వృత్తి, కాని తరువాత పారిశ్రామికముగా కూడ అగ్రస్థానము వహించినది. ఇందుకు ఇచటి సౌమ్యమైన శీతోష్ణస్థితి, ఖనిజ సంపద, ప్రజల దీక్ష కారణములు. ఇది సంపూర్తిగా సమశీతోష్ణ మండలములోనుండి ప్రజల శారీరక, మానసిక శక్తులను పెంపొందించు చున్నది. ఇచ్చట సహజసంపద అపారము. ఖనిజములు, అడవులు, వ్యవసాయ భూములు, సముద్రములోని చేపలు మిక్కుటముగా నున్నవి. జనసంఖ్య పరిమితముగా నుండుటచే ఎప్పుడును ఆహారపదార్థముల నెగుమతిచేయు స్థితిలో నుందురు. ఇచ్చట కల బొగ్గు, ఇనుము, పెట్రోలియము, రాగి, ప్రత్తి మర యేదేశమందును లేవు. ఇట్లు అత్యధికమైన సహజసంద, మితమైన జనసంఖ్య యుండుటచే ప్రజల జీవనప్రమాణము హెచ్చుగా నున్నది.

ఈ దేశముయొక్క వైశాల్యము 2,977,128 చదరపు మైళ్ళు. జనసంఖ్య 15 కోట్లు. 250,000 ఎఱ్ఱ ఇండియనులు, 2 కోట్ల నీగ్రోలు కలరు. ఈ దేశము 48 రాష్ట్రముల సమాఖ్య (ఫెడరేషన్). రాష్ట్రము లన్నియు సమాన ప్రతిపత్తి కలవి. కేంద్రమునకు కొన్ని అధికారములను దత్తము చేసియుండెను. కాని ఇటీవల రాష్ట్రముల అధికారము తగ్గుచు, కేంద్రాధికారము ఎక్కువ అగుట జరుగుచున్నది.

శాస్త్రజ్ఞులు ఈ దేశమును ఈదిగువభాగములుగావిభజించి పరిశీలించు చున్నారు. (1) ఈశాన్యవ్యాపార పారిశ్రామిక

మండలము (a) అపలేషియన్ పర్వత ప్రాంతము, (b) తూర్పు తీర మైదానము. (2) ఆగ్నేయ వ్యవసాయ మండలము (3) మధ్య వ్యవసాయ మండలము (ప్రెయిరీ మండలము) (4) రాకీ పర్వత మండలము (5) పసిఫిక్ తీర ప్రదేశములు.

---

# 14. ఈశాన్య వ్యాపార పారిశ్రామిక మండలము

(a) అపలేషియన్ పర్వత ప్రాంతము : ఈ పర్వత ప్రాంతమునుగూర్చి ఈవరకే చదివియుంటిరి. అంటారియో, ఈరీ సరస్సుల దిగువనుండి తూర్పుగా వ్యాపించియున్నది. ఉత్తరపు చివర తీరమైదానము చాల తక్కువ. రానురాను దక్షిణమున మైదానము వెడల్పైనది. ఈ ప్రాంతము సంయుక్తరాష్ట్రము లకు చాల ముఖ్యమైనది. దేశములోని జనసంఖ్యలో దాదాపు మూడవ వంతు ఇచట నివసించుచున్నారు. అనేక పరిశ్రమలకు ఈ ప్రదేశము కేంద్రము. ఇచ్చటి నేల పర్వతమయమగుటచే వ్యవ సాయమున కనుకూలము కాదు. కాని సారవంతమైన లోయ లలో కొద్ది వ్యవసాయము, పశుపోషణ జరుగుచున్నవి.

ఈ ప్రాంతములో అపారమైన ఖనిజ సంపద కలదు. ఇచ్చట బొగ్గు విశేషముగా లభించును. ఈగనులు పెన్సిల్వేనియా రాష్ట్రములో కలవు. ఈ గనులు జగద్విఖ్యాతమైనవి. ఇక్కడ

నుండి బొగ్గు కెనడాకును, సంయుక్తరాష్ట్రములలో ఇతర ప్రాంతములకును ఎగుమతి అగుచున్నది.




అమెరికా సంయుక్త రాష్ట్రములు. ఈశాన్య వ్యాపార పారిశ్రామిక మండలము.

ఈబొగ్గుగనుల సమీపముననే సహజవాయువు, ఇనుము, పెట్రోలియం గనులుకూడ కలవు. గొప్ప ఇనుప కర్మాగారములు వెలసినవి. దీనికి పిట్స్‌బర్గు, హోమ్‌స్టెడ్, క్లీవ్‌లాండు, బఫెలోలు కేంద్రములు ఇచ్చట సుపీరియర్ సరస్సుప్రాంతమునందలి ముడి ఇనుము తెచ్చి వాడుచున్నారు. డెట్రాయిట్ మోటారుకారు

పరిశ్రమకు కేంద్రము. బఫెలో యంత్రశాలలలో నయాగరా జలపాత విద్యుచ్ఛక్తిని వాడుచున్నారు.



డెట్రాయిట్ - ఫోర్డు మోటారుకారుల కర్మాగారమున నొకదృశ్యము

(b) తూర్పుతీర మైదానము: దీనిని న్యూ ఇంగ్లండు ప్రాంతమని కూడ అందురు. సంయుక్త రాష్ట్రములలో మొట్ట మొదట ఇంగ్లీషువారు ఇచటనే నివాసము లేర్పరచుకొనిరి. అందుచే ఆ దేశములోని అతి ప్రాచీనమైన, ముఖ్యపట్టణము లిచట కలవు. ఇచ్చట వ్యవసాయముకంటె పరిశ్రమలు ముఖ్యమైనవి. ఫిలడెల్ఫియాలో ఉన్నివస్త్రములు, పెన్సిల్వేనియా న్యూజెర్సీ, న్యూయార్కు రాష్ట్రములలో సిల్కువస్త్రములు తయారుచేయుదురు. న్యూయార్కు సిల్కు, నూలు పరిశ్రమలకు

ప్రముఖమైనది. ఇచ్చట కాగితపు పరిశ్రమకూడ కలదు. చాల మంది జెస్తవృత్తిలో నున్నారు.

బోస్టను నగరము న్యూ ఇంగ్లండు తీరమునకు ముఖ్య రేవు. చక్కని హార్బరు కలదు.

న్యూయార్కు సంయుక్త రాష్ట్రములలో కెల్ల ముఖ్య మును, పెద్దదియు అగు నగరము. దీని జనసంఖ్య 60 లక్షలు మించియుండును. లండను తర్వాత ప్రపంచములో నిదియే పెద్దది. ఈ పట్టణము అన్ని ప్రాంతములతోను కాలువలు, రైలుమార్గముల ద్వారా కలుపబడినది. ఈ రేవు చాల పెద్దది. గొప్ప ఓడలు వచ్చి సురక్షితముగా నిలువగలవు. ఐరోపాకు చాలదగ్గరగనున్న రేవగుటచే వర్తకమునకు చాల అనుకూల మైనది. ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యాలయమగు లేక్‌సక్సెస్ ఈ పట్టణములోనే కలదు. ఆకాశమునంటు గొప్ప భవనములు కలవు. వీనిని స్కైస్క్రేపర్లు అందురు.

ఫిలడెల్ఫియా డీలావేర్ నదీ ముఖద్వారమునకల చక్కని రేవు. బొగ్గుగనులకు సమీపమున నుండుటచే ఈ రేవుద్వారా బొగ్గు ఎగుమతి అగుచుండును. ఉక్కుయంత్రశాలలు కలవు. ఓడలు, సామాను పెట్టెలు, యంత్రములు తయారుచేయుదురు.

బాల్టిమోరు : మరొక ముఖ్యమైనరేవు. చక్కని హార్బరు కలదు. దీని వెనుక భూమిలోకూడ బొగ్గు, ఇనుము కలవు. అందుచే ఉక్కుపరిశ్రమ కలదు.



అమెరికా సంయుక్త రాష్ట్రముల రాజధాని నగరమగు వాషింగ్‌టన్‌లోని కాంగ్రెసు భవనము



ఫిలడల్ఫియాలోని ఉన్నత సౌధములు

వాషింగ్టను : అమెరికా సంయుక్త రాష్ట్రముల కేంద్ర ప్రభుత్వ ముండు చోటు. ఇచట ఆ దేశపు అధ్యక్షు డుండును. ఆయన నివసించు ఇంటిని వైట్‌హౌస్ (White House) అందురు. ఆ దేశపు కాంగ్రెసు (పార్లమెంటు) భవనములు, సుప్రీంకోర్టు భవనములు, ఎన్నో ఇతర కార్యాలయములు ఉండును. ఈ పట్టణము అమెరికా స్వాతంత్ర్య యుద్ధములో విజయము సాధించిన జార్జివాషింగ్టను పేర కట్టిరి. విశాలమైన వీథులు, చక్కని బాటలు, ఇంపైన ఉద్యానవనములు ఆ పట్టణమునకు సౌందర్యము తెచ్చినవి.

## 15. ఆగ్నేయ వ్యవసాయ మండలము

ఈ మండలములో అట్లాంటికు తీరపు దక్షిణ భాగము, మెక్సికో సింధుశాఖ చుట్టునున్న పల్లపు ప్రదేశములు చేరి యున్నవి. ఇచ్చటి శీతోష్ణస్థితి తేమగాను, వెచ్చగాను ఉండును. చక్కని వర్షపాతము కలదు. శీతకాలము నీరు గడ్డకట్టినను (ఆర్కిటిక్ పవనముల ప్రభావమువలన) వేసవిలో వేడి చాల ఎక్కువగా నుండును. వర్షము ఎక్కువగా వేసవిలోనే కురియును. కావున శీతోష్ణస్థితి ప్రత్తి, పొగాకు పంటలకు అనుకూలముగా నున్నది. ప్రపంచములోకెల్ల ఎక్కువగా ప్రత్తి ఇచటనే పండుచున్నది. ఈ ప్రత్తి పొలములలో పని చేయుటకే

నీగ్రోలు బానిసలుగా తేబడిరి. ఇచ్చటిది పొడుగుపింజ ప్రత్తి. సన్నని గట్టిదారము తీయవచ్చును.



ఆమెరికాలో ప్రత్తిని యంత్రములతో పోగుచేయుచున్నారు.

జార్జియా రాష్ట్రము ప్రత్తిపంటకు అగ్రస్థానము వహించి నది. ముడిప్రత్తి న్యూ ఆర్లియన్స్, గాల్ వెస్టన్, సవానా రేవుల నుండి ఎగుమతి అగును.

వర్జీనియా రాష్ట్రము పొగాకునకు ప్రసిద్ధి కెక్కినది. దానిని బట్టియే మన దేశములో కూడ (ఆంధ్రప్రదేశ్ కోస్తా జిల్లాలలో) సిగరెట్టు పొగాకును వర్జీనియా పొగాకు అను

చున్నారు. ఇప్పుడు కెంటకీ రాష్ట్రము పొగాకుపంటకు ప్రధాన మైనది. లూయీ విల్లి ఈ వర్తకమునకు ముఖ్య నగరము.



ప్రఖ్యాతమైన వర్జీనియా పొగాకు

ఇచట ముఖ్య పంట మొక్కజొన్న. గోధుమ కంటె ఈ పంటకే ప్రాధాన్యత కలదు. మిసిసిపీ నది డెల్టాలో వరి, చెఱకుకూడ పండించు చున్నారు. కొన్ని ప్రాంతములలో అరణ్యములు కలవు. ఇవి వెచ్చని సమశీతల మండలారణ్యములు. ఇచట నారింజ, ద్రాక్ష, అనాసపండ్లు పండించబడు చున్నవి.

ఫ్లోరిడా రాష్ట్రములో ప్రత్తిపంట లేదు. శీతోష్ణస్థితి చాల చక్కగా నుండును. కాబట్టి విహార నగరములు పెరిగినవి. అవి

పామ్‌బీచ్, మియామీ మొదలైనవి. విశ్రాంతి కోరువారు ఇచ్చటికి వచ్చు చుందురు.

ఈ మండలమునకు న్యూ ఆర్లియన్స్ ముఖ్యమైన రేవు. ఇది మిసిసిపీ నదీ తీరమున సముద్రమునకు దూరముగా (కలకత్తావలె) ఉన్నది. అందుచే పెద్ద ఓడలు వచ్చుటకు నదిని త్రవ్వుచుండ వలయును. మధ్య మైదానమునకు కూడ ఇది ముఖ్య మార్గము. కోతలైన తర్వాత న్యూ ఆర్లియన్సు రేవు సరుకులతో నిండి యుండును. దక్షిణపు వేడి రాష్ట్రముల నుండి చక్కెర, బియ్యము, పొగాకును, అంతకంటె ఉత్తరము నుండి గోధుమ, ఓట్లు, మొక్కజొన్న, పీఠభూముల మీదనుండి మాంసము, చర్మములు మొదలగునవియు ఎగుమతి కొఱకు ఎదురుచూచు చుండును. వీటన్నిటిలోను ప్రత్తి ముఖ్యమైనది. సంయుక్త రాష్ట్రములలోని ప్రత్తిలో మూడవ వంతు ఈ రేవు మీదుగానే ఎగుమతి అగును.

# 16. మధ్య వ్యవసాయ మండలము

ఈ మండలము రాకీ పర్వతముల నుండి అపలేషియన్ పర్వతముల వరకు వ్యాపించి యున్నది. రెండు పర్వత పంక్తుల

మధ్యనున్న పెద్దలోయ అని చెప్పవచ్చును. ఈ ప్రదేశ మంతయు ఎత్తు పల్లములు ఎక్కువగాలేని మైదానము. కెనడాలోని ప్రెయిరీ మండలము యొక్క తరువాయి. నదుల మార్గమును బట్టి ఎటు వాలియున్నదో గమనింపుము. శీతకాలములో చలి ఎక్కువ, వేసవిలో వేడి ఎక్కువ, కనుక ఉష్ణ వ్యత్యాసము అధికముగా నుండును. దీనిని రెండు భాగములు చేయ వచ్చును. 1. అధిక వర్షముగల తూర్పు ప్రాంతము. 2. పొడిగా నుండు పశ్చిమ భాగము.

1. మిసిసిపీలోయ లేక తూర్పు ఆహారపంటల మండలము: ఈ మండలము అమెరికాకు అత్యంత ప్రధానమైనది. ఈ ప్రాంతము కెనడా గోధుమ మండలము తరువాయి అని ఈవరకే చెప్పబడినది. దక్షిణమునకు పోయిన కొలది వర్షము, వేడిమి హెచ్చును. అందుచే గోధుమకు దక్షిణమున మొక్కజొన్న, దానికి దక్షిణమున ప్రత్తి ముఖ్యముగా పండింపబడు చున్నవి.

గోధుమమండలము సరస్సులకు చుట్టును, వాటికి పశ్చిమముగాను, వాయవ్యముగానుకూడ వ్యాపించి యున్నది.

ఇక్కడ ఒక సంవత్సరములో పండించు గోధుమ అక్కడి రైతులకు కొన్ని సంవత్సరములకు సరిపడును. అందుచే ఈ పంటలో అధికభాగము ఎగుమతి చేయబడుచున్నది. మిసిసిపీనదిమీదనున్న మినియాపోలిసు గోధుమకు కేంద్రము (కెనడాలో విన్నిపెగ్). ఈ పట్టణము సుపీరియర్ సరస్సుమీదనున్న డులూత్ రేవుతో రైలుద్వారా కలుపబడినది. కావున డులూత్ రేవునుండి సరస్సుల ద్వారా గోధుమ, పిండి ఎగుమతి అగుచున్నవి. మిసిసిపీనది మీదుగా న్యూ ఆర్లియన్సుద్వారాకూడ ఎగుమతి అగుచున్నవి.

మినియాపోలిసులో గోధుమ ఎగుమతియేకాక గొప్ప పిండిమరలు కలవు. ఆ మరలు సెంట్ ఆంథొనీ జలపాత విద్యుచ్ఛక్తి నుపయోగించుకొను చున్నవి.

గోధుమ మండలమునకు దక్షిణమున మొక్కజొన్న మండలము కలదు. ఈ పంటకు గోధుమ కంటె వెచ్చదనము కావలెను. ఓట్లు కూడ పండును. మిసిసిపీ ఓహియో నదులమధ్య మొక్కజొన్న విశేషముగాపండింపబడుచున్నది. ఈమొక్కజొన్న పశువులను, పందులను క్రొవ్వు పట్టించుటకు వాడు చున్నారు. ఈ మధ్య వ్యవసాయమండలపు పడమటి మిట్టలమీద పెరిగిన ఆవులను మొక్కజొన్న ప్రాంతములో క్రొవ్వుపట్టించి షికాగో, కాన్సాస్, ఇండియానా పోలిస్ పట్టణములలోని వధ్యశాలలకు కొనిపోయి చంపి వాటిమాంసమును ఎగుమతి చేయుదురు. కెనడాలోని క్విబెక్ ప్రాంతములో ఆవులను పాడికొఱకు పెంచగా యిక్కడ మాంసముకొరకు పెంచుదురు.



మాంసము కొరకు పెంచబడుచున్న పందులు

మొక్కజొన్న మండలములో ప్రధాననగరము షికాగో. ఇది అతిత్వరితముగా పెరిగి ఇప్పుడు 30 లక్షలమంది కల



మాంసమును నిలువచేసిన గది.

గొప్ప పట్టణమైనది. ఈ పట్టణము మిచిగాన్ సరస్సుమీద నున్నది. ఇది మొక్కజొన్న, గోధుమలకు కేంద్రము. ఇక్కడ కూడ గొప్ప పిండిమరలు కలవు. గొప్ప వర్తకస్థానము. రైలు మార్గములకు కూడలి. మాంసపరిశ్రమకు ప్రధానస్థానము. కలప వర్తకముకూడ చాల ఎక్కువ. దాని ఉనికియే ఆ నగరము యొక్క అభివృద్ధికి కారణము. రైలు, రోడ్డు, ఓడ, విమాన

మార్గములకు కూడలి. ఇచ్చట నిత్యము వధింపబడు వందలాది జంతువుల మాంసము మంచులో పెట్టి తీరప్రాంతపు పట్టణములకు ఎగుమతి చేయుదురు. డబ్బాలలో నిలువచేసి విదేశములకు పంపుదురు.

ఈ ప్రాంతమున సెంటులూయీ మరొక ముఖ్య నగరము. ఇది మిసిసిపీ మిస్సోరీలు కలియు కీలక స్థానమున నున్నది. ఇది కూడ ఉనికిని బట్టి వృద్ధిచెందుచున్నది. అధికముగా మొక్కజొన్న, తర్వాత గోధుమ వర్తకమునకు కేంద్రము. రైలు రోడ్డు మార్గముల కూడలి.

మిసిసిపీ మండలము వ్యవసాయమునకే కాక ఖనిజ సంపదకు కూడ ప్రసిద్ధమైనది. ఇల్లినాయ్, మిచిగాన్, రాష్ట్రములలో గొప్ప బొగ్గుగనులును, ఓహియో, ఇల్లినాయ్, కాన్సాస్ రాష్ట్రములలో చమురు గనులును కలవు. ఇచ్చట గొప్ప యినుప గనులు కలవు. పిట్స్‌బర్గులోని ఇనుప పరిశ్రమకు సుపీరియర్ సరస్సు ప్రాంతమునుండి ముడిఇనుము తీసుకొని పోవుదురని చెప్పియుంటిమి. సుపీరియర్ సరస్సు ప్రాంతమున రాగి గనులు కూడ కలవు.

ఇచ్చట వ్యవసాయ పరికరములు చేయుట, కలప పరిశ్రమ, కాగితపు గుజ్జు, కాగితముచేయుట అను పరిశ్రమలు కూడ కలవు. ఈ ప్రాంతము ప్రపంచములోని ముఖ్య వ్యవసాయ, పారిశ్రామిక ప్రదేశములలో నొకటి. అచ్చటి సరస్సులు,

నదులు, జలపాతములు, ఖనిజసంపద ఇందుకు ముఖ్య కారణ ములు.

2. పొడిగానుండు పశ్చిమప్రాంతము : రాకీ పర్వతములకు తూర్పునను గోధుమ, మొక్కజొన్న మండలములకు పశ్చిమమునను మిట్టలతో కూడియున్నది. వ్యవసాయమునకు అనుకూలము కాదు. మరియు వర్షము తక్కువ. నేల సారవంతమైనదికాదు. అందుచే లక్షలకొలది పశువులను మేపుచుందురు. ఈ పశువులు గడ్డి మేయుచు ఒకచోటినుండి మరొక చోటికి పోవుచుండును. వీటిని గుర్రముల మీద కాయుచుందురు. ఆనవాలు కొఱకు వీటికి ముద్రలు వేయుదురు. ఇట్టి గడ్డిబీళ్ళను రాంచ్‌లు (Ranches) అందురు. గొప్ప రాంచి టెక్సాస్ రాష్ట్రములో కలదు.

ఈ ప్రాంతములో పెద్ద పట్టణములు ఓమహా, కాన్సాస్. ఇచ్చటినుండి పశువులు, వాటి మాంసము ఎగుమతి అగుచున్నవి.

---

# 17. రాకీ పర్వత ప్రాంతము

అమెరికా సంయుక్త రాష్ట్రములలో రాకీపర్వతములు చాల విశాలముగా వ్యాపించి ఉత్తరమున కెనడాలోను, దక్షిణమున మెక్సికోలోను సన్నమైనవి. సంయుక్త రాష్ట్రములలో

ఈ పర్వతపంక్తుల నడుమ 1000 మైళ్ళు వెడల్పున్నది. ఈ పర్వతములలో పడమట కాస్కేడ్, సెర్రానివాడా పర్వతపంక్తులును, తూర్పున ప్రధాన రాకీ పంక్తియు కలవు. వీటిమధ్య ఇతర పంక్తులచే వేరుచేయబడిన స్నేకునదీ పీఠభూమి, కొలరెడో పీఠభూమి కలవు. ఈ రెంటిమధ్య యూటా పీఠభూమి కలదు. ఈ పీఠభూములకు పడమటనుండి కాని, తూర్పునుండికాని వర్ష వాయువులు లోనికిరావు. కావున ఈ ప్రదేశము చాల పొడిగా ఎడారిగాను, ఎడారితుల్యముగాను ఉన్నది. కాని రెండు పర్వతపంక్తుల వెలుపల మంచి వర్షముండుటచే అక్కడ అరణ్యములు కలవు. ఈ పీఠభూములు శీతకాలములో ఎక్కువ చలిగాను, వేసవిలో ఎక్కువ వేడిగాను ఉండును.

ఈ ప్రాంతములో ప్రభుత్వము వారిచే నిర్మించబడ్డ ఉద్యానవనములు కలవు. అందు యెల్లోస్టోన్ పార్కు పెద్దది. ఇది అరణ్యమైనది. దీనిలో కాన్యనులు (నదులచే లోతుగా కోయబడిన లోయలు), జలపాతము, గెయిజర్లు, వాటిచుట్టు ఏర్పడిన రంగురంగుల మట్టిపొరలు చూచుటకు ఆహ్లాదకరముగా నుండును. చుట్టునున్న శృంగాకారారణ్యములు వింతసొగసును కలిగించును. అందుచే ప్రభుత్వమువారు దీనిని జాతీయ విహార స్థలము (National Park) గా మార్చిరి.

స్నేకునదీ పీఠభూమి అగ్నిపర్వత సంబంధమైన నల్ల రేవడి నేలగా తయారగు చున్నది. కొద్ది పశువులను మేపుచున్నారు. గోధుమ ముఖ్య ఆహారపంట.

యూటా పీఠభూమిని గ్రేట్ బేసిను, గ్రేట్ అమెరికన్ ఎడారి అనికూడ అందురు. పర్వతముల లోపల పడిన కొద్ది



వాషింగ్టన్ రాష్ట్రమందలి రైనీర్ నేషనల్ పార్కు

వాననీరు, మంచు కరగిన నీరు ఇక్కడచేరును. ఈ ప్రాంతములో గ్రేట్ సాల్టులేక్ (గొప్ప ఉప్పుసరస్సు) కలదు. అది యూటా రాష్ట్రములోనిది. ఈ సరస్సు ప్రక్కన సాల్టులేక్ సిటీ అను పట్టణ

మును మార్మను లను ఒక వింత మతమువారు కట్టిరి. వారు అక్కడనే నివసించు చుందురు. ఇతరులతో సంబంధము పెట్టుకోక కొన్ని మూఢాచారములను కలిగియుందురు. వీరు ఐరోపీయులే కాని ఆదిమ నివాసులు కారు. ఈ ప్రాంతమునకట్టిన రూజువెల్ట్ ఆనకట్ట వలన ఈ ఎడారి ప్రాంతము ఇప్పుడు పంటలతో తులతూగుచున్నది.



ఇచ్చట మంచి ఖనిజ సంపద కలదు. బంగారము, వెండి, రాగి, సీసము ఇనుము, ముఖ్య ఖనిజములు. ఖనిజ పరిశ్రమకు కొలరెడోలోని డెన్వరు, మాంటేనా లోని వర్జీనియా సిటీ ముఖ్యకేంద్రములు

కొలరెడో పీఠభూమిలో గ్రేట్ కాన్యను ప్రసిద్ధ మైనది. కొలరెడో నది అక్కడ మెత్తని కొండను 4000 అడుగుల లోతునకు కోసివేసిన దృశ్యము అతి రమణీయముగ నుండును. వర్షము లేకపోవుటచే ప్రక్కలు పడిపోక నిలువుగానే ఉన్నవి. నదికి రాకీ పర్వతములనుండి మాత్రమే నీరు లభించును.

# 18. పసిఫిక్ తీర ప్రాంతము

పసిఫిక్ సముద్ర తీరమున కొంత ప్రదేశములో మధ్య ధరా శీతోష్ణస్థితి కలదు. ఈ భాగము కాలిఫోర్నియా రాష్ట్రము లోనిది. ఒక వైపున పసిఫిక్ మహాసముద్రము, రెండవ వైపున సెర్రానివాడా పర్వతపంక్తి కలవు. తీరము వెంబడి కోస్టురేంజి పంక్తి కలదు. ఈ రెండు పంక్తులమధ్య కాలిఫోర్నియా లోయ ఉన్నది. కోస్టు రేంజిలో మరొక లోయ కలదు. ఈ లోయ ముఖమువద్దనే శాన్ ఫ్రాన్సిస్కో నగరము కలదు. ఈ లోయలో ఖర్జూరము, ద్రాక్ష మున్నగు అనేక పండ్లు పండును. వాటిని షికాగో, న్యూయార్కు మున్నగు నగరములకు ఎగుమతి



కాలిఫోర్నియా ఖర్జూరము

చేయుదురు. ఎక్స్‌ప్రెస్ రైలుకు ప్రత్యేకపు పండ్ల పెట్టెలు తగిలింతురు.

గోధుమ, బార్లీ ముఖ్య ఆహారపంటలు, బంగారము, పాదరసముకూడ త్రవ్వుచున్నారు.

ఇచ్చట పర్వతములమీద మంచి కలప లభించుచున్నది. ఓరిగాన్ రాష్ట్రములో ఈ పరిశ్రమ ఎక్కువ.

శాన్‌ఫ్రాన్సిస్కో ఇచ్చట ముఖ్యనగరము, ముఖ్యరేవు. చక్కని హార్బరుకలదు. ఖండాంతర్గత రైలు మార్గములు రెండును ఈ రేవున కెదురుగానుండు ఓక్‌లాండునుండి ప్రారంభ మగుచున్నవి. ఈ రేవు ద్వారా చైనా, జపాను, దక్షిణ అమెరికా, అమెరికా తూర్పుతీరము, ఐరోపాలతో సముద్రవర్తకము జరుగుచున్నది.





హాలీవుడ్‌లో ఒక ఫిల్మ్ స్టూడియో

లాస్ఏంజెలిస్ ఈ ప్రాంతములోని దక్షిణపు రేవు. పెనామా కాలువ త్రవ్విన తరువాత వృద్ధిపొందినది. ఇచట గొప్ప నూనెబావులు కలవు. ఈ పట్టణమునకు సమీపమున ఫిలిమ్‌పరిశ్రమకు ప్రఖ్యాతి గాంచిన హాలీవుడ్ నగరము కలదు.

---

# 19. అలాస్కా

అలాస్కా అమెరికా సంయుక్త రాష్ట్రములకు చెందినది. దీని ఉనికిని గమనింపుడు. 60°—70° ఉత్తర అక్షాంశముల మధ్యను, ఆర్కిటిక్ మహాసముద్రము ప్రక్కను ఉండుటచే అతిశీతలముగనుండును. వేసవి లెక్కలోనిదికాదు. గ్రీన్ లాండులోవలె మంచుదిబ్బలు ఉత్తరపు వైపున సముద్రములోనికి జారుచుండును. దక్షిణ తీరమున కొంత భరించదగినట్లుగా నుండును. దీని చివర అనేక ద్వీపముల వరుస కలదు. వీటిని అల్యూషియన్ ద్వీపము లందురు. వీటిలో అగ్ని పర్వతము లున్నవి. వ్యవసాయము సాధ్యముకాదు గాన ఉన్న కొద్ది జనము చేపలను పట్టుటయే ముఖ్యవృత్తిగా కలిగియున్నారు. తిమింగిలములను, సీలు, సామన్ చేపలను పట్టుదురు. ఇటీవల బంగారము, రాగి త్రవ్వుచున్నారు. ఈరాష్ట్రము గుండా యూకనునది ప్రవహించుచున్నది. ఈ రాష్ట్రమునకు ముఖ్యమైన రేవు స్కాగ్వే. ఇచ్చటనుండి రాష్ట్రములోపలికి రైలుమార్గము కలదు.

# 20. మెక్సికో

మెక్సికో దేశము సంయుక్త రాష్ట్రములకు దక్షిణమున నున్నది. దీనికిని సంయుక్తరాష్ట్రములకును రయోడిగ్రాండి డెల్‌నార్టి నది కొంతదూరము సరిహద్దుగానున్నది. దక్షిణ కాలిఫోర్నియా కూడ ఈ దేశములోని భాగమే. ఈ దేశమును మొదట స్పెయిను




వారు ఆక్రమించినపుడు ఇక్కడకూడ (దక్షిణ అమెరికాలోని పెరూలోవలె) నాగరికులైన అజ్‌టక్ అను జను లుండిరి. స్పెయినువారు వారిని నిర్దాక్షిణ్యముగా చంపి, వారి వెండి బంగారములను దోచిరి. తర్వాత ఆ దేశము ప్రజాప్రభుత్వమైనది.

మన దేశములోవలె ఈ దేశము మధ్యగా కర్కటరేఖ పోవుచుండుట గమనింపుడు. ఆ భాగము పర్వతమయ మని కూడ చూడుడు. ఈ పర్వతములు రాకీపర్వతముల తరువాయివి.

ఇచ్చట పసిఫిక్ తీరమున పశ్చిమ సిర్రా మాడ్రే, తూర్పున తూర్పు సిర్రామాడ్రే పర్వతపంక్తులును, దక్షిణమున టెహ్వాం టెపెక్ భూసంధి వద్ద చాల అగ్నిపర్వతములును కలవు. కాబట్టి తీర మైదానముల నుండి పీఠభూమిలోనికి పోవుట కష్టము. కావుననే అనేక రైలుమార్గములు వేసిరి. ఈ అగ్ని పర్వతములవల్ల తరచు భూకంపములు కలుగుచుండును.

అధికభాగము ఉష్ణమండలములో నుండుటచే తీరమైదానములకు మంచివర్షము కురియును. వేడి ఎక్కువగా నుండును. పర్వతముల వాళ్లమీద కూడ మంచివర్షము కురియుటచే అరణ్యాము లేర్పడినవి. కాని పీఠభూమిమీద వర్షములు చాలతక్కువ. ఉత్తర మెక్సికోలోను, దక్షిణ కాలిఫోర్నియాలోను వర్షము చాల తక్కువ కనుక చాలభాగము ఎడారిగా నున్నది. నీటి పారుదల ఏర్పాట్లు కలచోట్ల కొద్దిగా వ్యవసాయము సాగుచున్నది. పీఠభూమిమీద రాత్రులు ఎక్కువ చలిగాను, పవళ్ళు ఎక్కువ వేడిగాను ఉండును.

తీరమైదానముమీద చెఱకు, రబ్బరు, వానిల్లా, పొగాకు, నార ఉత్పత్తిచేయుచున్నారు. పర్వతవాళ్లమీద కాఫీ, మొక్కజొన్న ముఖ్యపంటలు. పీఠభూమి మీద నీటిపారుదల ఏర్పాట్లున్నచోట ప్రత్తి, గోధుమ, మొక్కజొన్న పండించుచున్నారు. ఆవులు, గుఱ్ఱములు, కంచరగాడిదెలు, గొఱ్ఱెలు, మేకలు, పందులు పోషింపబడుచున్నవి. అగ్నిపర్వత సంబంధమైన నేల కనుక సారవంతమైనది.

ఈ దేశము ఖనిజసంపదకు ప్రసిద్ధమైనది. వెండి ఉత్పత్తికి ఈదేశము ప్రపంచములో అగ్రస్థానము వహించును. బంగారము, ప్లాటినము, పాదరసము, రాగి, జింకు ఇనుముగనులు త్రవ్వుచున్నారు. అగ్నిపర్వతములవద్ద గంధకము తీయుచున్నారు. బొగ్గుగనులుకూడ కలవు. పర్వతపాదములవద్ద ప్రసిద్ధమైన చమురుగను లున్నవి. అమెరికా సంయుక్తరాష్ట్రముల తర్వాత ఈదేశములోనే అధికముగా చమురు ఉత్పత్తి అగుచున్నది. ఈ దేశములో బట్టలమిల్లులు, నారయంత్రశాలలు, లినెన్ యంత్ర శాలలు, కాగితపు మిల్లులు కలవు.

ఈ దేశమునకు ముఖ్యపట్టణము మెక్సికోసిటీ దేశము మధ్య పీఠభూమిమీద గనుల ప్రాంతమున నున్నది. రెండు వైపుల తీరమైదానముతోను, సంయుక్తరాష్ట్రములతోను రైలుమార్గముల ద్వారా కలుపబడినది.

టాంపికో మెక్సికో సింధుశాఖమీదనున్న రేవు పట్టణము. ఈ రేవుద్వారా చమురు ఎగుమతి చేయబడుచున్నది.

వెరాక్రుజ్ కూడ మెక్సికో సింధుశాఖమీది రేవు పట్టణమే. బట్టల మిల్లులకు కేంద్రము. జలపాత విద్యుచ్ఛక్తి నుపయోగించుచున్నారు. ఎక్కువ విదేశ వ్యాపారము ఈ రేవు మీదుగానే జరుగుచున్నది. ఇక్కడ నుండి ముఖ్య ఎగుమతులు వెండి, చమురు, మహాగనీ కలప, వానిల్లా, కాఫీ, పొగాకు, చర్మములు.

---

# 21. మధ్య అమెరికా

మధ్య అమెరికా ఉత్తర దక్షిణ అమెరికాలను కలుపు సన్నని భూసంధి అని పటము చూచి నంతనే తెలియ గలదు. ఈ భూసంధిలో ఏడు చిన్న రాజ్యములు కలవు. అందు బ్రిటిషు హోండూరాస్ ఇంగ్లీషు వారిది. మిగిలిన ఆరును ప్రజా ప్రభుత్వ ములు. అవి గ్వాటిమాలా, హోండూరాస్, సాల్వడార్, నికారాగ్వా, కోస్టారికా, పనామా. ఈ భూసంధి పనామా రాష్ట్రములో మిక్కిలి సన్ననై ముప్పది మైళ్ళు మాత్రము వెడల్పున్నది. ఈ ప్రాంత మంతయు పర్వతమయము. పసిఫికు తీరము వెంబడి సజీవమైన అగ్ని పర్వతములు ఎన్నో కలవు. వీటిలోనుండి వచ్చు బూడిదచే లోయలు, తీరమైదానము కూడ కప్పబడి యున్నవి. అందుచే ఈ ప్రదేశములు చాల సారవంత మైనవి. కాని భూకంపములవల్ల తరచు పట్టణములు నాశనమగుచుండును.

ఈ ప్రాంతము వ్యాపారపవన మార్గమున నుండుటచే తూర్పు తీరమున సంవత్సర మంతటను వర్ష ముండును. పడమటి తీరమున వర్షము చాల తక్కువ.

ఇక్కడ తీర మైదానములలో వేడిమి, తేమ ఎక్కువగు టచే ఉష్ణమండలపు పంటలు పండును. అవి వరి, చెఱకు, అరటి, కొబ్బరి. తీరపు టడవులలో గట్టి కలప లభించును (ఉష్ణమండలా రణ్యములు కనుక).

పర్వతముల వాళ్లమీద దట్టమైన అరణ్యములు కలవు. వీనిలో రబ్బరు, మహాగనీ ముఖ్యమైన చెట్లు. వర్షము ఎక్కువగా

కురియని పర్వత పై భాగములందు గాలి పొడిగానుండును. గడ్డి బీడులు కలవు. కావున పశుపోషణ కొంత వరకు కలదు. ఇచ్చటి అగ్నిపర్వత సంబంధమైన నేలమీద మంచి కాఫీతోటలు కలవు. మొక్కజొన్న, చిక్కుళ్లు కూడ చక్కగా పైరగును.

ఇచ్చట జనసంఖ్య చాల తక్కువ. ఆదిమ నివాసులు, స్పెయినువారు, సంకర జాతులు కలవు. వీరు విద్యావిహీనులు. పరిశ్రమలు లేవు. కోస్టారికాలో కాఫీ, బ్రిటిషు హోండూరాసు నుండి చ్యూయింగ్ గమ్ (Chewing gum) చేయుట కుపయోగించు చిక్లీ అను జిగురు ఎగుమతులు. బ్రిటిషు హోండూరాస్‌కు బిలీజ్ ముఖ్యరేవు. చిక్లీకాక్, అరటి, కొబ్బరి, మహాగనీ, గట్టికలపకూడ ఎగుమతి అగును.




మధ్య అమెరికాలోని పనామా ప్రముఖమైన స్థానము నాక్రమించినది. ఇచ్చటనే పనామా కాలువ అమెరికా సంయుక్త రాష్ట్రప్రభుత్వముల వారిచే త్రవ్వబడినది. దీని వలన అట్లాంటిక్ పసిఫిక్ మహాసముద్రములకు 8రి మై. దారి ఏర్పడుటయే కాక దక్షిణ అమెరికాచుట్టు తిరుగవలసిన బాధతప్పినది. సూయజు కాలువతో పోల్చుడు. సూయజు కాలువ 100 మైళ్ళు పొడ

వున్నది. చదునైన నేలమీద మధ్యగల సరస్సులను కలుపుచు త్రవ్వబడినది. పెనామా కాలువ కొండల ప్రదేశములో బహు ప్రయాసతో త్రవ్వబడినది. ఎత్తుపల్లము లెక్కువ. అందుచే దారి పొడవున లాకు లేర్పరచిరి. వీటిలో ఒకలాకు సముద్రమట్టము నుండి 85 అడుగుల ఎత్తున్నది. ఈకాలువ పెనామాదేశములో నున్నను కాలువ త్రవ్వినచోట 10 మైళ్ళ వెడల్పుకల నేలను అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము 10 కోట్ల డాలరులకు 1904 లో కొని కాలువను త్రవ్వించెను. సూయజు కాలువవలె ఈ కాలువలో కూడ అన్ని దేశముల నౌకలును పోవచ్చును. ఈ కాలువకు పసిఫిక్ చివర పనామా అను నగరమును అట్లాంటికు చివర కోలను అనునగరమును కలవు.

ఈ కాలువ అమెరికా సంయుక్త రాష్ట్రములకు చాల ముఖ్యమైనది. ఒక సముద్రములోనుండి మరొక సముద్రములోనికి సులభముగా పోవుటయేకాక యుద్ధసమయములందు యుద్ధ నౌకలనుకూడ ఒక చోటనుండి మరొక చోటకు త్వరగా మార్చవచ్చును.

---

## 22. పశ్చిమ ఇండియాదీవులు

కొలంబసు ఇండియాకు మార్గము కనుగొనుటకు బయలుదేరి ఈ దీవులకు మొదట వచ్చెను. ఆయనయే ఆ పేరుపెట్టెను.

వీనిలో నాలుగు పెద్దద్వీపములు, చాల చిన్న ద్వీపములు కలవు. పెద్దవి క్యూబా, హైటీ, పోర్టోరికో, జమైకా. ఇవి కారిబియన్ సముద్రములో నున్నవి. సముద్రములో అగ్నిపర్వత క్రియ వలన కొన్ని ద్వీపములును, పవడపు దిబ్బలవలన కొన్ని దీవులును ఏర్పడినవి. ఈ దీవు లన్నియు ఉష్ణమండలములోనే ఉండుటచే సమృద్ధిగా వర్షము కురియును. ఈ వర్షము పవనముల వలనను, తుపానువలననుకూడ కలుగు చుండును.

అధిక వేడిమి, వర్షపాతము, సారవంతమైన అగ్నిపర్వత సంబంధమైన నేల ఉండుటచే ఉష్ణమండల పంటలు పండును. తీర ప్రాంతములందు కొబ్బరితోటలు కలవు. పర్వతములమీద మహాగనీ మొదలైన గట్టి కలపగల అరణ్యములుకలవు. వెదురు, పేముబెత్తముకూడ అడవులలో లభించును. మైదానములలో చెఱకు, పొగాకు ముఖ్యపంటలు.

ఈ ద్వీపములలో జమైకా, బెర్మూడాలు, బహామాలు, లీవర్డు, విండ్ వర్డ్ ద్వీపములు, ట్రినిడాడ్ బ్రిటిషువారికి చెందును.

జమైకా పంచదార, అరటి పండ్లకు ప్రసిద్ధమైనది. దీనికి ముఖ్య రేవు కింగ్స్టన్.

హైటీ ద్వీపములో రెండు నీగ్రో ప్రజాప్రభుత్వములు కలవు. వీరు విడుదల కాబడిన అమెరికా నీగ్రోజాతివారు.

పోర్టోరికో సంయుక్త రాష్ట్రములకు చెందిన చిన్న ద్వీపము. చెఱకు, పొగాకు, కాఫీ ముఖ్య ఉత్పత్తులు.

క్యూబా ఈ ద్వీపము లన్నిటిలోను పెద్దది. అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వ సహాయమున అభివృద్ధిగాంచిన ప్రజా ప్రభుత్వము కల ద్వీపము. ఇచ్చట చెఱకు చాల ముఖ్యమైన పంట. ఇచ్చటి చక్కెర అమెరికా సంయుక్త రాష్ట్రములకు ఎగుమతి అగుచున్నది. పొగాకునకుకూడ ఈ ద్వీపము ప్రసిద్ధి కెక్కినది. దీని ముఖ్యపట్టణమగు హవానా నుండి ప్రసిద్ధమైన హవానా చుట్టలు ఎగుమతి అగుచున్నవి.

# ప్రశ్నలు

1. ఉత్తర అమెరికా ఉనికిని వివరింపుము.
2. ఉనికినిబట్టి ఉత్తర అమెరికా వర్తక వ్యాపారములకు అనుకూలముగా నున్నట్లు చూపుడు.
3. రాకీ పర్వతములను గూర్చి వ్రాయుడు.
4. రాకీ పర్వతములమధ్య ఏర్పడిన పీఠ భూము లేవి ?
5. కెన్యానులన నేమి ? ఎట్లేర్పడును ? ఎచ్చట కలవో తెలుపుడు.
6. న్యూ ఇంగ్లండ్ పర్వతములను వర్ణించి వానిలోని ఖనిజ సంపదను గూర్చి వ్రాయుడు.
7. ఉత్తర అమెరికాలోని సరస్సులు ఎట్లు ఏర్పడినవి ? అందు కొన్ని ముఖ్యమైన వాటిని పేర్కొనుము.
8. గొప్ప సరస్సులు మంచి రవాణా సదుపాయములని చూపుడు.
9. ఉత్తర అమెరికాలోని మధ్య మైదానములను వర్ణింపుడు.
10. ఉత్తర అమెరికాలోని నదులను గూర్చి వ్రాయుడు.
11. మిసిసిపీనది అమెరికాలో ప్రముఖపాత్ర వహించు చున్నది-ఎట్లు ?
12. మిసిసిపీ పరీవాహ ప్రదేశమును అమెజాను పరీవాహ ప్రదేశముతో పోల్చుడు.
13. కెనడాలోని నదులను గూర్చి వ్రాయుడు.
14. ఉత్తర అమెరికాలో ముఖ్య నదులు ఉత్తరముగాను దక్షిణముగాను ఏల పారుచున్నవి ?
15. సెంటు లారెన్సు నదిని వర్ణించి దాని ప్రాముఖ్యమును పటముద్వారా చూపుడు.

16. హడ్సన్‌నది లోయ యొక్క ప్రాముఖ్య మేమి ?
17. ఉత్తర అమెరికా శీతోష్ణస్థితిని వివరింపుడు.
18. ఉత్తర అమెరికాలో వర్ష పాత వితరణమును గూర్చి వ్రాయుడు. పటము వ్రాసి చూపుడు.
19. ఉత్తర అమెరికాలోని సహజ వృక్షజాలమును గూర్చి వ్రాయుడు.
20. కెనడాలోని అరణ్యములను వర్ణింపుడు.
21. టండ్రా లన నేమి ? అచ్చటి ప్రజల జీవనము వర్ణింపుడు.
22. అమెరికాలోని ఆదిమ నివాసులను గూర్చి వ్రాయుడు.
23. ఇప్పటి అమెరికా జన సంఖ్యను గూర్చి వ్రాయుడు.
24. ప్రెయిరీలను గూర్చి వ్రాసి వాని ప్రాముఖ్యత తెలుపునది.
25. కెనడాలో ఎక్కడ జనసాంద్రత ఎక్కువ ? ఏల ?
26. కెనడాలోని వివిధ రాష్ట్రములును, వానిలోని ఖనిజ సంపదను గూర్చి వ్రాయుడు.
27. కెనడాలో చేపల పరిశ్రమ చాల ముఖ్యము. ఎట్లు ?
28. విన్నిపెగ్ యొక్క ప్రాముఖ్యతను వివరింపుము.
29. సెంట్ లారెన్సు మండలము కెనడాకు చాల ముఖ్య మని ఎట్లు చెప్పగలవు ?
30. అమెరికాలోని కాగితపు పరిశ్రమను గూర్చి వ్రాయుడు ?
31. కెనడాలో వేర్వేరు వృత్తులు ఎక్కడెక్కడ కలవో తెలుపుడు.
32. కెనడాలోని ముఖ్య పట్టణములను వాని ప్రాముఖ్యతను పేర్కొనుడు.
33. క్విబెక్, మాంట్రియల్ పట్టణముల ప్రాముఖ్యత తెలుపుడు.
34. సంయుక్త రాష్ట్రములను ఎన్ని సహజ భాగములుగా విభజింప వచ్చును ? అవి ఏవి ?

35. సంయుక్త రాష్ట్రముల ఈశాన్య భాగమందలి ఖనిజ సంపదను పటమున చూపి పరిశ్రమలను పేర్కొనుడు.
36. న్యూయార్కు యొక్క ప్రాముఖ్యతను తెలుపుడు.
37. సంయుక్త రాష్ట్రములలోని ముఖ్య రేవులను గూర్చి వ్రాయుడు.
38. చికాగో, సెంటు లూయీల ప్రాముఖ్య మేమి ?
39. సంయుక్త రాష్ట్రములలో ప్రత్తి, గోధుమ, మొక్కజొన్న పంటలను గూర్చి వ్రాయుడు.
40. సంయుక్త రాష్ట్రములలోని ఖనిజ సంపదను గూర్చి వ్రాయుడు.
41. సంయుక్త రాష్ట్రములలోని రాకీ పర్వత ప్రాంతమును గూర్చి వ్రాయుడు.
42. సంయుక్త రాష్ట్రములలోని ఎడారిని గూర్చి వ్రాయుడు.
43. సంయుక్త రాష్ట్రములలోని మధ్యధరా మండలము గూర్చి తెలుపుడు.
44. నేషనల్ పార్కులన నేమి ? వాటినిగూర్చి విశదపరచుడు.
45. సంయుక్త రాష్ట్రములలోని ముఖ్య నగరములను, వాటి ప్రాముఖ్యతను పేర్కొనుడు.
46. మెక్సికో నైసర్గిక స్వరూపమును వివరింపుడు.
47. పనామా కాలువ పటము వ్రాసి, దాని ప్రాముఖ్యతను వర్ణింపుడు.
48. పశ్చిమ ఇండియా దీవులను గూర్చి వ్రాయుడు.

# విశ్వపరిచయము

పదియవ తరగతి

మొదటి భాగము

## ఐరోపా ఖండము

### 1. ఉనికి - రూపము - విస్తీర్ణము

మీ రిదివరకు ఆసియాఖండమును గురించి చదివి యున్నారు. ఇపుడు ఆధునిక యుగమున చాల అభివృద్ధిగాంచిన ఐరోపాఖండమును గురించి నేర్చుకొందుము.

ఆసియా ఖండమునకు పశ్చిమమున ఖండము నంటి పెట్టుకొని యొక పెద్ద ద్వీపకల్పము కలదు. దీనిని ఆసియా యొక్క ద్వీపకల్పమని చెప్పవచ్చును. ఇదియే ఐరోపా. ఐరోపాయొక్క తీరరేఖ చీలియుండి సముద్రము అనేకచోట్ల ఖండములలోనికి చొచ్చుకొని పోవుటవలన పెక్కు ద్వీపకల్పము లేర్పడినవి. స్కాండినేవియా, జట్లండ్, నార్మండీ, బ్రిటనీ, ఐబీరియా, ఇటలీ. బాల్కన్, క్రిమియా ద్వీపకల్పము లిట్టివి. కనుకనే ఐరోపాను ద్వీపకల్పములతో కూడిన పెద్ద ద్వీపకల్పమని చెప్పవచ్చును.

ఐరోపాయందలి శీతోష్ణస్థితి, ప్రజల నాగరికత, సంస్కృతి, ఆసియా ఖండ పరిస్థితులకు భిన్నముగ నుండుటచే ఆద్వీపకల్పమును ప్రత్యేక ఖండముగ పరిగణించుచున్నారు. ఈ ఖండమును ఆసియాతోచేర్చి యూరేషియా అని పిలుచుటకూడ కలదు.

ఐరోపాఖండము ఆసియా వైశాల్యములో నాల్గవ వంతైనను లేదు. దీని వైశాల్యము 37 లక్షల 60 వేల చతురపు మైళ్ళు. ఈ ఖండము ఆసియానుండి తూర్పున యూరల్ కొండలు యూరల్ నది, కాస్పియన్, నల్లసముద్రముల వలనను, ఆగ్నేయభాగమున కాకసస్ పర్వతములు, నల్లసముద్రము చేతను వేరుచేయబడుచున్నది. ఈఖండమునకు తక్కిన మూడు వైపులగల సముద్రములను పటమున గమనింపుము.



ఐరోపాఖండవాసులు ప్రపంచములో అగ్రస్థానము నాక్రమించుట కనేక కారణములున్నవి. (1) ఈ ఖండము పూర్తిగ సమశీతోష్ణమండలమున నున్నది. అందుచే జనులు చురుకుగ నుండి పనిపాటలలో త్వరగా అలసిపోరు. (2) ఐరోపా భూగోళములో కేంద్రస్థానము నాక్రమించుకొని యున్నది. అందుచే ప్రపంచమునందలి అన్ని దేశములతో వ్యాపారము సాగించుటకు అందుబాటులో నున్నది (3) పడమటి విశాలమైన సముద్రముపైనుండి వాయువులు వీచి ఖండపు శీతోష్ణస్థితిని వాసయోగ్యముగ జేయుచున్నవి. (4) సముద్ర మనేకచోట్ల భూమిలోనికి చొచ్చుకొని యుండుటచేత అనేక రేవులు ఏర్పడి వ్యాపారమునకు మిక్కిలి అనుకూలముగ నున్నవి. మరియు సముద్రముతో పరిచయము కల్గి జనులు గొప్ప నావికులైరి. ఈచీలికలు శీతోష్ణస్థితిపై కూడ ప్రభావము కలిగి యుండును.

5. ఐరోపాఖండము చిన్నదైనను అనేక సౌకర్యములు కలిగియున్నది. విద్యుచ్ఛక్తినిచ్చు పర్వత ప్రవాహములు, మెత్తని కఱ్ఱగల అడవులు, ఖనిజసంపద, పంటభూములు, గడ్డిమైదానములు, వ్యాపారానుకూలములైన నదులు దేశసంపదకెంతయు తోడ్పడుచున్నవి. ఈఖండవాసులు ప్రకృతి లభ్యమైన సౌకర్యముల నెంపొందించుకొని ప్రపంచమందలి యితర ఖండవాసులకన్న మిన్నయైయున్నారు.

ప్రాక్టికల్

ఐరోపా పటముగ్రాసి అందు ఎల్లలు ద్వీపకల్పములు గుర్తింపుము.

# 2. నిమ్నోన్నతములు

పర్వత ప్రదేశము : ఐరోపాలో రెండు సంప్రదాయముల పర్వత ప్రదేశము లున్నవి. అందు మొదటిది, ఖండమునకు వాయవ్య భాగమునకల స్కాండినేవియన్ పర్వతములు. ఇవి పురాతన మైనవి. వీని శిఖరములు మంచువలన అణగియుండి పడమట అట్లాంటిక్ మహాసముద్రము వైపున ఎక్కువ నిట్రముగ నున్నవి. తూర్పునకు క్రమముగా వాలియున్నవి. ఈ



పర్వత శాఖలే స్కాట్లాండు లోనికి ఐర్లాండు యొక్క ఉత్తర భాగమునకును, ఐస్‌లాండు ద్వీపము లోనికిని వ్యాపించి యున్నవి.

ఖండములో దక్షిణపు పర్వతములు రెండవ సంప్రదాయమునకు చెందినవి. ఇవి యౌవనములోనున్న ముడుత పర్వతములు. ఆల్ప్స పర్వతములు వీనికి కేంద్రము. ఆల్ప్స పర్వతములనుండి శాఖలు తూర్పు, పడమర, దక్షిణములకు వ్యాపించియున్నవి. పడమట పిరనీస్ పర్వతములు స్పెయిన్, ఫ్రాన్సు దేశములకు సరిహద్దుగా నున్నవి. వీనినుండి కాన్‌టాబ్రియన్, సిర్రానెవాడా పంక్తులు ఐబీరియన్ ద్వీపకల్పమున వ్యాపించి యున్నవి. ఆల్ప్సు దక్షిణ శాఖయై అపినైన్ పర్వతములు ఇటలీ దేశములో వెన్నెముకవలె వ్యాపించుటయేగాక ఈ దేశమునకు దక్షిణమునకల సిసిలీ ద్వీపములోనికి సైతము విస్తరించినవి.

ఆల్ప్సు పర్వతములకు తూర్పున రెండు శాఖలున్నవి. ఇందు ఈశాన్యశాఖకు కార్‌పేథియన్ కొండలని పేరు. తూర్పున బాల్కన్ పర్వతములు వ్యాపించియున్నవి. బాల్కనులు దక్షిణముగా గ్రీసు దేశములో పిండస్ అను పేరుతో విస్తరించియున్నవి. బాల్కనులు తూర్పుగా వ్యాపించి ఆసియా మైనరులోని కాకసస్ పర్వతములతో చేరుచున్నవి. ఆల్ప్సు పర్వతముల కుత్తరమున జూరా పర్వతశ్రేణి కలదు.

ఆల్ప్సు యూరపులోకెల్ల మిక్కిలి ఉన్నతములైన పర్వతములు. వీని శిఖరములు మంచుచే కప్పబడి యుండును. ఇందు పెక్కు నదులు పుట్టుచున్నవి. ఈ పర్వతములు ఉన్నతములైన సుమారు 100 శిఖరములచే ఒప్పుచున్నవి. ఈ పర్వతమందలి సృష్టివైచిత్ర్యములు చూడదగినవి.

పీఠభూములు : ఈ ముడుత పర్వత శ్రేణులకు మధ్య ప్రాచీన యుగమునకు చెందిన తక్కువ ఎత్తుగల పీఠభూములు కొన్నికలవు. వీనికి దిమ్మభూములని పేరు. స్పెయిన్ దేశములోని మెసిటాపీఠభూమి, ఫ్రాన్సునందలి మధ్యపీఠభూమి, జర్మనీ మధ్యగల పీఠభూమి, బొహిమియాపీఠభూమి, రైన్‌పీఠభూమి, హ్వోడోల్పపీఠభూమి మొదలగునవి యిట్టి దిమ్మభూములే.

మైదానములు : బిస్కే అఖాతము మొదలు ఐరోపా తూర్పు చివరవరకు ఒక పెద్ద మైదానము వ్యాపించియున్నది. ఈ మైదానము నైరృతి భాగమున యిరుకుగను, తూర్పున చాల వెడల్పుగ నున్నది. వెడల్పైన తూర్పు మైదానమునకు రష్యామైదాన మని పేరు. ఇదిగాక ముడుత పర్వత శ్రేణులమధ్య మరికొన్ని మైదానము లున్నవి. హంగేరి, బల్గేరియా, రుమేనియా, లంబార్డీ మైదానము లిట్టివి. బ్రిటిషు దీవులలోని తూర్పు ఇంగ్లాండును, ఐర్లాండును మైదాన ప్రదేశములే. మధ్యధరా సముద్రము నంటియున్న ఫ్రాన్సు దక్షిణభాగము చదును ప్రదేశమై యున్నది. ఈ మైదానములు మిక్కిలి ఫలవంత మైనవి.

నదులు : ఐరోపాలోని నదులకు ఆల్ప్సు పుట్టినిల్లు. ఇవి నలుదెసలకుపారి సముద్రతీరములనుండు సింధుశాఖలందు పడుచున్నవి. తూర్పుభాగపు నదులు పొడవుగను, పడమటి వైపుగా పారునవి కుఱుచగ నున్నవి. కాని వీనిగుండ సముద్రపు పోటు సమయమున ఓడలులోభాగమునకుపోగలవు. మరియు ఈనదులు జలపాతములతో కూడియుండుటచే వీని విద్యుచ్ఛక్తి పరిశ్రమల కెక్కువ ఉపయోగపడుచున్నది. ఐరోపాలోని పెక్కునదులు ఒక దానితో నొకటి కాలువలచే కలుపబడియుండుటచే నదులు వ్యాపారమున కెక్కువ ఉపయోగముగ నున్నవి. పటముజూచి ఏయే నదులు ఏయే సముద్రముల కలియుచున్నది జ్ఞాపకముంచుకొనుము.

## ప్రాక్టికల్

ఐరోపా పటమును అట్లాసున చూచి క్రింది నమూనాలను పూర్తి చేయుము:

ఐరోపాలోని నదులు

1. ఉత్తర సముద్రమున పడునదులు: (1) రైన్. (2) ఎల్బ్. (3) వీసర్.
2. బాల్టిక్ సముద్రమున పడునదులు
3. ఇంగ్లీషు ఛానలునందు పడు నదులు
4. అట్లాంటిక్ మహాసముద్రమున పడునవి
5. మధ్యధరా సముద్రమందు పడు నదులు
6. నల్లసముద్రమున పడు నదులు
7. ఐరోపా తూర్పుభాగమున పారు నదులు
8. వాయవ్యపు ఎత్తు ప్రదేశమున పారు నదులు

ఐరోపాఖండ పటముగ్రాసి అందు నిమ్నోన్నతములను, నదులనుచూపుము.

# 3. శీతోష్ణస్థితి

ఐరోపా శీతోష్ణస్థితి ఆసియా దానికంటె భిన్నముగా నుండును. ఆసియా చాల పెద్ద ఖండ మగుటచేతను, తీరరేఖ లోతుగా చీలి ఉండకపోవుటచేతను ఖండాంతర శీతోష్ణస్థితిని కలిగియుండును. ఐరోపా ఖండము చిన్నది. తీరరేఖలో చీలిక లెక్కువగానుండి సముద్రము అనేకచోట్ల లోనికి చొచ్చుకొని పోవుటచే యూరపులో సముద్రప్రాంత శీతోష్ణస్థితి కలదు. ఐరోపా ఆసియా అంత ఉత్తరమునలేదు. అందుచే ఉత్తరమున ఆసియాలో నున్నంత చలి యుండదు. అట్లే దక్షిణమునఆసియా ఉష్ణమండలములోనికి వ్యాపించియుండగా యూరపు 35 ఉ. అక్షాంశము వరకు మాత్ర మున్నది. కాబట్టి ఆసియాలో ఉష్ణ మండలమున్నను, యూరపులో లేదు. యూరపుయొక్క పడమటి భాగమునకు సముద్రము మీదనుండి వేడిగాలులు వీచుచుండును. కాని ఆసియాలో అట్టిగాలులు భూమిమీదనుండి వచ్చుటచే చల్లగానుండును. ఐరోపా పడమటి తీరమున గల్ఫ్‌స్ట్రీమ్ అను ఉష్ణజల ప్రవాహమువల్ల కొంత వెచ్చదనము కలుగుచున్నది.

శీతకాలములో తూర్పు యూరపులో అతి చలిగానుండి మంచు ఏర్పడును. 32 సమోష్ణరేఖ చూడుడు. నార్వే దక్షిణ భాగము, తూర్పు జర్మనీ, మధ్య యూరపు, ఉత్తర బాల్కను మండలములతో కూడిన తూర్పు యూరపులో చలి ఎక్కువ. వీటికి పడమట మంచు ఏర్పడదు. ఈ భాగములో ఇంగ్లండు,

పశ్చిమ జర్మనీ, డెన్మార్కు, హాలెండు, బెల్జియం, ఫ్రాన్సు, స్పెయిను, ఇటలీ, దక్షిణ బాల్కను మండలములు కలవు. ఐరోపా పడమటి తీరమునకు పశ్చిమ వాయువులయొక్కయు, ఉష్ణజల ప్రవాహము యొక్కయు ప్రభావము కలదని చెప్పితిమి. దక్షిణమున మధ్యధరా మండల మగుటచే అంత చలి ఉండదు.



32° మించిన ఉష్ణము



70° లకు మించిన ఉష్ణము

వేసవిలో ఐరోపాలో ఎక్కడను నీరు గడ్డకట్టదు. 70° సమోష్ణరేఖ ఖండము మధ్యగా తూర్పు పడమరలుగా పోవుచున్నది. కావున ఖండ దక్షిణ భాగములోనే ఉష్ణ మెక్కువగా నుండి, ఉత్తర భాగమున ఉష్ణము తక్కువగా నుండును. దక్షిణ భాగములోకూడ సముద్ర ప్రభావముచేత అతి వేడి యుండదు. ఉత్తర ఐర్లండు, ఉత్తర ఇంగ్లండు, స్కాట్లండు, నార్వే, ఉత్తర రష్యాలు మాత్రము 60° కంటె తక్కువ ఉష్ణమును కలిగియున్నవి.

ఐరోపాలోని మధ్యధరా మండలములో ప్రత్యేకమైన శీతోష్ణస్థితి కలదు. దీనికి అచ్చటి సముద్రమును బట్టి మధ్యధరా శీతోష్ణస్థితి అని పేరు వచ్చినది. ఈ ప్రాంతమున వేసవిలో గాలి పొడిగాను, ఆకాశము నిర్మలముగాను ఉండును. శీతకాలమున కొద్ది వర్షము కురియును. మధ్యధరా సముద్రమునకు చుట్టు నున్న ప్రదేశము లన్నిటిలోను ఈ శీతోష్ణస్థితి కలదు. దక్షిణ స్పెయిను, దక్షిణ ఫ్రాన్సు, ఇటలీ, గ్రీసులు ఈ శీతోష్ణస్థితిని కలిగియున్నవి.

# 4. సహజ విభాగములు

ఐరోపాను శీతోష్ణస్థితినిబట్టి నాలుగు భాగములు చేయ వచ్చును. (1) ఆర్కిటికు ప్రాంతము. (2) వాయవ్యప్రాంతము (3) మధ్యప్రాంతము. (4) మధ్యధరామండలము.

1. ఆర్కిటికు సముద్ర ప్రాంతమునకల కొద్ది ప్రదేశము ఈ మండలములోనిది. ఇచ్చట శీతకాలమున సంవత్సరములో ఎక్కువ నెల లుండును. చలి విపరీతము. సముద్రమును, నదులును గడ్డగట్టి యుండును. తెల్లసముద్రములోని ఆర్కేంజలు రేవు సంవత్సరములో ఆరునెలలు నిరుపయోగముగానుండును.

ఇది టంండ్రాప్రదేశము. ఇది నార్వేలోను, రష్యాలోను కూడ కలదు.

2. వాయవ్యప్రాంతము : నార్వే తీరప్రాంతము, బ్రిటిషు దీవులు, డెన్మార్కు, హాలెండు, బెల్జియం, పశ్చిమ ఫ్రాన్సు దీనిలో చేరియున్నవి. ఈ ప్రాంతము భూమధ్యరేఖకు చాల దూరమున నున్నను రెండుకారణములచే అతిశీతలతను పొందుట లేదు. (1) గల్ఫ్‌స్ట్రీమ్ అను ఉష్ణజల ప్రవాహముయొక్క ప్రభావము కలదు. (2) సముద్రపవనములు పశ్చిమమునుండి వీచును. అందుచే శీతకాలమున అతి చలి ఉండదు. వేసవులు చల్లగానుండును. పశ్చిమవాయువుల వల్ల ఈ ప్రాంతమునకు సంవత్సరమంతటను వర్షము కురియును కాని అక్టోబరు నుంచి మార్చివరకు ఎక్కువ. ఏలన అప్పుడు పశ్చిమపవనములు ఎక్కువగా వీచును.

3. మధ్యప్రాంతము : జర్మనీ, హాలెండు, రష్యా, తూర్పు యూరపు ఇందు చేరును. ఇచ్చట ఖండాంతర శీతోష్ణస్థితి యుండును. ఇది మధ్యధరా మండలమునకును, ఆర్కిటికు ప్రాంత ప్రదేశమునకును మధ్యను, వాయవ్య ప్రాంతమునకు తూర్పునను ఉన్నది. ఐరోపాలోని ఎక్కువ భూభాగము ఈ మండలములోనే ఉన్నది. ఉష్ణ వ్యాత్యాసము ఎక్కువగా నుండును. వేసవికాలములో వేడిగను, శీతకాలములో అతి చలిగాను ఉండును. తూర్పునకును, ఆగ్నేయముగాను పోవుకొలది వర్షము తగ్గుచుండును.

4. మధ్య ధరామండలము : స్పెయిను, దక్షిణ ఫ్రాన్సు, ఇటలీ, బాల్కను ద్వీపకల్పము ఈ మండలమునకు చెందును. ఇట్టి లక్షణములనుగూర్చి ఇదివరకేచదివితిరి. ఈ లక్షణములున్న మండలములు అన్ని ఖండములలోను భూమధ్య రేఖకు ఉత్తరమునను దక్షిణముననుకూడ 35°—55° మధ్య కనబడును. వేర్వేరు ఖండములలో గుర్తించుడు. మనదేశమున ఎక్కడనైన కలదా? ఏల?

ప్రాక్టికల్

**ఐరోపా పటములో వివిధ శీతోష్ణ మండలములు గుర్తింపుడు.**

---

# 5. సహజ వృక్షజాలము

ఐరోపాలో వివిధ వృక్షజాల మండలములను చూతము. మధ్య ధరామండలములో సతతహరితము లున్నవి. కాని ఇవి ఉష్ణమండలపు సతతహరితముల వంటివి కావు. ఉష్ణమండలపు సతతహరితములు అధిక వర్షముపై ఆధారపడి ఆకులు రాలుచున్నను వెంటనే చిగుర్చుచు పచ్చగా కనబడుటచే వానికి ఆ పేరు వచ్చినది. మధ్యధరా మండలములలో ఆకులు శీతకాలము వచ్చినంతనే రాలక చెట్లు పచ్చగానుండును. ఇచ్చట వర్షపాతము తక్కువ. వేసవులలో వేడి ఎక్కువ. కావున ఆ పరిస్థితులను ఎదుర్కొనగల లక్షణములు అచ్చటి చెట్లకు గలవు.

ఈ చెట్లవేళ్లు చాల లోతుగా వ్యాపించును. చెట్ల ఆకులు దళసరిగానుండును. కొన్నిటికి నూగుఉండును. అందుచే తేమ త్వరితముగా ఆవిరి అయిపోదు.

ఇచ్చటి ముఖ్య వృక్షములు ఆలివు, ఓకు, మిర్టిల్. ఆలివు మైదానములలో పెరుగును. దాని పండ్లు వేసవిలో పక్వమగును. నారింజ, నిమ్మ, ద్రాక్ష, అత్తి, పీచ్, ఆప్రికాట్, మల్బరీ, దానిమ్మ, పండ్లకు కూడ ఈ మండలము ప్రసిద్ధము.



మధ్యధరా వృక్షజాలమునకు ఉత్తరమున ఆకురాలు విశాల పత్రారణ్యములు కలవు. ఈ మండలములో బ్రిటిషు దీవులు, ఉత్తర స్పెయిను, ఉత్తర ఫ్రాన్సు, బెల్జియం, హాలెండు, డెన్మార్కు, దక్షిణ స్కాండినేవియా, పోలెండు, దక్షిణ రష్యా చేరియున్నవి. ఇచ్చట ఓకు, బీచి, ఎల్మ్ మొదలగు వృక్షములును, ఆపిల్, పేర్, ప్లమ్, చెర్రీ మొదలైన ఫలవృక్షములు చక్కగా పెరుగును. కాని ఈ అరణ్యములు ఇప్పుడు నరికివేయబడినవి. అచ్చటి భూములు పంటభూము లైనవి.

ఈ మండలమునకు ఉత్తరమున అనగా ఉత్తరస్కాట్లండు స్కాండినేవియా, ఉత్తర రష్యాలలో శృంగాకారారణ్యములు కలవు. ఇట్టి అరణ్యములు ఉత్తర అమెరికాలోను, ఎత్తయిన పర్వతములమీదకు పోయినకొలదిని ఉన్నట్లు చూచియుంటిమి. ఈ వృక్షజాలము మహారణ్యముగా ఉత్తర ఐరోపా, ఆసియాలలో వ్యాపించియున్నది. ఈ అరణ్యములలో పైన్, ఫర్, లార్చివంటి సూది ఆకులుగల చెట్లు కలవు. మధ్య, దక్షిణ ఐరోపాలలోని పర్వతపంక్తులలో ఎత్తయినచోట్ల కూడ ఈ వృక్షములున్నట్లు ఈ వరకే చెప్పితిమి.

శృంగాకారారణ్యములకు ఉత్తరమున టండ్రాలు కలవు. వీటినిగూర్చి శీతోష్ణస్థితి పాఠములో చదివితిరి. అలాస్కా, గ్రీన్‌లాండు మొదలగుచోట్లగూడ ఇట్టి ప్రదేశములు కలవు. ఈ ప్రాంతపు జనుల జీవితము ఏఖండములోనైనను ఒకే మాదిరిగానుండును.

ఆగ్నేయ రష్యాలో వర్షపాతము తక్కువ. అక్కడ వృక్షములు పెరుగజాలవు. గడ్డిమాత్రము పెరుగును. ఇది స్టెప్పీ మండలము. అనగా సమశీతల మండల గడ్డిభూమి. ఈగడ్డిబీడులు యూరల్ పర్వతములు, కాస్పియను సముద్రపుప్రాంతమునుండి ఆసియాలోనికి వ్యాపించియున్నవి. హంగేరీలోను, రుమేనియాలోను కూడ ఇట్టి బీడులు కొద్దిగా కలవు.

ఐరోపాలో వర్షములేని ప్రదేశమేలేదు. అందుచే ఎడారి కూడ లేదు. కాని కాస్పియన్ సముద్ర ప్రాంతమునందు కొంచెము ప్రదేశము ఎడారి తుల్యము.

### ప్రాక్టికల్

**ఐరోపా పటమును గీచి అందు సహజ వృక్షజాల మండలములను గుర్తింపుడు.**

---

# 6. ఆర్థిక సంపద

మిగిలిన అన్ని ఖండములకంటెను ఐరోపా ఆర్థికముగా మిక్కిలి అభివృద్ధి పొందియున్నది. దీనితో కొంతవరకు పోటీ రాగలది ఉత్తర అమెరికామాత్రమే. అచ్చటి శీతోష్ణస్థితి ప్రజలకు అలసట కలిగింపక ఉత్సాహమును కలిగించును. ఆ ఖండపు వైశాల్యములో 31 శాతము అరణ్యములు. అరణ్యములలో కలప, ఇతర పదార్థములు విపరీతముగా లభించును. ప్రపంచ

ఖనిజ సంపదలో దాదాపు సగము ఈఖండమందే లభించుచున్న దన్నచో పారిశ్రామికముగా ఎంత అభివృద్ధి చెందినదో ఊహింప వచ్చును. ఐక్యరాజ్య సమితి వారి 1951 లోని అంకెలను బట్టి అక్కడి బొగ్గు ఉత్పత్తి చూడుడు.

బొగ్గు ఉత్పత్తి
(మిలియనుల టన్నులు)

| | 1937 | 1951 |
|---|---|---|
| ఐరోపా (రష్యా కాక) | 653.8 | 684.5 |
| కెనడా మరియు అ. సం. రా. | 462.6 | 536.5 |
| ఆఫ్రికా | 17.1 | 30 3 |
| ఆసియా | 115.7 | 122.0 |
| దక్షిణ అమెరికా | 4.5 | 6.5 |
| మధ్య ప్రాచ్యము | 2.4 | 5.1 |
| రష్యా | 128.0 | 284.0 |

ఇనుప ఖనిజములోకూడ యూరపుదే అగ్రస్థానము. ముఖ్యమైన ఇనుపగనులు స్పెయిను, ఫ్రాన్సు,స్వీడను, రష్యాలలో కలవు. పెట్రోలియముకూడ అధికముగా కలదు. రష్యాలోని కాకసస్, యూరలు ప్రాంతములలోను, రుమేనియాలోను పెట్రోలియం అధికముగా లభించును. ప్రపంచపు పెట్రోలియంలో 14% ఈఖండమందు లభించును. సీసము, జింకు, ప్లాటినము, రాగి పొటాషు, బాక్సైటు అధికముగాకలవు. బంగారము, వెండి, నికెలు, తగరముకూడ కొన్నిచోట్ల లభించుచున్నవి.

వ్యవసాయోత్పత్తులలోకూడ ఐరోపా మంచిస్థానమునే ఆక్రమించుచున్నది. ఐక్యరాజ్య సమితి అంకెలు ఈ దిగువ ఈయబడినవి.

| | ప్రపంచ ఉత్పత్తి | ఐరోపా ఉత్పత్తి |
|---|---|---|
| | (మిలియనుల ప్రమాణములో-1935) | |
| గోధుమ | 1319 | 640 |
| బార్లీ | 426 | 233 |
| ఓట్లు | 687 | 415 |
| రై | 492 | 470 |
| బంగాళాదుంపలు | 2018 | 1848 |
| బీటు పంచదార | 781 | 689 |

పై అంకెలనుబట్టి ఐరోపా వ్యవసాయములో చాల అభివృద్ధిలోనున్నట్లు గమనింపవచ్చును. మధ్యధరామండలము, వాయవ్య మధ్య ఐరోపాలు, తూర్పు మైదానములు, వ్యవసాయ భూములు, నవీనపద్ధతులపై జరుగుచున్న ఈ వ్యవసాయమువల్ల ఎకరమునకు దిగుబడికూడ ఎక్కువగానే ఉన్నది.

పారిశ్రామిక విప్లవము ఈఖండములోనే వచ్చినది.అందుచే అనేక పరిశ్రమలు అత్యంత ఆధునిక పద్ధతులపై జరుగుచున్నవి. శాస్త్రవిజ్ఞానము పెరుగుచున్నకొలదిని వ్యవసాయము, పరిశ్రమలుకూడ క్రొత్తవిధానముల ప్రకారము నడుపబడుచున్నవి. పరిశ్రమలు ఇంగ్లండు, ఉత్తరఫ్రాన్సు, బెల్జియము, జర్మనీ, జెకొస్లొవేకియా, దక్షిణపోలెండు, మధ్యరష్యాలలో ఎక్కువ. ఇటలీ, హంగేరీ, స్కాండినేవియాలలో తక్కువ.

ఐరోపాయొక్క అభివృద్ధికి రవాణా సదుపాయములు ముఖ్యసాధనములై యున్నవి. సముద్రతీరము ఎక్కువగా చీలి యుండుటచే అనేక సహజ నౌకాశయము లేర్పడి వర్తకము నకు మిక్కిలి అనుకూలించుచున్నవి. ఐరోపానౌకలు అన్ని ఖండములతోను వర్తకము చేయుచున్నవి. ఇంగ్లండు, ఫ్రాన్సు, నార్వే, ఇటలీ, హాలెండు, ఈ వ్యాపారములో ముఖ్యస్థాన మాక్రమించుచున్నవి.

ఐరోపా మొత్తముమీద 2,30,400 మైళ్ళ రైలు మార్గములను కలిగియున్నది. (మన దేశములో 40,000 మైళ్ళ రైలుమార్గములు మాత్రము కలవు. కెనడా, అ. సం. రా. ములలో 2,70,200 మైళ్ళ రైలు మార్గము లున్నవి.) అట్లే రోడ్లుకూడ చక్కగా అభివృద్ధి పొందినవి.

ఐరోపాలో జనబలము సమృద్ధిగా నున్నది. ఈ ఖండ ములో 524 మిలియనులు జనులున్నారు. ఇది ప్రపంచ జనా భాలో నాల్గవ వంతుకంటె ఎక్కువ. కాని, ఈ జనము అంత టను సమానముగాలేరు. ఉత్తర స్కాట్లండు, ఉత్తర స్కాండి నేవియా, టండ్రా ప్రాంతపు రష్యాలలో జనసాంద్రత బహు తక్కువ. ఇంగ్లండు, మధ్య ఐరోపాలలో ఎక్కువ జనసాంద్రత కలదు. వివిధ దేశములలో వివిధ భాషలుండి దాదాపు అన్నియు చక్కగా అభివృద్ధి పొందుచున్నవి.

ఇప్పటివరకు ఐరోపా మొత్తమునుగురించి చూచితిమి. ఇప్పుడు అందలి వివిధ దేశములనుగూర్చిన వివరములను చూతము.

# 7. స్కాండినేవియా

స్కాండినేవియా ద్వీపకల్పములో పడమటివైపు నార్వే యును తూర్పున స్వీడను కలవు. నార్వే సన్నగ పొడవుగ పర్వతమయమై యున్నది. దీని తీరరేఖలో అనేక చీలికలు కలవు. వెంబడి ఎత్తయిన పర్వతములు కలవు. వానిలో అసంఖ్యాకమైన ఫియోర్డులు లోనికి చొచ్చుకొని వచ్చినవి. స్వీడను నార్వే కంటె విశాలమైన దేశము.




పర్వతములు తక్కువ. ఈ దేశము తూర్పునకల బాల్టిక సముద్రము వైపు వాలి యున్నది. నార్వేలో నదులు పొట్టిగనుండి చాల వేగముగ ప్రవహించి అట్లాంటికులో కలియును. ఈ నదులనుండి జలవిద్యుచ్ఛక్తి తీయుటకు ఎక్కువ అవకాశము కలదు. స్వీడనులో నదులు అంతకంటె పొడవుగానుండి బాల్టికులో కలియును. ఈ రెండు దేశములును ఆర్కిటికు వలయము దాటి ఉత్తరముగా వ్యాపించినవి. కాబట్టి ఈ దేశపు రేవులు శీతకాలములో గడ్డ కట్ట వలసినదే. కాని గల్ఫ్‌స్ట్రీమ్ అను ఉష్ణజల ప్రవాహము

యొక్క ప్రభావమువల్ల నార్వే తీరములో నీరు గడ్డకట్టక రేవులు ఎల్లప్పుడును ప్రయాణమునకు అనుకూలముగా నుండును. కాని బాల్టికులో నుండుటచే స్వీడను రేవులు, నదులు, సరస్సులు శీతకాలములో గడ్డకట్టి యుండును. స్కాండినేవియా పర్వతములు అట్లాంటికు మీదనుండి వచ్చు వెచ్చని వాయువులను తూర్పుగా పోనీయక పోవుటయే ఇందుకు కారణము. నార్వేలో పర్వతము లెక్కువ కనుక వ్యవసాయమున కెక్కువగా అవకాశ ముండదు. పర్వత పాదముల వద్దను, లోయలలోను, కొంచెము వ్యవసాయము సాగుచున్నది. పచ్చిక బీళ్ళలో గొఱ్ఱెలు, పశువులు మేపబడు చున్నవి. అందుచే నార్వీజియనుల జీవితము ఎక్కువగా సముద్రము మీదనే గడుచుచుండును. వారు మంచి నావికులు. చేపలను అతి నేర్పుతో పట్టుదురు. వారి తీరము వెంబడి చేపలు ఎక్కువగా నుండును. అక్కడ కాడ్, హెరింగు చేపలు బాగుగా లభ్యమగును. శీతకాలములో చేపలను పట్టి ఎండబెట్టి ఎగుమతి చేయుదురు. కాడ్ చేపలలోనుండి కాడ్ లివర్ ఆయిల్ తీయుదురు. నార్వే దేశీయులు తిమింగిలములను కూడ పట్టుదురు.

పశ్చిమ పవనముల ప్రభావమువల్ల నార్వేకు మంచి వర్షము లభించును. కాని స్కాండినేవియా పర్వతము లడ్డుటచే తూర్పుననున్న స్వీడనులో వర్షము బహు తక్కువ. స్వీడను వర్షచ్ఛాయా ప్రదేశములో నున్నది. ఈ పర్వతముల ప్రభావమువల్ల స్వీడనులో శీతకాలమున చలి ఎక్కువ; వేసవిలో వేడిఎక్కువ.

ఉత్తర నార్వేలో రాత్రిపూట ప్రకాశించు సూర్యుడు కానన గును. శీతకాలములో ఈప్రాంతమున సూర్యుడు కనబడడు. అయినను ఆ కాలమున అరోరా బొరియోలిస్ అను కాంతి దర్శనీయముగ నుండును. ఈ వింతలను చూచుటకు అనేకులు వచ్చుచుందురు.

నార్వే దక్షిణ భాగమున కొంచెము మైదానము కలదు. ఈ ప్రాంతమున ఒక ఫియోర్డు ముఖమున ఆదేశపు రాజధాని యగు ఆస్లో పట్టణ మున్నది. కాని ఈ ఫియోర్డునకు అట్లాంటికులోని ఉష్ణజల ప్రవాహ ప్రభావములేదు. కావున శీతకాలములో గడ్డకట్టును. నార్వేలోకూడ జలశక్తి నుపయోగించి రంపపు మిల్లులను నడుపుచున్నారు.

స్వీడను నార్వేకంటె వెడల్పైనది. కాబట్టి వ్యవసాయమునకు ఎక్కువ అవకాశమున్నది. నార్వేలోకంటె ఎక్కువగడ్డి బీడులు, అరణ్యములుకూడ కలవు. ఇచ్చట ఓట్లు, రై, బార్లీ, బంగాళాదుంపలు ముఖ్యపంటలు. వ్యవసాయముకంటె పశుపోషణ ముఖ్యమైన వృత్తి.

నార్వేలో చేపల పరిశ్రమ ఎంత ముఖ్యమో స్వీడనులో కలప పరిశ్రమ అంతముఖ్యమైనది. దేశ వైశాల్యములో సగము కంటె ఎక్కువభాగము శృంగాకారారణ్యములచే కప్పబడియున్నది. ఈకలపను యంత్రశాలలవద్దకు నదులు చేర్చుచున్నవి. నదులనుండి వచ్చు విద్యుచ్ఛక్తితో కోత యంత్రములు కాగితపు యంత్రములు పనిచేయుచున్నవి. బాల్టికు తీరమున గల

ఈ యంత్రశాలలలో అనేకులకు పని లభించుచున్నది. కోసిన కలపతో తలుపులు, ద్వారబంధములు మొదలగు సామానులు కూడ చేసి ఎగుమతి చేయుదురు. అగ్గిపెట్టెల కర్మాగారములు, నౌకా నిర్మాణ శాలలు కలవు. స్వీడనులో తయారగు కాగితము చాల మంచిది.



స్వీడనులో కలప పరిశ్రమ

స్వీడనులో మంచి ఇనుపగనులు కలవు. ఈగనులు ఫలూన్, గెల్లివర్రై రాలవద్ద త్రవ్వబడుచున్నవి. ఈ ఇనుప ఖనిజములో ఎక్కువ భాగము ఇంగ్లండునకు ఎగుమతి చేయబడుచున్నది.

ఈ ఖనిజము వేసవిలో బాల్టికు రేవగు ల్యూనా ద్వారాను, శీత కాలములో నార్వే రేవగు నార్విక ద్వారాను ఎగుమతి చేయ బడుచున్నది. కారణ మూహింపుము.

స్వీడనుకు రాజధాని స్టాక్‌హోమ్. ఇది మేలార్ సరస్సు లోని ఒక ద్వీపముమీద కట్టబడినది. ఇది రైలు ద్వారా పడమటి రేవగు కటెగట్‌తో కలుపబడినది. స్టాక్ హోమ్ రేవు శీత కాలములో గడ్డకట్టును.

---

# 8. బాల్టికు రాజ్యములు

మొదటి ప్రపంచయుద్ధమునకు పూర్వము బాల్టికు సముద్రమునకు తూర్పువైపునగల ప్రదేశమంతయు రష్యను సామ్రాజ్యములో చేరియుండెను. 1917 లో రష్యను విప్లవ ఫలితముగా బాల్టికు తీరమున ఫిన్లండు, ఎస్తోనియా, లాట్వియా, లిథూయేనియా అను నాలుగు ప్రజాప్రభుత్వములు వెలసినవి. ఈ దేశము లన్నియు ఆర్థికముగా వెనుకబడి యున్నవి,

ఫిన్లండు దేశములో అనేక సరస్సులు శృంగాకారారణ్యములతో కూడిన కొండలు కలవు. నవంబరునుండి ఏప్రిలు వరకు భూమి మంచుచే కప్పబడియుండును. వసంతఋతువు కొద్ది కాలమే యుండును. వేసవిని వేడిగా నుండును. వ్యవసాయము

నకు అనుకూల పరిస్థితులు తక్కువ. అయినను, ఓట్లు, రై, దక్షిణమున గోధుమ పండించుచున్నారు.



ప్లైవుడ్ పరిశ్రమ

స్వీడనులోవలెనే ఫిన్లండులోకూడ కలపవృత్తి ముఖ్యమైనది. ఇచ్చటి అడవులలో ఫర్, పైను, మేపుల్, ఆష్, ఓకు చెట్లుకలవు. ఈ కలపనుండి న్యూసుప్రింటు, కాగితము, గుజ్జు, అట్టలు తయారుచేయుదురు. ఇటీవల ప్లైవుడ్ తయారు చేయుట ముఖ్యవృత్తి అయినది. పశుపోషణకూడ కలదు.

ఈ దేశమునకు రాజధాని హెల్ సింకీ, లేక హెల్ సింగ్ ఫోర్సు. వైబోర్గునుండి కలప ఎగుమతి అగును. ఆబో, టోర్కులు కూడ ఎగుమతి రేవులే.

ఎస్తోనియా, లాట్వియా, లిథూయేనియాలు రెండవ ప్రపంచ యుద్ధానంతరము తిరిగి రష్యాచే ఆక్రమింపబడినవి. ఈ మూడు రాజ్యములలోను కలపపరిశ్రమ ముఖ్యము. రెవెల్, రీగా, మెమెల్‌లు కలప ఎగుమతి రేవులు. వ్యవసాయము, పశు పోషణ, కోళ్ళ పెంపకము కొందరికి ముఖ్యవృత్తులు. నారకూడ పండింపబడుచున్నది. ఈనార బెల్జియముకు ఎగుమతి చేయబడు చున్నది. అక్కడ దీనితో లినెను వస్త్రములు తయారు చేయు చున్నారు. లిథూయేనియానుండి కోడిగుడ్లు ఎక్కువగా ఎగుమతి అగుచున్నవి. రై, ఓట్లు, బంగాళాదుంపలు ముఖ్య పంటలు.

---

# 9. పడమటి మైదాన ప్రదేశములు

మధ్యమైదానము అట్లాంటికు సముద్రమునుండి రష్యా వరకు వ్యాపించి యున్నదని చదివియున్నారు. అందు పడమటి మైదానప్రదేశములో ఫ్రాన్సు, బెల్జియము, హాలెండు, డెన్మార్కు, జర్మనీ, పోలెండు చేరియున్నవి.

## ఫ్రాన్సు

ఫ్రాన్సుదేశము గొప్ప నాగరికతగల దేశము. ఐరోపా చరిత్రలో ప్రముఖస్థానము నాక్రమించి యుండెను. ఉత్తరము నను దక్షిణమునను కూడ సముద్రములుండుటచే వర్తకమునకు




చాల అనుకూలమైన స్థితిలో నున్నది. వైశాల్యము, జనసంఖ్య కూడ ఎక్కువే కనుక దేశమును ఆర్థికముగా అభివృద్ధిలోనికి తెచ్చుటకు అవకాశము కలదు. ఇందుకు చక్కని నదులు, అనుకూలమైన శీతోష్ణస్థితి సహాయపడుచున్నవి.

ఫ్రాన్సుదేశమును రెండు సహజమండలములుగా విభజింపవచ్చును. (1) ఉత్తరపు మైదానము. (2) దక్షిణపుమిట్టలు. దక్షిణపు మిట్టలను మరల రెండు భాగములు చేయవచ్చును. (a) మధ్యపీఠభూమి. (b) పశ్చిమ ఆల్ప్సు. మధ్యపీఠభూమి పిరనీసు పర్వతములనుండి కార్కాసోన్ ద్వారమువలనను, ఆల్ప్సు నుండి రోన్, సోన్ నదీలోయ వలనను వేరుచేయబడినది. ఈ రెండు లోయలును రవాణాకు చాల అనుకూలముగా నున్నవి.

మైదానము, పర్వతములుకూడ నుండుటచే వ్యవసాయము, పరిశ్రమలు, పశుపోషణ సమముగా వృద్ధిపొందినవి. మరియు రెండువైపుల సముద్రముండుటచే బెస్తవృత్తికూడ పెంపొందినది. ప్రజలు నౌకాయానమునందు ఆరితేరినవారు.

ఫ్రాన్సులో వ్యవసాయము ముఖ్యవృత్తి. జనసంఖ్యలో దాదాపు సగముమంది ఇందు పాల్గొనుచున్నారు. చాలమందికి స్వంతపొలము లుండును. మనదేశములోవలె అక్కడకూడ రైతు కుటుంబముతో పొలములో పనిచేయును. ముఖ్యపంట గోధుమ. మైదానమంతటను గోధుమపొలములు కలవు. అందు ముఖ్యముగా లోయర్ నదీ పరీవాహ ప్రదేశములో అధికము. గరోనీ నదీ మండలములో మొక్కజొన్న అధికము. ఉత్తరమున బార్లీ, హాప్ పండ్లు, బీటు దుంపలు పండింపబడుచున్నవి. ఇక్కడ కూరగాయలతోటలు, పూలతోటలుకూడ ఎక్కువ. పువ్వులు, పండ్లు, ఇంగ్లండుకుకూడ ఎగుమతి చేయుదురు. ఫ్రాన్సు దక్షిణ భాగమున మధ్యధరా ఫలములు అధికము. వీటన్నిటిలోను ముఖ్య

మైనది ద్రాక్ష. ఈపంట గోధుమ తర్వాత రెండవది. ఇది గరోనీ, రోన్, సోన్, ఎగువసీన్, లోయర్ నదుల ప్రాంతమున ఎక్కువ. ఆ ప్రాంతములలోనే ద్రాక్ష సారాయముకూడ ఎక్కువగా చేయుచున్నారు. దీనికి ముఖ్య కేంద్రము బూర్డ్.

బ్రిట్టనీ, నార్మండీలలో ఆపిలుపండ్లు ఉత్పత్తి చేయబడు చున్నవి. వీటినుండి సైడరు అను పానీయమును తయారు చేయుచున్నారు. రోన్‌నదీ లోయలో మల్బరీ చెట్లను పెంచి పట్టు పురుగులను ఉత్పత్తి చేయుచున్నారు. పట్టు ఉత్పత్తిలో ఫ్రాన్సు ప్రముఖస్థాన మాక్రమించుచున్నది. రోన్, సోన్, నదుల సంగమస్థానమునకల లయన్స్ పట్టణము పట్టుపరిశ్రమకు కేంద్రము.

పశుపోషణకూడ అధికముగా జరుగుచున్నది. ఉత్తరపు మైదానములోను, మధ్యపీఠభూమిలోను పశువులను మేపుటకు అనుకూలముగా నున్నది. రెండు చోట్లను పాడిపరిశ్రమ అధికము. వర్షము తక్కువగా నుండు పీఠభూములమీద గొఱ్ఱెల మేపుచున్నారు.

ఫ్రాన్సులో ఖనిజసంపద విశేషముగా కలదు. ఇనుప ఖనిజములో ఈ దేశము ఐరోపాలో ప్రథమస్థాన మాక్రమించి నది. ఈగనులు రైన్ మండలములో కలవు. ఇవి బొగ్గుగనుల సమీపమున లభించుటచే పరిశ్రమలకు అనుకూలముగా నున్నది. ఇనుపగనులు నార్మండీ, బ్రిట్టనీ, పిరనీస్ ప్రాంతములో కూడ కనుగొనబడినవి.

ఈ దేశమున బొగ్గు సమృద్ధిగా లభించుచున్నది. ఫ్రాన్సుతో ఉత్తరమున లిల్లీ వద్దగల ఫ్రాంకో బెల్జియనుగని పెద్దది. రెండవది మధ్యపీఠభూమిలోని లోయర్ బొగ్గుగని, సెంట్ ఎటిఎన్ని వద్దను, రోన్ డెల్టాలోను, లెక్రుజీ వద్దను, ఇంకను ఇతర చోట్లను చిన్న చిన్న బొగ్గుగనులు కలవు. కాని ఈ దేశములోని బొగ్గు అంత శ్రేష్ఠమైనది కాదు.

పిరనీస్, ఆల్ప్సు పర్వతముల మీద పుట్టిన నదుల నుండి జలవిద్యుత్తు తీసి పరిశ్రమలకు వాడుచున్నారు.

ఫ్రాన్సులో అనేక పరిశ్రమలు కలవు. లిల్లీ బొగ్గుగనివద్ద ఉన్ని, నూలు, నార వస్త్రములు తయారుచేయు యంత్ర శాలలు కలవు. ఫ్రెంచి వస్తువులు అందముగాను, నాజూకుగాను ఉండును.

లోయర్ మండలములోని నాన్సీ లాంగ్వీలలో ఇనుము ఉక్కు పరిశ్రమ కలదు. లయన్స్‌లో పట్టు పరిశ్రమ విశేషము. ఎలక్ట్రికల్ సామానులుచేయు పరిశ్రమకూడ వృద్ధిచేయ బడినది. మార్సెయిల్స్‌లోను, సేన్ ముఖద్వారములోను నౌకా నిర్మాణము సాగుచున్నది. రసాయనిక పదార్థముల ఉత్పత్తిలో కూడ ఫ్రాన్సుకు ప్రముఖ స్థానము కలదు.

ఫ్రాన్సులో రవాణా సదుపాయములు చాల తృప్తి కరముగా నున్నవి. నదులు ఒకదానిలో నొకటి కాలువలద్వారా కలుపబడి నౌకాయానమునకు మిక్కిలి అనుకూలముగా నున్నవి. ఇట్లు కలుపబడిన నదులు-సేన్, ఓయిస్, మ్యూజ్, సోన్, రోన్,

రైన్, లోయిర్. దేశమంతటను రైలు మార్గములు, రోడ్లు విశేషముగా కలవు. ఇప్పుడు దేశములోపల విమానమార్గములు కూడ పనిచేయుచున్నవి. అంతర్జాతీయ విమానమార్గములు ఈ దేశము ద్వారా పోవుచుండును.

ఫ్రాన్సులో చాల అందమైన పట్టణములు కలవు. పారిసు పట్టణము ఆ దేశమునకు రాజధాని. తూర్పు మైదానములో మధ్యనుండి అన్ని ప్రాంతములతోను రైలుమార్గములద్వారా కలుపబడినది. అనేక సుందరభవనములు, చక్కని విశాలమైన రాజబాటలు నగరముయొక్క సౌందర్యమును ఇనుమడింప జేయుచున్నవి.

మార్సెయిల్స్ మధ్యధరా సముద్రతీరపు రేవు. చాల ముఖ్యమైనది. ఇచ్చట సబ్బులు, క్రొవ్వువత్తులు చేయుదురు. సూయజు కాలువ వచ్చినతర్వాత దీని ప్రాముఖ్యత హెచ్చినది.

కెలే పట్టణము ఫ్రాన్సు ఉత్తరతీరమున ఇంగ్లండుకు మిక్కిలి దగ్గరలో నున్నది. పట్టుపరిశ్రమకు లయన్సు, ద్రాక్షసారాయమునకు బోర్డో, నూలు వస్త్రములకు రూయెన్, లినెనకు లిల్లీ మొదలగు అనేక పారిశ్రామిక నగరములు ప్రసిద్ధమైనవి.

రెండు ప్రపంచయుద్ధములలోను ఫ్రాన్సు చాల నష్టపోయి యుండెను. ఇప్పుడిప్పుడే ఆ దెబ్బలనుండి కోలుకొనుచున్నది.



పారిస్ నగరమందలి ఓర్లీ విమానాశ్రయము

## బెల్జియము

బెల్జియము ఫ్రాన్సు జర్మనీలకు మధ్యను, హాలెండుకు దక్షిణమునను ఉన్నది. వెనుక ఫ్రాన్సు జర్మనీలు అనేక యుద్ధములలో పాల్గొనప్పుడు ఈదేశము ఆ దెబ్బలవల్ల నలుగుచుండెడిది. కావున దీనికి ఐరోపాయొక్క యుద్ధభూమి అని పేరుండెను.

దేశము చాల చిన్నది. దీనిలో మూడు భాగములున్నవి.

1. ఉత్తరపు ఫ్లాండర్స్ మైదానము : ఇచ్చట వ్యవసాయము పశుపోషణ ముఖ్య వృత్తులు, రై , ఓట్లు, గోధుమలు, బంగాళాదుంపలు, బీటుదుంపలు, నార పండును. ఇచ్చట బట్టల మిల్లులు కూడ కలవు. పాడి పరిశ్రమ ఈప్రాంతమున అధికము.

2. సేంబర్ - మ్యూజ్ నదీలోయ : ఈలోయ ఫ్లాండర్సు మైదానమునకును, ఆర్డెన్నీస్ పీఠభూమికిని మధ్య దేశములో ఒక చివరనుండి మరొక చివరవరకు వ్యాపించియున్నది. దీని పశ్చిమపు చివర ఫ్రాన్సులోనికిని, తూర్పు చివర జర్మనీలోనికిని పోయినవి. ఈ ప్రదేశ మంతటను ఒక బొగ్గుగని వ్యాపించి యున్నది. ఈ బొగ్గుగని ఫ్రాన్సులో కూడ కలదు. కాబట్టి దీనికి ఫ్రాంకోబెల్జియము బొగ్గుగని అందురు. ఇనుము, సీసము, జింకు కూడ ఈ లోయలో లభించుచున్నవి. బొగ్గుతోపాటు ఇతర ఖనిజములు లభించుటయేగాక జలవిద్యుచ్ఛక్తి కూడ లభించుటచే ఈప్రాంతము అనేక పరిశ్రమలకు కేంద్రమైనది.

హాలెండు, డెన్మార్కులలో ఇట్టి సదుపాయములు లేకపోవుటచే అవి కేవలము వ్యవసాయము మీదను, పాడి పరిశ్రమ మీదను అధారపడి ఉన్నట్లు మీరు చదువగలరు. ఈ నదీలోయలో మాన్స్, చార్లిరాయ్, నామూర్, లీజ్ ఉక్కు పరిశ్రమకు ముఖ్య కేంద్రములు. చార్లిరాయ్, లీజ్‌లలో గొప్ప గాజు యంత్ర శాలలుకూడ కలవు. ఈ గాజు పరిశ్రమ కవసరమైన ఇసుక ఫ్లాండర్సు మైదానములో లభించుచున్నది.

3. ఆర్డెన్నిస్ పీఠభూమి : ఈ పీఠభూమి మీద పచ్చిక ఎక్కువ కనుక గొఱ్ఱెల పోషణ బాగుగా జరుగుచున్నది. లోయలలోను, కొండల వాళ్ళ మీదను ఆహార పదార్థములు పండించుచున్నారు.

ఐరోపాలోకెల్ల బెల్జియము, మిక్కిలి జనసాంద్రతగల దేశము. దేశపు మొత్తముమీద చదరపు మైలుకు 717 మంది కలరు. ఫ్లాండర్సు మైదానములో 990 మందికలరు. ఈ జన సంఖ్యను పోషించుటకు శాస్త్రీయ పద్ధతులపై వ్యవసాయము జరుగుచున్నను ఆహారపదార్థముల దిగుమతి తప్పుటలేదు.

ఈ దేశమునకు రాజధాని బ్రసెల్స్ ; ఫ్లాండర్సు మైదానములో నున్నది. చక్కని భవనములుగల నగరము. దేశము అన్ని ప్రాంతములతోను, పొరుగు దేశములతోను రైలు మార్గముల ద్వారా కలుపబడినది. ఇచ్చట లేసు అల్లుట, తివాసులు నేయుట, కొయ్యసామానులు చేయుట జరుగుచున్నది. కాగి

తపు యంత్రశాలలు కలవు. ఆంట్వెర్ప్‌తో రైలు ద్వారాను. కాలువద్వారాను కలుపబడినది.

ఆంట్వెర్ప్ ముఖ్యరేవు. ఈ రేవుద్వారా బెల్జియనుల సరకులే కాక ఉత్తర ఫ్రాన్సు, జర్మనీ సరకులుకూడ ఎగుమతి అగుచుండును.

ఘెంట్‌లో లినెన్ యంత్రశాలలు, వెర్వియర్స్‌లో ఉన్ని యంత్రశాలలు కలవు. ఈ ఉన్నియంత్రశాలలకు ఉన్ని ఆర్డెన్నీసు పీఠభూమిమీది గొఱ్ఱెల నుండి లభించుచున్నది.

## హాలండ్

ఈదేశము పూర్తిగా మైదానము. దీనిలో అధికభాగము రైన్‌నదియొక్క డెల్టాయై యున్నది. అందుచే చాలవరకు సారవంతమైనది. దేశములో నాలుగవవంతు సముద్ర మట్టము కంటె పల్లముగానున్నది. కావుననే ఈ దేశమునకు నెదర్లాండ్సు అనగా పల్లపు దేశమను పేరుగూడ కలదు. ప్రకృతితో మానవుని పోరాటమును పూర్తిగా ఈ దేశము రుజువు చేయుచున్నది. ఓలన సముద్రముకంటె పల్లముగా నుండుటచే సముద్రము నుండి దేశమును కాపాడుకొనుటకు ఎత్తయిన గట్లు వేయుదురు. ఆగట్లను డైకులు (Dykes) అందురు. పైగా సముద్రమును వెనుకకు నెట్టి వీలైనంత ప్రదేశమును ఉపయోగము లోనికి తెచ్చుచున్నారు. ఇట్లు ఏర్పడిన భూములను పోల్డరు

లందరు. రైను డెల్టాలోను, సముద్రప్రాంతములోను ఉండు అధికమగు నీటిని బయటికి పంపివేయుటకు అనేక కాలువలను పర్పరచుకొనిరి. ఇట్లునీటిని తోడివేయుటలో గాలి యంత్రములను ఉపయోగించుచున్నారు. దేశమునకు ఉత్తరమునకల జూడర్ జీ అను లోతులేని సముద్ర ప్రాంతము నుండి నీటిని తొలగించి ఉపయోగము లోనికి తెచ్చుటకు కృషి చేయు చున్నారు. హాలెండులో పల్లపు మైదానములు, వాటిమధ్య లెక్కలేనన్ని కాలువలు కనిపించుచుండును.




సముద్ర మట్టమునకు దిగువనున్నభూమి

దేశముయొక్క స్వభావమునుబట్టి హాలెండు దేశస్థులు (డచ్చివారు) నౌకాయానమందు ఆరితేరిన వారైరి. 400 సంవత్సరముల క్రిందట ఇంగ్లీషు వారితో సమానముగ సముద్రములమీద ప్రయాణముచేసి అనేక వలసలను సంపాదించియుండిరి. ఓడలలో సరకులను ఒకచోటునుండి మరొకచోటుకు తీసుకొనిపోవుచుండురు. అంతర్జాతీయ విమాన మార్గములను కూడ నడుపుచున్నారు.



జూడర్‌జీ ఉత్తర సముద్రములను వేరుచేయుచున్న పెద్ద డైకు.



హాలెండు - పోల్డర్లను, గాలియంత్రములను గమనింపుడు.

దేశము సారవంతమైనది గనుక వ్యవసాయము బాగుగా జరుపబడుచున్నది. ఓట్లు, రై, గోధుమ, బార్లీ, నార, బీటు దుంప, బంగాళాదుంపలుముఖ్యపంటలు.

పాడిపరిశ్రమ, పుష్పములను పెంచుటకూడ అధికముగా కలదు. కొన్ని రకముల పువ్వులు, గులాబీలు చక్కగా పెరుగును. వీటిని ఎగుమతి చేయుదురు. ఈ పూల పరిశ్రమకు హార్లెమ్ కేంద్రము. ఆ దేశములో ఆవులు చాల ఎక్కువగా కలవు. జున్ను, వెన్న, గడ్డపాలు, పాలపొడి తయారుచేసి ఎగుమతి చేయుచున్నారు. ఈ పాడిపరిశ్రమయే హాలెండుయొక్క సౌభాగ్యమునకు ముఖ్యాధారమై యున్నది.

ఈ దేశములో ఆగ్నేయమూల కొద్ది బొగ్గు తప్ప ఇతర ఖనిజములు లేవు. అందుచే పరిశ్రమలు కొద్దిగానే ఉన్నవి. ఉన్ని, లినెను యంత్రశాలలు కలవు. రైను నదీతీరముననుు, ముఖ్యముగా రోటర్ డాములో నౌకా నిర్మాణము జరుగుచున్నది. చాకొలేట్లు, సిగరెట్లు తయారుచేయుదురు. బీటు దుంపనుండి పంచదార, రైనుండి సారాయి చేయుదురు.

హాలెండుకు రాజధాని దిహేగ్. ఆదేశపు రాజులు ఇచటనే నివసింతురు. అంతర్జాతీయ న్యాయస్థాన కార్యాలయము కలదు.

రోటర్ డామ్ ప్రధాన వర్తక కేంద్రము. ప్రపంచములోని మూడవ పెద్దరేవు. రైను మీదనున్న ఈ పట్టణము పెద్ద కాలువ ద్వారా సముద్రముతో కలుపబడినది. అందుచే పెద్ద

ఓడలు కూడ సునాయాసముగా ప్రయాణముచేసి ఇక్కడకు రాగలవు. ఇచ్చటనుండి నార, లినెను, పాడి సరుకులు ముఖ్య



ప్రపంచములోని మూడవపెద్దరేవు రోటర్డాం (హాలండ్)

ఎగుమతులు. జర్మనీనుండి చాల సరుకు ఈ రేవుద్వారా ఎగుమతి అగును.

ఆమ్స్టర్ డామ్ హాలెండులోని మిక్కిలి పెద్ద పట్టణము. ఇది ఉత్తర సముద్రముతో కాలువ ద్వారా కలుపబడినది.

ఎగుమతి దిగుమతి వ్యాపారమునకు కేంద్రము. వజ్రములను సానపెట్టి మెరుగు పెట్టుటలో ప్రసిద్ధి కెక్కినది. ఈ వ్యాపారము నేటికిని బాగుగా జరుగు చున్నది.

## డెన్మార్కు

ఇది మధ్య మైదానములోనుండి ఉత్తరముగా స్కాండినేవియా వైపునకు వ్యాపించి యున్న ద్వీపకల్పము. ఇది దక్షిణమున జర్మనీతో భూమి ద్వారా కలుపబడి యున్నది. ఈ ద్వీప కల్పమునకు జట్లండు ద్వీపకల్పమని పేరు. అది కాక సమీపమున కొన్ని ద్వీపములు కూడ కలవు. వీనిలో ఫ్యూనెన్, జీలాండ్. లాలాండ్‌లు ముఖ్యమైనవి. ఈ దేశము బాల్టికునకు ద్వారమువలెనున్నది.

ఈ చిన్న దేశములో ఎక్కువ భాగము మైదానము. చిన్న కొండలు అక్కడక్కడ కలవు. దేశము ఎక్కడను 600 అడుగుల కంటె ఎత్తులేదు, పడమటి తీరము ఇసుక మయము. తూర్పు తీరము కొంతవరకు సారవంతమైనది. అందుచే జనులు ఎక్కువగా ఈ ప్రాంతమున నివసింతురు.

డెన్మార్కు దేశస్థులు (డేనులు) మొదటినుండియు నౌకాయానము నందు ఆరితేరినవారు. అందుచే పూర్వము ఈ దేశస్థులు ఇతర దేశముల పైకి దండయాత్రకు పోవుచుండిరి. వీరు ఒకప్పుడు ఇంగ్లండు మీదికి పోయి కొంత ఆక్రమించిన విషయ

మును చరిత్రలో చదువగలరు. నేటికికూడ నార్వీజియనుల వలె సముద్రముల మీదికి పోయి చేపలను పట్టుచుందురు.

డెన్మార్కులో ఖనిజ సంపదలేదు. నదులు ముఖ్యమైనవి కావు. అడవులు తక్కువ కాబట్టి కలప పరిశ్రమ లేదు. కావున



డెన్మార్కులో బహుమతిని పొందిన ఆవు. దీనిపాలనుండి ఒక సంవత్సరములో 1823 పౌనుల వెన్న లభించినది.

ఒకప్పుడు వ్యవసాయము ముఖ్యవృత్తిగానుండెను. గోధుమ, రై, ఓట్లు పండింపబడుచున్నవి. ఇప్పుడు గోధుమ ఎగుమతి చేయబడుటలేదు. పశు పోషణయే డేనుల ముఖ్య జీవనాధారము. పాడి ఆవులను పోషించి వాటి పాలనుండి గడ్డపాలు, వెన్న, జున్ను మొదలగు వస్తువులను చేయుచుందురు.



డెన్మార్కులో యంత్రసహాయమున పాలుపితుకుట.

సహకార విధానము (Co-operation) ఇక్కడనే మొట్ట మొదట ఆరంభమై ఇతర దేశములకు వ్యాపించినది. సహకార సంఘములద్వారా పాడిపరిశ్రమను నడుపుకొనుచుందురు. అవులే



డెన్మార్కులో కోళ్ళ పెంపకము

కాక గుఱ్ఱములు, పందులు, కోళ్లు కూడ పెంచబడుచున్నవి. కోడిగ్రుడ్లను ఎగుమతి చేయుట మరొక ముఖ్యవృత్తి. ఈదేశము నుండి మాంసము కూడ ఎగుమతి చేయుచున్నారు. చైనా, జపానుల నుండి సోయ చిక్కుళ్లు తెప్పించి వాటినుండి నూనె తీసి మిగిలిన పిప్పిని పశువులకు మేతగా ఉపయోగించుదురు.

డెన్మార్కు ఆధునిక విజ్ఞానము నుపయోగించుకొని అభివృద్ధి చెందుచున్నది. అచ్చట వృత్తివిద్యలు నేర్పు పాఠ

శాలలు ఆదర్శమైనవి. దేశము ఎక్కడ చూచినను పువ్వులతో కలకల లాడు చుండును.



కోపెన్ హేగన్ నుండి స్వీడనులోని మామోకు రైళ్లు, బళ్లు బల్లకట్టుపై దాటించుట

ఈ దేశమునకు కోపెన్ హేగను రాజధాని. జీలండు ద్వీపముమీద నున్నది. ఇచ్చట వస్త్రములు, బూట్లు, బీరు, మట్టి పాత్రలు చేయుదురు. ఎస్బెర్గ్ పడమటి తీరమున చేపల పరిశ్రమకు కేంద్రము.

## జర్మనీ

జర్మనీకూడ ఫ్రాన్సువలె ఖ్యాతి గాంచిన దేశమే. వైశాల్యములోను, జనసంఖ్యలోను కూడ ఫ్రాన్సుకంటె పెద్దది.

మొదట చిన్నచిన్న రాజ్యములుగా నుండగా బిస్మార్కు అను నతడు వీటిని ఏకము చేసి బలవంతమైన రాజ్యముగా మార్చెను. బలమైన జర్మనీ యుద్ధములలో చిక్కుకొని రెండు ప్రపంచ యుద్ధములలోను విశేషముగా నష్టపడెను. ఇప్పుడు జర్మనీ రాజ




కీయముగ రెండు భాగములైనది. పశ్చిమ జర్మని అమెరికా సంయుక్తరాష్ట్రములు, బ్రిటనుల పలుకుబడిలోనుండి స్వతంత్రముగా నున్నది. దీనికి బాన్ (Bonn) రాజధాని. తూర్పు జర్మనీ రష్యావారి అధిపత్యము క్రిందనున్నది.

భౌగోళికముగా జర్మనీలో ఉత్తర మైదానము, దక్షిణ పర్వత ప్రదేశము కలవు. ఉత్తర మైదానము హాలెండు,

పోలండులకు మధ్యనున్నది. జర్మనీకి ఉత్తరమున మాత్రమే సముద్రమున్నది. ఉత్తరమైదానము హిమక్రియవల్ల ఇసుక, బంక మట్టితో కూడియున్నది. ఇవి కొన్నిచోట్ల చిన్నగుట్టలుగాకూడ పర్పడినవి. ఈ మైదానమునకు తూర్పుచివర బీచ్, పైను అరణ్యములును, అనేక చిన్న సరస్సులును కలవు. దక్షిణ పర్వత ప్రాంతము ఆస్ట్రియా, స్విడ్జర్లండు సరిహద్దుల వరకును వ్యాపించియున్నది. ఈప్రాంతములోనే రైను, డాన్యూబ్ నదులు పుట్టుచున్నవి. దేశమునకు నైర్‌ఋతి మూల ఉన్నతమైన బ్లాక్‌ఫారెస్టు కొండలు కలవు. జర్మనీ ఎక్కువగా పారిశ్రామిక దేశమైనను వ్యవసాయము, పశుపోషణ నిర్లక్ష్యము చేయబడలేదు.

దేశములో వ్యవసాయము ప్రముఖస్థాన మాక్రమించుచున్నది. ఉత్తరపు భూములు సారవంతమైనవికావు. అచ్చట రై, ఒట్లు, బంగాళాదుంపలు, బీటుదుంపలు అధికముగా పండించుచున్నారు. సారవంతమును, ఎక్కువ వెచ్చదనమును కల రైను లోయలో గోధుమ, బార్లీ, ద్రాక్షపండ్లు, హోపుపండ్లు పండింపబడుచున్నవి. సామాన్య జనులకు రై ముఖ్యాహారము. బీటు దుంపలనుండి పంచార చేసి ఎగుమతి చేయుచున్నారు. రైను లోయలోని మోసెల్‌లో ద్రాక్ష సారాయము చేయుదురు.

గొఱ్ఱెల పెంపకము చాలవరకు తగ్గినది. ఉన్ని పరిశ్రమకు ఉన్నిని దిగుమతి చేసుకొనుచున్నారు. జర్మనీ పశ్చిమభాగములో అవులు, పందులు అధికముగా పోషింపబడుచున్నవి. జర్మను పర్వతములలో అడవు లెక్కువ. ఈ కలపతో ప్రత్యేక పరిశ్రమలు

బవేరియా, వర్టెంబర్గ ప్రాంతములలో ఏర్పడినవి. న్యూరెంబర్గులో ఆటవస్తువులు, గడియారములు చేయుదురు. మ్యూనిక్‌లో కుర్చీల



న్యూరెన్‌బర్గ్‌కు సమీపమున స్టెయిన్ పట్టణమునగల A. W. ఫేబర్ కేసిల్ పెన్సిలు కార్మగారము

వంటి కొయ్యసామాను చేయుదురు. స్టట్‌గార్డ్, కోబ్లెంజి, బెర్లినులలో పియానోలు చేయుదురు.

ఈ దేశములోని పారిశ్రామిక సంపదకు అచ్చటి రవాణా సదుపాయములు మూలకారణము. జల, భూ, విమానమార్గములు చక్కగ పెంపొందించబడినవి. రైలుమార్గములు మిక్కిలి వృద్ధి చేయబడినవి. ఈ మార్గములు పర్వతముల మీదనుండికూడ వేయబడి పొరుగు దేశములతో కలుపబడినవి.

మైదాన ప్రదేశములో నదులు అనేక కాలువల ద్వారా కలుప బడినవి. రైను, ఎల్బ్, ఓడరు మొదలైన నదులు లోతు చేయబడి కాలువల ద్వారా కలుపబడి ప్రయాణమునకు మిక్కిలి అనుకూలముగా చేయబడినవి. రైనునది తూర్పున వీజరుతోను, దక్షిణమున డాన్యూబుతోను, కలుపబడినది. మరియు రైను నది ఫ్రెంచికాలువలతోకూడ కలుపబడినది. రైనునదియే జర్మనీ రవాణాకు ముఖ్యమైనది. అమెరికాలో సరస్సుల మండలముతో దీనిని పోల్చవచ్చును. ఈ నదీ తీరమున అనేక పారిశ్రామిక నగరములు వెలసినవి.

జర్మనీలో మూడు ముఖ్యమైన బొగ్గు గనులు కలవు. అవి: 1. రూర్ నది లోయలోని రూర్ బొగ్గుగని 2. సార్ మండలములోని సార్ బొగ్గుగని 3. ఎల్బ్ నదీ మండలములలోని సాగ్జనీ గని. ఈ గనుల ప్రాంతములలో పరిశ్రమలు విశేషముగా వృద్ధిపొంది యుండుటచే జర్మనీలోని జన సంఖ్యలో అధిక భాగము ఈ మూడు ప్రాంతములలోనే కలదు.

ఇనుము, ఉక్కు పరిశ్రమలో రెండవ ప్రపంచ యుద్ధమునకు పూర్వము వరకును జర్మనీ చాల ప్రముఖస్థాన మాక్రమించి యుండెను. రూరు మండలము ఈ పరిశ్రమకు కేంద్రము జర్మనీ తనకు కావలసిన ముడి ఇనుమును స్వీడను, ఫ్రాన్సుల నుండి దిగుమతి చేసుకొను చుండెను. ఎస్సెన్, డ్యూయిస్‌బర్గ్, డార్ట్‌మండ్, డస్సెల్‌డార్ఫ భారీ యంత్రములను ఉత్పత్తి చేయును.

రసాయనిక పదార్థములు, గాజు, రంగుల పరిశ్రమలకు కూడ ఈ మండలము ప్రసిద్ధమైనది.




రైనునది ప్రదేశము

జర్మనీలో నూలు, ఉన్ని, పట్టు వస్త్రముల ఉత్పత్తి ఎక్కువగా జరుగుచున్నది. దేశమంతటను ఈ యంత్ర శాలలున్నను రూరుమండలము, శాగ్జనీ ఇందుకు ప్రసిద్ధమైనవి.

బీటు పంచదార పరిశ్రమ కూడ జర్మనీలో ఎక్కువ. రెండు ప్రపంచ యుద్ధములతర్వాత ఈపరిశ్రమ చాలతగ్గినది. ప్రపంచములో చెఱకు పంచదార ఎక్కువగుట అందుకు కారణము.

జర్మను పరిశ్రమలు, వ్యాపారము కూడ రెండవ ప్రపంచ యుద్ధమువల్ల పూర్తిగా దెబ్బతిన్నవి. ఇప్పుడు వాటి పునర్నిర్మాణమునకు కృషి జరుగుచున్నది.

ఈ దేశమునకు రాజధాని బెర్లిను. అనేక రైలు మార్గములచే కలుపబడినది. రెండవ ప్రపంచయుద్ధములో ఈపట్టణము



డూయిస్‌బర్గ్‌లోని ఇంజనీయరింగ్ సామానులు చేయు కార్ఖానాలో మిక్కిలి పెద్దదగు ఉక్కు అయస్కాంతమును పటమునందు చూడుము.

చాలవరకు శిథిలమైనది. బెర్లిను తూర్పుభాగము తూర్పు జర్మనీకి రాజధానిగా నున్నది. ఎల్బ్‌నదీ ముఖద్వారమునగల హాంబర్గు ప్రధానవ్యాపార కేంద్రము. ఈ పట్టణము బాల్టికు వైపునగల కీలు పట్టణముతో కీలుకాలువ ద్వారా కలుపబడినది. అందుచే తూర్పు పశ్చిమ జర్మనీలకు దగ్గర మార్గము ఏర్పడినది.




## పోలండ్

పోలండ్ దేశము జర్మనీకిని, రష్యాకును మధ్య నున్నది. దీనిలో అధికభాగము విశ్చులా నదీపరీవాహిక ప్రదేశములో నున్నది. దీనిలో ఉత్తరమున మైదానమును, దక్షిణమున కార్పేథియను పర్వతములుకలవు. ఈపర్వతప్రాంతములో ఖనిజసంపద విపరీతముగా నున్నది. బొగ్గు, ఇనుము, సీసము. జింకు, ఉప్పుగనులు కేటోవిజ్, క్రేకొౌలవద్ద త్రవ్వుచున్నారు. ఎగువసైలీషియాలో ఉక్కు కర్మాగారములు, రసాయనిక యంత్రశాలలు, గాజు యంత్రశాలలు గలవు.

పోలండ్ వైశాల్యములో నాలుగవవంతు శృంగాకారా రణ్యములతో నిండియున్నది. అందుచే కలప పరిశ్రమలో చాల మంది పాల్గొనుచున్నారు. వ్యవసాయము ప్రధాన వృత్తి. రై ముఖ్యపంట. ఇది ప్రజలముఖ్యఆహారము. ఓట్లు, బార్లీ, గోధుమ, బీటు దుంపలు పండించుచున్నారు. చాలచోట్ల బీటు పంచదార చేయు కర్మాగారములు కలవు. బట్టల మిల్లులు లెమ్‌బెర్గ్, లాడ్జి నగరములలో కలవు. ఉన్ని, నార పరిశ్రమలు కూడకలవు.

ఈ దేశమునకు రాజధాని వార్సా. (వస్త్రములు, చర్మ ములు, పంచదార యంత్రశాలలు కలవు. ఇదివిశ్చులా నదీ తీరమున కలదు.) బెర్లిన్, మాస్కో రైలుమార్గము ఈ పట్టణము మీదుగా పోవును.

పోలండ్‌కు సముద్రము లేదు. కావున డాన్జిగ్ రేవు దీని కొఱకు ఏర్పరచబడినది. రెండవ ప్రపంచ యుద్ధములో జర్మనీ ఓడిన తర్వాత పోలెండు రష్యాచే ఆక్రమించబడి ఇప్పుడు వారి అజమాయిషీలో ఒక స్వతంత్ర రాజ్యముగా నున్నది.

---

# 10. మధ్య మైదానపు తూర్పుభాగము

## రష్యా

1917 లో రష్యాలో వచ్చిన విప్లవము వల్ల కమ్యూ నిస్టు రాజ్యము ఏర్పడి దేశము అనేక రిపబ్లికులుగా విభజింప బడినది. అవన్నియు కేంద్రమునకు లోబడి యుండును. అందుచే ఆ దేశమునకు U. S. S. R యూనియన్ ఆఫ్ సోవియెట్ సోష

లిస్టు రిపబ్లిక్కు అని పేరు వచ్చినది. ఈ యూనియనులో సైబీరియా, మధ్య ఆసియా, యూరల్ పర్వతముల పశ్చిమముననను, కాస్పియను ప్రాంతముననను కల అన్ని రిపబ్లికులును చేరియున్నవి.

దేశము పెద్దదైనను సముద్రతీరము తక్కువ. మరియు బాల్టిక్కు, ఆర్కిటికు, పసిఫికు సముద్రములు మూడును శీతకాలములో గడ్డకట్టుచున్నవి. నార్వే సమీపమున గల మర్మన్స్క్ రేవు మాత్రము గల్ఫ్‌స్ట్రీమ్ ప్రభావమువల్ల మంచుతో కప్పబడక ఎల్లప్పుడును ఉపయోగ కరముగ నున్నది. ఈ దేశములో శీతకాలమున అతి చల్లగా నున్నను వేసవిలో వేడిగా నుండును. ఉత్తరమున గొప్ప అరణ్యాము లున్నట్లు దక్షిణమున చెట్టు చేమలులేని గడ్డిబీడులును, చిన్న ఎడారులును కూడ కలవు.



రష్యాలోని గొప్ప వ్యవసాయ కేంద్రము

పంచవర్ష ప్రణాళికల ద్వారా ఈ దేశము అభివృద్ధిని సాధించుచున్నది. రష్యాలో వ్యవసాయము చాల ముఖ్యమైనది. పరాధీనముకాక పూర్తిగా స్వయంపోషకముగానుండు విధమున వ్యవసాయము జరుగుచున్నది. సమిష్టి వ్యవసాయ కేంద్రములు, ప్రభుత్వ వ్యవసాయ కేంద్రములు ట్రాక్టరువంటి యంత్రముల నుపయోగించి విరివిగా పండించుచున్నవి. గోధుమ ముఖ్యపంట. దీనికి యుక్రెయిన్ ప్రధాన కేంద్రము. దక్షిణ రష్యాలో కూడ గోధుమపంట ఎక్కువగుచున్నది. బీటుదుంపలు కూడ ఈ ప్రాంతములో పండింపబడుచున్నవి. వీటినుండి పంచదార



యంత్రముల సహాయమున వ్యవసాయము - పొలముల విస్తీర్ణము గమనింపుము.

చేయుట మరొక ముఖ్య పరిశ్రమ. ఇవికాక రై, బార్లీ, నార, పొగాకు, తేయాకు పండించుచున్నారు. దక్షిణ ప్రాంతములో

పత్తిపంట అధికము. ఇది క్రిమియా, నల్లసముద్రమునకు ఉత్తరభాగము, కాస్పియను సముద్ర ప్రాంతములలో ఎక్కువ.

రష్యాలో ఖనిజ సంపద అపారముగా నున్నది. బొగ్గు, పెట్రోలియము, ఇనుము, మాంగనీసు, ఫాస్ఫేట్లు అధికముగా లభించు చున్నవి. యూరల్ పర్వతములలో వెండి, బంగారము, ప్లాటినముకూడ కలవు. అజావ్ సముద్రప్రాంతములోను, దేశ మధ్యమునను, యూరలు మండలములోను ముఖ్యమైన బొగ్గు గనులు కలవు. కాస్పియను ప్రాంతములో గొప్ప నూనెబావులు కలవు. బాకూ దీనికి కేంద్రము.

రష్యాలో అనేక గొప్ప పరిశ్రమలు వృద్ధిచేయ బడినవి. వస్త్రములు, ఉక్కు యంత్ర పరికరములుచేయు యంత్రశాలలు అధికముగా లెనిన్‌గ్రాడ్, మాస్కోలలో కలవు. కీవ్ గోధుమకు, ఒడెస్సా వ్యవసాయ పరికరములకు, క్రివోయ్‌రోగ్ ఇనుము ఉక్కు పరిశ్రమకు, సీపర్‌పెట్రొవోస్క్ యంత్రములకు, రాస్టోవ్ వ్యవసాయ సాధనములకు, వోరోషిలోవ్‌గ్రాడ్ రైలు ఇంజనులకు, స్టాలిన్‌గ్రాడ్ ఉక్కు, ఇనుముపరిశ్రమకు కేంద్రములు. యూరల్ పర్వత ప్రాంతములో కూడ అనేక పరిశ్రమలు పెరుగు చున్నవి.

రష్యాలో ఉత్తరమునుండి దక్షిణమునకు పోనుపోను వివిధ వృక్షజాలము కనబడును. ఉత్తర ఆర్కిటికు తీరమున టండ్రాలు గలవు. ఇచట ధ్రువపు జింకలకు పనికివచ్చు నాచుమొక్కలు పెరుగును. టండ్రాలకు దక్షిణమున విశాలమైన శృంగాకారారణ్యా

ప్రదేశము కలదు. ఈ ప్రాంతములో వ్యవసాయము లేదనియే చెప్పవచ్చును. ఇచ్చట ప్రజలు ఉన్నిజంతువులను వేటాడుదురు.



రష్యాలోని టండ్రాల దృశ్యము

కలప పని చేయుచుందురు. కలప కొంత ఎగుమతి చేయబడును. కొంత కాగితము చేయుదురు. ఈ అరణ్యములలో పైను, ఫర్, లార్చ్, స్ప్రూసు చెట్లు ఎక్కువగా కలవు.

శృంగాకారారణ్యములకు దక్షిణమున ఆకురాలు విశాల పత్రారణ్యములు కలవు. కాని ఈ ప్రాంతపు అడవులు నరికి వేయబడి వ్యవసాయ భూములుగా మార్చబడినవి.

ఆకురాలు విశాల పత్రారణ్యా మండలమునకు దక్షిణమున నల్ల రేగడినేల భూమి కలదు. ఈ మట్టి మంచు క్రియవల్ల పర్పడి రుమేనియా నుండి వాల్గా వరకు వ్యాపించి యున్నది.

ఈ మండలములో గోధుమ ముఖ్యపంట. అదికాక బార్లీ, ఓట్లు రై, బంగాళా దుంపలు, బీటు దుంప కూడా పండింప బడు చున్నవి.

నల్ల రేవడి నేలకు దిగువ క్రిమియా ద్వీప కల్పములోను, నల్ల సముద్ర తీరములోను మధ్యధరా మండలపు పండ్లు పండును. మరియు మొక్కజొన్న, పొగాకు కూడ పండింప బడుచున్నవి.



దక్షిణ క్రిమియాలో నల్లసముద్రతీరము

రష్యా ఆగ్నేయమూల స్టెప్పీలు కలవు. ఇవి ఆసియా లోనికికూడ వ్యాపించినవి. ఈ మండలములో సంచార జీవనులు నివసించుచు గొఱ్ఱెలను, మేకలను, ఒంటెలను, గుఱ్ఱములను పోషించు చున్నారు.

రష్యాలో రవాణా సదుపాయములు చాల ముఖ్యమైనవి. రష్యాలోని నదులు చాల దూరము వరకు యాన యోగ్యము

లుగా నుండుటచే గాక జల విద్యుత్తునకు కూడ ఉపకరించు చున్నవి. రష్యాలోని నదులలో నీరు వసంత ఋతువులో నుండును. శీత కాలములో నదులు గడ్డ కట్టినపుడు ఉపయోగ కరముగా లేవు. రష్యాలో రైలు మార్గములు విశేషముగా నున్నవి. మాస్కో నుండి వ్లాడివోస్టకు వరకు కల ట్రాన్సు సైబీరియను రైలు మార్గము ప్రపంచములోని రైలు మార్గము లన్నిటిలోను పొడవైనది.



మాస్కో నగరము

రష్యాకు రాజధాని మాస్కో. దేశ మధ్యముననుండి అన్ని వైపులతోను రైలు, విమాన మార్గములద్వారా కలుప బడినది. అనేక పరిశ్రమలకు కేంద్రము, జన సంఖ్య 40 లక్షలు

మించియుండును. వస్త్రములు, లోహములు, చర్మము, కాగితము, అల్యూమినియము పరిశ్రమలు కలవు.

బాకూ కాస్పియన్ సముద్రము మీద నున్నది. నూనె బావులకు కేంద్రము. నల్ల సముద్రము మీది బాటూమ్ వరకు ఈ నూనె గొట్టముల ద్వారా పోవును. ఆస్ట్రిఖాన్ కాస్పియన్ సముద్రము మీద వాల్గా ముఖ ద్వారమునగల రేవు పట్టణము. ఒడెస్సా నల్లసముద్రము మీది రేవు. గోధుమ ఇక్కడనుండి ముఖ్య ఎగుమతి. నీపరు నది మీది కీవు కూడ మంచి గోధుమ కేంద్రము. రాస్టోవ్, ఖార్కోవ్ మున్నగు పారిశ్రామికనగరములు కలవు. స్టాలిన్‌గ్రాడ్ రెండవ ప్రపంచ యుద్ధములో ప్రసిద్ధి గాంచిన పారిశ్రామిక కేంద్రము.

---

# 11. మధ్య ఐరోపా

## స్విట్జర్లండు

ఈ దేశము ఆల్ప్సు పర్వతములలో నున్నది. దీనిలో మూడు భాగములను చూడవచ్చును. వాయవ్యమున జూరా పర్వతములు, వాటికి దక్షిణమున జినీవా సరస్సు నుండి కాన్‌స్టెన్సు సరస్సు వరకు వ్యాపించిన పీఠభూమి, దానికి దక్షిణమున ఆల్ప్సు పర్వత ప్రదేశము కాననగును. ముఖ్య నగరము లన్నియు పీఠభూమి మీదనే ఉన్నవి. ఈ దేశము చాల

చిన్నది. ఆల్పులలో మిక్కిలి ఎత్తయిన శిఖరము ఈ దేశములోనే కలదు. ఈ దేశస్థులు బహు సున్నితమైన వస్తువులు చేయుటలో నేర్పరులు. గడియారములు చేయుటకు ఈ దేశము జగత్ప్రసిద్ధి కాంచినది.




స్విట్జర్లాండు

ఇచ్చటి భూమిలో నాల్గవ వంతు నిరుపయోగ మైనది. మిగిలిన వానిలో మూడవ వంతు వ్యవసాయము క్రింద నున్నది. గోధుమ, ఓట్లు, రై, బంగాళా దుంపలు, బీటు దుంపలు పీఠ భూమి మీద పండింపబడు చున్నవి. లోయలలో ద్రాక్ష పండ్లు పడించు చున్నారు.

ఈ దేశ ప్రజలకు పశుపోషణ ముఖ్యావృత్తి. శీత కాలములో పశువులను లోయల లోనికి తోలుకొని పోవుదురు.



స్విట్జర్లాండులోని గడియారముల కర్మాగారములో ఒక దృశ్యము.

వసంత ఋతువునకు ముందు పర్వతములపైన ఉన్న గడ్డి బీడుల లోనికి తోలుకొని పోవుదురు. పశువుల కాపరులు కొయ్య ఇండ్లలో కాపురముండి పశువులను కాచుకొందురు. పాలు పితికి వెన్న, జున్ను, డబ్బాపాలు, చాకొలేట్లు తయారు చేయుదురు.

జూరిచ్, బేసిల్ మున్నగు చోట్ల నూలు, పట్టు యంత్రశాలలు కలవు. ఈ యంత్రశాలలను నడుపుటకు జల విద్యుచ్ఛక్తిని వాడుచున్నారు.

స్విట్జర్లండుకు సముద్రము లేనందున ఉత్పత్తియైన సరకులను విదేశములకు పంపుట చాల కష్టముగా నుండెడిది. ఇప్పుడు

రైను నదిమీద కల బేసిల్ నుండి సరకులు నౌకలమీద చౌకగా రవాణా చేయుచున్నారు. రైలుమార్గములు ఎక్కువగా వృద్ధి చేయబడినవి.

బెర్న్ ప్రభుత్వ కేంద్రము. జూరిచ్ మిక్కిలి పెద్దపట్టణము. పారిశ్రామిక కేంద్రము, రైనునదిమీది బేసిల్ మంచి వర్తక కేంద్రము. జినీవా, లాసేన్ మున్నగు పట్టణములు వాటి సౌందర్యమునకు ప్రసిద్ధి కెక్కినవి. అందుచే అనేకులు వినోదార్థము ఈదేశమునకు వచ్చుచుందురు. చాలమంది ఇట్టి యాత్రికులకు సదుపాయములను కల్పించి జీవనోపాధి సంపాదించుచున్నారు.

## డాన్యూబు మండలము

డాన్యూబ్ నది ఐరోపాలో చాల ముఖ్యమైనది. ఇది వాస్తవముగా ఆల్ప్సులకు ఉత్తర వాళ్ళలో పుట్టినను దక్షిణముగా ప్రవహించి నల్లసముద్రములో కలియుచున్నది. పొడవులో ఐరోపానదులలో ఇది రెండవది. ఇది ప్రవహించునపుడు పర్వతములను ఛేదించుకొని పోయెను. దీనికి ఆల్ప్సులనుండియు, కార్పేథియనుల నుండియు ఉపనదులు కలవు. చిన్న ఓడలు దాదాపు నది అంతటను ప్రయాణము చేయగలవు. ఈనదికి అంతర్జాతీయనది అని పేరు కలదు. బ్లాక్ ఫారెస్టు పర్వతములలో పుట్టి దక్షిణ జర్మనీ, ఆస్ట్రియా, హంగేరి, యుగోస్లేవియా రుమేనియా, బల్గేరియాలమీదుగా ప్రవహించుచున్నది. ఆస్ట్రియా

రాజధానియగు వియన్నా, హంగేరీరాజధానియగు బ్యూడా పెస్టు,యుగోస్లావియా రాజధానియగు బెల్‌గ్రేడు మీదుగా ప్రవ



స్విట్జర్లాండులోని ఒక క్రీడా స్థలము

హించి బాల్కనుట్రాన్సిల్వేనియాపర్వతములమధ్యగా ఒక ఇరుకు కంధరముగుండా ప్రవహించుచున్నది. దీనికి ఐరన్ గేట్ అని పేరు. ఇచ్చట ఓడలు ప్రయాణము చేయజాలవు కావున ప్రక్కనుండి ఒక కాలువను త్రవ్వియున్నారు. రుమేనియా,బల్గేరియాలకు కొంతదూరము సరిహద్దుగా నున్నది. తర్వాత ఉత్తరముగా రుమేనియాగుండా ప్రవహించి నల్లసముద్రములో కలియుచున్నది. దీని ముఖద్వారమువద్ద డెల్టాకలదు.

## ఆస్ట్రియా

ఈ దేశములో అధికభాగము ఆల్ప్సు పర్వతమయమై యున్నది. వ్యవసాయమునకు అనుకూలముగా లేదు. అడవులు ముఖ్య సంపద. కలపనుండి కాగితము, పెన్సిళ్ళు, ఫిల్ములు తయారుచేయుదురు. లిగ్నైటు, ఇనుము, బొగ్గు, ఉప్పు, మాంగనీసు త్రవ్వబడుచున్నవి.

లోయలలో వ్యవసాయము జరుగుచున్నది. రై, మొక్క జొన్న, బీటుదుంపలు ముఖ్యపంటలు. పర్వతముమీద పశుపోషణ



వియన్నా పట్టణము

కలదు. ఆస్ట్రియాలో కొంచెము మాత్రము మైదానము కలదు.

ఈ దేశమునకు కూడ విదేశయాత్రికులు వచ్చుచుందురు. వీరు దర్శించుటకు వచ్చుభాగమునకు టైరాల్ మండల మందురు. టైరాల్ మండలమునకు ఇన్స్ బ్రక్ కేంద్రము.

ఈ దేశమునకు రాజధాని వియన్నా. మైదానముమీద నున్నది. చక్కని నగరము. రైలు మార్గముల ద్వారా అన్ని పెద్ద పట్టణములతోను కలుపబడినది. కంచు, ఇనుము, వస్త్రములు, చర్మము, కాగితము, పరిశ్రమలు కలవు. గొప్ప విద్యా కేంద్రము. వైద్య శాస్త్రములో ప్రసిద్ధి కెక్కినది.

## హంగేరీ

ఆస్ట్రియాకు తూర్పున హంగేరీ కలదు. ఇది సారవంతమైన మైదానము. ఈ దేశములోని ప్రజలను మాగ్యారులు అందురు. వీరు చైనాజాతికి చెందినవారు. ఈ దేశము పల్లెలతోను, వ్యవసాయ భూములతోను కూడియున్నది. జనులలో చాలమంది వ్యవసాయములో పాల్గొను చున్నారు. మూడింట రెండువంతులు వ్యవసాయ భూములు, మిగిలినవి గడ్డిబీడులు, అడవులు. హంగేరీ గుండా డాన్యూబు, దాని ఉపనదులు ప్రవహించు చున్నవి. దేశము చుట్టును పర్వతములు కలవు. శీతకాలములో అతిచలి, వేసవిలో వేడి ఎక్కువఉండును. వేసవిలో కొద్ది వర్షము కురియును.

హంగేరీ ఐరోపా ధాన్యా గారములలో నొకటిగా నున్నది. ఇచ్చట వ్యవసాయభూములలో 80% గోధుమ, మొక్క జొన్నలకు ఉపయోగింప బడుచున్నవి. రై, బార్లీ, ఓట్లు, బీటు దుంప, బంగాళాదుంప, పొగాకు మొదలగునవికూడ విశేషముగా పండింపబడుచున్నవి. ద్రాక్షపండ్లు, ద్రాక్ష సారాయముకూడ ఉత్పత్తి చేయుచున్నారు. ఇతర పండ్ల ఉత్పత్తికూడ ముఖ్యమైనది.

గొఱ్ఱెలు, ఆవులు, గుఱ్ఱములు పెంచబడుచున్నవి. కాని ఆ పరిశ్రమయొక్క ప్రాముఖ్యత ఇప్పుడు తగ్గుచున్నది. ఖనిజ సంపద తక్కువ. బొగ్గు, ఇనుము ముఖ్యమైనవి. కాని ఇవి చాలి నంతగా లేకపోవుటచే దిగుమతి చేసికొను చున్నారు.

కొద్దిగా పరిశ్రమలుకలవు, పిండి చేయుట, సారాయి చేయుట, పంచదార చేయుట, వస్త్రములు తయారుచేయుట ముఖ్య పరిశ్రమలు. యంత్రములు చేయుట, తోళ్ళు పదును చేయుట కూడ కలదు.

హంగేరిలో మంచిరోడ్లకలవు. నదులు చాలవరకు యాన యోగ్యములు. అయినను ఈ దేశపు సరకులు విదేశ రేవుల ద్వారా ఎగుమతి కావలసినదే. హాంబర్గు, ఫియూము, స్ప్లిటీల ద్వారా ఈ దేశపు సరకులు ఎగుమతి అగుచుండును.

హంగేరీ రాజధాని బ్యూడాపెస్టు. డాన్యూబు నదిమీద రెండు వైపులను కల బ్యూడా, పెస్టు కలిసి ఏక నగరమైనది. అనేక పిండి మిల్లులు కలవు. విద్యుత్పరికరములు చేయుదురు.

## జెకోస్లొవేకియా

ఈ రాజ్యము మొదటి ప్రపంచ యుద్ధానంతరము ఉద్భవించెను. ఈ రాజ్యము బొహీమియా, సైలీషియా, మొరేవియా, స్లావేకియాలతో 1918 లో ఏర్పరచబడినది. ఈ దేశము పారి




శ్రామిక మగు పశ్చిమ యూరపునకును, వ్యవసాయ ప్రధానమగు తూర్పు యూరపునకును మధ్యనున్నది. కాని ఈ దేశమునకు సముద్రములేదు. సంవత్సరమునకు 20"–30" వాన - ముఖ్యముగా వేసవిలో కురియును.

వ్యవసాయము ప్రధానవృత్తి. చాల వృద్ధి చేయబడినది. సారవంతమైన భూమి, జల సమృద్ధమగు నదులు, నీటిపారుదల ఏర్పాటులు ఇందుకు చాల ఉపయోగించు చున్నవి. గోధుమ, రై, బార్లీ, బీటు దుంపలు, బంగాళా దుంపలు ముఖ్యపంటలు.

అడవులు అధికముగానుండుటచే అగ్గిపెట్టెలు, కాగితము, ఆటవస్తువులు, సంగీతపు యంత్రములు చేయుట మొదలగు పరిశ్రమలు సాగుచున్నవి.

మొరేవియా, బొహీమియా, స్లొవేకియాలలో బొగ్గు అధికముగా కలదు. జింకు, రాగి, బంగారము, వెండి కూడ త్రవ్వబడు చున్నవి. స్లొవేకియా కొండలలో తగరము, నికెలు, మాంగనీసు, రాగి కలవు. కొన్ని నూనె బావులు కూడ కనుగొనబడినవి.

యంత్రములు, బీటు పంచదార, ఆల్కహోలు, పింగాణీ గాజు, లోహములు, రసాయన పదార్థములు, చర్మములు, వస్త్రములు మొదలగు పరిశ్రమలు వృద్ధిచేయు చున్నారు.

ఈదేశమునకు సముద్రము లేదుకనుక డాన్యూబ్, ఎల్బ్, ఓడరు నదులద్వారా ఎగుమతి జరుగుచున్నది. ఉన్ని, ప్రత్తి, ముఖ్య దిగుమతులు. వాటితో వస్త్రములు తయారుచేయుదురు. ఎరువులు, యంత్రములు, లోహములు, పాదరక్షలు, కాగితము మొదలైనవి ముఖ్య ఎగుమతులు.

ఈ దేశమునకు రాజధాని ప్రాగ్ లేక ప్రాహా. పారిశ్రామిక కేంద్రము. రైలు మార్గముల కూడలి.

బ్రన్ లేక బ్రూనోలో కాగితము, అగ్గిపెట్టెలు. చర్మపు యంత్రశాలలు కలవు. పిల్సెనులో సారాబట్టీలు యంత్ర నిర్మాణ శాలలు కలవు.

## రుమేనియా

ఈ దేశములో పడమట ట్రాన్సిల్వేనియా పీఠభూమి, తూర్పున దిగువ డాన్యూబు మైదానమును కలవు. ట్రాన్సి

ల్వేనియాలో అడవులు, నూనె బావులు, ఉప్పు గనులు, ఇతర గనులు కలవు, ఇక్కడిజనులు కలప నరుకుటలోను, గనులలోను పనిచేయుదురు. నూనె బావులు అనేకమందికి పని కల్పించు చున్నవి. ఉప్పు గనులు ప్రభుత్వపు స్వాధీనములో నున్నవి.

మైదాన ప్రదేశములో వ్యవసాయము అధికముగా జరుగు చున్నది. ఇచ్చటి నల్లరేగడినేల గోధుమ పంటకు మిక్కిలి ప్రశస్తమైనది. మొక్కజొన్న రెండవపంట. గోధుమ పంటలో ఈ దేశము ప్రముఖ స్థాన మాక్రమించు చున్నది. బీటు దుంపలు, పొగాకు, ద్రాక్షపండ్లు కూడ పండబడు చున్నవి.

రుమేనియాలో పెట్రోలియము ముఖ్యమైన ఖనిజము. ఇదికాక బంగారము, రాగి, సీసము, మాంగనీసు, వెండి, జింకు కూడ లభించు చున్నవి. తూర్పు మైదానములోని పర్వత ప్రాంతములలో ప్లోయెస్టీ అను నది పెట్రోలియమునకు ముఖ్య కేంద్రము. ఇక్కడనుండి గొట్టములద్వారా నల్ల సముద్రము మీద కాన్‌స్టాంజాకు ఈ నూనె తీసికొనిపోబడు చున్నది.

ట్రాన్సిల్వేనియా పర్వతముల మీద బీచ్, ఓక్ మున్నగు అరణ్యములు కలవు, సారాయి, కాగితము, పిండి, రసాయనిక పదార్థములు చేయుట ముఖ్య పరిశ్రమలు.

డాన్యూబు ఈ దేశమునకు ముఖ్య రవాణా మార్గము. నేల బురదగా నుండుటచే దీని తీరమున ఎక్కువ పట్టణములు లేవు. గలాట్జ్, బ్రెయిలా ఈ నదిమీది ముఖ్య రేవులు.

రుమేనియాకు రాజధాని బుఖారెస్టు. డాన్యూబు ఉపనది మీద నున్నది. ఈ పట్టణము ఐరన్ గేట్ గుండా రైలు ద్వారా పశ్చిమ యూరపుతో కలుప బడినది.

---

# 12. మధ్యధరా మండలము

## ఐబీరియా ద్వీపకల్పము

ఈ ద్వీప కల్పములో స్పెయిను, పోర్చుగలు చేరి యున్నవి. ఒకప్పుడు ఈ రెండు దేశములును ఒక్కటే. కాని పోర్చుగలు తరువాత వేరయినది. ఈ ద్వీపకల్పము వర్తకము



నకు మిక్కిలి అనుకూలముగా నున్నది. కాని తీరరేఖ చీలి యుండక పోవుటచే మంచి రేవులు ఎక్కువగా లేవు. మరియు సముద్రము యొక్క తీవ్రతచే హార్బరులు నిర్మించుటకు వీలు లేకున్నది.

దేశములో అధిక భాగము మెసీటా పీఠభూమిచే ఆక్రమింప బడినది. నదులు పీఠభూమిని విడుచు నపుడు జల పాతములు కలవు. వర్షము తక్కువ. నదుల నౌకాయానమున కుపయోగించుట లేదు. ఈ పీఠభూమిమీద మధ్యధరా మండలపు లక్షణములు లేవు. ఈ పీఠభూమిమీద మేకలు గొఱ్ఱెలు అధికముగా పోషింప బడుచున్నవి. మెత్తని ఉన్ని నిచ్చు ప్రఖ్యాతి చెందిన మెరీనో గొఱ్ఱెలు ఇక్కడివే. మెసీటా పీఠభూమిలో పాదరసము, రాగి, ఇనుము కలవు. ఇక్కడ లభించు ఇనుములో అధిక భాగము దక్షిణ వేల్సుకు ఎగుమతి చేయబడు చున్నది.

ఈ దేశములో గోధుమ, వరి, మొక్కజొన్న, ప్రత్తి, పండ్లు. హ్యూర్టాసులలో (నీటి సదుపాయముకల భూములలో) పండింపబడు చున్నవి. ఎల్చిలో ఖర్జూరపు పంట కలదు. ద్రాక్ష, ఆలివు మధ్యధరా సముద్ర ప్రాంతములో అధికముగా పండును.

స్పెయిను నుండి ముఖ్య ఎగుమతులు పండ్లు, ముడి ఇనుము, కార్కు, ఉన్ని, ఎస్పార్టో గడ్డి. ముఖ్య దిగుమతులు యంత్రములు, వస్త్రములు, ఆహార పదార్థములు.

స్పెయినుకు రాజధాని మాడ్రిడు. రైలు మార్గముల కూడలి. మధ్యధరా సముద్రము మీది బార్సిలోనా మిక్కిలి పెద్ద పారిశ్రామిక పట్టణము. వాలెన్షియా, మలాగా, బిల్బావో, కేడిజ్ ఇతర వర్తక కేంద్రములు.

పోర్చుగలు తీరమున నున్నది. మైదాన మెక్కువ. అందుచే నదులు నౌకా యానమున కుపయోగించును. స్పెయినులో కంటె పోర్చుగలులో ఉష్ణ భేదము తక్కువ. పడమటి తీరమున నుండుటచే వర్ష మెక్కువ. ఈ దేశములో వ్యవసాయము చాల ముఖ్యము. మధ్యధరా పండ్లు పండును. నిమ్మ, అత్తి, నారింజ, ఆపిలు, బాదము, ఖర్జూరము అధికముగా పెంచ బడుచున్నవి. దేశములో ఖనిజసంపద ఎక్కువగా కలదు. ఇనుము, తగరము, వుల్ఫ్రమ్, రాగి, సీసము, ఉప్పు తవ్వబడు చున్నవి.

పోర్చుగల్ అరణ్యములో కార్కు చెట్లు అధికము. వీని నుండి బిరడాలు తయారు చేసి ఎగుమతి చేయుదురు. బొగ్గు, విద్యుచ్ఛక్తికూడ తక్కువ కనుక పరిశ్రమలు ఎక్కువ లేవు. ఈ దేశములో ద్రాక్ష అంతటను పండింపబడు చున్నది. ద్రాక్ష సారాయపు ఎగుమతికి ముఖ్య రేవులు, ఒపోర్టో, కేడిజ్.

ఈ దేశములో రవాణాకు కంచర గాడిదలు ఎక్కువగా వాడుదురు. రాజధాని లిస్బన్ గొప్ప సముద్రపు రేవు. ఇక్కడ నుండి స్పెయిను మీదుగా ఫ్రాన్సుకు రైలు మార్గము అనేక సొరంగముల ద్వారా వేయబడినది.

జిబ్రాల్టరు ఒక కొండమీద నున్నది. మధ్యధరాస ముద్ర మునకు తాళము చెవి వంటిది. ఆంగ్లేయుల ఏలుబడిలో నున్నది.

## ఇటలీ

ఇటలీ దేశము ఆల్ప్సుకు దక్షిణమున మధ్యధరా సముద్రములోనికి వ్యాపించి యున్నది. భౌగోళికముగా ఈ దేశములో




ఇటలీ దేశము

రెండు కారణములు కలవు. (1) ఉత్తర ఇటలీ, (2) దక్షిణ ఇటలీ.

1. ఉత్తర ఇటలీలోని మైదానము పర్వతములచే చుట్టబడి యుండుటచే మధ్యధరా శీతోష్ణస్థితి కంటె ఎక్కువగా ఖండాంతర్గత శీతోష్ణస్థితిని కలిగియున్నది. ఈ మైదానమే లంబార్డీ మైదానము లేక పోనదీ మైదానమని పిలువబడుచున్నది. పోనది, దాని ఉపనదులు పర్వతములను చాలవరకు కోసివేసినవి. ఈ ఒండ్రుమట్టివల్ల మైదానము సారవంతమైనది. మైదాన దశ ఎక్కువ ఉండుటచే పోనదీ ముఖద్వారమున డెల్టా ఏర్పడినది. ఉత్తరఇటలీలో జనసాంద్రత చాలఎక్కువ. అనేక పెద్దపట్టణములు కలవు. ప్రజలు అనేక వృత్తులలో నిమగ్నులగుచున్నారు. ఈ ప్రాంతపు ప్రజల ముఖ్యవృత్తులు వ్యవసాయము, పాడి పరిశ్రమ. పట్టుపురుగులను పెంచుట, కోళ్ళ పరిశ్రమ. వ్యవసాయోత్పత్తులలో ముఖ్యమైనవి గోధుమ, మొక్కజొన్న, వరి, నార, బీటు దుంపలు. ఈ పంటలకొఱకు నీటిపారుదల ఏర్పాట్లు కొన్ని చేసినారు. ప్రతి రైతును ద్రాక్షపండ్లను పండించును. పట్టు పురుగులను పెంచును. ద్రాక్ష సారాయములో ఇటలీ ప్రముఖ స్థాన మాక్రమించుచున్నది. ద్రాక్షసారాయము, పట్టుపురుగుల పెంపకము ఉత్తర ఇటలీలో కంటె దక్షిణ ఇటలీలో ఎక్కువ.

ఆల్ప్సు పర్వత ప్రాంతములలో ఇనుప గనులున్నవి. ఈ దేశములో బొగ్గు లేదనియే చెప్పవచ్చును. ఇంగ్లండు, అమెరికాలనుండి దిగుమతి చేసుకొనడుచున్నది. ఆల్ప్సు పర్వతములలో

పుట్టిన అనేక నదులనుండి జలవిద్యుత్తు తీయుచున్నారు. ఈ దేశము పెట్రోలియమును కూడ దిగుమతి చేసుకొనవలయును. ప్రత్తి, ఇతర ఆహార పదార్థములుకూడ దిగుమతి చేసికొనవలసి యున్నది. గాజు, లేసు, పింగాణి, చలువరాయి పనులు, కత్తులు నూలు, ఉన్ని, సిల్కు, ద్రాక్షసారాయము, నౌకానిర్మాణము, ఇనుము, ఉక్కుపరిశ్రమలు చక్కగా సాగుచున్నవి. వస్త్రముల ఉత్పత్తి ముఖ్యమైనది. లక్షలకొలది కార్మికులు అందులో పని చేయుచున్నారు. మోటారు పరిశ్రమ చాల వృద్ధిపొందుచున్నది.

2. దక్షిణ ఇటలీలో, ద్వీపకల్ప భాగము, సిసిలీ ద్వీపము చేరియున్నవి. ద్వీపకల్ప భాగములోని అప్పినైను పర్వతముల నుండి అనేక నదులు తూర్పు పడమరలుగా వ్యాపించుచున్నవి. వీనిలో ముఖ్యమైనవి టైబరు, ఆర్నో. టైబరు మీద రోమ్, ఆర్నోమీద ఫ్లారెన్సు, పైసాలును కలవు.

దక్షిణ ఇటలీలో ప్రజలకు వ్యవసాయము, పండ్లు పండించుట ముఖ్యవృత్తులు. గోధుమ, మొక్కజొన్న ముఖ్య ఆహార ధాన్యములు. ఫ్లారెన్సు ప్రాంతములో ఆలివు పంట ఎక్కువగా కలదు. ఆలివునూనె, ఎండుద్రాక్ష, ద్రాక్షసారా యము లెగ్ హారను నుండి ఎగుమతి అగుచున్నవి.

సిసిలీలో నారింజ, నిమ్మతోటలు ఎక్కువ. ఇవి పాలెర్మొ నుండి ఎగుమతి అగును. ఈద్వీపములో ఎట్నా అను సజీవమైన అగ్నిపర్వతము కలదు. దీనినుండి గంధకముతీసి ఎగుమతి చేయు చున్నారు.

ఈ దేశమునుండి గంధకము, ఇనుము, పాదరసము ముఖ్య ఎగుమతులు.

ఈ దేశమునకు రాజధాని రోమ్. చాల ప్రాచీన పట్టణము. మన దేశముతో రెండువేల ఏండ్లకు పూర్వమునుండి వర్తకము చేయుచున్నది. ప్రాచీన రోమను నాగరికత ప్రసిద్ధికెక్కినది.

నేపుల్సు : రోముకు దక్షిణమున కల మంచి రేవు. వెసూవియస్ అను అగ్నిపర్వతమునకు దగ్గర కలదు. నౌకా నిర్మాణ కేంద్రము. చాల సుందరమైనపట్టణము. అందుచేతనే "See Naples and die" అను వాక్యము ఏర్పడినది.

వెనిస్ : లంబార్డీ మైదానము తూర్పుచివర అడ్రియాటిక్ సముద్రముమీద నున్నది. మధ్య యుగములో ఇదియు, జెనోవాయును ఇండియానుండి వచ్చు సరుకులకు మంచి వర్తక కేంద్రములై యుండెను. చాల సుందరమైన నగరము. వీధులన్నియు కాలువలే. గండోలా లను చిన్న పడవలమీద తిరుగుచుందురు.

మిలాన్ : ఆల్ప్సుల వద్దనున్న గొప్పపట్టణము. యంత్రముల ఉత్పత్తి శాలలు కలవు. పట్టు పరిశ్రమకు కేంద్రము.

ట్రిస్టిపో నదీమైదానముతూర్పు చివర కలదు. మంచి రేవు. దీనిపై హక్కు విషయమై యుగోస్లావియాకును, ఇటలీకిని వాదము జరుగుచున్నది.

---

# 13. బాల్కాను మండలము

## A. యుగోస్లావియా

ఈ దేశము హంగేరికి దక్షిణమున నున్నది. ఉత్తరమున తప్ప దేశములో అధికభాగము పర్వతమయము. పర్వతపంక్తులు




బాల్కాను ద్వీపకల్పము

తీరమునకు సమాంతరముగా ఉత్తర దక్షిణములుగా వ్యాపించి యున్నవి. ఇవి డినారిక్ అల్ప్సు లోనివి. తీరమైదానము ఇరుకైనది. ఈ రాజ్యము కూడ మొదటి ప్రపంచయుద్ధానంతరము పర్పడినది. పడమటి పర్వతపంక్తులలో సున్నపు రాయి ఎక్కువ.

మైదాన ప్రదేశములో వ్యవసాయము జరుగుచున్నది. గోధుమ, మొక్కజొన్న, పొగాకు, వరి మొదలగునవి ముఖ్య వ్యవసాయోత్పత్తులు. వ్యవసాయము ప్రాచీన పద్ధతులపై జరుగు చుండుటచే ఎక్కువ ఫలవంతముగా లేదు. పర్వత వాళ్ళ మీద ద్రాక్ష తోటలు, ఇతర పండ్ల తోటలు పెంచ బడు చున్నవి. ఈ తోటలకు పైన గడ్డి భూములు కలవు. ఇచ్చట పశుపోషణ ముఖ్యవృత్తి. ఆవులు, గొర్రెలు, మేకలు, పందులు విశేషముగా పెంచబడుచున్నవి. గడ్డి బీడులకు పైన అరణ్యములు కలవు. వీనిలో ఓకు, బీచి, ఫర్ మున్నగు వృక్షము లుండును. అనేకులు కలప పరిశ్రమ మీద ఆధారపడి యున్నారు.

తీర మైదానమగు డాల్మేషియా లో మధ్యధరా శీతోష్ణ స్థితి పూర్తిగా కలదు. ఇచ్చట సతత హరితారణ్యములు కలవు. మధ్యధరా ఫల వృక్షములు పెరుగును. ఈ దేశములో రైలు మార్గములు, రోడ్లు తక్కువ. ద్రాక్ష సారాయము, పిండి చేయుట తప్ప పరిశ్రమలు లేవనియే చెప్పవచ్చును.

ఈ దేశమునకు రాజధాని బెల్‌గ్రేడు. డాన్యూబు, సేవు నదులు కలియుచోట మైదానములో కలదు. వర్తక కేంద్రము.

ఓరియంట్ ఎక్స్‌ప్రెస్ ఈ పట్టణము మీదుగా పోవును. ఆ రైలు మార్గము ఈ దేశములోని మొరావా లోయగుండా వేయబడినది.

## B. ఆల్బేనియా

ఏడ్రియాటిక్ సముద్రమునకు తూర్పున మిక్కిలి పర్వతమయమైన ఈ దేశమున్నది. దీనికి ఒకవైపున యుగోస్లావియా, మరొక వైపున గ్రీసును కలవు. తీర ప్రాంతమున కొంచెము మైదానము కలదు. దేశము మిక్కిలి బీదది. ప్రజలు చాల వరకు మొహమ్మదీయులు. పశుపోషణ ముఖ్యావృత్తి. తీర మైదానములో మధ్యధరా శీతోష్ణస్థితి కలదు. గోధుమ, మొక్కజొన్న, మధ్యధరా ఫలములు పండించు చున్నారు. రోడ్లు చాలతక్కువ. పెట్రోలియము బావి కనుగొనబడెను.

దేశమునకు రాజధాని టిరానా. డ్యూరజ్జో రేవుతో చిన్న రైలుద్వారా కలుప బడినది. ఆ దేశములో అదికాక ఇతర రైలు మార్గములులేవు.స్కుటారి దేశములో కెల్ల పెద్దపట్టణము. ఆ పేరుకల సరస్సుమీద నున్నది.

## C. గ్రీసు

గ్రీసు దేశముకూడ చాలవరకు పర్వతమయమైన ద్వీపకల్పము. ఈ పర్వతములకు పిండస్ పర్వతములని పేరు. దీనికి పడమట అయోనియన్ సముద్రము, తూర్పున ఈజియన్ సముద్రము కలవు. క్రీట్ మరియు అనేక చిన్న ద్వీపములు కూడ

ఈదేశములో చేరియున్నవి. దేశములో పర్వతములు, సరస్సులు, బురద నేలలు ఎక్కువ. తీరము మిక్కిలి చీలియుండుటచే ప్రజలు నావికులైరి. వ్యవసాయము రెండవ ముఖ్య వృత్తి. ఇటీవల పాడిపరిశ్రమ కూడ వృద్ధిచేయబడు చున్నది. మైదానములోను, లోయలలోను కూడ మధ్యధరా శీతోష్ణస్థితి ఉండుటచే పండ్ల తోటలకు చాల అనుకూలముగా నున్నది. పశ్చిమ తీరమున ద్రాక్షతోటలు అధికము. ఇచ్చట వాటిని ఎండబెట్టి ఎగుమతి చేయుదురు. ఈ విషయములో ఈ దేశమే అగ్రస్థానము వహించుచున్నది.

మాసిడోనియా మైదానము సారవంతమగుటచే వ్యవసాయము బాగుగా జరుగుచున్నది. గోధుమ, ప్రత్తి, వరి, ఆలివు, ద్రాక్ష, పొగాకు పండించు చున్నారు. ఆలివు నూనె తయారు చేయుట చాల ముఖ్యమైనది.

ఈ దేశములో ఖనిజసంపద ఎక్కువగా లేదు. ఉప్పు, సీసము, చలువరాయి, ఇనుము, జింకు, రాగి, వెండి, ఆంటిమొని కొద్దిగా లభించు చున్నవి. మాగ్నెసైటు, క్రోమియము ముఖ్య ఖనిజములు.

యంత్రపరిశ్రమలు ఎక్కువగా లేవు. ఉన్ని, నూలు యంత్రములు, ద్రాక్ష సారాయము చేయుట, ఆలివు నూనె, రసాయనిక పదార్థములు చేయుట ముఖ్యపరిశ్రమలు.

రైలుమార్గములు కొంతవరకు వృద్ధిచేయబడినవి. నదులు యానయోగ్యములు కావు. రోడ్లు చాల తక్కువ. సముద్ర మార్గములు మాత్రము విరివిగా వాడుకలో నున్నవి.

దేశమునకు రాజధాని ఏథెన్సు. ప్రాచీన పట్టణము. గొప్ప నాగరికతకు కేంద్రము. కాని ప్రాచీన వైభవము పోయి నది. ముఖ్యరేవగు ఫిరోస్‌తో రైలుద్వారా కలుప పడినది.

సెలోనికా మాసిడోనియా మైదానమునకు రేవు. ముఖ్య వర్తక కేంద్రము. రైలుమార్గములద్వారా ఇతర ముఖ్యపట్టణము లతో కలుప బడినది. వర్డర్ లోయగుండా ఒక రైలుమార్గము ద్వారా ఓరియన్ట్ ఎక్స్‌ప్రెసుతో కలుపబడినది.

క్రీటుద్వీపము ప్రధాన భూభాగమునకు ఆగ్నేయముగా నున్నది. పర్వతమయము. వ్యవసాయము ముఖ్య వృత్తి. ద్రాక్ష సారాయము, ఆలివు నూనె ముఖ్య ఎగుమతులు.

## D. బల్గేరియా

ఈ దేశము డాన్యూబు నదికి దక్షిణమున బాల్కాను ద్వీప కల్పమునకు తూర్పున ఉన్నది. ఈ దేశస్థులు స్లావ్, మంగోలు జాతుల మిశ్రమము. దేశములో చిన్న వ్యవసాయ దారులు అధికము. వ్యవసాయము ముఖ్య వృత్తి. దేశం మధ్యగా పోవు బాల్కాను పర్వతముల మీద బీచ్, ఓకు అరణ్యములు కలవు. ఈ పర్వతములకు ఉత్తర దక్షిణములుగా మైదాన మున్నది. ఉత్తర మైదానము డాన్యూబు మండలములోను, దక్షిణ మైదానము

మారిటా నదీ మండలములోను కలవు. ఉత్తరమున బార్లీ, రై, బంగాళా దుంపలు ముఖ్య పంటలు. దక్షిణ మైదానములో మధ్యధరా శీతోష్ణస్థితి కలదు. గోధుమ, మొక్కజొన్న, ద్రాక్ష, పీచ్, ప్లమ్, పండ్ల తోటలు, పొగాకు, ప్రత్తి పెరుగు చున్నవి. ఈ ప్రాంతములో ప్రజలు గులాబి పూలను పండింతురు. వీటితో ఫిలిప్పొ పోలిస్ లో అత్తరు చేయుదురు.

దేశమునకు రాజధాని సోఫియా. ఓరియన్ట్ ఎక్స్‌ప్రెస్ మార్గమున నున్నది.

## E. టర్కీ

టర్కీలో చాలభాగము ఆసియాలో నున్నది. కాన్‌స్టాంటి నోపిలు, దాని వెనుక కొంత భూమియు మాత్రము ఐరోపాలో మిగిలి యున్నవి. అచ్చట బాస్ఫరస్ జలసంధి దాటి స్కూటారీ నుండీ బాగ్దాదు వరకు తిరిగి రైలుమీద పోవచ్చును. డార్డినెల్స్ జలసంధి కూడ రెండు టర్కీలను వేరు చేయుచున్నది. ఇచ్చట వ్యవసాయము, గొఱ్ఱెల పెంపకము ముఖ్య వృత్తులు.

కాన్‌స్టాంటి నోపిలు (ఇస్థాంబుల్) మిక్కిలి ప్రాచీనమైన పట్టణము. నల్ల సముద్ర ముఖ ద్వారమువద్ద చాల ప్రముఖమైన స్థలములో నున్నది. ఇప్పుడు టర్కీకి రాజధాని ఆసియాలోని అంకారా. గల్లిపోలి-డార్డినెల్సును కాపలాకాయు యుద్ధ నౌకా కేంద్రము.

# 11. బ్రిటిషు దీవులు

బ్రిటిషు దీవులలో గ్రేట్ బ్రిటను, ఐర్లండు అను రెండు ముఖ్యమైన దీవులు, అనేక చిన్న దీవులు కలవు. గ్రేట్ బ్రిటనులో పశ్చిమమున వేల్సు. ఉత్తరమున స్కాట్లండు కలిసియున్నవి. ఇంగ్లండు ఫ్రాన్సునుండి ఇంగ్లీషు ఛానెలుచే వేరుచేయబడుచున్నది. ఈ దీవులకు తూర్పున ఉత్తర సముద్రమును, గ్రేట్



బ్రిటను, ఐర్లండులకు మధ్య ఐరిష్ సముద్రమును, ఇతర దిక్కులందు అట్లాంటికు మహాసముద్రమును కలవు. చుట్టునుండు ప్రదేశము క్రుంగుటచే ఈ సముద్రము లేర్పడినవి. ఈ సముద్రములు చాలమెరక. 600 అడుగులకంటె లోతు లేవు. కొన్ని చోట్ల 60-80 అడుగులు మాత్రమే లోతున్నవి. ఇట్లు మెరకగా నుండు సముద్ర భాగమునకు కాంటినెంటల్ షెల్ఫ్ అని పేరు. కాంటినెంటల్ షెల్ఫ్‌లో మునుగని ప్రదేశమే బ్రిటిషు దీవులైనది.

ఇంగ్లండులో ఆగ్నేయ భాగమున మైదానమును, మిగిలిన భాగమున పర్వతములును, కొండలును కలవు. మైదాన భాగములో కూడ గుట్టలున్నవి. ఇంగ్లండులో నాలుగు పర్వత ప్రదేశములు కలవు.

1. పినైను అను ముడుత పర్వతములు దేశమధ్యగా వ్యాపించి స్కాట్లండు పర్వతములలో కలిసిపోయినవి. ఈ పర్వత పంక్తినుండి అనేక నదులు తూర్పుపడమరలకు ప్రవహించుచున్నవి. ఈ పర్వత పంక్తిలోని టైన్, ఐర్ కనుమలద్వారా రైలు, రోడ్డుమార్గములు వేసిరి.

2. లేకు మండలములో కొండలు అగ్నిపర్వత క్రియ వలన పర్పడినవి. వీని నడుమ అనేక సరస్సులు కలవు. ఇచ్చటి దృశ్యము చాల రమణీయముగా నుండును.

3. వేల్సు పీఠభూమిలో స్నోడన్ శిఖరము మిక్కిలి ఎత్తయినది (3571 అ.) సెవరన్ ముఖ్యనది. 200 మైళ్ళు

ప్రవహించే బ్రిస్టలు ఛానెలులో కలియుచున్నది. పినైను పర్వతములకును, వేల్సు పీఠభూమికిని మధ్య స్టగేటు అను కనుమ కలదు.




4. నైరృతి ద్వీపకల్పములోని కొండలలో కఠిన శిలలు కలవు. డేవన్‌షైర్‌లోని డార్టుమూరులో ఈ రాతిగుట్టలు చాల

ఎక్కువగా ఉన్నవి. కారణ్‌వాల్ ప్రాంతమున ఇసుకరాయి గుట్టలు కలవు. ఇచ్చటి నదులు నిరుపయోగమైనవి.

ఇంగ్లండు ఆగ్నేయ భాగమున మైదానము కలదు. ఈ మైదానములో ఇంగ్లండు యొక్క చాల భాగమును, వేల్సు తూర్పుభాగమును చేరియున్నవి. దీనిలో అక్కడక్కడ చిన్న కొండగుట్టలు కలవు. సెవరన్, థేమ్స్, ట్రెంట్ ఇచ్చటి పెద్ద నదులు. సెవరన్ వేల్సు పీఠభూమినుండి ప్రవహించుచున్నది. దీని లోయద్వారా రైలుమార్గములు వేసిరి. థేమ్సు కాట్స్‌వోల్డ్సులో పుట్టి తూర్పుగా ప్రవహించుచున్నది. దీని తీరమున ఆక్స్‌ఫర్డ్, విండ్సరు, లండను పట్టణములు కలవు. ఈనది ఉత్తర సముద్రములో కలియుచున్నది.

స్కాట్లండులో ఉత్తర పర్వతములు, మధ్యలోయ, దక్షిణ మిట్టలు కలవు. ఉత్తర పర్వతములు, ప్రాచీన కఠిన శిలతో కూడినవి. ఈ పర్వతములు, స్కాండినేవియా పర్వతములు ఒకే రకమయినవని ఇదివరకే చెప్పబడినది. మంచువల్లను, నదుల వల్లను ఎత్తుపల్లములు ఎక్కువైనవి. పడమటి తీరమున అనేక ఫియోర్డులు ఏర్పడినవి. (నార్వే, ఐస్‌లండ్, ఐర్లండుల పడమటి తీరమువలె) ఇచ్చటి నదులు చాల వేగముగా ప్రవహించును. మంచుయుగములో ఇచ్చట అనేక సరస్సులు ఏర్పడినవి. కొండలమీద శృంగాకారారణ్యములు కలవు. జనసంఖ్య చాల తక్కువ. బ్రిటిషుదీవులలో కెల్ల ఎత్తయిన బెన్‌నెవిస్ (4406అ) పర్వతము ఇచటనే కలదు. తీరమునకు దూరమున హెబ్రిడీస్

అను ద్వీప సముదాయము కలదు. ఇవికాక ఆర్క్‌నీస్, షెట్ లాండు ద్వీపములు ఉత్తరముగా నున్నవి.

మధ్య మైదానము భూమి కృంగుటచే ఏర్పడినది. దీనిని రిఫ్ట్‌లోయ అందురు. ఇట్టివి ఆఫ్రికాలో ఉన్నట్లు చూచితిమి. ఈ లోయలో మధ్య అగ్నిపర్వత క్రియవలన ఏర్పడిన కొండల వరుస కలదు. ఈ లోయలో టే, ఫోర్తు నదులు తూర్పుగాను, క్లైడు పశ్చిమముగాను ప్రవహించుచున్నవి.

దక్షిణ మిట్టలలో కొండలు, లోయలు అధికము. కొన్ని చోట్ల చెట్టుచేమలు లేవు. మిగిలినచోట్ల ఈ కొండలమీద గడ్డి కలదు. గొఱ్ఱెలకు అనుకూలమైనచోటు. క్లైడు, ట్వీడు నదులు లోయలను లోతుగా కోసినవి. ట్వీడుకు దక్షిణమున కల చెవియట్ కొండలలో ఇంగ్లండు, స్కాట్లండుల సరిహద్దు పోవుచున్నది.

ఐర్లండులో చుట్టును పర్వతములును, మధ్య మైదానమును కలవు.

మధ్య లోయలో సున్నపురాళ్ళు కలవు. నదులు, వర్షము ఈరాతిని చాలవరకు కోసివేసినవి. ఐర్లండులో పెద్దదగు షానన్ నది ఇచ్చటనే ఉన్నది.

## శీతోష్ణస్థితి - వృక్షజాలము

బ్రిటిషు దీవులు సమ శీతోష్ణ మండలములో నున్నవి. అందుచే శీతోష్ణస్థితి సౌమ్యముగా నుండును. అతి వేడిగాని,

అతి చలి గాని ఉండవు, వేసవిలో వెచ్చగా నుండును. ఆకురాలు కాలములో చెట్లు ఆకులను రాల్చి మోడులవలె నిలిచి యుండును. శీతకాలము చల్లగా నుండును. అప్పుడప్పుడు పొగమంచు ఏర్పడును. వసంతఋతువులో ప్రకృతి మేల్కొం




జనవరి నెలలో

జూలై నెలలో

చును. చెట్లు చిగుర్చును. అతి చలిగాని అతి వేడిగాని, లేకుండుటచే ప్రజలు ఎంతపని చేసినను అలసిపోరు. ఈ శీతోష్ణస్థితియే ఆ దేశపు ఔన్నత్యమునకు ముఖ్య కారణము. అదే అక్షాంశము మీద నున్న కెనడా, ఐరోపాలలో కంటె ఈ దీవులలో వేసవులు చల్లగాను, శీత కాలములు వెచ్చగాను ఉండును. ఇందుకు

కారణములు చాల కలవు. ద్వీపములు కావునను, సముద్రము చాల చోట్ల లోనికి చొచ్చుకొని పోవుట చేతను సముద్ర ప్రభావము ఎక్కువ. అందుచే వేసవిలో చల్లగానుండును. ఈ దీవులకు పశ్చిమమున గల్ఫ్‌స్ట్రీమ్ అను ఉత్తర అట్లాంటికు ఉష్ణజల ప్రవాహము ప్రవహించుచు వెచ్చని వాయువుల నిచ్చుచుండుటచే శీతకాలములో అతి చలి ఉండుటలేదు. బ్రిటిషు దీవులకు పశ్చిమ పవనములు తరచుగా వీచుచుండుటచే వెచ్చదనము కలుగు చుండును.

బ్రిటిషు దీవులలో వర్షము సంవత్సర మంతయు నుండును. అందుచే దేశము ఎల్లప్పుడును పచ్చగా నుండును. వర్షము పశ్చిమ తీరమున ఉత్తరముగా పోయిన కొలది ఎక్కువగును. అందుచే వృక్షజాలము చక్కగా పెరుగును. దక్షిణ స్కాట్లండు, ఇంగ్లండు, ఐర్లండులలో ఆకు రాలు విశాల పత్రారణ్యములున్నవి. వీటిలో ఓకు, ఎల్మ్, బీచ్ మున్నగునవి ముఖ్య వృక్షములు. ఉత్తర స్కాట్లండులో శృంగాకారారణ్యములు కలవు.

## బ్రిటిషుదీవులలోని ప్రజలు – వారి జీవితము

నేటి బ్రిటిషుప్రజలు పరిశ్రమలలోను, వ్యవసాయములోను ప్రపంచములో అన్ని దేశములలోను అగ్రగాములు. 400 సంవత్సరముల క్రిందట వ్యవసాయము మాత్రము జరుగు చుండెను. సాహసికులగుటచే సప్తసముద్రములు దాటి అనేక

క్రొత్తదేశములను కనుగొని గొప్ప సామ్రాజ్యమును స్థాపించుకొనిరి. పారిశ్రామిక విప్లవము ఇక్కడనే ఆరంభమయ్యెను. యంత్రములు ఇచ్చటనే కనుగొనబడెను. అందుచే క్రమముగా పరిశ్రమలును, వర్తకమును ఎక్కువై ఆ దేశమునకు అపారమైన సంపదను సమకూర్చెను.

వ్యవసాయము నిర్లక్ష్యము చేయబడుటలేదు. వ్యవసాయ విప్లవముల ద్వారా క్రొత్తరకమైన పద్ధతుల నవలంబించి అధికోత్పత్తిని సాధించుచున్నారు. ఇప్పుడు ఎక్కువమంది యంత్రశాలలలో, కర్మాగారములలో, సరకులగిడ్డంగులలో, రైలుమార్గములలో, ఆఫీసులలో పనిచేయుచున్నారు. మొత్తముమీద వ్యవసాయముకంటె ఇతర వృత్తులే ఎక్కువ.

యంత్రములను కనిపెట్టుటచే వాటికి ఎక్కువ ముడి సరకు కావలసి వచ్చెను. తయారైన సరకును అమ్ముటకు వర్తక స్థానములను వెదకవలసి వచ్చెను. ఇట్లు ఒక్కమారుగా పరిశ్రమలు, వర్తకము ఎక్కువయ్యెను. ఆహారము, ముడిసరకులు విదేశములనుండి దిగుమతి చేసుకొనవలసి వచ్చినది. ఆస్ట్రేలియా, న్యూజిలాండులనుండి ఉన్ని, మాంసము; స్పెయిను, ఫ్రాన్సు, స్వీడనులనుండి ముడి ఇనుము; ఇండియానుండి తేయాకు, నార, చమురు గింజలు, చర్మములు, ప్రత్తి; అమెరికా ఈజిప్టులనుండి ప్రత్తి; అమెరికా, డెన్మార్కులనుండి మాంసము మొదలగునవి దిగుమతి చేసికొని తిరిగి యంత్రముల మీద తయారైన వస్తువులను ఎగుమతి చేయుచున్నారు. ఇన్ని విధముల వర్త




కము పెరిగినది. పెట్టుబడి పెట్టు బ్యాంకులు, ఇన్సూరెన్సు కంపెనీలు కూడ చాల మంచి స్థితిలో నున్నవి. గనులలోను, చేనేతవృత్తిలోను, నౌకా నిర్మాణములోను పనిచేయువారు చాలమంది కలరు.

బ్రిటిషు దీవులలో జనసంఖ్య హెచ్చుగనే ఉన్నది. 1700 సంవత్సర ప్రాంతమున ఒకకోటి జనముండగా ఇప్పుడు 5 కోట్లున్నారు. మరణములు తగ్గుట, జననములు ఎక్కువగుట ఇందుకు ముఖ్య కారణములు. సరాసరి జనసాంద్రత చదరపు మైలుకు 685 మంది. బెల్జియము, హాలెండు, జావాలలో మాత్రము ఇంతకంటె ఎక్కువజనసాంద్రత కలదు. ఈ దీవులలో వ్యవసాయ మండలముల కంటె పారిశ్రామిక మండలములలో అధిక జనసాంద్రత కలదు.

## వ్యవసాయము, పశుపోషణ - మత్స్య పరిశ్రమ

పరిశ్రమలు పెరిగినను వ్యవసాయము నిర్లక్ష్యము చేయబడలేదని ఈవరకె చెప్పబడినది. ప్రజలలో 11% ఈ వృత్తిలో నున్నారు. గోధుమ, బార్లీ, ఓట్లు, బంగాళాదుంపలు, బీటు దుంపలు, కూరకాయలు, పండ్లు ముఖ్యముగా పండింపబడు చున్నవి. ఆగ్నేయ ఇంగ్లండు ఇందుకు ఎక్కువ అనుకూలముగా నున్నది. ఎకరమునకు రాబడికూడ చాల హెచ్చుగా నుండును. దేశమును స్వయం సమృద్ధము చేయుటకు ఇటీవల వ్యవసాయము గూర్చి ఎక్కువశ్రద్ధ తీసుకొనబడుచున్నది.

ఈ దీవులలో అన్నిచోట్లను ఆవుల పోషణ బాగుగా జరుగుచున్నది. వర్షము సంవత్సరమంతయు ఉండును కావున పచ్చగడ్డికి కొదువయుండదు. పాడి, మాంసము, చర్మములు వీనినుండి లభించును. ఆక్స్‌ఫర్డ్, ఐల్స్‌బరీలనుండి లండను పట్ట

ణమునకు పాలు సరఫరా చేయుదురు. ఇతరచోట్ల పాలనుండి వెన్న, జున్ను తీయుదురు. ఐర్లాండులో పాడిపరిశ్రమ ఇంకను ఎక్కువ. ఇంగ్లీషు ఆవులు చాల మంచి జాతికి చెందినవి. అవి



చేపల పేట

ఎక్కువ పాలిచ్చును. మధ్యమైదానములో ఆవులను మాంసము కొఱకు పెంచుదురు. పందులుకూడ చాలకలవు.

గొఱ్ఱెల పోషణకూడ ముఖ్యమైనది. వీటిని మాంసము కొఱకేకాక, ఉన్ని కొఱకుకూడ పెంచుదురు. గొఱ్ఱెలు పినైనులు, వేల్సు పీఠభూమి, ఉత్తర స్కాట్లండు పర్వత ప్రాంతము, ఐర్లండులలో ఎక్కువగా పెంచబడుచున్నవి.

జెస్తవృత్తి బ్రిటిషు దీవులలో చాల ముఖ్యమైనది. దీవులకు తూర్పునగల కాంటి నెంటల్ షెల్ఫ్లో చేపలు పట్టుదురు. హాడక్, హెర్రింగ్, కాడ్ మొదలగు చేపలు ముఖ్యమైనవి. చేపలు పట్టుటకు విక్, అబర్డీన్, పీటర్, హెడ్, స్టోన్ హేవెన్, హల్, గ్రిమ్స్బీ, యార్మత్‌లు ముఖ్య కేంద్రములు.

## ఖనిజ సంపద

గ్రేటు బ్రిటనులో ఖనిజ సంపద హెచ్చుగా నున్నది. బొగ్గు, ఇనుము, సీసము, జింకు, తగరము, జిప్సము, ఇసుకరాయి, సున్నపురాయి, సుద్ద ముఖ్యమైనవి. ఇచ్చట బొగ్గు, ఇనుము దగ్గరలో లభించు చుండుటచే పరిశ్రమలు బాగుగా వృద్ధి పొందినవి. ఇంగ్లండు ఐశ్వర్యమునకు ఇదియే మూలకారణము. బ్రిటిషు దీవులలో ఈ దిగువ ముఖ్య బొగ్గు గనులు కలవు.

1. దక్షిణ స్కాట్లండ్ బొగ్గు గని, 2. నార్తంబర్లాండులోని డర్హాంబొగ్గుగని 3. కంబర్లాండ్ బొగ్గుగని 4. లాంక

షైర్ బొగ్గుగని 5. యార్కు షైర్ బొగ్గుగని 6. మధ్య యింగ్లాండులోని మిడ్‌లాండ్ బొగ్గుగని 7. దక్షిణ వేల్సు బొగ్గుగని. వీని ఉనికిని పటమున గమనింపుము.



టన్నుల బొగ్గు ఉత్పత్తి యైనది. ఇందు పదిలక్షల కార్మికులు పాల్గొనిరి. బొగ్గుగనుల ప్రాంతమున అనేక యంత్రశాలలు వెలసినవి.

గ్రేట్ బ్రిటనులో లాంకషైరు ప్రాంతమున ఇనుప గనులు కలవు. ముఖ్య ఇనుపగనులు ఉత్తర లాంకషైరు, క్లైడులోయ, ఉత్తర స్టాఫర్డ్ షైరు, దక్షిణ వేల్సు, ఆగ్నేయ ఇంగ్లండులలో కలవు. గనులు లోతునకు పోవుచున్న కొలది త్రవ్వుట ఎక్కువ కష్టము. ఖరీదు ఎక్కువగును. అందుచే స్వీడను, స్పెయిను, ఫ్రాన్సు, అమెరికా సంయుక్త రాష్ట్రములు, న్యూఫౌండు లాండుల నుండి మంచి ఇనుము దిగుమతి చేసికొనుచున్నారు.

## యంత్ర పరిశ్రమలు

బ్రిటిషు దీవులు ప్రపంచములోకెల్ల మిక్కిలి పారిశ్రామికముగా వృద్ధిపొందినవి. ఇచట ఇనుము, ఉక్కు యంత్రములు, ఓడలు, శకటములు నిర్మించుట, వస్త్రములు, చర్మము, దుస్తులు తయారుచేయుట, ఆహారసంబంధమైన యంత్రములు, పొగాకు, రసాయనిక పదార్థములు, మందులు చేయుట, కాగితము, కలప మొదలైన పరిశ్రమలు కలవు. వీనిలో ఇనుము, ఉక్కు, వస్త్రములు, రసాయన పదార్థములుచేయుట ముఖ్యమైనవి. ఇనుము, ఉక్కుతో అనేక యంత్రములు, రైళ్ళు, స్టీమరులు, మోటారులు, విమానములు మొదలగునవి చేయుచున్నారు.

మధ్యమైదానములో ఉక్కు ఇనుపయంత్రములు, శకటములు చేయుచున్నారు. నాటింగ్‌హామ్‌లో సైకిళ్ళు, బర్మింగ్‌హామ్, కవెంట్రీ, వుల్వర్‌హాంప్టన్‌లలో మోటారులు, సైకిళ్ళు, రైల్వేసామాను, యంత్రపుపనిముట్లు (Machine Tools), విద్యుత్పరికరములు, సూదులు, గొలుసులు చేయుదురు బర్మింగ్‌హామ్, కవెంట్రీ, వుల్వర్ హాంప్టనులను బ్లాక్ కంట్రీ (Black Country) అందురు. ఇచ్చట అనేక ఇనుపకార్ఖానా లుండుటచే ఈ పేరు వచ్చినది.

ఉక్కుపరిశ్రమ తర్వాత రెండవస్థాన మాక్రమించునది నూలు పరిశ్రమ. లాంకషైరు మండలములో కేంద్రీకరింపబడినది. ఇచ్చట గాలిలో తేమ ఉండును కాబట్టి అతి సన్నని నూలు తీయవచ్చును. దగ్గరలో బొగ్గు గనులున్నవి. పినైను పర్వతము నుండి వచ్చు నదులు సమృద్ధిగా నీటిని సరఫరా చేయును. వస్త్రములను తెలుపుచేయు బ్లీచింగు పౌడరు దక్షిణమున చెషైరులో చేయుచున్నారు. కాని ప్రత్తిమాత్రము అ. సం. రా. ఈజిప్టు, ఇండియాలనుండి దిగుమతిచేసికొనుచున్నారు. నూలు యంత్రశాలల కేంద్రములగు బ్లాక్‌బరన్, ఓల్డ్ హామ్, బోల్టన్, బర్రీ మున్నగు పట్టణములు నదీతీరమున కలవు. వీటిమధ్య మాంచెస్టరు కలదు. ఇది ఈ పరిశ్రమకు ప్రధానకేంద్రము. ఇచటి ఉత్పాదితములు లివర్పూలు రేవు ద్వారా ఎగుమతి చేయుచుండిరి. ఇప్పుడు లివర్పూలు మాంచెస్టరుతో కాలువద్వారా కలుపబడినది.



మాంచెస్టరు నూలు యంత్రాలయమున ఒక దృశ్యము.

ఇంగ్లండు నూలు వస్త్రములను చైనా, ఈజిప్టు, హాలెండు మున్నగు అన్ని దేశములకు ఎగుమతి చేయును.

నౌకా నిర్మాణము, ఉన్ని పరిశ్రమ, చర్మపు పరిశ్రమ మొదలగు ఎన్నో పరిశ్రమలు వృద్ధిలో నున్నవి.

స్కాట్లండులో మధ్యలోయ చాల ముఖ్యమైనది. ఇచ్చటి క్లైడునదీ మండలములో పరిశ్రమలు ఎక్కువ. గ్లాస్గో ఈ నదీ ముఖద్వారమున కలదు. ఈ నదీ ముఖద్వారమువద్ద కల క్లైడ్ బాంక్, డంబార్టన్, రెన్‌ఫ్రూ పోర్టు, గ్లాస్గో, గ్రీనక్ రేవులు నౌకా నిర్మాణ కేంద్రములు. ఇనుము, ఉక్కు, యంత్రనిర్మాణ పరిశ్రమలు కలవు. క్లైడు మండలములోని బొగ్గు ఈ పరిశ్రమల కుపయోగించు చున్నది.

తూర్పు స్కాట్లండులోని డండీలో నార యంత్రశాలలు కలవు. ఇచ్చటికి నార బెంగాలునుండి వచ్చును. పెర్తులో రంగులు వేయుదురు.

దక్షిణ మిట్టలలో ట్వీడు వస్త్రములు తయారుచేయు యంత్రశాలలు కలవు.

ఐర్లండు ఎక్కువగా వ్యావసాయిక దేశము. పశుపోషణ, పందుల పెంపకము ముఖ్య వృత్తులు. పాడి పరిశ్రమలో చాల మంది పాల్గొను చున్నారు. ఉత్తరమున లండన్ డెర్రీ, దక్షిణ మున కార్క్, వాటర్‌ఫోర్డు వెన్న ఎగుమతి కేంద్రములు.

ఐర్లండులో దక్షిణ భాగము స్వతంత్ర రాజ్యము. ఉత్తర భాగమును అల్‌స్టర్ అందురు. ఇది యునైటెడ్ కింగ్డములో

చేరి ఉన్నది. దక్షిణ ఐర్లండుకు డబ్లిను, ఉత్తర ఐర్లండుకు బెల్‌ఫాస్టు రాజధానులు.

## రవాణా సదుపాయములు

గ్రేట్ బ్రిటనుయొక్క పారిశ్రామిక, వ్యాపారాభివృద్ధికి అచ్చటి రవాణా సదుపాయములు కూడ ముఖ్య కారణము. దేశమంతటను అనేక రైలు మార్గములు కలవు. ప్రధాన కేంద్రమగు లండను నగరము అనేక మార్గములకు కూడలి. ఇచ్చట ఉన్నన్ని రైలుమార్గములు మరి యే దేశములోను లేవు. ఈ దేశములో 52,000 మైళ్ళ రైలు మార్గములుకలవు. రోడ్లుకూడ చాల వృద్ధి చేయబడినవి. 184,000 మైళ్ళ రోడ్డుమార్గములు కలవు. నదులు కాలువలచే కలుపబడి నౌకాయానమున కనుకూలముగా నున్నవి. 2400 మైళ్ళు కాలువలలో నౌకలు తిరుగుచుండును. విమాన మార్గములు కూడ వృద్ధి చేయబడినవి. లండను సమీపమున కల క్రోయిడన్ విమానాశ్రయము చాల ప్రసిద్ధమైనది. దేశములోనే కాక విదేశములకుకూడ ప్రయాణములు సాగించుచున్నవి.

యునైటెడ్ కింగ్డముకు రాజధాని లండను. థేమ్సు నదిమీద నున్నది. ప్రపంచములోకెల్ల మిక్కిలి పెద్దది. జనసంఖ్య 75 లక్షలు. చుట్టు ప్రక్కల నున్న పేటలను కలుపు భూగర్భ రైలుమార్గముకలదు. గొప్ప వర్తక కేంద్రము. నౌకలు మైళ్ళ కొలది దూరము నిలిచి సరకులను దించుచుండును. ప్రపంచములో కెల్ల గొప్పదైన ఆర్థిక కేంద్రము. ఈ పట్టణము నుండి

ఇతర ప్రాంతములకు సరకులు ఎగుమతి అగుచుండును. ఇండియా లోని తేయాకు ఇచ్చటనే ఇతరదేశములకు అమ్ముదురు. యునైటెడ్ కింగ్డముయొక్క రాజకుటుంబము ఇచట నివసించును. పార్లమెంటు భవనము కలదు.

సౌథాంప్టను దక్షిణమున కల మంచిరేవు.

కార్డిఫ్ వేల్సులో మిక్కిలి పెద్ద పట్టణము. బొగ్గు ఎగుమతి అగును. నౌకా నిర్మాణము, రసాయనములు, ఇనుప సామానులు చేయుట ముఖ్య పరిశ్రమలు.

గ్లాస్గో స్కాట్లండులో మిక్కిలి పెద్దపట్టణము, మంచిరేవు. నౌకా నిర్మాణము, ఉక్కు, వస్త్రములు తయారుచేయు పరిశ్రమలు కలవు.

ఎడింబరో : స్కాట్లండుకు రాజధాని. విద్యా కేంద్రము.

బెల్‌ఫాస్ట్ ఉత్తర ఐర్లండు రాజధాని. మంచి వర్తక స్థానము నారవస్త్రములు ఉత్పత్తిచేయుట, నౌకా నిర్మాణము ముఖ్య పరిశ్రమలు.

డబ్లిన్ ఐరిష్ ఫ్రీస్టేటుకు రాజధాని. వస్త్రములు, బిస్కత్తులు, రంగువేయుట, బీరు, విస్కీ తయారుచేయుట ముఖ్య పరిశ్రమలు.

## బ్రిటిషు, జపాను దీవులకు గల పోలికలు

జపానును ప్రాచ్యబ్రిటను అందురు. ఈ రెండు దేశములకును సమాన లక్షణములు కొన్ని యుండుటే అందుకు కారణము.

రెండు దేశములును యూరేషియా ఖండ భాగమునకు చెరియొక వైపునను అమరి యున్నవి. బ్రిటిషు దీవులు అధిక జనసాంద్రతగల ఐరోపాఖండ భాగమునకును, జపాను దీవులు చైనాకును చేరువలో నున్నవి.

శీతోష్ణస్థితి విషయములో రెండు దేశములకును దగ్గర పోలిక కలదు. రెండు దేశములును, సమశీతోష్ణ మండలముననే ఉన్నవి. రెండును ద్వీపములై సముద్ర ప్రభావమును కలిగి యున్నవి. బ్రిటిషు ద్వీపములకు పడమటినుండి గల్ఫ్‌స్ట్రీమ్ వేడి నీటి ప్రవాహము పోవుచుండగా జపాను దీవుల తూర్పునుండి జపాను (క్యూరోసివో) వేడినీటి ప్రవాహము పోవుచున్నది. పై కారణముల వలన రెండు దేశములును ఒకే రకమగు శీతోష్ణ స్థితిని కలిగి యున్నవి. రెండు దేశములందును సౌమ్యమగు శీతోష్ణస్థితివలన జనులు త్వరగా అలసిపోరు. చురుకుగ నుందురు.

రెండు దేశముల తీరరేఖయు చీలియుండుటచేత అనేక నౌకాశ్రయము లేర్పడినవి.

రెండు దేశములును సముద్రావృతములగు, ద్వీపము లగుటచేత ఈ దేశములవారు సముద్రముతో పరిచయము కల వారై గొప్ప నావికులైరి. అందుచే యీ రెండుదేశములును నేడు గొప్ప నావికాబలమును కలిగియున్నవి. రెండు దేశముల వారును సైనికశిక్షణను నౌకా శిక్షణను పొందియున్నారు.

యూరపియను జాతు లన్నిటిలో ఇంగ్లీషువారు తెలి వైనవారు. అట్లే మంగోలియను జాతు లన్నిటిలో జపాను వారు తెలివైనవారు.

రెండు దేశములందును పంటభూములు తక్కువ. ఆయా దేశీయుల అవసరములకు సరిపడునంత ఆహారము లభ్యమగుట లేదు. కనుక రెండు దేశములును పారిశ్రామికముగ వృద్ధి నందవలసి వచ్చెను.

రెండు దేశముల యందును బొగ్గు, ఇతర ఖనిజములు. విద్యుత్తు లభించుచున్నవి. రెండు దేశములును తమయంత్రాగార ములలో విరివిగా సామానులను తయారుచేసి ఇతర దేశముల బజా రులకై పోటీ పడవలసియున్నది. బ్రిటిషు దీవులు నాణ్యమైన విలువగల సామానులను తయారుచేయగా జపాను అంత నాణ్య మైనవి కాకపోయినను మిక్కిలి తక్కువ ఖరీదులో వస్తువుల నుత్పత్తి చేయుచున్నది.

రెండు దేశములును ఆహార పదార్థములను, పరిశ్రమ లకు కావలసిన ముడిసరుకులను దిగుమతి చేసికొనుచున్నవి.

రెండు దేశములందును చేపలవేట విరివిగా నవీన పద్ధతు లలో సాగుచున్నది.

# ప్రశ్నలు

1. ఐరోపా నైసర్గిక స్వరూపమును వివరించుడు.
2. ఐరోపా శీతోష్ణస్థితిని గూర్చి వ్రాయుడు.
3. ఐరోపాలోని ఉత్తర పర్వతములను గూర్చి వ్రాయుడు.
4. ఐరోపాలోని మధ్య మైదానమును గూర్చి వ్రాయుడు.
5. ఐరోపాలోని దక్షిణ పర్వతములను గూర్చి వ్రాయుడు.
6. ఐరోపాలోని ముఖ్య నదులను గూర్చి వ్రాయుడు.
7. వాల్గా, డాన్యూబ్, రోన్, రైన్ నదులను గూర్చి వ్రాయుడు.
8. రష్యాలోని నదులను గూర్చి వ్రాయుడు.
9. ఫ్రాన్సులోని నదులను గూర్చి వ్రాయుడు.
10. జర్మనీలోని నదులను గూర్చి వ్రాయుడు.
11. ఐరోపాలోని ఎన్ని సహజ విభాగములు కలవు? వాటి ముఖ్య లక్షణము లేవి?
12. ఐరోపాలోని సహజ వృక్షజాలమును గూర్చి వ్రాయుడు.
13. ఐరోపాలోని ఖనిజ సంపదను గూర్చి వ్రాయుడు.
14. నార్వే స్వీడనులు ఒకే ద్వీపకల్పములో నున్న అనేక విషయములలో వేరుగానున్నట్లు చూపుడు.
15. బాల్టికు రాష్ట్రములను గూర్చి వ్రాయుడు.
16. ఫ్రాన్సు పంటలను గురించి వ్రాయుడు.
17. ఫ్రెంచి ప్రజల వివిధవృత్తులను గూర్చి వ్రాయుడు.
18. ఐరోపాలోని మధ్య మైదానమును గూర్చి వ్రాయుడు.
19. రైను నదిని గూర్చి వ్రాసి అది జర్మనీ కెట్లు తోడ్పడుచున్నదో తెలుపుడు. రైను నదీమండలమును పటము వ్రాసి చూపుము.
20. జర్మనులకు రైను నది అతి పవిత్ర మైనది. ఏల?

21. జర్మనీలోని వృత్తులను గూర్చి తెలుపునది.
22. జర్మనీలోని పారిశ్రామికాభివృద్ధికి అందలి ఖనిజములే కారణము అని నిరూపింపుడు.
23. జర్మనీలోని రవాణా సదుపాయములను గూర్చి వ్రాయుడు.
24. రష్యా మైదానమును గూర్చి వ్రాయుడు.
25. రష్యాలోని నదులను గురించి వ్రాయునది.
26. రష్యా నైసర్గికమును వివరింపుడు.
27. రష్యాలోని వివిధ పంటలను గురించి వ్రాయుడు.
28. రష్యా పారిశ్రామికముగా చాల వృద్ధిలోనికి వచ్చుచుండుటకు కారణ మేమి ?
29. స్విట్జర్లండు సహజ సౌందర్యమునకు నిలయమని చూపుడు..
30. హంగరీ వ్యవసాయమున కెక్కువ అనుకూలమని చూపుడు.
31. జెకోస్లోవేకియా యొక్క పరిశ్రమలను గూర్చి వ్రాయుడు.
32. రుమేనియాను గురించి వ్రాయుడు.
33. ఐబీరియాద్వీపకల్పము మధ్యధరామండలములోనిదని రుజువు చేయుడు.
34. ఇటలీలోని ప్రజలను; పంటలను గూర్చి వ్రాయుడు.
35. ఇటలీదేశమును ఇండియాతో పోల్చుడు..
36. ఇటలీలోని పరిశ్రమలను వివరింపుడు.
37. గ్రీసు దేశమును గూర్చి వ్రాయుడు.
38. బ్రిటిషు దీవుల నైసర్గిక స్వరూపమును వివరింపుడు.
39. బ్రిటిషు దీవులలోని నదులు చిన్నవైనను ఉపయోగకరమైన వని నిరూపింపుడు.
40. బ్రిటిషు దీవులు ఒకప్పుడు ఐరోపాతో చేరి యుండవచ్చునని ఎట్లు చెప్పగలవు ?

41. బ్రిటిషు దీవులలోని ప్రజలు ఘంచి నావికు లగుటకు కారణము లను చూపుడు.
42. బ్రిటనులోని వ్యవసాయమునుగూర్చి వ్రాయుడు.
43. బ్రిటిషు దీవులలోని వర్షపాతము, సహజ వృక్షజాలములను గూర్చి తెలుపుడు.
44. బ్రిటిషు దీవులలోని ప్రజల జీవితమును గురించి వ్రాయుడు.
45. బ్రిటిషు దీవుల వర్తకమును గూర్చి వ్రాయునది.
46. బ్రిటిషు దీవులలోని పశుపోషణ, వ్యవసాయము గూర్చి వ్రాయుడు.
47. బ్రిటిషు దీవులలో జెస్తవృత్తి ఒక ముఖ్య వృత్తి అని చూపుడు.
48. బ్రిటిషు దీవులలోని ఖనిజ సంపదను వివరింపుడు.
49. బ్రిటిషు దీవులు ప్రపంచములోకెల్ల పరిశ్రమలలో అగ్ర గాము లని నిరూపింపుడు.
50. బ్రిటిషు దీవులలోని రవాణా సదుపాయములను గూర్చి వ్రాయుడు.
51. బ్రిటిషు దీవులను జపానుతో పోల్చుము.

రెండవ భాగము

# ప్రపంచ సమీక్ష

## 1. మానవుడు-భౌతిక పరిసరములు

ప్రపంచములో వేర్వేరు చోట్ల మానవులు జీవించుచున్నారు. వీరి జీవిత విధానమునందు భేదములు కనబడుచున్నవి. మానవుని జీవితము అతని పరిసరములపై ఆధారపడి యుండును దీనికి భౌగోళికాధికారము అని పేరు.

ఒక ప్రదేశము యొక్క నైసర్గిక స్వరూపము, శీతోష్ణ స్థితులపై వృక్షజాలము జంతుజాలము ఆధారపడి యుండును. అధిక వర్షపాతముగల ప్రాంతముల అరణ్యములు పెరుగును. అందు ఘాతుక మృగములు జీవించును. వర్షపాతము తక్కువగా గల ప్రదేశముల గడ్డిభూము లుండును. అట్టిచో గడ్డిపై జీవించు ఆవులు, మేకలు, గొర్రెలు మొదలగు జంతువులు జీవించును. వర్షపాతములేని ఎడారులలో ఒంటెలు నివసించును.

పై నైసర్గికము, శీతోష్ణస్థితి, వృక్షజాలము, జంతుజాలము మానవుని జీవితముపై తమ ప్రభావమును కలిగియుండును.

మిక్కిలి ఎత్తగు పర్వతాగ్రములు మంచుతో కప్పబడి యుండును. అచట వృక్షజాలముగాని మానవుడుగాని జీవింపజాలడు. ఈ పర్వతముల లోయలలో కొద్దిమంది నివసించినను వారు అనాగరికులై యుందురు. వారుండు ప్రదేశముల పర్వతములు రాకపోకల కాటంకము కలిగించుటచేత యిట్టి ప్రదేశ

ముల మానవులతో రాకపోకలుండవు. ఇచట ఆహారము కూడ అరుదుగ దొరకును. కనుక మానవ జీవితము ఆహార సంపాదన తోనే తీరిపోవును. పర్వత ప్రదేశములు సాధారణముగా అడవులతో నిండియుండును.

ఎత్తైన సమప్రదేశములను పీఠభూము లందురు. ఇవి తరుచు రాతిమయమై యుండును. టిబెట్, దక్కను, మధ్య ఆఫ్రికా, పెరూ, ఆరిజోనా పీఠభూము లిట్టివి. ఇచటి జనులు ఖనిజములు త్రవ్వియు, పశుపాలనమువలనను, శిల్పము, చేతి పనుల వలనను జీవనోపాధిని సంపాదించెదరు. కనుక పీఠ భూములలోని వారు కష్ట జీవులు.

ఎత్తు తక్కువగల సమ ప్రదేశములను మైదానము లందురు. కొన్ని మైదానములు నదులు తెచ్చిన ఒండలిమట్టి వలన ఏర్పడును. ఉత్తరఅమెరికా మధ్య మైదానము సముద్రపు అడుగు భాగము పైకి లేచుటవలన ఏర్పడినది. మైదాన ప్రదేశములు సారవంతమైన వగుటచేత అచట వ్యవసాయము ముఖ్యవృత్తి. ఆహార సంపాదనకు మానవుడు అధికముగా కష్ట పడ నక్కరలేదు. కనుక ఆ కాలమును లలితకళల నభ్యసించుట యందును, విద్యల నేర్చుకొనుట యందును వినియోగ పరచు కొన గలరు. కనుక అచటి జనులు ధనికులు, విద్యావంతులు, సుకుమారులు, నాగరికులుగ నుందురు. కావలసినంత ఆహారము మైదానములలో దొరుకుటచే జనసంఖ్య అధికముగా నుండును.

మైదానముల రాకపోకల అనుకూలములు ఎక్కువ. అందుచే అనేక పట్టణములు, పల్లెలు పర్పడును.

సముద్ర తీరమున నున్నవారికి చేపలవేట ముఖ్యవృత్తి. సముద్రముతో పరిచయము కలిగి అట్టి ప్రదేశములవారు మంచి నావికు లయ్యెదరు. సముద్రము చీలియున్న ప్రదేశములలో చక్కని రేవు లేర్పడి వర్తకమున కనుకూలముగ నుండును.

ఖండము లోభాగమున కల జలరాసులు కూడ మానవ జీవితముపై తమ ప్రభావమును చూపును. పెద్ద సరస్సులు, నదులు పడవల రాకపోకలకు, చేపలు పట్టుటకు అనుకూలముగ నుండును. ప్రపంచములోని నదీ మైదానములు ప్రాచీన నాగరికతకు పేరొందినవి.

పై విషయములను బట్టి ప్రదేశము యొక్క నైసర్గికము మానవ జీవితముపై ఎక్కువ ప్రభావము కలిగి యున్నదని స్పష్టమగు చున్నది.

## శీతోష్ణస్థితియొక్క ప్రభావము

వేడి, చలి, వర్షము యొక్క భేదములను బట్టి మానవుల ఆహారము, నివసించుఇండ్లు, ధరించుదుస్తులు, ఆరోగ్యము, బలము, రాకపోకల విధానము మారుచుండును. ఎడారులలో వేడిమి అధిక మగుటచేతను, ఆహారము లభింపకుండుటచేతను జనసంఖ్య చాల తక్కువ. ఒయాసిస్సులవద్ద నుండువారు ఖర్జూరము, ఒంటెపాలు, మాంసము తిని జీవింతురు. వదులగు నీలి దుస్తుల

ధరింతురు. పగలు వేడినుండి, రాత్రి చలినుండి కాపాడుకొనుటకు మిద్దెటిండ్లలో నివసింతురు. ఇచట నీరు దొరకుట కష్టము. కనుక తరచు స్నానము చేయరు.

అధిక వర్షపాతము కల నాడీమండలారణ్యములు కూడ జననివాసములు కాలేదు. అడవులలో నివసించు పిగ్మీలు మొదలగు అనాగరిక జాతులకు ఒంటినిండ బట్ట అక్కరలేదు.

అతిశీతల ప్రదేశములవారు మాంసము, చేపలు తిని జీవింతురు. చలినుండి రక్షించుకొనుటకు ఉన్నితోకూడిన చర్మములు ధరింతురు. వేసవిని తోలు డేరాలలోను, శీతకాలమున గాలి చొరని మంచుటిండ్లలోను నివసింతురు. వారి రాకపోకల విధానములలోకూడ వ్యత్యాసమున్నది. తమ స్లెడ్జి అను చక్రములు లేని బండ్లను మంచుపై జంతువులచే లాగింతురు.

## వృక్షముల ప్రభావము

సహజ వృక్షజాలము మానవునిపై యెట్టి ప్రభావమును కలిగి యున్నది ప్రత్యేకముగా ముందు పాఠమున చదువగలరు.

## జంతువుల ప్రభావము

జంతువులుకూడ మానవ జీవితముపై తమ ప్రభావమును చూపుచున్నవి. అరణ్యప్రదేశములలో ఘాతుక మృగములనుండి రక్షించుకొనుటకును, ఆహారమును సంపాదించుకొనుటకును మానవులు వేట జీవనులుగ నున్నారు. మైదానములందు మాన

వుడు ఆవు, ఎద్దు, గేదె, గుఱ్ఱము మొదలగు జంతువులను, తన వ్యవసాయపు పనులకును, రాకపోకలకును ఉపయోగించు కొనుచున్నాడు. పాలు, మాంసము, ఉన్ని, తోళ్ళు మొదలగు వానికొఱకై పశువులను పెంచుచున్నాడు. శృంగాకారా రణ్యములలోని వారు ఉన్ని గల జంతువుల వేటాడి జీవించు చున్నారు. మంచు ఎడారులలోని ఎస్కిమోలు, లాప్పుల జీవి తము వారు మేపు రెయిండీరు మందలపై ఆధారపడి యున్నది.

ఈ విధముగా మానవుడు తాను నివసించు ప్రదేశము యొక్క భౌగోళికాధికారమును కలిగియున్నాడు.

---

# 2. మానవుని జీవిత విధానములు

మానవుడు జీవించుటకు ఆహారము కావలెను. దానిని సంపాదించుట కతడు వివిధ వృత్తుల నవలంబించుచున్నాడు.

1. వేట : అరణ్యవాసులు ఆకలముల పరుకొని తినియు మృగముల వేటాడి వాని మాంసము తినియు జీవించుచున్నారు. సముద్రతీరములను, నదీతీరములందును కలవారు కొందరు చేప లను పట్టి బెస్తవృత్తి వలన జీవించు చున్నారు. అమెరికాలోని న్యూఫౌండ్ లాండ్, బ్రిటిషుకొలంబియా, జపాను ఉత్తరతీరము, బ్రిటిషు దీవుల సమీపమందలి డాగర్ బ్యాంక్సు ప్రపంచములోని చేపల వేటకు ప్రధాన స్థానములు.

కలప నరకుట : శృంగాకారారణ్యములలోను, బర్మా, సయాం, ఇండియాలో పడమటి కనుమలపైనను కలప నరకి చాలమంది జీవించుచున్నారు. దీనినుండి కఱ్ఱసామానులు చేయుట, కాగితపుగుజ్జు, కాగితము, అగ్గిపెట్టెలు, ఆటవస్తువులు, సంగీతపు పెట్టెలు చేయుట మొదలగు ఎన్నో ఉప వృత్తులు బయలుదేరినవి.

పశుపాలన : వర్షపాతము ఎక్కువగాగల గడ్డిభూములలో పశుపాలన ముఖ్యవృత్తి. హాలెండు, డెన్మార్కు, స్విట్జర్లాండు, సెంటులారెన్సు నదీమైదానము, ఆస్ట్రేలియాలో ముఱ్ఱేడార్లింగు నదీమైదానము, న్యూజీలాండ్ లలో పాడిపరిశ్రమ వృద్ధిపొందినది. మాంసముకొఱకుకూడ పశువులు పెంచబడుచున్నవి. ఉన్ని కొరకు ప్రపంచములోని పీఠభూములలోను, ఎడారి అంచుల లోను గొఱ్ఱెలు మేపబడుచున్నవి.

వ్యవసాయము: ఫలవంతమైనమైదానములలో ప్రపంచమందంతటను వ్యవసాయము ముఖ్యవృత్తిగా నున్నది. వ్యవసాయపు ప్రదేశములు అధిక జనసంఖ్య కలవై యున్నవి. యూరపు, అమెరికా, ఆస్ట్రేలియాలలో వ్యవసాయపు పనులకు యంత్రము లుపయోగింపబడుచున్నవి. ఇండియా, చైనాలు వ్యవసాయ దేశములలో ప్రధానమైనవి.

గనులు త్రవ్వుట : ఇది యంత్రయుగము. నేటి మానవుడు వివిధ ఖనిజములను, వాని ఉపయోగములను కనుగొనెను. కనుక ప్రపంచములో చాల ప్రదేశములందు గనులు త్రవ్వబడు

చున్నవి. పారిశ్రామిక ప్రదేశములైన అమెరికా, ఐరోపా, బ్రిటిషు దీవులలోనివారు ఈ వృత్తిని ఎక్కువగా సాగించుచున్నారు.

పరిశ్రమలు : పరిశ్రమలు వృద్ధిపొందిన ప్రతిదేశములోను లక్షలకొలది జనులు కర్మాగారములలో పనిచేసి జీవనోపాధిని సంపాదించుకొనుచున్నారు. మరికొందరు కుటీర పరిశ్రమలు సాగించి బ్రతుకుచున్నారు.

---

## 3. మానవ జాతులు - ప్రజా వితరణము

ప్రపంచములో అన్ని ప్రదేశములలోను కొలదిగనో గొప్పగనో జనులు నివసించుచున్నారు. శీతోష్ణాది భేదములను బట్టి మానవుల రంగులో భేదములు కనబడుచున్నవి. శీతల దేశములవారు తెల్లగను, వేడిదేశములవారు నల్లగను నుండురు. అంతేకాదు. మానవుల తలయొక్కయు, ముఖము యొక్కయు ఆకారము, పరిమాణములలో కూడ వ్యత్యాస మున్నది. వారి జుట్టులో కూడ అట్టి తేడాను గమనింప వచ్చును. పటములోని వివిధ జాతులను పరికింపుము. ఈ భేదములను బట్టి ప్రపంచములోని మానవకోటిని 1. కకేషియనులు, 2. మంగోలియనులు, 3. నీగ్రోలు అను మూడు ముఖ్య జాతులుగ విభజించిరి.

ఇండియా, పర్షియా, యూరప్, ఉత్తర అమెరికా, ఆస్ట్రేలియాలలో కకేషియన్ జాతివా రెక్కువగ నున్నారు.


























మానవ జాతులు

1. క్రోమెగ్నార్డు; 2, 3. అస్ట్రిలాయిడులు; 4. 5, 6. నీగ్రోలు; 7, 8, 9. కాకేషియనులు: 10, 11, 12. మంగోలియనులు.

యూదులు, అరబ్బులు, సిరియనులు, ఈజిప్షియనులు, ఉత్తర ఆఫ్రికాలోని బాంటూ, బెదూవియన్ తెగలవారు ఈ జాతివారే.

చైనా, జపాను, కొరియా, ఇండోచైనా, బర్మా, మంగోలియా, తురుష్కస్థానము, ఆర్కిటిక్ తీరమున మంగోలియా జాతివారున్నారు.

ఆఫ్రికాలో సహారానుండి కేప్ అగ్రము వరకు నీగ్రోలున్నారు. అండమాను ద్వీపములోని వారును, అమెరికాకు పూర్వము బానిసలుగా గొనిపోబడి యిపుడు వృద్ధిపొందిన వారును నీగ్రోలే.

పై జాతులేగాక ఆస్ట్రేలియా, న్యూగినీలలో ఆస్ట్రిలాయిడు లున్నారు. మలయాలోని ఆదిమ నివాసులు మంగోలియావారిని కొంతవరకు పోలియుందురు. అమెరికాలోని రెడ్ యిండియనులు మరొక జాతికి చెందియున్నారు.

ఫలవంతమగు ఋతుపవన ప్రదేశములలో ప్రపంచములోని జనాభాలో సగముకంటె ఎక్కువమంది నివసించుచున్నారు. యూరపు అమెరికాలలోని పారిశ్రామిక ప్రదేశములు కూడ ఎక్కువమందిని ఆకర్షించినవి. ఎడారులలోను, అరణ్యములలోను జనసంఖ్య చాల తక్కువగ నుండును. అటకామా ఎడారి మాత్రము లవణములు త్రవ్వబడుటచేత జనసాంద్రత కలిగి యున్నది.

1950 లో ఖండముల జనసంఖ్య మిలియనులలో:

1. ఆఫ్రికా 199
2. అమెరికా 328
3. ఆసియా 1272 (ఆసియాలో U. S. S. R కాక)
4. యూరపు 594 (ఆసియాలోని U. S. S. R. తో సహా)
5. ఆస్ట్రేలియా 13 (మహాసముద్రములలోని ద్వీపములతో సహా)

---

# 4. ప్రపంచమునందలి ప్రకృతిసిద్ధ మండలములు

ప్రపంచములో అంతటను శీతోష్ణస్థితి, వర్షపాతము లొకే విధముగ లేవు. అందుకు కారణములు భౌతికభూగోళమున నేర్చుకొని యున్నాము. శీతోష్ణస్థితి వర్షపాతములను బట్టి వృక్షజాలము మారుచుండును. ఒకేరకపు సహజ వృక్షజాలమును కలిగియున్న ప్రాంతమును ప్రకృతిసిద్ధ మండలము అందురు.

శీతోష్ణస్థితినిబట్టి ప్రపంచమును (1) అత్యుష్ణ ప్రదేశములు (2) వెచ్చని సమశీతల మండలములు (3) చల్లని సమశీతల మండలములు (4) అతిశీతల భాగములు అను నాల్గు ముఖ్య భాగములుగ విభజింప వచ్చును. పటమున వానిని చూడుడు.




సమోష్ణరేఖలు - ఉష్ణమండలములు

సమోష్ణరేఖలు - ఉష్ణమండలములు




ప్రపంచము

1, 2, 6, 7. అత్యుష్ణ ప్రదేశములు;  3, 4, 5. వెచ్చని సమశీతల మండలములు;  8, 9. చల్లని సమశీతల ప్రదేశములు;  10, 11. అతిశీతల భాగములు.

ప్రకృతిసిద్ధమండలములు



ఉత్తరార్ధ గోళములో నాడీరేఖనుండి ఉత్తర ధ్రువము వరకుగల ప్రకృతిసిద్ధమండలములు పైన చూపబడెను. దక్షిణార్ధ గోళమందలి మండలములు కూడ ఇదే క్రమములో నుండును. శృంగాకారారణ్యములలో మాత్రము మార్పుండును.

---

# 5. అరణ్య ప్రదేశములు

ప్రపంచములోని అడవులను నాల్గు రకములుగ విభజింప వచ్చును. అవి 1. నాడీరేఖా మండలపు అడవులు, 2. ఋతు పవన అరణ్యములు, 3. సమశీతోష్ణ మండలపు ఆకురాల్చు అడవులు, 4. శీతల ప్రదేశమందలి శృంగాకారారణ్యములు.

## 1. నాడీరేఖా మండలపు అడవులు

భూమధ్యరేఖకు ఉత్తర, దక్షిణముల 5 డిగ్రీల వరకు సుమారు 600 మైళ్ళు వెడల్పున భూగోళము చుట్టును ఈ మండలము అమరియున్నది. దక్షిణ అమెరికాలోని అమెజాన్ నదీ మైదానము, మధ్య ఆఫ్రికాలోని కాంగో మైదానము, ఆసియాకు ఆగ్నేయమున నున్న ద్వీపసమూహము, వాని నంటియున్న ఖండభాగములు ఇట్టి అడవులుగల ప్రదేశములు. కొన్ని ప్రదేశములలో 10 డిగ్రీల వరకు కూడ ఈ ప్రదేశముల లక్షణములు చూపట్టుచున్నవి.



సూచికారణ్యములు.
వెడల్పు ఆకుల అరణ్యములు
ఉష్ణమండలపుసాంద్రారణ్యములు
150 120 90 60 30 0 30 60 90 120 150 160
60 30 0 30


అరణ్యములు

ఈ ప్రాంతముల జ్ఞాపక ముంచుకొన తగినది 80 డిగ్రీల వేడిమి. 80 అంగుళముల వర్షము. వేడిమి, వర్షము ఎక్కువగా నుండుటచే వృక్షజాలము ఏపుగా పెరుగును. క్రింది భాగముల సూర్యరశ్మి తగులక చీకటిగ నుండును. ఇవి సతత హరితారణ్యములు. ఈ అడవులలో గట్టికఱ్ఱ గల టేకు, మహోగని, తాళ వృక్షములు, రబ్బరు, సింకోనాచెట్లు ముఖ్యమైనవి. ఈ అడవులలో జంతుజాలము వృక్షాగ్రములనే నివసించును. ఇందలి అరణ్యవాసులు కాయ కసరుల నేరుకొనియు, వేటాడియు జీవించుచున్నారు. ఈ అడవు లంత ఉపయోగ పడుటలేదు.

## 2. ఋతుపవన మండలారణ్యములు

ఆసియా ఖండపు ఆగ్నేయ భాగమున వేసవిని నైరృతి ఋతుపవనముల వలన వర్షించును. వర్షపాతము యొక్క హెచ్చు తగ్గులనుబట్టి ఋతుపవన ప్రదేశములను నాల్గు ఉప మండలములుగ విభజింప వచ్చును. అవి




80 అం. ల వర్షపాతముగల సతత హరితారణ్యములు.
70 ,, వర్షముగల ఆకురాల్చుచెట్ల అరణ్యములు.

40 అం. ల. వర్షముగల సవానా గడ్డి భూములు.

20 ,, వర్షముగల తుప్పలు పెరుగు ప్రదేశములు.

ఋతుపవన మండలారణ్యములు అంత ఒత్తుగా నుండవు. వీనిని సులభముగ ఛేదించి పంట భూములుగా మార్చవచ్చును. టేకు, నల్లమద్ది, విరుగుడు చావ, చందనము, వెదురు మొదలగు మిక్కిలి ఉపయోగకరమగు కలప జాతు లిందు గలవు. ఇచటి పంటభూములలో ఉష్ణమండలపు పంటలన్నియు పండించ వచ్చును. కనుకనే యీ భాగములు జనసమ్మర్దముగలిగి యున్నవి.

## 3. సమశీతోష్ణ మండలపు ఆకురాల్చు చెట్ల అరణ్యములు

ఈ అరణ్యములు అంత దట్టముగా నుండవు. వీని ఆకులు వెడల్పుగ నుండుటచేత వీనిని వెడల్పు ఆకుల అరణ్యములు అని కూడ పిలిచెదరు. ఈ ప్రాంతముల శీతకాలమున ఈ చెట్లు ఆకులురాల్చి మోడులై నిలచును. ఈ అరణ్యములు రెండు రకములు. 1. ఖండములో సముద్రమునకు సమీపముగాగాని, ఎక్కువ తేమగల ప్రాంతములగాని ఉండునవి. ఇట్టివి బ్రిటిషు ద్వీపములలోను, పశ్చిమ ఐరోపా, కెనడాలోని బ్రిటిషు కొలంబియా, న్యూజిలాండు, టాస్మేనియాలలో నున్నవి. 2. ఖండములకు తూర్పు భాగమునను, దక్షిణ అమెరికా లోని దక్షిణ చిలీ తీరమునను, తూర్పు కెనడాలోను, సంయుక్త

రాష్ట్రముల ఈశాన్య భాగమునను, జపాను, ఆస్ట్రేలియా ఆగ్నేయ తీరమునను ఉన్నవి. ఇట్టి అడవులలో పెరుగు ముఖ్య జాతులు ఓక్, ఎల్మ్, బీచ్, బర్చి, ఆపిల్ మొదలగునవి. ఈ ప్రాంతము లిపుడు పంటభూములుగను పశువులు మేపుకొను గడ్డి భూములుగను మార్చబడినవి.

## 4. శీతల ప్రదేశపు శృంగాకారారణ్యములు

ఇవి ఉత్తరార్ధ గోళములో చల్లని సమశీతల మండల మున తూర్పునుండి పడమరవరకును. ఉత్తరఅమెరికా, యూరపు ఆసియాల ఉత్తర భాగమున భూగోళము చుట్టును వ్యాపించి యున్నవి. శీతకాలమున పడు ముద్దమంచుకు ఆకులు చెడి పోకుండ మంచు జారిపోవుటకు వీలగునట్లు వీని ఆకులు సన్నము గను పొడవుగను ఉండును. ఇట్లుండుటచేత వృక్షములోని తేమ కూడ త్వరగా ఆవిరై పోదు. ఫర్, పైన్, లార్చి మొదలగు ఈ జాతిచెట్లు మెత్తని కఱ్ఱగలవి. వీనిని నరుకుట సులభము.

మధ్య ఐరోపాలో జర్మనీ, స్విట్జర్లాండ్‌లలోని ఎత్తగు పర్వతముల పైనను, కార్పేథియన్‌ల పైనను మన దేశ ములో హిమాలయముల పైనను, ఈ జాతిచెట్లు పెరుగు చున్నవి. కెనడాలో ఈ కలప నరకు పరిశ్రమ ఎక్కువగా వృద్ధి పొందినది. ఈ అడవులలో ఉన్నిగల జంతువుల వేటాడి వాని చర్మములు అమ్మి కొందరు జీవించుచున్నారు.

## మధ్యధరా సముద్ర శీతోష్ణ భూములు

మధ్యధరా సముద్రప్రాంతముల శీతకాలమున వర్షించి, వేసవిని ఒరపుగ నుండును. ఈ శీతోష్ణస్థితిలోని వృక్షజాలము ప్రత్యేకత కలిగి యున్నది. ఇవి సతత హరితములు. చెస్ట్‌నట్ కార్క్, ఓక్ ఇచటి జాతులు. నిమ్మ, నారింజ, ద్రాక్ష, పీచ్, పియర్, యాపిల్, ఆలివ్, అత్తి, బాదము, మల్బరీ మొదలగు చిన్నజాతిచెట్లు ఇచట అధికము. వేసవి వేడిమి పండ్లు పండుటకు అనుకూలముగ నున్నది. ఇట్టి శీతోష్ణస్థితి మధ్యధరా సముద్రమునానుకొని యున్న ప్రాంతములనేగాక ఉత్తర అమెరికాలోని కాలిఫోర్నియా, దక్షిణ అమెరికాలోని మధ్యచిలీ, దక్షిణ ఆఫ్రికాలోని కేప్ రాష్ట్రము. పడమటి ఆస్ట్రేలియా యొక్క నైరృతిభాగము, దక్షిణ ఆస్ట్రేలియా, విక్టోరియా రాష్ట్రపు కొంతభాగములో కూడ ఉన్నది.

---

# 6. గడ్డిభూములు

వర్షపాతము తక్కువగాగల ప్రదేశములు గడ్డిభూములుగానున్నవి. అవి (1) ఉష్ణమండలపు గడ్డిభూములు, (2) సమశీతోష్ణమండలపు గడ్డిభూములు అని రెండు రకములు.

1. ఉష్ణమండలపు గడ్డిభూములు : ఆఫ్రికాలోను, దక్షిణ అమెరికాలోను ఈ గడ్డిభూములు ఉష్ణమండలారణ్యములకు


ఉష్ణమండలపు గడ్డి బీడులు
సమశీతోష్ణ మండలపు గడ్డి-భూములు
పా- పాడిపశువులు
ప- మాంసపు పశువులు
గొ- గొఱ్ఱెలు
గడ్డి భూములు.

ఉత్తరముననుకూడ చాల దూరమువరకు విస్తరించి యున్నవి. ఇందలి గడ్డి ఆరు అడుగుల ఎత్తువరకును పెరుగును. కనుక వర్షాకాలమున ఈగడ్డిభూములలో త్రోవ కనుగొనుట కష్టము. స్వల్పకాలపు వర్షములు వెనుకబడగనే యీ గడ్డి యెండి నేల బోడిగ నుండును. త్వరలో ముదిరెడి ఈ గడ్డి విత్తనములు నేలపై జారి మరల వర్షాకాలమున కెదురుచూచుచుండును.



సవానాలోని జంతుజాలము

దక్షిణ అమెరికాలో వీనిని లానాస్, కాంపోస్ అనియు, ఆఫ్రికాలో సవానాలు అనియు పిలిచెదరు. ఆస్ట్రేలియా ఉష్ణమండలారణ్యముల అంచులందుకూడ యిట్టి గడ్డిభూము లున్నవి.

ఈ గడ్డిబీడులలో ఆవులు, గుఱ్ఱములు, లేడి, దుప్పి, జిరాఫీ, చారల జీబ్రా మొదలగు ఆకలముల తిను జంతువులును,

పై జంతువులపై జీవించు సింహాము, పులి మొదలగు క్రూర మృగములును జీవించును.

2. సమశీతోష్ణ మండలపు గడ్డినేలలు: మధ్య కెనడా, అమెరికాలలో వీనివి ప్రయరీలనియు, దక్షిణ రష్యా, సైబీరియాలలో స్టెప్పీలనియు, ఆస్ట్రేలియాయందు డౌన్సు (downs) అనియు, దక్షిణ అమెరికాయందు పాంపాలు అనియు, దక్షిణ ఆఫ్రికాలో వెల్డు అనియు పిలుచుచున్నారు.

ఈ గడ్డిభూములలోని గడ్డి కురుచగ నుండును. ఈ బయళ్లలో గాళుపులు విపరీత వేగము, బలముతో వీచును. కనుచూపు మేర ఎచటను ఒక్క చెట్టయినను కనబడదు. ఇవి పశుపాలనకు తగి యున్నవి. ఇపుడు ఈ గడ్డిభూములు చాలమట్టుకు గోధుమ భూములుగా మారినవి. ఆఫ్రికాలోని వెల్డునందును, ఆస్ట్రేలియాలోని డౌన్సునందును గొఱ్ఱెలు విశేషముగా మేపబడుచున్నవి. ఉత్తర అమెరికాలో ప్రయరీలకు పడమటిభాగములో మాంసము కొఱకు పశువులు మేపబడుచున్నవి.

---

# 7. ఎడారులు

వర్షపాతము మిక్కిలి తక్కువగాగాని, బొత్తిగా లేక గాని యుండు ప్రదేశములలోను, 50 డిగ్రీలకు తక్కువ ఉష్ణముండు ధ్రువ చక్రములలోని మంచు భూములలోను చెట్టు


ప్రపంచములోని ఎడారులు.
ఉష్ణమండలపు ఎడారులు
సమశీతోష్ణ మండలపు-ఎడారులు.
మంచు భూములు.
1
2
3
4
5
6
7
8
9
10
11

చేమలు వృద్ధి పొందలేవు. ఇట్టి ప్రదేశములను ఎడారు లందురు. ప్రపంచములో 1. ఉష్ణమండలపు ఎడారులు, 2. సమశీతోష్ణ మండలపు ఎడారులు, 3. మంచు భూములు అను మూడు రకములైన ఎడారిప్రదేశము లున్నవి.

1. ఉష్ణమండలపు ఎడారులు : కర్కాట, మకర రేఖలకు సమీపమున ధ్రువముల వైపున ఈ ఎడారులు వ్యాపించి యుండుట పటమున గమనింపుము. ఆఫ్రికా యందలి సహారా, కల్హారి ఎడారులును, ఆసియా యందలి అరేబియా ఎడారి, ఇరాను, థార్ ఎడారులును, పడమటి ఆస్ట్రేలియాలోని ఎడారి, దక్షిణ అమెరికా యందలి అటకామా ఎడారి, ఉ. అమెరికా యందలి మెక్సికో, కొలరేడో ప్రాంతములు ఇట్టి ఎడారులు.

ఈ ఎడారులలో పగలు భరింపరాని వేడిమి రాత్రి విపరీత మగు చలి ఉండును. చెట్టుచేమ లుండవు. అచ్చటచ్చట నీటి ఊటలుగల తావులందు మాత్రము ఖర్జూరపుచెట్లు పెరుగును. ఇట్టి నీటిపట్టులకు ఒయాసిస్సు లని పేరు. ఒయాసిస్సులవద్ద మాత్రము కొలదిగా జనులు నివసింతురు. ఎడారి అంచులలో గొఱ్ఱెలు, గాడిదలు, గుఱ్ఱములు మేపబడును. ఒంటె ఈప్రదేశ ముల నివసించుటకు తగిన జంతువు. అటకామా ఎడారిలో పెట్లుప్పు త్రవ్వబడు చున్నది.

1. సమశీతల మండలపు ఎడారులు : మధ్య ఆసియా అంతయు ఖండాంతర శీతోష్ణస్థితిగల వర్షశూన్య ప్రదేశము. సముద్రమునకు దూరముగా నుండుటచే వర్షవాయువు లిచటికి

చేరవు. ఈ ప్రదేశముల గొఱ్ఱెలు ఒంటెలు మేపబడుచున్నవి. ఇచట ఒంటెలకు రెండు మూపురములుండును. ఉత్తర అమెరికాలో గ్రేట్ బేసిన్, దక్షిణ అమెరికాలోని పెటగోనియా ఎడారి అంత నిరూపయోగమైనవి కావు. ఇచట గొఱ్ఱెలు మేపబడుచున్నవి.

3. మంచు ఎడారులు : ఆర్కిటిక్ మహాసముద్రతీరము నంటిపెట్టుకొని వందలకొలది మైళ్ళవరకు వ్యాపించియున్న ప్రదేశములు మంచుతో కప్పబడియుండును. వీనిని టండ్రా లందురు. ఉత్తర అమెరికా, ఐరోపా, ఆసియాఖండముల ఉత్తర భాగము లిట్టినేలలుగా నున్నవి.

ఇచట నాచుతప్ప మరేమియు బయలుదేరదు. దట్టమయిన ఉన్నిగల కస్తూరియెద్దు, కారిబో, రెయిండీరు, చెవుల పిల్లులు, చిట్టెలుకలు, ఎలుగుగొడ్లు, తోడేళ్ళు, నక్కలు మొదలగు జంతువు లిచట నివసించును. సముద్రములలో సీలు వాల్రస్ తిమింగిలము, కొన్ని రకముల చేపలు, పక్షులు ఉన్నవి.

కెనడాలోని టండ్రాలలో ఎస్కిమోలు, యూరపులో లాప్‌లు, ఆసియా మంచుభూములలో సెమోయిడ్లు మొదలగు జాతుల వారు నివసించుచున్నారు. వీరు పై జంతువుల వేటాడియు, రెయిండీరు మందల మేపియు జీవింతురు. వీరి మందలు వీరికి, మాంసము, పాలు యిచ్చును.

---

# 8. ఆహారపుపంటలు

వ్యవసాయము ప్రపంచమునందలి ప్రజల ముఖ్యవృత్తులలో నొకటి. విత్తులనాటి పంటలను పండించుట వ్యవసాయ మన బడును. ఈ పంటలలో కొన్ని ఆహారముగ నుపయోగించును. మరికొన్ని వర్తకమున కుపయోగించును. మనుష్యులకును జంతువులకునుకూడ ఆహారము ముఖ్యావసరమగుటవలన ఆహారపు పంటలు మిక్కిలి ముఖ్యమైనవి. గోధుమ, వరి, జొన్న, రై, మొక్కజొన్నలు ఈపంటలలోనివి. ఇవిగాక మాంసము, పండ్లు, పాలుకూడ ఆహారపదార్థములే.

## గోధుమ

చిరకాలమునుండియు చల్లని ప్రదేశములలో నివసించు వారికి గోధుమ ముఖ్యాహారముగ నున్నది, అది మిక్కిలి బలకర

గోధుమ:- మిలియనుల బుషెల్సులో

| | |
|---|---|
| రష్యా | 1,110 |
| అ.సం.రా. | 978 |
| చైనా | 903 |
| కెనడా | 562 |
| ఫ్రాన్సు | 260 |
| ఇటలీ | 250 |
| ఇండియా | 232 |
| టర్కీ | 206 |
| స్పెయిన్ | 176 |
| పాకిస్థాన్ | 148 |

మగు ఆహారము. ఈగోధుమపంటకు నల్లటినేల, మితమగు వేడి, తేమ అవసరము. ఎక్కువ వేడిగాని, మంచుగాని ఉండుచోట్ల గోధుమ పండదు. మంచిరకము గోధుమలు కెనడాలోని మెనిటోబా, ఆల్బర్టాలలోను; అమెరికా సంయుక్తరాష్ట్రములలోని మినియాపోలిస్‌లోను, దక్షిణ అమెరికాలోని అర్జెంటైనా, ఉరుగ్వే, మధ్యచిలిలోను; ఆస్ట్రేలియాలోని విక్టోరియా, న్యూసౌత్‌వేల్సు లలోను దొరకును. రష్యాలో యుక్రేన్, సైబీరియాలలో నల్లభూములలో ఎక్కువ గోధుమపంట పండును. రుమేనియా, బల్గేరియా, హంగేరి, ఫ్రాన్సు, జర్మనీలలో కూడ గోధుమ పండును. కాని అది ఆయాదేశముల ప్రజలకే సరిపోవును. మనదేశమునందు పంజాబు, మధ్యప్రదేశ్, బొంబాయి, హైదరాబాదులలోకూడ గోధుమ పండును. రష్యా, అమెరికా సంయుక్తరాష్ట్రములు, కెనడా, అర్జెంటైనా, ఆస్ట్రేలియాలలో మాత్రము విదేశముల కెగుమతి చేయదగినంత పండును.

## వరి

ప్రపంచమునందలి జనసంఖ్యలో సుమారు సగముమంది వరిమీద జీవింతురు. వరిపంటకు ఎక్కువ వేడి, వర్షము, రేగడినేల అవసరము. నదితీరములలో ఒండ్రుమట్టిగల చోట్ల వరిపంట బాగుగ నగును. వరి చైనాలోని సికియాంగ్, యాంగ్‌ట్సికియాంగ్ నదితీరములందు, ఇండియాలోని బెంగాలులోను, తీరమైదానములలోను, పంజాబులోను, బాగుగ పండును.

పండును. జపాన్, కొరియా, తూర్పు ఇండియా దీవులలోని వరి పంట అక్కడి ప్రజలకే సరిపోదు. అమెరికా సంయుక్త రాష్ట్ర

వరి:- వేల టన్నులలో

| | |
|---|---|
| చైనా | 49,500 |
| ఇండియా | 35,000 |
| పాకిస్థాన్ | 13,870 |
| జపాన్ | 12,500 |
| ఇండోనేషియా | 10,850 |
| థాయ్‌లాండు | 7,250 |
| మలయా | 7,140 |
| ఇండో చైనా | 6,250 |
| బర్మా | 5,900 |
| బ్రెజిల్ | 3300 |

ములు, మధ్య అమెరికా, బ్రెజీల్. ఈజిప్టు,గయానాలలో తయారగు వరిపంట ఇతరదేశముల ఎగుమతి చేయబడును.

## రై

ఇది గోధుమ తరువాత ముఖ్యమైనధాన్యము. ఈపంటకు తడితోకూడిన సామాన్యమగు సారముగల భూమి చాలును. ఈ పంట బెల్జియం, జర్మనీ, పోలండు, రష్యా, అర్జెంటైనా, కెనడా, అమెరికా సంయుక్తరాష్ట్రములలోఅగును. ప్రపంచముమొత్తము మీద 90%పంట ఐరోపాలో తయారగును కాని అక్కడనే ఉప


బార్లి
మొక్కజొన్న

యోగపడును. కెనడా, ఆర్జెంటైనా, అమెరికా సంయుక్త రాష్ట్రములలోని పంట ఎగుమతి చేయబడును.

## జొన్న

ఇది దక్షిణ అమెరికాలో పుట్టినది. దీనికి ఎక్కువ వేడియు, స్వల్ప వర్షమును కావలెను. ప్రపంచము మొత్తముమీద పండు పంటలో ⅘ వంతు అమెరికాలో అగును. ఐరోపా లోని రుమేనియా, హంగేరీ, ఇటలీ, దక్షిణ రష్యాలలోను, ఇండియా చైనాలలోను అగు పంట ఆయా దేశములలోనే ఉపయోగపడును. అమెరికా సంయుక్తరాష్ట్రములలోని పంట ఎగుమతి చేయబడును.

## మొక్కజొన్న

ఈ పంటకు ఎక్కువ వేడియు, ఎక్కువ వర్షమును కావలెను. ఇది ఋతుపవన ప్రదేశములలో బాగుగ నగును. ఈ పంట ఇండియా, చైనా, జపాన్, అమెరికా సంయుక్త రాష్ట్రములలో నగును. ఇది యెగుమతి చేయబడదు.

## మాంసము

జంతువులు పాలను, ఉన్నిని, మాంసమును ఇచ్చును. అందువలననే అవి శ్రద్ధగ పెంచబడుచున్నవి. మాంసము కొరకు జంతువులను పెంచుటకు దగ్గరలో గడ్డినేలలు ఉండవలెను. పశు వులు, మేకలు, గొర్రెలు మంచిమాంసము నిచ్చును. ఆర్జెంటైనా, ఉరుగ్వే, అమెరికా సంయుక్తరాష్ట్రములలోని మధ్యభాగములు

మాంసమునకు ప్రసిద్ధమైనవి. ఆస్ట్రేలియా, న్యూజిలాండులలో మంచి గొర్రెమాంసము లభించును.

## పాల పరిశ్రమ

మానవులకు పనికివచ్చు ఆహార పదార్థములలో పాలు కూడ ముఖ్యమైనవి. ఈపాలు యీనాడు అనేక దేశముల కెగుమతి చేయబడుచున్నవి. పాలనుండి వెన్నను, జున్నును తయారుచేసి యెగుమతి చేయుదురు. స్విట్ జర్లండునుండి గడ్డ పాలను, న్యూజిలాండునుండి పాలపొడియు ఎగుమతి చేయబడును. కెనడా, హాలండు, డెన్మార్కులు పాలపరిశ్రమకు ప్రసిద్ధ మయినవి.

## గొర్రెల పెంపకము

గొర్రెలు, మేకలు, ఒంటెలు, ఉన్నవి ఇచ్చును. న్యూజిలాండు, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, ఉరుగ్వే, ఇండియాలలో గొర్రెఉన్ని లభించును. అరేబియా, ఉత్తరాఫ్రికా, మధ్య ఆసియాలలో ఒంటెఉన్ని దొరకును.

---

# 9. రాకపోకల సాధనములు

యంత్రములు వచ్చుటతో పరిశ్రమలు త్వరితముగ నభివృద్ధి నందినవి. దీనికి ఫలితముగ ఫ్యాక్టరీలలో తయారగు వస్తువులు అమితముగ జమయైనవి. వీనిలో కొన్ని ఆయాదేశముల

లోనే ఉపయోగపడినను, చాలభాగము విదేశములకు ఎగుమతి కావలసినదే. ఏయేదేశములలో ఇవి కావలెనో ఆయాదేశములకు వీనిని తీసుకొనిపోవుట అవసరమయ్యెను. తరచుగ ఈ వస్తువులు బహు దూరదేశములకు పోవలసి వచ్చెను. ఈ వస్తువులేగాక నేటి పరిస్థితులలో అనేకమంది దూర దేశములకు పోవలసిన అవసర మేర్పడినది. అందుకు సరియైన రాకపోకల సాధనములు ముఖ్యావసరములు. ఈ సాధనములు మూడు విధములు. కొన్ని రాకపోకల మార్గములు భూమిమీదను, మరి కొన్ని సముద్రముల మీదను, ఇంకను కొన్ని ఆకాశమందును కలవు.

## రైలు మార్గములు

భూమిమీది రాకపోకల మార్గములలో రైలుమార్గములు ముఖ్యమైనవి. ఇవి బహుదూరములకు పోవుటకును, బరువైన వస్తువుల నొకచోటినుండి మరియొకచోటికి తీసికొని పోవుటకును, త్వరితముగను చౌకగను ప్రయాణము చేయుటకును సాటి లేనివి. రైల్వేలు అన్ని దేశముల యందును కలవు. ప్రపంచము మొత్తముమీద 800,000 మైళ్ళ రైలు మార్గములు కలవు. వీనిలో కొన్ని స్థానికములు. కొన్ని ఒక దేశమునుండి మరియొక దేశమునకు పోవునవి. మరికొన్ని ఒక ఖండమునుండి మరియొక ఖండమునకు పోవునవి.




ప్రపంచము - ముఖ్య విమానమార్గములు

రైలుమార్గములలో ఈ క్రిందివి ముఖ్యములు

1. ట్రాన్స్‌సైబీరియన్ రైల్వే : ఈ రైలు మార్గము ఐరోపా ఆసియాఖండముల ఉత్తర భాగమున 5800 మైళ్ళ పొడుగున వేయబడినది. ఇది పడమర బాల్టిక్ సముద్రతీరము నందున్న లెనిన్‌గ్రేడ్‌నుండి మాస్కో మీదుగా తూర్పున పసిఫిక్ తీరమునందున్న వ్లాడీ వోస్టక్ వరకును పోవును.

2. కెనేడియన్ పసిఫిక్ రైల్వే : దీని పొడుగు 3500 మైళ్ళు. ఇది కెనడాలో తూర్పు పడమరలుగా ఒక చివరనున్న వాన్‌కూవర్‌నుండి మరియొక చివరనున్న సెంటుజాన్ వరకును పోవును. ఇది అట్లాంటిక్ తీరమునుండి పసిఫిక్ తీరము వరకును పోవును.

3. కేప్ కెయిరో మార్గము : ఇది ఆఫ్రికాలో దక్షిణాగ్ర మునుండి ఉత్తరాగ్రము వరకును పోవు మార్గము. ఇందు మధ్య కొంతదూరము పడవలమీదను, కొంతదూరము భూమార్గ మునను పోవలెను. ఈ భాగములను పూర్తిగా రైలుమార్గము వేసి కలిపిన యెడల దీనిపొడవు 9000 మైళ్ళు ఉండును.

4. ఓరియంట్ ఎక్స్‌ప్రెస్ మార్గము : ఈ మార్గము ప్యారిస్‌నుండి ఇస్తంబుల్ వరకును పోవును. దీని పొడవు 2000 మైళ్ళు.

5. కెనేడియన్ నేషనల్ రైల్వే : ఈ మార్గము కెనడాలో దక్షిణమునందున్న హాలిఫాక్సునుండి ఉత్తరమునందున్న ప్రిన్స్ రూపర్ట్ వరకును పోవును.

## జల మార్గములు

ఈ ప్రపంచమునందు అనేక సముద్రములును, సరస్సులును, నదులును కలవు. ఇవికూడ రాకపోకల సాధనములుగ నుపయోగించును. నేడు ఇనుముతోను, ఉక్కుతోను నిర్మింపబడి ఆవిరిశక్తి సహాయముతో నడచు పెద్దపెద్ద ఓడలు జలమార్గము లన్నిటిమీదను తిరుగుచున్నవి. అవి వస్తువులను, మనుష్యులను ఎంత దూరదేశములకైనను తీసికొనిపోవుట కుపయోగించుచున్నవి.

## సముద్రమార్గములలో క్రిందివి ముఖ్యములు

*1.* ఉత్తర అట్లాంటిక్ మార్గము : ఇది మిక్కిలి ముఖ్యమైన మార్గము. ఈ మార్గమున దీసికొని పోబడునంత సామగ్రి మరి యేయితరమార్గముననను పోదు. ఈ మార్గము ఐరోపా పశ్చిమోత్తర ప్రాంతపు రేవులనుండి బయలుదేరి ఉత్తర అమెరికా తూర్పు తీరమునగల రేవులకు పోవును.

2. పెనామా మార్గము : ఈ మార్గము ఉత్తర దక్షిణ అమెరికాలలో అట్లాంటిక్ సముద్రతీరమందున్న ప్రాంతముల నుండి ఆఖండముల పసిఫిక్ తీరమునందుండు ప్రాంతములకు పోవుటకు ఉపయోగపడుచున్నది. అంతియకాక అమెరికా తూర్పు తీరమునుండి పసిఫిక్ మహాసముద్రము మీదుగా దూరప్రాచ్య దేశములకు పోవుటకును ఈ మార్గ ముపయోగించును.

3. సూయజ్ కాలువ మార్గము : అట్లాంటిక్ మార్గము తరువాత ఇది మిక్కిలి ముఖ్యమైనది. సూయజ్ కాలువ మధ్య

ధరా సముద్రమును, ఎర్రసముద్రము ను కలుపును. ఇది ప్రపంచము లోని కాలువలలోనెల్ల పెద్దది. ఐరోపానుండి ఇండియాను, దూరప్రాచ్య దేశములను చేరుటకు సూయజ్ కాలువ మార్గము చాల దగ్గరదారి. ఇది కొంచెం మించుమించుగ ప్రపంచ మధ్య భాగమునందుండి అనేక దేశములమీదుగ పోవును. ఐరోపాలో బయలుదేరి ఎర్రసముద్రము దాటినమీదట ఈ మార్గము రెండు శాఖ లగును. ఒకశాఖ తూర్పుగ ఆఫ్రికా తూర్పుతీరము వెంబడి పోవును. రెండవశాఖ ఇండియా, సింహాళముల మీదుగ ఆస్ట్రేలియాకు పోవును.

4. కేప్‌మార్గము : ఈమార్గము ఐరోపా పడమటితీరపు రేవులనుండి బయలుదేరి దక్షిణముగ నేగి, ఆఫ్రికా పడమటి తీరము వెంబడి గుడ్ హోప్ అగ్రమును చేరి అచ్చటినుండి ఆస్ట్రేలి యాకు పోవును.

5. దక్షిణ అమెరికా మార్గము : ఈ మార్గము ఐరోపా రేవులనుండి బయలుదేరి దక్షిణ అమెరికా తూర్పుతీరము వెంబడి పోవును.

## ఆకాశమార్గములు

ఈ రోజులలో తరచుగ విమానములలో ప్రయాణము చేయుట పాటియగుచున్నది. ఇట్లు పోవుట వలన దూరమును ప్రయాణకాలమునుకూడ తగ్గును. ఆకాశమార్గములలో నీ క్రిందివి ముఖ్యములు.

1. ఐరోపానుండి అమెరికాకు : ఈ మార్గము పశ్చిమ ఐరోపాలోని ముఖ్యకేంద్రములనుండి బయలుదేరి, ఆఫ్రికా ఉత్తరతీరము వెంబడి పోయి, బ్రెజిల్ చేరును. అక్కడనుండి అమెరికాలోని కేంద్రములకు అట్లాంటిక్ తీరము వెంబడి అనేక మార్గములున్నవి.

2. ఐరోపానుండి ఆసియాఆస్ట్రేలియాలకు : ఈ మార్గము లండనులో బయలుదేరి మార్సెయిల్స్, ఏథెన్సు, కెయిరో, కరాచీ, ఢిల్లీ, కలకత్తా, రంగూన్, సింగపూర్, సిడ్నీలమీదుగా మెల్బోర్నను చేరును.

3. ఐరోపానుండి ఆఫ్రికాకు : ఈ మార్గము ఐరోపాలోని ముఖ్యకేంద్రములలో బయలుదేరి దక్షిణ ఆఫ్రికాలోని కేప్టవునును చేరును.

4. అమెరికానుండి ఆసియాకు : ఈ మార్గము అమెరికా సంయుక్త రాష్ట్రములలోని శాన్‌ఫ్రాన్‌సిస్కోలో బయలుదేరి తూర్పు ఇండియా దీవులలోని మనిలాకు పోవును.

## అంతర్జాతీయ వాణిజ్యము

ప్రతి దేశమునను అనేకవస్తువులు తయారగును. శీతోష్ణ స్థితినిబట్టియు, భూసారమునుబట్టియు కొన్ని దేశములలో కొన్ని వస్తువులే తయారగును. అట్లే కొన్ని దేశములలో కొన్ని వస్తువు లితరదేశముల కంటె నెక్కువగ తయారగును. ప్రదేశ మును తాను తయారుచేయు వస్తువులలో చాలభాగము ఎగు

మతి చేయును. ఏదేశమైనను తాను తయారుచేయలేని వస్తువు లను ఇతరదేశములనుండి తెప్పించుకొనును. ఈవిధమున వస్తువులు ఒకదేశమునుండి మరియొక దేశమునకు పోవుచునే ఉండును. ఈ విధములగు ఎగుమతి దిగుమతులను చేయుటకు అంతర్జాతీయ వాణిజ్యమని పేరు.

## రేవులు, వాణిజ్య కేంద్రములు

ఒక దేశము ఇతర దేశములతో చేయు వర్తకము అభివృద్ధి చెందుటతో ఈ వాణిజ్యమునకు కొన్ని కేంద్రము లవసరమైనవి. ఎగుమతిదిగుమతులు ముఖ్యముగ కొన్ని రేవులద్వారా జరుగసాగినవి. ఈరేవుల ప్రాముఖ్యము రెండు అంశములపై ఆధారపడియుండును. అందు మొదటిది రేవులు వర్తకమునకై వస్తువులను తయారుచేయు ఫ్యాక్టరీలకును, పంటలను పండించు ప్రదేశములకును దగ్గరగను అందుబాటులోను ఉండుట. రెండవ అంశము ఓడరేవులు ఎక్కడనో మారుమూలలగాక ప్రధాన వాణిజ్యమార్గములయం దుండుట అట్లగుచో దేశదేశముల వర్తకులకు ఈ వస్తువులను గురించి వివరములు సులభముగ తెలిసి ఈ వస్తువులు అమ్ముడుపోవుటకు వీలగును.

### అంతర్జాతీయ వాణిజ్యమున నీక్రింది రేవులు ముఖ్యములు:

ఐరోపాలో : లండను, గ్లాస్గో, లివర్పూల్, కార్డిఫ్, మాన్ చెస్టర్, హాంబర్గు, రాటర్ డామ్, ఆంటువర్ప్, మార్సెయిల్స్.

ఉత్తర అమెరికా: బాల్టిమూర్, బోస్టన్, మాన్ట్రియల్, న్యూయార్కు, శాన్‌ఫ్రాన్‌సిస్కో, లాస్ ఏన్‌జిల్స్, సియేటిల్, పోర్టులండ్, వాన్‌కూవర్.

దక్షిణ అమెరికాలో : రియోడి జనీరో, బ్యూనస్ అయిరిస్, వాల్‌పరైజో, మాంటివీడో.

ఆసియా : కరాచీ, బొంబాయి, కొచిన్, మద్రాసు, కలకత్తా, అక్యాబ్, రంగూన్, సింగపూర్, హాంగ్‌కాంగ్, కొలంబో.

ఆస్ట్రేలియా : సిడ్నీ, మెల్‌బోరన్, ఎడిలయిడ్.

ఆఫ్రికా : కేప్‌టౌన్, డర్బాన్, అలెగ్జాండ్రియా.

---

# హెచ్. ఎస్. సి. పరీక్షా ప్రశ్నములు

## భూగోళశాస్త్రము 1944

1. ఇండియాలో అధిక జనులు పల్లెలలోనుందురు. ఇందుకు కారణ మేమో తెలిపి ఈ విషయములో ఇంగ్లండుతో పోల్చుడు.

2. మంచి రేవు పట్టణము ఏర్పడుటకు కావలసిన లక్షణము లేవి? ఉదాహరణ పూర్వకముగా వివరించునది.

3. ఈ క్రిందివానినిగూర్చి పటముతోకూడ వివరింపుడు,
(1) సమోష్ణరేఖలు. (2) పాటు, పోటు. (3) సముద్రపు వాయువులు.

4. ప్రపంచములో గొప్పనాడీమండలారణ్యములు ఎక్కడ కలవు? వ్యాపారరీత్యా వాటి విలువ ఏమి?

5. ఆసియాలో ఈ క్రిందివి ఎక్కడ హెచ్చుగా ఉత్పత్తి చేయ బడుచున్నవి? వీటికి ఎట్టి శీతోష్ణస్థితి, నేల కావలయును?
తేయాకు, రబ్బరు, వరి.

6. హైదరాబాదు రాష్ట్రపటములో శీతోష్ణస్థితిలోను, భూస్వభావము లోను భేదముకల సహజ మండలమును చూపుము. మరియు అచ్చటి ముఖ్య ఉత్పత్తులనుగూర్చి వివరింపుడు.

7. గంగామైదానమునకును, సహారా ఎడారికిని భేదములను వ్రాసి శీతోష్ణస్థితికి మానవ నాగరికత, సంస్కృతులపైకల ప్రభావమును చూపునది.

8. ఈ క్రిందివానిలో ఏ మూటికైన వాని సరియైనస్థితి, ప్రాముఖ్యతలనుగూర్చి తెలుపునది:
ఖార్టూము, సిడ్నీ, యోకహామా, మోసల్, ఖైబర్ కనుమ, యూక్రెయిన్, కాన్‌స్టాంటి నోపిల్, కిన్‌బర్గ్, న్యూకాసిల్, షికాగో.

## 1945

1. మైదానములు ఎట్లు ఏర్పడుచున్నవి ? ప్రపంచములోని కొన్ని ముఖ్య మైదానములను పేర్కొని వాటి ప్రాముఖ్యతను వివరింపుడు.

2. వర్షము సూర్యుని వెంబడించును ! ఈ విషయమును ఇండియా సందర్భములో వివరింపుడు.

3. హిమాలయ పర్వతములకు ఆసియాలోని శీతోష్ణస్థితి, జాతులు, నాగరికతలపై ఎట్టి ప్రభావము కలదు ?

4. ఆస్ట్రేలియాలోని పర్వతములు ఉత్తర దక్షిణములుగా వ్యాపించి యున్నవి. అవి తూర్పు పడమరలుగా వ్యాపించి యున్నచో కొన్ని సహజ లక్షణములలో మార్పు లుండెడివి. ఈ వాక్యమును క్లుప్తముగా వివరింపుడు.

5. ప్రపంచమందలి కొన్ని ప్రాంతములలోని ప్రజలు కేవలము పశువుల పెంపకముమీద ఆధారపడియున్నారు. ఈ ప్రదేశము లెచ్చటకలవు ? అట్లుండుటకు కారణములను వివరింపుడు.

6. దక్షిణ ఆఫ్రికా యూనియనును క్లుప్తముగా వివరింపుడు. ఏ ఏ రాష్ట్రములు దానిలో చేర్చబకయున్నవి. ఆదేశము ఇంగ్లండుకు ఎగుమతిచేయు సరకులేవి ? ఆ సరకుల విలువ యేమి ?

### లేక

ఉత్తర అమెరికా పటము గీసి క్రిందివాటిని గుర్తింపుడు.

1. వ్యవసాయమండలము - ముఖ్య ఉత్పత్తులు 2. పారిశ్రామిక ప్రదేశములు - ముఖ్య పరిశ్రమలు 3. గొఱ్ఱెల పోషణ మండలము – వాటినుండి లభించు మరియు అమ్మబడు సరకులు

7. ఈ దిగువ విషయములలో చైనా, జపానుల మధ్యకల పోలికలను, భేదములను చూపుడు.
   1. సహజలక్షణములు 2. శీతోష్ణస్థితి 3. ఉత్పత్తులు 4. ప్రజల వృత్తులు.
8. నైజాము రాజ్యములో చేయబడు వివిధ నీటిపారుదల ఏర్పాట్లు ఏవి ? ఇందువల్ల లభించు ఆయా ప్రాంతముల ముఖ్య ఉత్పత్తు లేవి ? పటసహాయమున వివరింపుడు.

**1946**

1. కుటీరపరిశ్రమ అననేమి ? హైదరాబాదు రాష్ట్రములోని కొన్ని ముఖ్య కుటీరపరిశ్రమలను పేర్కొని అవి ఎచ్చట, ఏలకలవో వివరింపుడు.
2. దిగువ వానిలో ఏమూటినిగూర్చియైన క్లుప్తముగా వ్రాయుడు.
   (a) ఆర్కిటిక్‌లో కలియు పెద్దనది, చిన్నది అగు థేమ్సునదివలె ఉపయోగకరమేలకాదు ?
   (b) బ్రిటిషుదీవులు శీతకాలములో తూర్పు యూరపు దేశములకంటె ఏల వెచ్చగానుండును.
   (c) అర్ధరాత్రి సూర్యుడు కనబడు దేశము, సంవత్సరములో ఈవింత కనబడుకాలము.
   (d) దక్కనుకును, ఆస్ట్రేలియా, ఆఫ్రికాలకును ఏలపోలికలుకలవు?
   (e) ఋతుపవన దేశములలో నదీలోయలు ఏల అధిక జనసమ్మర్దము కలిగియుండును ?

నైజాము రాష్ట్రపు తూర్పుభాగములు పడమటి భాగములకంటె ఏల ఎక్కువ వర్షమును పొందును ?

3. 'నేటికాలమున బంగారము, రత్నములకంటె బొగ్గు, ఇనుము విలువైనవి' ఈ వాక్యమునకు అనుకూలముగాగాని, ప్రతికూలముగాగాని కారణముల నిమ్ము.

4. ప్రపంచమున ఏ ప్రాంతములలో పట్టు, రబ్బరు అధికముగా ఉత్పత్తి చేయబడుచున్నవి ? ఏ దేశములతో ఈ వ్యాపారము ఎక్కువగా చేయబడుచున్నది ?

5. ఈ క్రిందివానిలో ఇండియా, బ్రిటనులు ఎంతవరకు పరస్పరాధీనములుగా నున్నవి !

(a) ముడిసరకులు (b) యంత్రములమీద తయారైన వస్తువులు - కారణము తీయుడు.

లేక

క్రిందివానిలో ఏనాలుగునుగూర్చియైన క్లుప్తముగా వ్రాయుడు

(a) సాన్ ఫ్రాన్సిస్కో (b) అజెర్బైజాన్ (c) కొరియా
(d) వెల్లిగ్టన్ (e) మాండలే (f) సింగపూరు
(g) మనిల్లా (h) కాన్బెర్రా.

6. దక్షిణ అమెరికాలోని ముఖ్యసహజమండలములను పేర్కొని అందు ఒకదానినిగూర్చి క్లుప్తముగా వ్రాయుడు.

7. నైజాము రాష్ట్రీయము పటమును గీచి క్రిందివి గుర్తింపుడు.

(a) ముఖ్యనదులు (b) ఈ నదులు ప్రవహించుప్రాంతములు
(c) ఈ నదులమీద నిర్మింపబడిన ప్రఖ్యాతమైన చెఱువులు.

## 1947

1. (a) అక్షాంశములు, తులాంశములు నిర్వచింపుడు. ఏయే విషయములలో అవి వేరుగా నున్నవో స్పష్టపరుచుడు.

(b) లండనునుండి మధ్యాహ్నము 1-45 గంటలకు ఒక తంతి వార్త పంపబడెను. వార్త ప్రయాణకాలము 20 నిమిషములు అనుకొని ఆ వార్త న్యూయార్కునకు (74° ప. రే.) ఎప్పుడు చేరునో కనుగొనుడు.

2. నదులు, పర్వతములు దేశములమధ్య సహజమైన సరిహద్దులుగా ఉపకరించుచున్నవి, ఈ విషయమును ఉదాహరణములతో వివరింపుడు.

3. పనామా కాలువను, సూయాజు కాలువతో పోల్చుడు.

4. ప్రపంచములో ఏ ప్రాంతములలో ఉప్పునీటి సరస్సులు కలవు? ఈ ప్రాంతములలో శీతోష్ణస్థితిలోని ప్రత్యేకతలు, నిమ్నోన్నతములు, సహజ వృక్షజాలమును చెప్పి వివరింపుడు. ఇండియా నుండి ఒక ఉదాహరణమును ఈయుడు.

5. ఆఫ్రికాయొక్క లేక ఆస్ట్రేలియాయొక్క పటము గీసి అందు ఆఖండపు నిమ్నోన్నతములను గుర్తింపుడు.

6. నైజాము రాష్ట్రములో నీటి పారుదల ఏర్పాట్లయొక్క ప్రాముఖ్యతను తెలిపి అట్టి కొన్ని ముఖ్యమైన ఏర్పాట్లను పేర్కొనుడు.

7. ఈ క్రిందిమండలములలో ఏ ఒక్కదానికైనను దాని భూగోళ లక్షణములను వివరించి ఆ లక్షణములు అచ్చటి ప్రజాజీవితముపై కనబరచు ప్రభావమును వివరింపుడు.

(a) అమెజాను మండలము (b) సైబీరియా గడ్డి బీడులు

(c) గంగాలోయ (d) అరేబియా ఎడారి.

8. ఇండియాలో జనసాంద్రతలో తేడాలకు కారణములు చూపుడు: పటము గీచి అధిక జనసాంద్రతగల ప్రదేశములు గుర్తింపుడు.

## 1948

1. సముద్రప్రవాహములు ఎట్లు ఏర్పడినవి ? అవి ఏదేశ తీరముల వెంట ప్రవహించునో ఆదేశముల శీతోష్ణస్థితిపై వాటికిగల ప్రభావమును వివరింపుడు.
2. ఆసియాను దాని సహజభాగములలోనికి విభజించి అందలి వివిధ సహజ వృక్షజాలము అచ్చటి శీతోష్ణస్థితిపై ఎట్లు అధార పడినదో చూపుడు.
3. నీటిపారుదల ఏర్పాట్ల ప్రాముఖ్యత ఏమి ? నైజాము రాష్ట్రములోని ముఖ్య నీటిపారుదల ఏర్పాట్లను పేర్కొనుడు.
4. ఈ క్రిందివానిలో ఏ మూటినైనను సకారణముగావివరింపుడు.
   (a) మదరాసు, బొంబాయిలలో శీతోష్ణస్థితిలోని భేదములకు కారణమేమి ?
   (b) చైనాయొక్క వ్యాపారము దాని సహజ సంపదకు తగినట్లు లేదు.
   (c)] ఇండియాలో సహకార వ్యవసాయము వ్యక్తిగత వ్యవసాయముకంటె లాభకరముగా నుండును.
   (d) ఇండియాయొక్క ముడిసరకులు ఎక్కువగా ఎగుమతి అగుచున్నవి.
   (e) గ్రహణములు ప్రతినెల సంభవింపవు.
5. ఆఫ్రికా పటముగీచి అందు ఎడారులను గుర్తింపుము. అధిక వర్షపాతముకల ప్రదేశములను పెన్సిలుతో ఒత్తుగాగుర్తింపుడు. ఆ ఖండములో ఎడారులు, వర్షపాత మండలములు ఉండుటకు కారణములను పేర్కొనుడు.
6. ఆస్ట్రేలియా తూర్పు ప్రాంతము మధ్య, పశ్చిమ ప్రాంతముల కంటె ఏల అధికజనసాంద్రతను, ఐశ్వర్యమును కలిగియున్నది?

7. ఐరోపాలోని రెండు ముఖ్య పారిశ్రామిక దేశములను పేర్కొని అట్టి పారిశ్రామికాభివృద్ధికి కారణములను వివరింపుము.

8. దిగువ వానిలో ఐదింటినిగూర్చి క్లుప్తముగా వ్రాయుడు.
సాన్ ఫ్రాన్సిస్కో; మాంట్రియల్; చిలీ: ఆస్లో; మంచూరియా; భూ, సముద్రవాయువులు; కరాచీ; ట్రివాండ్రమ్: జావా.

## 1949

1. ఋతుపవన మండలమనగా నేమి ? ఆసియాలోని ఏ దేశములు ఇందు చేరియున్నవి ? ఆ దేశములు ఏల అధికజన సాంద్రతను కలిగియున్నవి ?

2. క్రిందివానిలో ఏరెంటిని గూర్చియైనను క్లుప్తముగా వ్రాయుడు
   (a) చక్రపవనమునకు, వ్యతిరేక చక్రపవనమునకు భేదము.
   (b) నిక్షేపశిలయొక్క నిర్మాణము.
   (c) సమోష్ణ రేఖలను గీయునపుడు గమనించవలసిన అంశములు.
   (d) సూర్యగ్రహణము.

3. ఒక ప్రదేశపు జనసంఖ్య ఏ విషయములపై ఆధారపడును ? హైదరాబాదు రాష్ట్రములో అధిక వర్షపాతముకల ప్రదేశములలో అల్పజన సాంద్రత, అల్పవర్షపాతము కలచోట్ల అంతకంటె ఎక్కువ జనసాంద్రత ఏల కలదో వివరింపుడు.

4. ఇండియా ఉపఖండపు పటము గీయుడు. దానిమీద ముఖ్య రేవులను గుర్తించి వాటి ద్వారా ఎగుమతి అగు వస్తువులను పేర్కొనుడు.

5. ప్రపంచమందు ఏ దేశములలో వరి, గోధుమ అధికముగా ఉత్పత్తి చేయబడుచున్నవి ? ప్రస్తుత ఆహారపు కొఱతను నివా

రించుటకు ఇండియా వీటిని ఏ దేశములనుండి దిగుమతి చేసు కొనుచున్నది ?

6. దక్షిణ అమెరికాయొక్క సహజమండలములను పేర్కొని ఆండీసు పర్వతపంక్తి చిలీదేశపు ఆర్థిక సంపదయొక్క వృద్ధికి సహాయపడెనో, ఆటంకమయ్యెనో సకారణముగ నిరూపింపుడు,

7. అ. సం. రా. లోని ముఖ్యపారిశ్రామిక మండలములు ఎచ్చట కలవు? ఆదేశములోని ముఖ్య పరిశ్రమలను పేర్కొనుడు.

8. ఈ క్రింది వానిలో ఏ ఐదింటినిగూర్చి యైనను క్లుప్తముగా వ్రాయుడు:-పనామాకాలువ, సైలులోయ, కరాచీ, బర్మింగు హాము, సిడ్నీ, కొత్తగూడెం, బ్రసెల్స్, అంకారా, జెమ్‌షెడ్ పూరు, జావా.

## 1950

1. ఉష్ణమండలపు ఎడారులు ప్రపంచములో ఏ ప్రాంతములలో కలవు ? వాటి వితరణకు కారణములను పేర్కొనుడు.

2. ఈ క్రిందివానిలో రెంటియొక్క నిర్మాణమునకు కారణములు వ్రాయుడు.

   (a) డెల్టాలు (b) నిక్షేపశిల

   (c) పవడపు దీవులు (d) ఎడారిలోని ఇసుక దిబ్బలు.

3. మధ్యధరామండలపు ముఖ్య లక్షణములేవి ? ప్రపంచములో ఎచ్చ టెచ్చట ఇట్టి మండలములుకలవు ?

4. హైదరాబాదు రాష్ట్రపు పటముగీచి దానిలో వేర్వేరు రక ముల నేలలను అందలి వ్యవసాయ ఉత్పత్తులను గుర్తింపుడు.

5. పెద్ద పట్టణములు పెరుగుటకు కారణములేవి ? ప్రతి విషయ మునకు ఇండియానుండి ఉదాహరణమును చూపుడు.

6. ఆస్ట్రేలియాలోని సహజ వృక్షజాల మండలమును పేర్కొని అందొక దానిని గూర్చి క్లుప్తముగా వర్ణింపుడు.
7. ఇండియా యొక్క శీతోష్ణస్థితికి కారణమగు భూగోళ లక్షణములను సంపూర్ణముగా వర్ణింపుడు.
8. ఈ క్రిందివానిలో ఏ ఐదింటినిగూర్చి యైనను క్లుప్తముగా వ్రాయుడు.
   (a) చికాగో (b) ఫార్మోజా (c) ఇస్టాంబుల్ (d) తుంగభద్ర ప్రాజెక్టు (e) బ్యూనస్ ఐరిస్ (f) సింగరేణి (g) మధుర (h) కాన్బెర్రా (i) జెమ్షెడ్పూర్.

## 1951

1. భూకంపములు ఎట్లు కలుగుచున్నవి? వాటి ఫలితములేవి? ఇటీవల అస్సాములో సంభవించిన భూకంపమును పై వాటిని బట్టి పరిశీలింపుడు.
2. ఋతుపవన మండలము యొక్క ముఖ్య లక్షణములేవి? ప్రపంచములో ఇట్టిమండలము లెచ్చటకలవు? అందలి వ్యవసాయోత్పత్తులేవి?
3. పట సహాయమున ఈ క్రిందివాటిలో ఏ మూటినైన వివరించి, అవి ఎట్లు ఏర్పడినవో క్లుప్తముగా వ్రాయుడు.
   (a) అగ్నిపర్వత సంబంధమైన పర్వతము (b) జల, స్థల పవనములు (c) ఫియోర్డులు (d) ఒయేసిస్సు (e) గెయిజరు.
4. ఇండియా పటముమీద ఈ దిగువ ఉత్పత్తులుకల ప్రదేశములను గుర్తింపుడు.
   (a) ప్రత్తి (b) తేయాకు (c) నార.
   మరియు ఈ ఉత్పత్తులకు సంబంధించిన ముఖ్య పారిశ్రామిక ప్రదేశములను కూడ గుర్తింపుడు.

5. హైదరాబాదు రాష్ట్రములోని జిల్లాలలో ఏది ఎక్కువగా కఱవులకు గురిఅగుచుండును? ఈ ప్రదేశములలో ప్రభుత్వము తీసుకున్న కఱవు నివారణ చర్యలేవి?
6. ఆఫ్రికాలోని ముఖ్య సహజ మండలములేవి? అందు ఒక దానినిగూర్చి క్లుప్తముగా వర్ణింపుడు.
7. సూయజు కాలువను వర్ణించి దాని వ్యాపార ప్రాముఖ్యత వివరింపుడు.
8. ఇంగ్లండు యొక్కగాని అ. సం. రా. యొక్కగాని పారిశ్రామికాభివృద్ధికి కారణములు వ్రాసి వాటిలోని ముఖ్య పరిశ్రమలను పేర్కొనుడు.
9. క్రింది వానిలో ఏ ఐదింటిని గూర్చియైనను క్లుప్తముగా వ్రాయుడు.

   (a) పెకింగ్ (b) లేక్ సక్సెస్ (c) కీలుకాలువ (d) మధుర (e) వ్లాడివాస్టక్ (f) అలెగ్జాండ్రియా (g) సియోల్ (h) జకార్తా (i) రయోడిజనీరో.

## 1952

1. నదియొక్క చర్యకును, హిమానీ నదముయొక్క చర్యకును పోలికలు, భేదములు వ్రాయుడు.
2. సముద్ర ప్రవాహములు ఏదేశముల సమీపమున ప్రవహించునో వాటి శీతోష్ణస్థితిపై ఎట్టి ప్రభావమును కలిగియున్నవో వివరింపుడు. ఏదైన ఒక ముఖ్య సముద్ర ప్రవాహముయొక్క మార్గమును వర్ణింపుడు.
3. ఇండియాలో అనుసరింపబడు వివిధ నీటిపారుదల ఏర్పాట్లను వర్ణింపుడు. ఆ విధమగు ఏర్పాట్లు ఎచ్చటెచ్చట కలవు?

4. నైలులోయ ఉనికిని తెలిపి దాని భౌగోళిక ప్రాముఖ్యతను వివరింపుడు.

5. బ్రిటిషు దీవులలోని ప్రజల పనిపాటల పైనను, జీవితము పైనను భూగోళ పరిస్థితులకుగల ప్రభావములను వర్ణింపుడు.

6. హైదరాబాదురాష్ట్ర పటము మీద ముఖ్య రైలుమార్గములను, ఈక్రింది ప్రదేశములను గుర్తింపుడు.
(a) డోర్నకలు (b) కాజీపేట (c) సికింద్రాబాదు (d) వాడీ (e) ఔరంగాబాదు (f) బీదర్.

7. హైదరాబాదు రాష్ట్రములోని కొన్ని ముఖ్య యంత్ర పరిశ్రమలను పేర్కొనుడు. వాటి అభివృద్ధికి ఎట్టి చర్యలు తీసుకొన బడినవి ?

8. ఇండియా పటమును గీచి దానిమీద విమాన మార్గములను అందలి విమానాశ్రయములను గుర్తింపుడు.

9. అమెరికా సంయుక్తరాష్ట్రముల పారిశ్రామికాభివృద్ధికి కారణములను తెలిపి, దాని ముఖ్య పరిశ్రమలను పేర్కొనుడు.

10. ఈ క్రిందివానిలో ఏ ఐదింటిని గూర్చి యైనను క్లుప్తముగా వ్రాయుడు.
(a) రంగూను (b) ఢిల్లీ (c) చిరపుంజి (d) కైరో (e) అర్జెంటైనా (f) వాషింగ్టను (g) సిడ్నీ (h) మాంట్రియల్ (i) జొహాన్సుబర్గు.

## 1953

1. అక్షాంశ. తులాంశముల యొక్క ప్రాముఖ్యతను వివరింపుడు.

2. ఒక ప్రదేశము యొక్క మార్పునకు కారణ భూతమగు అంశము లేవి ?

3. భూమధ్య రేఖాప్రాంతపు అధిక వర్షపాతమునకు కారణమేమి?
4. జపాను ప్రాచ్య బ్రిటిషు దీవులని అందురు. ఈ వాక్యము ఎంతవరకు సమంజసము ?
5. స్విట్జర్లండులో చాలినంత ముడిసరకులు లేకపోయినను పారిశ్రామికముగా ఎట్లు అభివృద్ధి పొందెనో వివరింపుడు.
6. ఈజిప్టు నైలునదియొక్క ప్రసారము. ఎట్లో చూపుడు.
7. ఇంగ్లండు దేశముయొక్క ఏప్రాంతములు అధిక జనసాంద్రతను కలిగియున్నవి ? ఏల ?
8. ఆఫ్రికాలో ఒకేసమయమున వేర్వేరు ఋతువులను చూడవచ్చును – ఇది ఎట్లు సాధ్యము ?
9. (a) ఇండియా పటము గీచి అందలి వివిధ రైలు మార్గములను ముఖ్య రైల్వే స్టేషనులను గుర్తింపుడు.
   (b) దక్కను పటముగీచి అందలి వివిధ రైలుమార్గములను ముఖ్య రైల్వే స్టేషనులను గుర్తింపుడు.
10. ఏ మూటినిగూర్చియైనను క్లుప్తముగా వ్రాయుడు.
   (a) మధ్యధరా మండలము.
   (b) బొంబాయి, మార్సెయిల్స
   (c) చంద్రగహణము
   (d) దక్కనుయొక్క ఎగుమతులు
   (e) పనామా కాలువ.

---